శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ శ్రీవత్సాంకమిశ్రవిరచిత

# పంచస్తవీ



## ప్రథమ సంపుటము

(శ్రీ వైకుంఠాతిమానుష స్తవములు)





కవిశేఖర - మహోపాధ్యాయ, విద్యాలంకార

మధ్వాశ్రీ పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యకృత

భావాదర్శనామకాంధ్ర వివరణ సహితము

దాసకుటీ

ప్రకాశితము

అంగలకుదురు

మూల్యము : 4—00



# స మ ర్ప ణ ము

శ్రీ దాసశేష బుధసేవిత పాదపద్మా !
మోదాది సద్గుణ సమూహ నివాససద్మా !
కోదండరామ ! యిదిగో ! కొను కావ్యకన్యన్
నీ దివ్య వైభవమునే కొనియాడు మాన్యన్ ॥

# శ్రీ హయగ్రీవాయ నమః

# తొలిపలుకు

పంచస్తవీ పవిత్ర కృతికర్తలు ప్రతిభాశాలు లగు శ్రీవత్సాంక మిశ్రులు. వీరు కలి 4109 సౌమ్యసంవత్సర పుష్యమాసమున హస్తానక్షత్రమందు శ్రీరామునంశవలన హారీతాన్వయ సంభూతుఁడగు శ్రీ మదనంత భట్టార్యున కాత్మజులై యవతరించిరి. 'నగరేషు కాంచీ' అని ప్రసిద్ధి గాంచిన కాంచీపురమునకుఁ బ్రతీచీదిగ్భాగమునఁ గ్రోసెఁడు దవ్వునఁగల 'కూర' నగరము వీరి జన్మభూమి. ఈ కూరనగరమునకుఁ బ్రభువు లగుటచే వీరికిఁ గూరేశు లనియు ద్రవిడబాషలో 'కూరత్తాళ్వా' ననియుఁ దిరునామము లేర్పడినవి. వీరు జ్ఞానభక్తివైరాగ్యములకు నికషాయమానులు. ఇందులకు వీరి పంచస్తవియే నిదర్శనము.

ఆగర్భ శ్రీమంతులు వదాన్యులు ధర్మనిరతు లగు వీరు తాము కోరిపెండ్లాడిన ధర్మపత్ని యాండాళ్ళు సహాకరింపఁ బ్రతినిత్యము రవి యుదయించినది మొదలు రాత్రి యామ ద్వయమువఱకు 'బధిరపంగ్వంధభిక్షుక బ్రహ్మచారి జటిపరివ్రాజకాతిథి' పూజలయందు నిమగ్నులై యుండెడువారు. అన్నశాలా కలకలములు సన్నగిల్ల రాత్రి పండ్రెండు గంటలవేళ మూయఁబడు వీరికోటగుమ్మపుఁ దలుపుల ఘంటికా నినాదములు ఘల్లు మని కాంచీపురమునకు వినఁబడుడు నేమిది యని శ్రీ వరదరాజప్రేయసి యగు శ్రీమహాలక్ష్మి విస్మితురాలై

భర్తృముఖమునఁ దత్కారణ మారసి యీ మహనీయుని దర్శనమునకుఁ దహతహ లాడెననఁ గూరేశుల వైభవమును వేఱే వర్ణింపవలెనా ?

కూరేశు లంతఁ గొన్నాళ్ళకు నిర్విణ్ణులై 'మదత్రయ విహీనస్య ముక్తి స్తస్య కరే స్థితా' విద్యాధనాభిజన మదములు లేనివానికే కైవల్యము కరతలామలక మని యెంచి తన సర్వస్వమును సత్పాత్రుల కొసంగి సహధర్మిణితో శ్రీరంగనాథుని సేవింప శ్రీరంగమునకు బయలు వెడలిరి. ధర్మపత్ని యగు నాండాళ్ళుమాత్ర మాగర్భ శ్రీమంతుఁ డగు తన భర్త క్షీరపాన మొనర్ప నవరత్నఖచిత మగు నొక బంగారు గిన్నెను వస్త్రములోఁ దాఁచి తెచ్చుచుండెను. అరణ్యమార్గమున భీతురాలై యాతల్లి ముందు పోవుచున్న భర్తను జూచి నాథా! యీ యరణ్యమార్గమున భయమేమియు లేదుగదా! యని యడుగ, 'సాధ్వీ! విత్తవంతునకు సర్వత్ర భయముగలదు. నీటిలోఁ జేఁపలచేత, నేలపైఁ బులులచేత నాకసమునఁ బక్షుల చేత నామిషము భక్షింపఁబడునట్లు ధనవంతుఁ డెల్లరచే భక్షింపఁబడును. ప్రాణులను మృత్యువువలె ధనవంతులను భయము వెంటాడు' నని తెలిపి, తద్భయకారణము నెఱింగి, యామె దాఁచియుంచిన రతనాల పైడిగిన్నెను నావలఁ బాఱవైచెను. ఇది శ్రీ కూరేశుల వైరాగ్యమునకు గీటురాయి.

క్రమముగా నాళ్వాను ధర్మపత్నితో శ్రీరంగమును జేరుకొని, శ్రీరంగేశుని సేవించి, యచ్చటనే వేంచేసియున్న

శ్రీ భగవద్రామానుజులకు సాష్టాంగ మర్పింప గురువులు శ్రీ కూరేశుల లేవనెత్తి గాఢాలింగన మొనర్చి ప్రియశిష్యుని రాక కత్యంత ముప్పొంగిరి. నాఁడు మొదలుకొని కూరనాథులు శ్రీహరి గురువుల సేవించుకొనుచు నుంఛవృత్తి నొనర్చుచు శ్రీరంగమున సద్గోష్ఠితోఁ గాలము గడుపుచుండిరి. ఇట్లుండ నొకనాఁడు జడివాన, యెడతెఱపి లేక కురియుటచేతఁ గూరేశుల యుంఛవృత్తి కంతరాయము గలిగెను. నాఁడు స్నాన మొనర్చి యనుష్ఠానముల నిర్వర్తించి పెరుమాళ్ళపూజ సలిపి ఫలము నివేదన మొనర్చి తీర్థమును మాత్రము గ్రహించిరి. సాయంకాలము కోవెలలో శ్రీరంగనాథుని సేవించి యింటి కరుదెంచి శతారిసూక్తమును జపించుచు స్వస్థముగాఁ బరుండిరి. అంత రంగనాథుని కోవెలలో సాయంకాల నివేదన సమయము నందలి కాహళీనినాదములు చెవిఁబడుడు శ్రీ ఆండాళ్లు తనభర్త పస్తుండుటకు వగచుచు 'స్వామీ! శ్రీ రంగనాథా! నీ భక్తుఁ డాఁకట నలమటింప నీ వారగించు చున్నావా?' అని మనస్సులో ననుకొనెను. భక్తవత్సలుఁ డగు రంగనాథుఁ డా సాధ్వీమణి వాణి నాలించి దేవాలయ ధర్మాధికారికి స్వప్నమున సాక్షా త్కరించి శర్కరాజ్యాది సంమిశ్రమగు మత్ప్రసాదమును ఛత్ర చామరాది వైభవముతో శ్రీ కూరేశుల కర్పింపు మన ధర్మాధి కారియు నట్లు చేయ శ్రీవత్సచిహ్ను లాశ్చర్యభరితులై యిది యేమన భార్య తాను మదిలో ననుకొన్న మాటను మనవి చేసెను. ఇట్లు భగవానుని నడుగవచ్చునా ? అని గృహిణిని

మందలించి యా ప్రసాదములో నొక్కింత తాను స్వీకరించి తక్కిన ప్రసాదము నర్ధాంగి కీయఁగా నాసాధ్వి దానివలన గర్భమును దాల్చి విలక్షణులగు నిర్వురఁ గుమారులఁ గ నెను. వారి యోగక్షేమముల నెల్ల శ్రీ రంగనాథుఁడే చూచుకొను చుండెను. ఇది వీరియెడ శ్రీ రంగనాథునకుఁ గల వాత్సల్యాతి శయమునకుఁ దార్కాణ.

ఒకతఱి నుద్దండ పండితులగు యాదవ ప్రకాశులు భగవ ద్రామానుజస్వామివారి మతమునకు వేంచేసి 'స్వామీ! మీ రొనర్చు శంఖచక్రోర్ధ్వపుండ్రాది ధారణమునకు సగుణ బ్రహ్మో పాసనమునకును శాస్త్రములఁ బ్రమాణములు గానరావు. ఉన్నచో నుపన్యసింపుఁ'డన శ్రీవారు తమ శిష్యులగు కూరేశుల నియమింప 'శ్రూయతా మభిధాస్యామి శంఖచక్రాదిధారణే। సగుణబ్రహ్మసద్భావే' అని శ్రీవత్సాంకులు గంభీరోపన్యాస మొసఁగి ప్రతిపక్షుల నిరుత్తరులఁ జేసిన విషయము వీరి పాండితీ ప్రతిభలకు శ్రుతి స్మృతీహాసాభిజ్ఞతకు మంచిలక్ష్యము.

శ్రీ భగవద్రామానుజులు శ్రీ యామునమునుల సంకల్పము నీడేర్ప శ్రీభాష్యమును రచింప నెంచి కాశ్మీరమున శారదా పీఠమున నున్న బోధాయన వృత్తిగ్రంథమును జూడఁ గూరేశాది శిష్యులతో నటకేఁగి గ్రంథాలయాధికారుల సౌజన్యముతో వృత్తిగ్రంథమున మొదటి యధ్యాయమును సాంగముగాఁ జూచిరి. కుశాగ్రబుద్ధులగు కూరేశులు తక్కిన యధ్యాయముల నవలోకించిరి. అంతలోన మతాంతరుల

మాయమాటలచే నధికారు లాగ్రంథమును గైకొని మఱల నీయక పోవుటచే నాచార్యులవారు తపించుచుండ శ్రీ కూరే శులు స్వామీ! విచారము వలదు. దాసుఁడు తక్కిన యధ్యా యత్రయిలో నేపంక్తియైన నప్పగింపఁ గలఁడని విన్నవించి గురుపాదులచేత నోకూరేశా! నీ వుండుటవలన శ్రీయామున మునులు పరమపద మలంకరించినట్లు నేను భావించుటలేదని ప్రశంసింపఁ బడుట వీరి ధారణాశక్తికి గురుప్రసాదలబ్ధికిఁ బ్రబలదృష్టాంతము.

ఇట్లు కూరనాథు లాచార్యాభిమానమును జూఱ గొని శ్రీరంగేశుని సేవించుకొనుచు సుఖముగాఁ గాలము గడుపు చుండఁగా జరిగిన విచిత్రసంఘటన మెట్టివారి కేనియు హృదయ విదారకము కాకపోదు. అత్తఱి రాజేంద్ర చోళ పురము రాజధానిగాఁ జోళమండల మేలుచున్న కులోత్తుంగ చోళరాజు శైవమతాభిమానియై విష్ణుద్వేషము పట్టఁజాలక వైష్ణవపండితులచే 'శివాత్ పరతరంనాస్తి' అను వాక్యమును వ్రాయించుచుండ 'నాలూరాన్' అను నొక వైష్ణవుఁ డితరు లెంద ఱట్లు వ్రాసిన నేమి ప్రయోజనము. భగవద్రామాను జులు వ్రాసినఁగదా యావ్రాఁతకు విలువ యనఁగా నా పాషండరాజు శ్రీరామానుజులను గొనిరండని యమకింకరులఁ బోలు తన కింకరులను బంప వారు శ్రీరంగమునఁ గల రామానుజ మఠముఁ జేరుకొని రామానుజులవా రెచ్చట అని యడుగ వారిని జూడఁగనే సూక్ష్మబుద్ధియగు కూరే

శుఁడు గురులకు రానున్న యాపదను గుర్తించి స్నానము కేఁగిన గురువుల కాషాయత్రిదండములఁ ధరించి తానే రామానుజులని వారి వెంట జనెను. కూరేశుల వీడలేక వారి కండగ శ్రీమహాపూర్ణులును వారితో రాజసభ కేగిరి, స్నాన మొనర్చి వచ్చిన శ్రీరామానుజమును లంతయు విని శిష్యుల కేమి విపత్తు ఘటిల్లునో యని వగచిరి. ఇఁక నచట నుండుట యనర్థహేతువని యచటివారు పలువిధముల విన్నవింప శ్రీరామానుజులు తక్కిన శిష్యులతోఁ దిరు నారాయణ పురమునకు వేంచేసిరి. అచట చోళరాజు తన కింకరులు కొనివచ్చిన వైష్ణవ పండితులఁ జూచి 'శివా త్పరతరం నాస్తి' యని వ్రాయుఁడని కోర వారు శ్రుతి స్మృతి పురాణాదులనుండి ప్రమాణములఁ జూపుచుఁ బ్రతి పక్షుల నిరుత్తరులఁ జేయుచు విష్ణువే పరాత్పరుఁడని చాటిరి. అందులకుఁ జోళరా జాగ్రహించి మీరు మీ యిష్టము వచ్చిన ట్లేమేమో ప్రసంగించుచున్నారు. మేము చెప్పినట్లు వ్రాయుదురా! కన్నులఁ దీయింపమందురా! అని గట్టిగాఁ బలుకఁ గూరేశులు వ్యంగ్యభంగిగా విష్ణుసర్వోత్తమత్వము నే చాటుచు 'శివాత్ పరతరం నాస్తి ద్రోణ మస్తి తతః పరమ్' అని వ్రాయుడుఁ బాషండభూపతి యది గ్రహించి వారి గ్రుడ్లు దీయించెను. ఇది నిజముగా హృదయవిదారకమేగదా! దీనిచే వయోఽధికులగు మహాపూర్ణులు మార్గమధ్యముననే మరణించిరి. కూరేశులు శ్రీరంగమును జేరఁబోవఁ రామా

నుజ సంబంధు లిం దెవ్వరును ప్రవేశింపరాదు. ఇది రాజ శాసన మని ద్వారపాలురు నిరోధింప 'అవును. నేను శ్రీ రామానుజుల సంబంధిని. శ్రీరంగ సేవనైనను మానుకొందును గాని యాచార్యసంబంధమును దెగఁ ద్రెంచుకొనఁ జాల'నని యటనుండి సకుటుంబముగా సుందరభుజస్వామిని సేవింప వనగిరికిఁ బ్రయాణ మొనర్చిరి. మార్గమధ్యమున సత్వర ముగా సద్గురుసమాగమ భాగ్యలాభమునకు నేత్రబాధాస్మృతి నిరోధమునకు భగవత్కల్యాణ గుణానుభవ మొనర్చుకొనుచు మహాకవులగు శ్రీ కూరేశులు 'పంచ స్తవీ' రచన కుపక్ర మించిరి. 'పంచానాం స్తవానాం సమాహారః' అను విగ్రహ వాక్యముచేత నీ పదమున కైదు స్తవముల కూట మని యర్థము. లక్ష్మీ కటాక్షము పురుషకారముగా నన్నిటికి న పేక్షణీయము గానఁ దొలుదొల్త 'శ్రీస్తవ' మను పేర 11 శ్లోకములతో శ్రీదేవిని వర్ణించినారు. ఆవల వైకుంఠ స్తవమను పేర 101 శ్లోకములతో శ్రీ పరమ పదనాథుని గుణానుభవ మొనర్చిరి. అటుపై అతిమానుష స్తవము పేర 61 శ్లోకములతో శ్రీ రామకృష్ణుల యతిమానుష లీలల నద్భుతముగాఁ గొనియాడిరి. ఆ మీఁద సుందరబాహు స్తవము పేర 132 శ్లోకములతో వనగిరినాథుని వైభవమును వర్ణించిరి. ఇందు 129 వ శ్లోకమున 'శ్రీరంగధామని యథాపుర మేవ సోఽహం రామానుజార్యవశగ స్సముపవర్తిషీయ' మఅల నేను శ్రీరంగమునందు శ్రీ రామానుజుల యాజ్ఞావశ్యుఁడనై

మెలఁగున ట్లనుగ్రహింపు మనియు 130 వ శ్లోకమున 'శ్రీరంగ శ్రియ మన్వహం ప్రగుణయం స్త్వద్భక్తభోగ్యాం కురు' శ్రీరంగశోభను దినదినాభివృద్ధి నొనర్చుచు నీభక్తులకు భోగ్య నుగాఁ జేయు మనియుఁ బలుసార్లు సుందరభుజస్వామిని ప్రార్థించిరి. 'న మే భక్తః ప్రణశ్యతి' భక్తుల ప్రార్థనను భగవానుఁ డేల మన్నింపఁడు? ఇంతలోఁ బాతకియగు నా చోళరాజు తన మండలములోని విష్ణుక్షేత్రముల విధ్వంస మొనర్చుచు శ్రీరంగము నక్లే కావింప సైనికులతోఁ జనుదెంచుచు 'అత్యుత్కటైః పుణ్యాపాపై రిహైవ ఫల మశ్నుతే' అన్న సూక్తికి నిదర్శనముగా దారి నడుమనే కంఠమునందు వ్రణ మేర్పడి పుచ్చి పురుగులు పడ దానికి నుదరవ్యాధియుఁ దోడుపడ వెంటనే యాతఁడు మరణించెను. ఆ వార్త నలుదెసలఁ బ్రాకఁ గిల్బిషి యగు క్రిమికంఠుఁ డణఁగారినందుల కానందించుచు శ్రీ వైష్ణవబృంద మెప్పటియట్ల మరల శ్రీరంగమును జేరుకొనెను భగవద్రామానుజులు దర్శనము నకై తమ దర్శనముల బలి యొసఁగిన కూరేశుల నెంతయు నభినందించి తమ యెడఁబాటు తఱి శిష్యుఁడు వ్రాసిన స్తవములఁ బులకితగాత్రముతో నాలించి కన్నులు వచ్చుటకు వారిచేత శ్రీ వరదరాజస్తవమును సైతము వ్రాయించిరి. 102 శ్లోకములుగల యీ స్తవరాజముతోఁ బంచస్తవి పరిపూర్తిఁ జెందెను. వరదరాజస్తవమున 23 వ శ్లోకములో 'నేత్రసా త్కురు కరీశ! సదామే' అని ప్రార్థించుటచేత

వరదరాజస్వామి కూరేశులకు సదాదర్శనమునే యనుగ్రహించుచు శ్రీరామానుజుల ముఖోల్లాసమున కీ కన్నులతోనే తన్ను నొజ్జలను గనుంగొను భాగ్యమును సైతము కటాక్షించిరి. క్రిమికంఠుఁడు వైష్ణవవిద్వేషి యైనను పంచస్తవీ ప్రబంధమునకుఁ గారకుఁడగుటచే నొక విధముగా వైష్ణవజన మహోపకారి యనక తప్పదు. ఆదినుండియు భగవద్భాగవతాచార్య పరిచర్యలకే తన జీవితమంతయు నంకిత మొనర్చి తత్కృపకుఁ బూర్ణపాత్రమైన యీ యాళ్వాను దివ్యవైభవములో నొక కణమిట్లు క్రోలుపుణ్యము గలిగినందులకును అమరభాష కనర్ఘభాష యగు పంచస్తవి కిట్లు భావాదర్శ మనెడి యాంధ్ర వివరణము వ్రాయునదృష్టము చేకూరినందులకు నేను కృతార్థుఁడనైతి నని భావించుకొనుచున్నాను. నాకీ సేవాభాగ్యమును లభింపఁజేసిన యంగలకుదురు దాసకుటీ నివాసులగు శ్రీ దాసశేషస్వాములకు నా ధన్యవాదముల నమోవాకముల నర్పించుకొను చున్నాను.



# క వి తా గు ణ ము లు

శ్రీ కూరనాథుల కవితాగుణములు శ్రీ వైకుంఠనాథాదు లనే వశ్యులనొనర్చుకొన్న వన నాబోటివాఁ డాగుణముల వర్ణింపఁ బూనుకొనుట చిన్న దీపముతో నీతఁడే సూర్యుఁడని చూపుటవంటిదే యగును. కాని వారి పంచస్తవికిఁ బీఠిక వ్రాయుచు భాత్తిగ నాపని విరమించుటయు నుచితము కాదేమో యని యొక్కింత వ్రాయ సాహసించితిని. వీరి కవిత్వము మృదుమధురమై సర్వాంగ సుందరమై భక్తిరసము నొలికించుచు భావుకులను దన్మయులఁ జేయుటలో దీనికిదియే సాటి. అధికారిరుచిగుణానుసార మిందు వివిధపాకములు చేర్పఁబడినను పూర్వజన్మ పుణ్యపరిపాకము గలవాఁడే దీనికిఁ బూర్ణాధికారి. భక్తి రసమా! కాదా! యని సంశయించు వారీకృతిని బాఱఁజూచినచో భక్తియే రసమను నిర్ణయమునకు రాఁగలరని నా విశ్వాసము.

శ్లో॥ అంభోద నీల మరవింద దళాయతాక్షం
పింఛావతంస మురరీకృత వేణుపాణిమ్।
త్వాం గోపవేషపరికర్మితకాయ కాంతిం
ధన్యాస్తదా దదృశురున్మథి తాన్యభావాః ॥

(అతిమానుషస్తవము— శ్లో॥ 48)

ఇందలి యంభోదనీలత్వాది గుణవిశిష్టుఁ డగు గోపసుందరు దర్శనమున కువ్విళులూరుచున్న యీవిరక్తుని యార్తికిని

శ్లో॥ ఆలక్ష్యదంత ముకుళాన నిమిత్తహాసై
రవ్యక్త వర్ణరమణీయ వచః ప్రవృత్తీన్ ।
అంకాశ్రయ ప్రణయి నస్తనయాన్ వహంతో
ధన్యాస్తదంగరజసామలినీభవంతి ॥

(అభిజ్ఞానశాకుంతలము. అం. 7—17)

అనిమిత్తహాసములచే నాలక్ష్యదంత ముకుళులగు నాత్మజుల నొడులఁ దాల్చుచున్న యీయనురక్తుల యార్తికి నెంత తేడాగలదో! యేది ధన్యతా పాదకమగునో! విజ్ఞులెఱుంగనిది కాదు. రెండవరకము వారేమగుదురో కవియే ...'రజసామలినీభవంతి' అని గూఢముగాఁ దెలుపు చున్నాఁడు. ముముక్షువులకుఁ గావలసినది భగవద్భక్తియేగాని విషయరక్తిగాదు. అట్టి భక్తికీ పంచస్తవి పెట్టినదిపేరు.

ఈకవి కవితారత్నాపణమునఁ జతుర్దశ విద్యలును క్రయ్యములే. సూక్తిరత్నముల కంతేలేదు. వేదము వాల్మీకినోట రామాయణ శ్లోకములుగా వెలసిన ట్లుపనిషత్తులీ కవివరునోట సుశ్రావ్య శ్లోకములుగా రూపొందినవి. దిక్ప్రదర్శనము.

శ్లో॥ యః ఖల్వణో రణుతరో మహతో మహీయా
నాత్మాజనస్య జనకో జగతశ్చ యోఽభూత్ ।
వేదాత్మక ప్రణవకారణవర్ణ వాచ్యం
తం త్వాం వయంతు పరమేశ్వర మానునామః ॥

(వైకుంఠ స్తవము—20)

ఇందు- 'అణోరణీయాన్ మహతో౽మహీయాన్' ఇత్యాదులు పొందుపడి యుండుట గమనింపఁదగును.

'వ్యోమాం భోజ మిదంత యా కిలవిదన్
భ్రాంతో౽యమిత్యుచ్యతే' (శ్రీస్తవము - 8)

తర్కరసికు లిందుఁ గూరేశుల తార్కిక ప్రతిభను జవిచూడవచ్చును.

కౌతస్కుతాః - వాఙ్మన సాతిగశ్రీః-
'అబ్ధిం న తేరిథ నజిగ్యిథ రాక్షసేంద్రమ్'

ఇత్యాది ప్రయోగములచే వీరి వ్యాకరణ విజ్ఞానమును విజ్ఞులూహించుకొనవచ్చును.

పిత్తఘ్నమంజన మనాప్నుషి జాతు నేత్రే
నైవ ప్రభాభి రపిశంఖ సితత్వబుద్ధిః॥

(వైకుంఠస్తవము—16)

ఇందు వీరి వైద్యశాస్త్ర పరిచితి యాస్వాదనీయము.

'హాస్యం తత్తు న మన్మహే నహిచ కోర్యైకాఖిలాం చంద్రికాం। నాలంపాతుమితి ప్రగృహ్యరసనా మాసీత సత్యాంతృషి' (శ్రీస్తవము - 4)

ఇందు వీరికిఁగల ఝుడితి స్ఫూర్తియు లోకజ్ఞానము ప్రశంసనీయములు.

బాహ్యకుదృష్టయ ఇతి ద్వితయేప్యపారం
ఘోరంతమ స్సముపయాంతి న హీంక్షు సేతాః।

జగ్ధస్య కానన మృగై ర్మృగ తృష్ణికే ష్వోః
కాసార సత్వ నిహతస్య చ కో విశేషః ॥

(వైకుంఠ స్తవము—14)

ఈ శ్లోకములోని భావపుష్టి యెంతయాస్వాదించినను అక్షయమై యలరారుచున్నది. అంతియేకాదు- ఇందలి పరమత నిరాకరణ పరిపాటి యెంతయు శ్లాఘనీయము.

'తద్వ్యక్తమేవ తవ రాఘవ వంశ జస్య
తిర్యక్షు నైవహి విపక్షతయో పచారః'

(అతిమానవ స్తవము—21)

ఇందు వాలివధ విషయిక ధర్మసందేహము నీకవి తీర్చిన విధ మతిరమణీయము.

'సీతావియోగ వివశోస చ తద్గతిజ్ఞః।
ప్రాదా స్తదా పరగతించ కథం జటాయోః ॥

(అతిమానుష—17)

అబ్ధిం న తేరిథ...తస్య పదేఽభ్యషించః।
తస్యానుజం కథ మిదంహి విభీషణం చ ॥

(అతిమానుష—24)

ఈ ప్రశ్నములకు శ్రీరాముఁడైన నేమి సమాధాన మీయఁగలఁడు. మౌనము వహించవలయును. అదియు నర్ధాంగీకారమే యగును గదా! వీరి కవిత్వ రత్నాకరమున సుభాషిత రత్నములకుఁ గొఱంత యేమి గలదు?

పరిశీలకులుండ వలయును.

యుక్తో విధేయ విషయేషు హి కామచారః

(అతిమానుష—13)

సర్వో హి వశ్య విషయే వివృణోతి వీర్యమ్

(అతిమానుష—41)

సర్వం గుణాయ గుణినామితి సత్యమేతత్

(అతిమానుష—43)

ఇత్యాదులు పరశ్శతములు.

వీరింత మహాపండితులు మహాకవులయ్యు నతివినయసంపన్నులు. 'నశ్వావలీఢ మపి తీర్థమ తీర్థ మాహుర్నో దన్యతాపి చ శునా కిల లజ్జితవ్యమ్-'

(వైకుంఠ—8)

'కుక్కగతికినగంగకుఁ గొదవగలదె
సిగ్గుపడఁ గుక్కరపిపాస తగ్గు టెట్లు?'

అని తన్ను శునకముతోఁ బోల్చుకొనుట వీరి మహత్త్వనే చాటుచున్నది. శ్రీ వరదరాజస్వామి తన స్తవమునకు సంతసించి నీకేమి కావలయునని యడుగ గురులు కోల్పోయిన కన్నులఁ గోరుకొమ్మని ప్రోత్సహించినప్పటికి నీ ప్రపన్నుఁడు కేవల చర్మదృష్టులఁ గోరుకొనక

శ్లో॥ నీలమేఘ నిభమం జనపుంజ
శ్యామకుంతల మనంత శయంత్వామ్।
అబ్జపాణి పదమంబు జనేత్రం
నేత్ర సాత్కురు కరీశ! సదా మే॥ (వరద—23)

అని 'సదా పశ్యంతి సూరయః' అన్నట్లు నిత్యసూరి యోగ్య మగు సదా దర్శనము నపేక్షించుటయే వీరి మహత్తకు నిదర్శనము. ఇట్టి మహనీయుల పంచస్తవీ కోశము నేనెంతవఱ కాంధ్రుల కందుపాటొనరింపఁగలిగితినో పాఠక మహాశయులే నిర్ణయింప నధికారులు. నేను నా భావాదర్శాంధ్ర వివరణ మున నా కుపలబ్ధమగు శ్రీ శ్రీనివాసాచార్య వ్యాఖ్యనే అనుస రించితిని. ప్రతి శ్లోకమున నీ నియమములు పాటింపఁబడెను.

1. అవతారిక (అవసరమగుచోట)
2. మూలశ్లోకము
3. ప్రతి పదార్థము
4. విశేషములు
5. తాత్పర్యము
6. ఆంధ్రపద్యము

పాఠాంతరములు న్నెడఁ బరిశీలించితిని. నా రుచి ననుస రించి కొన్నితావుల నొక శ్లోకమునకు రెండు పద్యముల వ్రాసితిని. చాలవఱకు నా యనువాద పద్యములు మూలాను సారములుగనే యుండును. మచ్చునకు

శ్లో॥ పృచ్ఛామి కించన యదా కిల రాఘవత్వే
మాయామృగస్య వశగో మనుజత్వమార్గ్యాత్ ।
సీతావియోగ వివశో న చ తద్గతిజ్ఞః
ప్రాదాస్తదా పరగతిం హి కథం ఖగాయ ॥

(అతిమానువ—17)

చ॥ అడిగెదఁ గోపమంద కొక
యంశము రాముఁడ వైనయప్డు మ
ర్త్యుఁడ వనిపించుకోఁ దలఁపు
తో నిజమంచును మాయలేడి వెం
బడిఁ బడి ధర్మపత్ని నెడఁ
బాసి యెఱుంగవుకాని తద్గతిన్
గడుసరి! యెల్లెఱింగితి ఖ
గంబునకున్ దయచేయ సద్గతిన్.

కొన్నితావుల మూలశ్లోకము సమాసముగా నున్నచో నా యనువాదపద్యము వ్యాసరూపమున నుండును.

ఉదాహరణము.

శ్లో॥ భక్తి ప్రభావ—వైకుంఠ స్తవము—3 శ్లో.

ఇందుమూలమున సంగ్రహరూపమునఁ జెప్పఁబడిన విషయము నా యనువాదమున సీసపద్యమున వివరింపఁబడినది.

ఒకచో మూలమున లేకున్నను అనువాదమున ఉపమాదులు క్రొత్తగాఁ జేర్చుకొనఁబడెను.

శ్లో॥ సత్కర్మ నైవ కిల కించన సంచినోమి
విద్యాప్య వద్యరహితా న తు విద్యతే మే।
కించ త్వ దంచితపదాంబుజ భక్తిహీనః
పాత్రం భవామి భగవన్! భవతో దయాయాః॥

(వైకుంఠ స్తవము—89)

శా॥ కొంచెంబేనియుఁ గూడఁ బెట్టుకొన వై
కుంఠేశ ! సత్కార్మ మా
ర్జించన్ బో ! నిరవద్య విద్యనయినన్
శ్రీవారి పాదాల య
త్కించి ద్భక్తియు లేదు సంసృతి పయో
ధిన్ దాఁట నిశ్శ్రేణికో
దంచత్త్వ త్కృపయొండె నొకవలెనా
ధారంబు దేవోత్తమా !

మూలమున లేకున్నను నొకవలెనను నుపమ అను వాదమున నందము కొఱకుఁ జేర్పఁబడెను. కొన్ని తావుల మనోహరంబులుగా నుండుటచే వ్యాఖ్యానస్థములగు శ్లోకములుగూడ ననువదింపఁబడినవి. అతిమానుష స్తవము 45 శ్లోకవ్యాఖ్యలోని 'శైలోఽగ్నిశ్చ జలాంబభూవ' అను శ్లోకము.

సీ॥ 'శైలంబు లగ్నియు సలిలాత్మకములాయె'

అని సీసపద్యములో అనూదితమాయెను.

మొదల శ్రీస్తవము నతిసుఖముగా ముగించితిని గాని వైకుంఠ స్తవములోనే విఘ్నములు వెంటాడినవి. అందుచేత నే-

శా॥ వైకుంఠ స్తవటీక వ్రాసెదు తఱిన్ వచ్చెన్
మహావిఘ్నముల్ ॥

అని వ్రాయవలసివచ్చెను. అలముకొనిన యంతరాయములన న్నిటి నంతరింపఁజేసి నేఁటికిట్లు పంచస్తవీ ప్రథమ సంపుటము నావిష్కరింపఁ జేసిన దాసకుటీ నిలయు శ్రీ కోదండ రామస్వామివారి యవ్యాజకృపకు శ్రీ దాసశేషుల యనుగ్రహమునకును కైమోడ్పు లర్పించుకొనుచున్నాను. ఇందలి దోషముల విడనాడి గుణలేశములనే గ్రహింపఁ బండిత హంసలను బ్రార్థింతును.

గుంటూరు
30—4—63

ఇట్లు
బుధవిధేయుఁడు
పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు.



# ప్రకాశక కృతజ్ఞత



శ్రీ భక్తిసంజీవనీ ముఖమున శ్రీ కూరేశప్రసాదిత పంచస్తవి భావాంధ్రానువాదము ప్రకాశితమగు చుండుట యెల్లరకు తెలిసిన విషయమే- ఈ మహత్తరమగు సర్వప్రపన్నభక్త వైష్ణవలోకమున కత్యంతోపకారకమగు నీకృతిని కవిశేఖర మహోపాధ్యాయ మధ్వశ్రీ శ్రీ పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులవా రవ్యాజమగు వాత్సల్య విశేషమె కారణముగా ననుగ్రహించి యున్నారు. వీరికి శ్రీ కోదండరామ ప్రభు వేమిఫలమీయ నున్నారో యది యదృష్టము. మాది దృష్టఫలము శ్రీ యాచార్యులవారికి శ్రీ భక్తిసంజీవనీ పాఠకులు, శ్రీ కోదండరామ సేవక ధర్మసమాజులు అననేల సమస్త వైష్ణవలోకము తీరని యప్పుపడియున్నారనుట సత్యదూరము కాదు- అకించనుఁడగు దాసశేషుఁడు శ్రీ యాచార్యులవారికి కృతజ్ఞతాపూర్వకముగ వందనము లర్పించుటకన్నఁ జేయఁగలదేమి కలదు- శ్రీ సీతారాములు శ్రీ యాచార్యులవారి కనంత కళ్యాణ పరంపరల ననుగ్రహింపఁ బ్రార్థించుచున్నాఁడు.

దాసకుటి<br>అంగలకుదురు<br>30–4–1963

ఇట్లు విన్నవించు,<br>దాసశేషుఁడు.

# విజ్ఞప్తి

శ్రీ కూరత్తాళ్వానను శ్రీవత్స మిశ్రులు ప్రసాదించిన పంచ స్తవము సంస్కృత భాష్యావ్యాఖ్యాన సహితము శ్రీ బృందావనములో దాసశేషునకుఁ బ్రాప్తించినది. అది నాగర లిపిలో నున్నది. వ్యాఖ్యానముతోడి గ్రంథమే అలభ్యము. మన వారికి పనికివచ్చునట్లు మనభాషలోనికి ననువదించిన బాగుండు నని దాసశేషునకుఁ దోఁచి శ్రీ శ్రీ కవిశేఖర మహోపాధ్యాయ మధ్వశ్రీ పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులవారి నర్థింపఁగాఁ బరమ ప్రీతితో ననుగ్రహించి యభయదాన మొసఁగి ప్రప్రథమమున శ్రీస్తవమును వ్రాసియిచ్చిరి. క్రమముగాఁ దక్కిన నాలుగు స్తవములును వ్రాసి యియ్యనున్నారు. మొట్టమొదట శ్రీస్తవ మును సంజీవనిముఖమునఁ బాఠకమహాశయులకు నివేదించుకొనుచున్నాము. పరమాదరమున మాసేవ స్వీకరించి మా యీ లేశ మాత్రపు భగవత్కైంకర్యమునకుఁ జేయూఁత నొసంగెదరు గాతమని యాశించుచున్నాము—గురుపరంపరా ప్రభావమున శ్రీ కూరత్తాళ్వానుల వైభవము విపులముగానున్నది. ఇచటను క్లుప్తముగా వ్రాయఁబడఁ గలదు.

ఇట్లు భవచ్చరణధూళి,

దాసశేషుఁడు.

శ్రీ హయగ్రీవాయ నమః

# కృతజ్ఞత

శ్రీమద్రామ పదారవింద రతుఁడున్ శ్రీవాసుదాసీయ వా
చామోచా ఫలమాధురీ పరవశస్వాంతుండు శ్రీ దాసశే
షామోఘేచ్ఛుఁడు శ్రీస్తవం బిటుల వ్యాఖ్యానింపఁ బ్రేరేచి శ్రే
యోమార్గంబునడింపె ధన్యుఁడ సుధన్యుండన్ మహాధన్యుఁడన్.

శ్రీవత్సాంక కవీంద్ర వాగమృతమున్ జిత్తంబు రంజిల్ల నా
గ్రీవా పూర్తిగఁ గ్రోలు మేల్ సుకృతమున్ శ్రీదేవి దీవ్యద్గుణా
లీ వేద్యాప్రతిమ ప్రభావ పరిశీలిత్వంబు శ్రీ దాసశే
షావిఖ్యాతముతోట నీ బుధునకే నర్పింతు ధన్యోక్తులన్.

గీ. చెఱకుగడఁ దింట కెవ్వరో జీతమిచ్చి
రంట సురభాష నా సూక్తి వింటి నట్లె
దక్కె వేతనముగ నాకు దాసశేషు
నాన శ్రీవత్సచిహ్న వాగమృతమాన.



శ్రీ హయగ్రీవాయనమః

శ్రీ గురుభ్యోనమః

# శ్రీ స్తవము

## కవిశేఖర మధ్వశ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యకృత

## ఆంధ్ర టీకా తాత్పర్య సహితము

శ్లో. శ్రీవత్స చిహ్న మిశ్రేభ్యో । నమో వాక మధీమహి
యదుక్తయ స్త్రయీకంఠే । యాంతి మంగళసూత్రతామ్ ॥

వందనము లాచరింతు శ్రీవత్స చిహ్న
మిశ్రులకు శ్రీహరి పదాంబుజాశ్రయులకు
తాల్చు యత్సూక్తి మాంగళ్యతంతు శోభ
చెన్నుమీఱ త్రయీకంఠసీమమందు.

ప్రతిపదార్థము :—యత్ + ఉక్తయః = ఏ మహనీయునిమాటలు, త్రయీకంఠే = వేదత్రయి యను కాంతయొక్క కంఠము నందు, మంగళసూత్రతామ్ = మంగళసూత్రమగుటను, యాంతి = పొందుచున్నవో (తేభ్యః = అట్టి) శ్రీవత్సచిహ్న మిశ్రేభ్యః = కూరేశులను నామాంతరముగల శ్రీవత్సాంక మిశ్రులకొఱకు, నమఉక్తిమ్ = నమోవాకమును (నతి యను మాటను) అధీమహి = అధ్యయనము చేయు చున్నాము.

విశేషము :— 'అధీమహి' అను క్రియాపదమును ప్రయోగించుటచే వేదము నెట్లు నియమపూర్వకముగా భక్తిశ్రద్ధ

లతో అధ్యయనము చేయుదురో యట్లే మంత్రతుల్యమగు నేతచ్ఛ్రీస్తవమునకు ద్రష్టయగు శ్రీ శ్రీవత్సాంక మిశ్రుల పట్లఁ గృతజ్ఞతను భక్తిశ్రద్ధలను జూపుచు నీ నమస్కార శ్లోకమును బఠించుచున్నామని స్తోత్ర పాఠకమహాశయుల యాశయము సూచితమగుచున్నది. ఇందు శ్రీవత్సాంక మిశ్రుల సూక్తులను త్రయీకాంత మంగళసూత్రముగాఁ బోల్చుటచేత స్త్రీకి మంగళసూత్ర మెంత ముఖ్యమో త్రయీకాంతకు శ్రీవారి సూక్తు లంత ముఖ్యములనియు, వ్యాఖ్యానప్రాయములనియు భావము. మఱియుఁ గంఠము నందలి మంగళసూత్రము స్త్రీని జీవద్భర్తృకనుగాఁ జాటు నట్లు ఈ త్రయీకాంత సదా జీవద్భర్తృక యనియు సకల వేద ప్రతిపాద్యుఁడును నిత్యుఁడు నగు శ్రీమన్నారాయణ మూర్తియే యీ కాంతను జేఁబట్టిన పరమపురుషుఁడనియు ధ్వనిత మగుచున్నది. దీనికి గమకము 'యాంతి' యను వర్తమానకాలిక క్రియ.

శ్లో. స్వస్తిశ్రీర్దిశతా దశేష జగతాం సర్గోపసర్గ స్థితీః
స్వర్గం దుర్గతి మాపవర్గిక పదం సర్వంచ కుర్వన్ హరిః ।
యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తేఖిలం
క్రీడేయం ఖలు నాన్యథాస్య రసదాస్యాదైకరస్యాత్తయా ॥ ౧

అవతారిక :- భాగవతోత్తములగు శ్రీకూరేశులవారు భగవత్సమాశ్రయణమున కుద్యుక్తు లగు సమస్తచేతనులకుఁ బురుషకారభూతురా లగుటచేఁ బ్రథమమున నాశ్రయణీయురాలగు శ్రీదేవిని బదునొకండు శ్లోకములచే స్తుతింపఁ

బోవుచు నంతరాయ పరిహారంబునకై యాశీర్వచనరూప మగు మంగళమును స్తోత్రారంభమున 'స్వస్తి శ్రీః' అను శ్లోకముతోఁ జేయుచున్నారు.

ప్రతి :- అశేషజగతామ్ = సమస్తలోకములకు, సర్గ, ఉపసర్గ, స్థితీః = సృష్టిని, సంహారమును, రక్షణమును, స్వర్గమ్ = స్వర్గమును, దుర్గతిమ్ = నరకమును, ఆపవర్గికపదమ్ = మోక్ష స్థానమును, సర్వంచ = (ఒకటేమి) అన్నిటిని, (అనఁగా ఐహికాముష్మిక భోగవిశేషము నంతయును అని భావము) కుర్వన్ = చేయుచు (చేయఁబోవుచు), హరిః = శ్రీమన్నారాయణమూర్తి, యస్యాః = ఏ శ్రీదేవియొక్క, ముఖమ్ = ముఖమును, వీక్ష్య = చూచి, తదింగిత, పరాధీనః = ఆ శ్రీదేవి కనుబొమల సూచనకు: బరతంత్రుఁడై, అఖిలమ్ = సమస్తమును, విధత్తే = చేయుచున్నాఁడో, అన్యథా = అట్లుకాని యెడల, అస్య - ఈనారాయణమూర్తి, తయా - ఆశ్రీదేవితో, ఐకరస్యాత్ = ఏకరుచికలవాఁడుగాన, ఇయమ్ - ఈ, క్రీడా = సృష్ట్యాదిక్రీడ, రసదా = ఆనందము నిచ్చునది, నస్యాత్ ఖలు = కాదో, సా = అట్టి, శ్రీః = శ్రీదేవి, స్వస్తి = శుభమును, దిశతాత్ = ఇచ్చుఁగాక.

తా. సమస్తలోకములకు సృష్టి స్థితి సంహారములను, స్వర్గ నరకములను మోక్షమును ఒకటేమిటి సమస్తైహికాముష్మిక సుఖవిశేషములను గలిగింపఁ బోవుచు శ్రీమన్నారాయణ మూర్తి, యే తల్లిముఖమును దిలకించుచు నామె కనుబొమ జాడల ననువర్తించునో, యే దేవి యిష్టానిష్టముల నే తనకుఁ

బ్రియాప్రియములుగా భావించునో యే యమ కిష్టముగాని
జగత్సర్గనాదిక్రీడ తనకానందదాయినికాఁజాలదని యెంచునో
యట్టి యుత్తమరాలును, ఎల్లరుఁ దన్నాశ్రయించుటచేతను
తాను సర్వేశ్వరునాశ్రయించుటచేతను ఏమాతశ్రీశబ్దముఖ్య
వాచ్యరాలో అట్టిశ్రీమహాదేవి స్వస్తోత్రనిర్మాణోద్యుక్తుఁడ
నగు నాకుఁ దదనుకూలశబ్దార్థభావ ప్రసారణాదికమును,
ఏతత్ స్తోత్రపాఠకమహాశయుల కభ్యుదయనిశ్రేయసాముల
ననుగ్రహించుఁగాక.

శ్రీనాథుండు సమస్తచేతనులకున్, సృష్ట్యాది లీలాయుతం
బే నీలాలకమోముఁ జూచుచు యదీయేచ్ఛానుసారంబు సం
ధానించున్, యదనిష్టమీదోముద, మేతాదృక్ప్రిభావాఢ్యయా
శ్రీనీలోత్పలనేత్ర లోకములకున్, జేకూర్చుఁ గళ్యాణముల్. 1

అవతారిక :- పైశ్లోకమునఁ జెప్పిన భావమునే యీ క్రింది
శ్లోకమున వివరించుచున్నారు.

శ్లో॥ హేశ్రీర్దేవి సమస్తలోకజననీంత్వాంస్తోతు మీహామహే
యుక్తాం, భావయ భారతీంప్రగుణయ ప్రేమప్రధానాంధియమ్।
భక్తింభందయ నందయాశ్రిత మిమం దాసం జనంతావకం
లక్ష్యంలక్ష్మి! కటాక్షవీచి విసృతే స్తేస్యామ చామీ వయమ్॥

ప్రతి :- శ్రీః! = ఎల్లరిచే నాశ్రయింపఁబడుదానా! లేదా సర్వే
శ్వరు నాశ్రయించినదానా! దేవి! = క్రీడాది గుణవిశిష్టు
రాలా!, హేలక్ష్మి! = ఓ లక్ష్మీదేవీ!, వయమ్ = మేము,
సమస్తలోకజననీమ్=ఎల్లలోకములకుఁ దల్లివగు, త్వామ్=
నిన్ను, స్తోతుమ్=స్తుతించుటకు, ఈహామహే - ప్రయత్నించు

చున్నాము, యుక్తామ్ = స్తోత్రమున కనువగు, భారతీమ్ = వాక్కును, భావయ = ఉత్పాదింపఁజేయుము, ప్రేమప్రధానామ్ = (నీ లోకోత్తర కల్యాణగుణములందు) ప్రీతియే ముఖ్యముగాఁగల, ధియమ్ = బుద్ధిని, ప్రగుణయ = వర్ధిల్లఁజేయుము, భక్తిమ్ = భక్తిని, భందయ = కల్యాణవతినిగాఁజేయుము. (అనగాఁ పరమభక్తిపర్యంతము పరిపాకమును జెందుదానినిగాఁ జేయుమని భావము ) ఆశ్రితమ్ = నిన్నాశ్రయించిన, ఇమమ్ = ఈ, తావకమ్ = నీ సంబంధియగు, దాసమ్, జనమ్ = దాసజనుని, నందయ = సంతోషపెట్టుము, అమీ = ఈ, వయమ్ = మేము, తే = నీయొక్క, కటాక్షవీచి విస్రుతేః = క్రేగంటి కెరటాలపొంగునకు, లక్ష్యమ్ = గుఱి, స్యామ = అగుదుముగాక.

తా॥ సర్వేశ్వరు నాశ్రయించి సకలచేతనాశ్రయణీయవైన యో లక్ష్మీదేవీ! సకలలోకజననివగు నిన్నునుతింపఁ బ్రయత్నించు మాకు మంచి వాక్కుల ననుగ్రహించి, నీ కల్యాణగుణగణములందుఁ బ్రేమాతిశయముగలబుద్ధి నభివృద్ధిపఱిచి, భక్తినొసఁగి, యా భక్తిని పరమభక్తిపర్యంతము పరిపాకమును బొందించి నీ యాశ్రితుఁడగు నీదాసుని సంతోషపెట్టుము. పరమభక్తి సమనంతరభావియగు నిత్యకైంకర్యనిరతు నొనర్పుము. ఈ మేము నిత్యముక్తులవలె నీ కటాక్షతరంగ విజృంభణమునకు లక్ష్యభూతుల మగుదుముగాక.

దేవీ! లక్ష్మీ! సమస్తలోకజనయిత్రీ! నిన్నుఁగొండాడు నా కీవమ్మా! మధురమౌ వాక్కు, వలపున్, హెచ్చించు ధీవైభవం బీవమ్మా! దృఢభక్తినిచ్చి కుతుకం, బీవమ్మ! యీదాసునిం బ్రోవన్ నీకడగంటిచూపుఁ గెరటంపున్ ముంపునిట్లుంపుమా! 2

అవతారిక :- ఇట్లు స్తోత్రానుగుణవాణి మొదలుకొని నిత్య కైంకర్యపర్యంతము గల నిజమనోరథమును వేఁడుకొని కూరేశు లీ శ్లోకమునందు కవిజనులచేత నిర్వచింపఁబడిన స్తోత్రలక్షణము నిరవధికాతివిలక్షణగుణవతి వగు నీయందుఁ బొసఁగదని చెప్పుచున్నారు.

శ్లో॥ స్తోత్రం నామకిమామనంతి కవయో యద్యన్యదీయాన్ గుణాన్
అన్యత్రత్వ సతోఽధ్యారోప్యభణితిః సాతర్హి వంధ్యాత్వయి ।
సమ్యక్ సత్యగుణాభివర్ణన మథో బ్రూయుః కథం తాదృశీ
వాక్ వాచస్పతి నాపి శక్యరచనాత్వ త్సద్గుణార్ణోనిధౌ ॥ 3

ప్రతి :- కవయః=కవులు, కింనామ=ఎట్టిదానిని, స్తోత్రమ్= స్తోత్రమునుగా, ఆమనంతి= చెప్పుచున్నారు ? (ఇది ప్రశ్న) అసతః = (స్తుతవస్తువునందు) లేనట్టియు, అన్యదీయాన్ = అన్యవస్తువునందున్న, గుణాన్ =గుణములను, అన్యత్ర= మఱియొక వస్తువునందు (స్తుత్యవస్తువునందు) అధిరోప్య= ఆరోపించి, భణితిః=ఉక్తి (చెప్పుట) స్తోత్రంయది=స్తోత్ర మగునేని (ఇది జవాబు) తర్హి =ఆపక్షమున, సా=ఆరీతిగాఁ జెప్పుట, త్వయి=అపారగుణగణనిధివగు నీయందు, వంధ్యా= నిరర్థకమైనది. (అంతులేని గుణగణములుగల నీయందు లేని గుణములు దుర్లభములు గాన నీ లక్షణము పొసఁగదని భావము. ఇది యీ స్తోత్రలక్షణమున కాపత్తి.) అథో= అట్లు కానియెడల, సమ్యక్ =చక్కఁగా (ఉన్నవియున్నట్లు) సత్య, గుణ, అభివర్ణనమ్ =ఉన్నగుణములనే పూర్ణముగా వర్ణించుటయే (స్తోత్రమ్ = స్తోత్రమునుగా,) బ్రూయుః

యది=చెప్పాదు రేని (స్తోత్రలక్షణము నీవిధముగా మార్చి చెప్పాదు రేని) త్వాత్, సద్గుణ, అర్ణోనిధా=నీసుగుణ సముద్రమునందు, తాదృశీ=అట్టి, వాక్=ఉక్తి, ఉన్న గుణముల నన్నిటిని సాకల్యముగాఁ గూర్చి చెప్పుట, వాచస్పతినా, అపి=బృహస్పతిచేతనైనను, కథమ్=ఎట్లు, శక్యరచనా=వీలైన రచన గలది, (స్యాత్=అగును) కాదని భావము.

తా॥ ఓ తల్లీ! స్తోత్రమునకుఁ గవులు లక్షణ మేమివచింతురు? స్తుత్యవస్తువున లేని యన్యదీయ గుణముల నారోపించి వర్ణించుట స్తోత్రమందు రేని సకల కల్యాణగుణ నిలయవగు నీయందాలక్షణ మసంభవగ్రస్తమగు (పొసఁగదని భావము) అట్లుగాక యున్న గుణములనే సాకల్యముగా నున్న వున్నట్లు వర్ణించుటయే స్తోత్రమునకు లక్షణమందు రేని నీగుణసముద్రమునందు ఉన్న గుణముల నన్నింటిని బొల్లుపోకుండ వర్ణించి చెప్పుట బృహస్పతి కేనియు శక్యముగాదు గాన నదియుఁ బొసఁగని లక్షణమే యగుచున్నది. సకలకల్యాణ గుణనిధివగు నీ యందు లేనిగుణములే లేవుగాన మొదటి లక్షణము పొసఁగదు. కల్యాణగుణపయోనిధివగు నీగుణములను సాకల్యముగా బృహస్పతియు వర్ణింపలేఁడుగాన రెండవ లక్షణమును బొసఁగదని భావము.

స్తోత్రం బెట్టిదిగా వచింతురు కవుల్? స్తుత్యంబునన్ లేని య
న్యత్రవ్యక్తములౌ గుణంబులిట సంధానించు టేనిన్, మృషా
పాత్రం బయ్యది నీయెడన్, గుణయథా వద్వర్ణనం బన్నచోఁ,
జిత్రింపం గలఁడే బృహస్పతియు లక్ష్మీ! నీగుణాలన్నియున్. ౩

అవతారిక :- ఇట్లు గుణము లపరిమితములుగాన స్తోత్రప్రవృత్తి యెట్లు సాధ్యమగునను శంకను దృష్టాంతపూర్వకముగాఁ బరిహరించుచున్నారు.

శ్లో॥ యేవాచాం మనసాంచ దుర్గ్రిహతయా ఖ్యాతా గుణాస్తావకా
స్తానేవ ప్రతిసాంబు జిహ్వాముదితా హైమామికా భారతీ।
హాస్యం తత్తు నమన్మహే నహి చ కోర్యేకాఖిలాం చంద్రికాం
నాలంపాతు మితి ప్రగృహ్యారసనా మాసీత సత్యాం తృషి॥ ౪

ప్రతి :- తావకాః = నీ సంబంధములకు, యే = ఏ, గుణాః = కల్యాణగుణములు, వాచామ్ = వాక్కులకు, మనసాంచ = హృదయములకును, దుర్గ్రిహతయా = గ్రహించుటకు నలవి కాని తనము చేత, ఖ్యాతాః = ప్రసిద్ధిగాంచినవో, తాన్, ఏవ, ప్రతి = వానినేగూర్చి (ఆ గుణములనే యుద్దేశించి) మామికా = నా సంబంధమగు, భారతీ = వాక్కు, స, అంబు జిహ్వామ్ = జలముతోఁ గూడిన నాలుక గలుగునట్లు, (నోరూరునట్లు వర్ణించుటకు) ఉదితా = (స్తుతించుటకు) ప్రవర్తించినది, హై = ఆశ్చర్యము, తత్, తు = అట్లు ప్రవర్తించుటను, హాస్యమ్ = పరిహాస్యమునుగా, న, మన్మహే = తలంచము, హి = ఎందుకనఁగా, ఏకా = ఒక, చకోరీ = ఆడు చకోరపక్షి (వెన్నెలత్రాగు పిట్ట) తృషి = దప్పిక, సత్యామ్ = ఉండఁగా, అఖిలామ్ = సమస్తమగు, చంద్రికామ్ = వెన్నెలను, పాతుమ్ = త్రాగుటకు, న, అలమ్ = సమర్థురాలనుగాను, ఇతి = అని, రసనామ్ = నాలుకను, ప్రగృహ్యా = ముడుచుకొని, న + ఆసీత = ఊరకుండదు.

తా॥ ఓతల్లీ! శ్రీదేవి! నీ లోకోత్తర కల్యాణగుణములు అవాఙ్మానసగోచరములుగాఁ బ్రసిద్ధిఁ బడసినను నా నాలుక యట్టి నీ గుణములనే రసములూర వర్ణింపఁ బ్రవర్తించుట పరిహాస్యముగాదు. ఏలయన దప్పిగొన్న చకోరాంగన యీ సమస్తమగు వెన్నెలను నేనెట్లు త్రాగఁగలనని నాలుక ముడుచుకొని యూరక కూర్చుండునా? దప్పిగొన్న వెన్నెల పిట్ట సమస్తచంద్రికను ద్రాగ శక్యముగాకున్నను మితముగా గ్రహించి యెట్లు దప్పికను దీర్చుకొనునో యట్లే నా నాలుకయు నీ కల్యాణగుణములను తన శక్తికొలఁది చవులూర వర్ణించి కృతార్థయగునని భావము.

ఓతల్లీ! విదితంబు నీదు సుగుణవ్యూహంబు వాఙ్మానసా
తీతంబంచు, మదుక్తిదాననె ప్రవర్తిల్లెన్ రసంబూర, నీ
రీతిన్ హాస్యముగాఁ దలంపను జకోరీజిహ్వ వెన్నాఁడు నే
నేతచ్చంద్రికనెల్లఁ గ్రోలఁగలనా! యేనంచు నీర్వట్టుచోన్. 4

అవతారిక :- గుణశూన్యుఁడగు తానీ స్తోత్రమును రచింపఁగడంగుటకు లజ్జాభయము లేల కలుగలేదను శంకను, గుణరహితుఁడగు తన స్పర్శచేఁ బవిత్రమగు నీ విషయమునకు దోషమంటదా? అను నాక్షేపమును కవి దృష్టాంతముఖమున నీ క్రిందిశ్లోకముతోఁ బరిహరించుచున్నాఁడు.

శ్లో॥ క్షోదీయానపి దుష్టబుద్ధిరపి నిః స్నేహో ప్యనీహోఽపి తే
కీర్తిం దేవి! లిహన్నహంనచ బిభేమ్యజ్ఞోనజిహ్రేమిచ।
దుష్యేత్సాతునతావతా నహిశునాలీఢాపి భాగీరథీ
దుష్యేత్ శ్వాపి న లజ్జతే నచ బిభేత్యార్తిస్తు శామ్యేచ్ఛునః॥ ౫

ప్రతి :- హే దేవి! = ఓ శ్రీదేవీ!, క్షోదీయాన్, అపి = మిక్కిలి క్షుద్రుడనైనను, దుష్టబుద్ధిః, అపి = దుష్టమతినైనను, నిః స్నేహః అపి = భక్తిలేని వాఁడనయినను, అనీహః అపి = భక్తికార్యములగు సేవాది చేష్టలు లేనివాఁడనైనను, తే = నీ యొక్క, కీర్తిమ్ = (గుణములుగల తల్లివను) ప్రతిష్ఠను, లిహన్ = ఆస్వాదించుచు, అజ్ఞః = పామరుఁడనగు, అహమ్ = నేను, న, చ, బిభేమి = భయపడను, న, జిహ్రేమి చ = సిగ్గుపడనుగూడ, సాతు = ఆ నీ ప్రతిష్ఠయైనను, తావతా = అంతమాత్రముచే (పామరుఁడనగు నేనాస్వాదించుటచేత) న, దుష్యేత్ = దోషయుక్తము కాదు. (దృష్టాంతమును జూపుచున్నాఁడు) హి = ఎందుకనఁగా, శునా = కుక్కచేత, లీఢా, అపి = ఆస్వాదింపఁ బడినను (నాకఁ బడినను) భాగీరథీ = గంగానది, దుష్యేత్ = దుష్టముకాదు, శ్వా, అపి = కుక్కయు, న, లజ్జతే = సిగ్గుపడదు, న, బిభేతి, చ = భయపడదుకూడ, తు = మఱి యేమనఁగా, శునః = కుక్కకు, ఆర్తిః = దప్పిక యను బాధ, శామ్యేత్ = శమించును.

తా॥ ఓ తల్లీ! అతి నీచుఁడనైనను దుష్టబుద్ధినైనను భక్తి హీనుఁడనైనను భక్తికార్యములగు పరిచర్యాదులు లేని వాఁడనైనను నీ కల్యాణగుణ ప్రశస్తిని ఆస్వాదించుటకు నజ్ఞుఁడనే యని నేను వెఱువను. లజ్జింపను. అజ్ఞుఁడనగు నాచే నాస్వాదింపఁబడిన మాత్రమున నా నీ గుణప్రశస్తి

కెట్టిదోషము నంటదు. ఎట్లన - దప్పిగొన్న యొకకుక్క యాస్వాదించినంత మాత్రమున భాగీరథి కేమి లోపము ? భాగీరథి నంటితినే యని కుక్క సిగ్గుపడునా ? భయపడునా? కుక్కకే దప్పితీఱును. అట్లే నీ గుణప్రశస్తిని స్తోత్రముగా రచించుటచే నా యిచ్ఛయే తీఱునుగాని నీ కెట్టిదోషము నంటదని భావము.

అతినీచుండను దుర్మతిఁ విగతసౌహార్దుండ నిశ్చేష్టుఁడఁ
వితథప్రజ్ఞుఁడనయ్యు నఁటుచు భవద్విఖ్యాతి భీతుండ ల
జ్జితుఁడఁగా, నపవిత్రమా నె యదిలక్ష్మి! యంటుచోఁ గుక్కనీ
ర్గతుకఁ గంగకునంటెఁ? కుక్క కెద సిగ్గా! తీఱుఁదత్తృష్ణయే.

అవతారిక :- ఇట్లు స్తవమును ప్రశంసించి శ్రీదేవిని స్తుతించు చున్నాఁడు.

శ్లో॥ ఐశ్వర్యం మహదేవవాల్ప మథవాదృశ్యేత పుంసాంహియత్
తల్లక్ష్మ్యాః సముదీక్షణాత్ తవయతః సార్వత్రికం వర్తతే।
తేనైతేన నవిస్మయేమహి జగన్నాథోఽపి నారాయణో
ధన్యంమన్యత ఈక్షణాత్తవయతః స్వాత్మానమాత్మేశ్వరః॥ ౬

ప్రతి :- సార్వత్రికమ్=సర్వత్ర అనుభావ్యమగు (అనఁగా) ఐహికమును, ఆముష్మికమునగు, పుంసామ్=పురుషులకు సంబంధించిన, మహత్, ఏవ, వా=గొప్పదిగాని, అథవా= లేక, అల్పంవా=స్వల్పముగాని, యత్=ఏ, ఐశ్వర్యమ్= వైభవము, దృశ్యేత=కనఁబడునో, తత్=ఆ వైభవము (ఐశ్వర్యము) లక్ష్మ్యాః=లక్ష్మీదేవివగు, తవ=నీ యొక్క, యతః=ఏ, సముదీక్షణాత్=కటాక్షమువలన, వర్తతే= ప్రవర్తిల్లుచున్నదో, తేన=అట్టి వైభవముగల, ఏతేన=

ఈ కటాక్షముచేత, న, విస్మయేమహి = ఆశ్చర్యపడము, యతః = ఎందువలన ననఁగా, జగత్ + నాథః = లోకములకు ప్రభువైనట్టియు, ఆత్మేశ్వరః = స్వయంప్రభువై నట్టియు, నారాయణః అపి = నారాయణమూర్తిగూడ, స్వ + ఆత్మానమ్ = తన యప్రాకృత దివ్యవిగ్రహమును, తవ = నీయొక్క ఈక్షణాత్ = చూపు వలన, ధన్యమ్ = సౌభాగ్య వంతము నుగా, మన్యతే = తలంచుచున్నాఁడు.

తా॥ ఓ తల్లీ! శ్రీదేవీ! అధికముగనో! స్వల్పముగనో! లోకమునఁ జేతనులయందుఁ గన్పడు నైహికాముష్మికైశ్వర్యమంతయునీకరుణాకటాక్షమువలన నేకలుగుచున్నది. నీ కటాక్ష మింత మహిమగలది యనుటలో మాకించుకయు నాశ్చర్యము లేదు. ఏలయన జగదీశ్వరుఁడును 'పతిం విశ్వస్యాత్మేశ్వరమ్, నారాయణం పరంబ్రహ్మ' ఇత్యాదిశ్రుతుల చేఁ జెప్పఁబడిన యాత్మేశ్వరుఁడగు నారాయణమూర్తియు నీ కటాక్షమువలనఁ దన యప్రాకృతదివ్యశరీరము సౌభాగ్య వంత మయ్యెనని తలంచుచుండ నీకటాక్ష మితరుల కైశ్వర్యమును గలిగించుచున్న దనుటలో విస్మయ మేముండును.

అమ్మా! యంతయొ యింతయో యెచటనే నైశ్వర్య
మొప్పారినఁ

నమ్మేఁ లోకము నీకటాక్ష మె నిదా,నమ్మంచు లేదిందుఁ జి
త్రమ్మింతేఁ జగదీశుఁడయ్యు హరి సాం,దర్యైకతానంబు స్వీ
యమ్మౌ కాయము త్వత్కటాక్షమున ధ,న్యమ్మంచుఁదా నెంచుఁడే

శ్లో॥ ఐశ్వర్యం యదశేషపుంసి యదిదం సౌందర్య లావణ్యయో
రూపం యచ్చహిమంగలం కిమపి యల్లోకేస దిత్యుచ్యతే।
తత్సర్వం దధీన మేవ యదతః శ్రీరిత్య భేదేనవా
యద్వాశ్రీ మదితీదృశేన వచసా దేవి! ప్రథా మశ్నుతే॥ ౭

ప్రతి :- హే దేవి! = ఓ శ్రీదేవి!, అశేషపుంసి = సమస్తచేతనుల యందు, యత్ = ఏ, ఐశ్వర్యమ్ = ఐశ్వర్యముగలదో, సౌందర్య లావణ్యయోః = అవయవ శోభారూపమగు సౌందర్యము యొక్కయు, సముదాయ శోభారూపమగు లావణ్యము యొక్కయు, యత్ = ఏ, ఇదమ్ = ఈ, రూపమ్ = రూపము గలదో, లోకే = లోకమునందు, యత్, చ = ఏది, మంగలం, హి = మంగళవస్తువని ప్రసిద్ధి చెందినదో, యత్ = ఏది, కిమపి = ఏమేని, సత్, ఇతి = మంచివస్తువని, ఉచ్యతే = చెప్పఁబడు చున్నదో, తత్ = అది, సర్వమ్ = అంతయు, యత్ = ఏ కారణమువలన, త్వత్ + అధీనమ్, ఏవ = నీ యధీనమైనది గానే, (భవతి = అగుచున్నది) అతః = ఇందువలన, శ్రీః, ఇతి, అభేదేన, వా = శ్రీయనుశబ్దార్థముతోడియభేదాధ్యవసాయముచేఁ గాని, యద్వా = లేక, శ్రీమత్, ఇతి, ఈదృశేన = శ్రీమత్ అను నిటువంటి, వచసా, వా = శబ్దముతోఁ గాని, ప్రథామ్ = ప్రసిద్ధిని, అశ్నుతే = పొందుచున్నది.

తా॥ ఓ జననీ! చేతననిష్ఠమగు ఐశ్వర్యగాని సౌందర్యలావణ్యా రూపములుగాని మంగళవస్తువులుగాని మంచివని చెప్పఁబడు ద్రవ్యములుగాని నీ కరుణాకటాక్ష సంప్రాప్తములే. కనుక నే పైఁ బేర్కొనఁబడిన యైశ్వర్యాదిపదార్థము లన్నియు

శ్రీ శ్రీమచ్ఛబ్దములకు వాచ్యములై ప్రసిద్ధిజెందె నీ కటాక్ష ప్రభావమును వేనోళ్ళ వెల్లడించుచున్నవి.

ఓ శ్రీదేవి! సమస్తచేతనులలో, నొప్పారు నైశ్వర్యమో!
సుశ్రీకంబగు రామణీయకమొ! మెచ్చుంగూర్చు లావణ్యమో!
అశ్రాంతమ్ము శుభమ్మొ! సత్తొ! భవదాయత్తంబె, నీకీర్తినే
శ్రీ శ్రీమత్పదవాచ్య మీసకలమున్, జెండావలెన్ జాటెడున్.

అవతారిక :- ఇట్టి భవదీయైశ్వర్యము నీకుఁగాని నీ వల్లభుఁడగు శ్రీరంగనాథునకుఁగాని యపరిచ్ఛేద్యమని తెలుపుచుఁ దన్మాహాత్మ్యమును గొనియాడుచున్నారు.

శ్లో॥ దేవి! త్వన్మహిమావధిర్న హరిణా నాపి త్వయా జ్ఞాయతే
యద్యప్యేవ మథాపి నైవ యువయో స్సర్వజ్ఞతా హీయతే।
యన్నాస్త్యేవ,తదజ్ఞతా మనుగుణాం సర్వజ్ఞతాయా విదుః
వ్యోమాంభోజ మిదంతయా కిలవిదన్ భ్రాంతోఽయ మిత్యుచ్యతే॥౯

ప్రతి :- హే దేవి!=ఓ తల్లీ! శ్రీదేవీ! త్వత్, మహిమ, అవధిః = నీ మాహాత్మ్యముయొక్క హద్దు, హరిణా, అపి= శ్రీమన్నారాయణమూర్తి చేతను, త్వయా అపి=నీచేతను గూడ, నజ్ఞాయతే= తెలియబడదు, యది+అపి= యద్యపి= విచారింపఁగా, ఏవమ్=ఇది యిట్లే, అథాఽపి=ఐనను, యువయోః=మీ యిరువురియొక్క, సర్వజ్ఞతా=సర్వజ్ఞత్వము, (అన్నిటిని దెలిసియుండుట) న+ఏవ, హీయతే= కొంచెమేనియుఁ గొఱఁతపడదు, యత్ = ఏది, నాస్తి, ఏవ=లేనేలేదో, తదజ్ఞతామ్=దాని తెలియమిని, సర్వజ్ఞ

తాయాః=సర్వజ్ఞత్వమునకు, అనుగుణామ్=అనుకూలమైన దానినిగా, విదుః = తెలిసికొనుచున్నారు, (పండితులని భావము) ఈ విషయమున వ్యతిరేక దృష్టాంతము నొసఁగు చున్నారు. వ్యోమ+అంభోజమ్=ఆకాశపద్మము (లేనిదని భావము) ఇదంతయా=ఇదిగో అని లక్ష్యనిర్దేశ్యముతో, విదన్ = తెలిసికొనుచు, (తటస్థైః = మధ్యవర్తులచేత) అయమ్ = ఇతఁడు, భ్రాంతః, ఇతి = భ్రమపడినవాఁడని, ఉచ్యతే, కిల=చెప్పఁబడుచున్నాఁడుగదా!

తా॥ ఓ తల్లీ! నీమహిమ మనవధికము. అట్టి నీమహిమయొక్క యవధిని శ్రీహరిగాని నీవుగాని తెలియఁజాలరు. ఇందువలన మీ సర్వజ్ఞత కెట్టిలోటును లేదు. లేని దెన్నఁడును లేనిదే గాన దాని తెలియమి సర్వజ్ఞతకు భూషణమేగాని దూష ణము గాదు. ఎట్లన: ఎన్నఁడును లేని యాకాశపద్మము నదిగోనని వ్రేలితోఁ జూపువానిని భ్రాంతుఁడందురుగాని విజ్ఞుఁడనరుగదా! కావున యథార్థముగా లేని నీమహిమా వధిని దెలియమి సర్వజ్ఞత్వమున కనుగుణమే కాని విరు ద్ధము కాదు.

హరిగానీ మఱి నీవుగాని జగదంబా! నీమహత్త్వా మహా
గురుపారంబు నెఱుంగఁజాల, రది మీ కుంగల్గు సర్వజ్ఞతన్
బరిభావింప, దెఱుంగనంటయసదున్, బై పెచ్చు సర్వజ్ఞతన్
స్థిరముం జేయు, నభేఖపుష్పమనునా, దేబెల్ మహిన్ భ్రాంతులే.

శ్లో॥ లోకే వనస్పతి బృహస్పతి తారతమ్యం
యస్యాం ప్రసాద పరిణామ ముదాహరంతి।
సాభారతీ భగవతీతు యదీయదాసీ
తాం దేవదేవ మహిషీం శ్రియ మాశ్రయామః॥ ౯

ప్రతి :- లోకే = లోకమునందు, వనస్పతి, బృహస్పతి, తారతమ్యమ్ = జ్ఞానము లేనివానిలో గొప్పదియగు వృక్షమునకును, జ్ఞానులలో గొప్పవాఁడగు బృహస్పతి యొక్కయు, భేదమును, యస్యాః = ఏతల్లియొక్క, ప్రసాద, పరిణామమ్ = అనుగ్రహముయొక్క పరిపాకమునుగా, ఉదాహరంతి = చెప్పుచున్నారో, సా = అట్టి, భగవతీ = పూజ్యురాలగు, భారతీ = సరస్వతీదేవి, యదీయ, దాసీ = ఏ జగజ్జనని పరిచారికయో, తామ్ = అట్టి, దేవ దేవమహిషీమ్ = వేల్పులకు వేల్పగు శ్రీరంగనాథునిపట్టపురాణియైన, శ్రియమ్ = శ్రీదేవిని (రంగనాయకిని) ఆశ్రయామః = ఆశ్రయించుచున్నాము.

తా॥ లోకమునఁ దెలివిలేనివానిలో మొదటిదియగు వృక్షమునకును, తెలివిగలవారిలో మొదటివాఁడగు బృహస్పతికిని గల భేదమే తల్లి యనుగ్రహ పరిపాకములుగాఁ బెద్దలు చెప్పుదురో యట్టి పూజ్యురాలగు సరస్వతియే జగజ్జనని దాసియో యా దేవదేవుని పట్టపురాణియగు శ్రీదేవి నాశ్రయించుచున్నాము.

సీ॥ క్షితి వనస్పతికిఁ బృహస్పతికి భేద
మే మహిళ సత్కృపాపరిణామమందు
రార్యయావాణి యేతల్లి కనుఁగుదాసి
అట్టి హరిపత్ని శ్రీదేవి నాశ్రయింతు.

శ్లో॥ యస్యాః కటాక్ష మృదు వీక్షణ దీక్షణేన,
సద్యః సముల్లసిత పల్లవ ముల్లలాస ।
విశ్వం విపర్యయ సముత్థ విపర్యయం ప్రాక్
తాం దేవదేవ మహిషీం శ్రియమాశ్రయామః॥ ౧౦

ప్రతి :- ప్రాక్ = పూర్వము (ప్రళయకాలమున) విపర్యయ, సముత్థ,విపర్యయమ్ = కటాక్షము లేకపోవుటచే బుట్టిన వినాశముగల, విశ్వమ్ = ప్రపంచము, యస్యాః = ఏతల్లియొక్క, కటాక్ష, మృదు, వీక్షణ, దీక్షణేన = కటాక్షరూపమగు లేతచూపుయొక్క సంకల్పముచేత, సద్యః = వెంటనే, సముల్లసితపల్లవమ్ పొడమిన చిగురు (అంకురము) కలుగునట్లు,ఉల్లలాస = ప్రకాశించెనో, తామ్ = అట్టి, దేవదేవ మహిషీమ్ = వేల్పులకు వేల్పగు రంగనాయకుని పట్టపురాణియైన, శ్రియమ్ = లక్ష్మీదేవిని,ఆశ్రయామః = ఆశ్రయించుచున్నాము.

తా॥ ప్రళయకాలమున సర్వేశ్వరుని కటాక్షము లేకపోవుటచే వినాశమందిన జగత్తు ఏతల్లి క్రేగంటి లేజూపు సంకల్పమున మరల నంకురోన్ముఖమై యుదయించెనో యా దేవదేవుని పట్టపురాణియగు శ్రీదేవి నాశ్రయించుచున్నాము.

ఏ దేవీ కృపలేమియుం ప్రళయమం, దేమాత్రముం నామరూపాదుల్ లేక యడంగె నాజగమె యిష్టాదేవి నేత్రాంతిక ప్రాదుర్భూతకృపేక్షణేచ్ఛ మగుడం, ప్రత్యగ్రశోభాఢ్యమో! శ్రీదం దాదృశి దేవదేవ మహిషిం, శ్రీదేవి సేవించెదం.

అవతారిక: ఈవిధముగానితరులయెడస్పష్టముగాగోచరించుచున్న లక్ష్మీకటాక్షవైలక్షణ్యా వైభవమును తనయందును జూపం బ్రార్థించుచు శ్రీకూరేశులీ స్తోత్రమును ముగించుచున్నారు.

శ్లో॥ యస్యాః కటాక్షవీక్షా, క్షణలక్ష్యం లక్షితా మహేశాః స్యుః ।
శ్రీరంగ రాజమహిషీ, సామామపి వీక్షతాం లక్ష్మీః॥ ౧౧

ప్రతి :- యస్యాః = ఏతల్లియొక్క, కటాక్ష, వీక్షా, క్షణలక్ష్యమ్ = క్రేఁగంటిచూపునకు క్షణకాలము లక్ష్యముగా (గుఱిగా) లక్షితాః = చూడఁబడినవారు, మహేశాః = మహైశ్వర్యవంతులు (మహేశ్వరులు అనియు భావము) స్యుః = అగుదురో, శ్రీరంగ రాజమహిషీ = శ్రీరంగనాథుని పట్టపురాణియగు, సా = ఆ, లక్ష్మీః = లక్ష్మీదేవి, మాంఅపి = నన్నుఁగూడ, వీక్షితామ్ = కటాక్షించుఁగాత.

తా॥ ఏతల్లి క్రేఁగంటిచూపునకు క్షణకాలము గుఱియైనవారు మహైశ్వర్యవంతులు లేదా మహేశ్వరు లగుదురో యట్టి శ్రీరంగనాథుని దేవేరియగు మహాలక్ష్మి నన్నుఁగూడఁ గటాక్షించుఁగావుత. ఆతల్లికటాక్షముచే నేనుకృతకృత్యుఁడ నగుదుఁగాక.

ఏక్షమావతి కరుణాకటాక్షములకు
క్షణము గుఱియగువార్ మహేశ్వరులగుదురో!
అట్టి శ్రీరంగరాజుల పట్టమహిషి
శ్రీమహాదేవి నను గటాక్షించుఁగాత.

తల్లిరో! నాదు పుష్పనవీఁ దజ్జుల మెప్పులనొప్పు కైతయన్
వల్లికిఁ బూచెఁ బూవులివి వాడవు వీడవు సౌరభంబులన్
సల్లలితంబు లర్పణము సల్పఁగ నీకివిగ గూర్చి మాలఁగా
నల్లితి దీని నిల్పు గళమందున నిందిర! పద్మమందిరా!-

*గద్యము :- ఇది శ్రీవత్సాంక మిశ్రవిరచిత శ్రీ స్తవంబునకు, కవిశేఖర, మహోపాధ్యాయ, మధ్వశ్రీ పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్య కృతంబగు నాంధ్రవివరణము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీ శ్రీవత్సాంకమిశ్రవిరచిత పంచస్తవీస్థ

# శ్రీ వైకుంఠ స్తవము

కవి శేఖర మధ్వశ్రీ పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్య కృతాంధ్ర
వివరణ పద్యసహితము.

అవతారిక:- భగవద్రామానుజసమీపమున నిత్యనివాసముచేత నధిగతాఖిలవేదాంత తత్త్వార్థులు అగు శ్రీవత్సచిహ్న మిశ్రులు కరుణార్ద్రహృదయముతో సకలసజ్జనుల నుజ్జీవింపఁ జేయఁ బంచస్తవీవ్యాజమున నర్థపంచకమును బ్రకాశింపఁ జేయఁ దలఁచినవారై మొట్టమొదట నకుంఠమహిము లగు భగవద్వైకుంఠనాథుల స్వరూపరూపగుణములఁ బ్రతిపాదించుటకు శ్రీవైకుంఠస్తవము నారంభించుచు సదాచార్య ప్రపత్తిరూప మగు మంగళంబును స్తవాదియందు నిబంధించుచున్నారు.

శ్లో॥ యో నిత్య మచ్యుతపదాంబుజయుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే।
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసింధో
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే॥

ప్రతిపదార్థము:- యః = ఏపూజ్యుఁడు, నిత్యమ్ = ఎల్లప్పుడు, అచ్యుత, పద, అంబుజ, యుగ్మ, రుక్మ, వ్యామోహతః = శ్రీ వైకుంఠనాథుని పాదపద్మములజంట యను బంగారము

మీఁది పేరాసవలన, తత్ + ఇతరాణి = దానికంటె నితరములగు వస్తువులను, తృణాయ = గడ్డిపోచకొఱకు, మన్యే = తలఁచెనో! (గడ్డిపోచను వలె ననాదరముగాఁ జూచె నని భావము.)

అస్య = ఇటువంటియు, దయా ఏక, సింధోః = ముఖ్యగుణమగు దయకు సముద్రమువంటియు, అస్మద్గురోః = మాయాచార్యుఁ డగు, భగవతః = కల్యాణగుణగణాకారుఁడగు, రామానుజస్య = శ్రీమద్రామానుజయతి సార్వభౌమునియొక్క, చరణౌ = రెండుపాదములను, శరణమ్ = శరణమునుగా, ప్రపద్యే = నిశ్చయించుకొని యాశ్రయించుచున్నాను. (పపత్తిచేయు చున్నాను.)

విశేషము:- యక్మ్రవ్యామోహాత స్తదితరాణి తృణాయ మేనే- బంగారము దొరకినవాఁడు ఇత్తడి, రాగి, యినుము మున్నగువాని నెట్లు నిరాదరముగాఁ జూచునో! అట్లే భగవద్రామానుజులు శ్రీవైకుంఠనాథుని పాదపద్మములజంట దొరకఁగా సార్వభౌమాంతమగు ప్రాపంచికసుఖమును బ్రహ్మాంత మగు నాముష్మికసౌఖ్యమును గడ్డిపోచవలెఁ దుచ్ఛముగాఁ జూచె నని భావము.

'కరుణైకసింధోః' ఇందలిముఖ్యార్థక మగు ఏకశబ్దముచే భగవద్రామానుజులయందుఁ గల యితర కల్యాణగుణముల కంటె దయాగుణమునకుఁ బ్రాచుర్యము చెప్పఁ బడినది.

'శరణమ్' అనిష్టనివృత్తి పూర్వకేష్టప్రాప్తి.

సాధనమ్- అనిష్టములను నివర్తింపఁ జేయుచు ఇష్ట ప్రాప్తికి సాధనమగుదానిని శరణ మందురు. శ్రీవత్స చిహ్నమిశ్రులకు శ్రీరామానుజపాద సమాశ్రయము జనన మరణాద్యనిష్టములను బోఁగొట్టుకొని నిరవధికనిరతిశయ నిత్యానందప్రాప్తిరూప మగు నిష్టమును బొందుట కని యాశయము.

ఈ ప్రథమశ్లోకము మంగళశ్లోకము 'సమాప్తికామో మంగళ మాచరేత్' అను శిష్టానుమితశ్రుతివలన మంగళ మునకు ఫలము అంతరాయశాంతియు సమాప్తియుఁ గనుకఁ దదర్థ మీ మంగళమును మనసులోఁ జేసినఁ జాలుఁ గదా! గ్రంథమునం దెందులకుఁ జేర్పఁ బడె ననఁగా 'మద్గురుణా మంగళం కృతం మయాఽపి మంగళం కర్తవ్య మితి శిష్యశిక్షాయై'- నా గురువుచే గ్రంథాదియందు మంగళము చేయఁబడుటచే నేనుగూడ గ్రంథమును వ్రాయు నపుడు మంగళము చేయ వలయునని యసన్నిహితశిష్యులు గూడ గ్రహించుట కని భావము.

తాత్పర్యము:- ఏ పూజ్యపాదులు నిత్యము శ్రీ వైకుంఠనాథుని పాదపద్మయుగ్మ మను బంగారము (భోగ్యవస్తువు) దొరకుటచే దానిమీఁది వ్యామోహముతోఁ దదితర భోగ్యవస్తువులను గడ్డిపోచఁగాఁ జూచిరో యట్టి యస్మద్గురువు లగు శ్రీ భగవద్రామానుజులచరణంబులను శరణముగాఁ బ్రపత్తి చేయుచున్నాను.

గీ॥ అచ్యుత పదాబ్జయుగ్మ రుక్మాశ్రయమున
నన్యముల నేగురుఁడు తృణమట్లు దలఁచె
నట్టికరుణాంబురాశి రామానుజార్య
చరణసరసిజయుగళంబు శరణు నాకు. 1

అవతారిక:- తరువాత నేతత్ స్తోత్రకర్త భగవద్భాష్య కారులకుఁ బ్రాచార్యులగు యామునమునులచేత మాతాపితేత్యాది శ్లోకముచే నిరంకుశవైభవులుగా సంగ్రహరీతిని జేర్కొనఁ బడిన శ్రీపరాంకుశ మునులను సమాశ్రయ ణీయులుగను సమాధిక రహితులుగను రెండుశ్లోకములతో నుడువు చున్నాఁడు.

శ్లో॥ త్రైవిద్యవృద్ధజనమూర్ధవిభూషణం యత్
సంపచ్చ సాత్వికజనస్య య దేవ నిత్యమ్।
య ద్వా శరణ్య మశరణ్యజనస్య పుణ్యం
త త్సంశ్రయేమ వకుళాభరణాంఘ్రియుగ్మమ్॥

ప్రతిపదార్థము:- యత్ = ఏది, త్రైవిద్య వృద్ధ, జన, మూర్ధ, విభూషణమ్ = ఋగ్యజుస్సామము లను విద్యలయందుఁ బెద్దలగువారియొక్క శిరస్సునకు భూషణమో, యత్ + ఏవ = ఏది, నిత్యమ్ = నిత్యము, (ఇక్కడ నక్కడ) సాత్వికజనస్య = సత్వగుణప్రధాన మగు జనమునకు, సంపత్ = సంపదవలె భోగ్యభూతమో, యత్ + వా = ఏది, అశరణ్య, జనస్య = దిక్కు లేనిజనమునకు, శరణ్యమ్ = శరణుచొచ్చఁ దగినదో, పుణ్యమ్ = పుణ్యసాధన మగు,

తత్ = ఆ, వకుళాభరణ, అంఘ్రి, యుగ్మమ్ = శ్రీ పరాంకుశమునుల పాదములజంటను, సంశ్రయేమ = ఆశ్ర యింతుము గాత.

విశేషము:- 'త్రైవిద్యవృద్ధజన' ప్రధానవిద్యలగు ఋగ్యజు స్సామ వేదముల యర్థములను బలుసారులు పరిశీలించిన విద్యావృద్ధులు అని భావము. వారితలలకు విభూషణ మనఁగా శఠారి పరాంకుశులవారి స్వరూపము గాన- శఠారి వ్యాజమున శ్రీపరాంకుశులే వారిశిరము నలంకరించు చున్నారని భావము.

'యద్ వా' ఇచ్చట 'వా' శబ్దము 'చ' అను అర్థమున వాడఁబడినది.

తా:- ఏపాదములజంట వేదత్రయమునందు నాఱితేఱిన పెద్దలకు శిరోభూషణమో, ఏది యీలోకమునను బరలోకమునను సాత్త్వికజనులకు సంపదవలె ననుభావ్యమో, ఏది యకిం చనులకు రక్షకమో పుణ్యసాధన మగునట్టి శ్రీపరాంకుశ మునుల పాదములజంట నాశ్రయింతుము.

ఉ. వేదపథాధ్వనీనులగు
　　విజ్ఞుల కెద్ది శిరోఽవతంసమో!
　ఏది సుసాత్త్వికావళుల
　　కెల్లపుడున్ బరమానుభోగ్యమో!
　ఏది యకించనాత్ములకు
　　నేడ్గడయో! యెది పుణ్యదాయియో!
　యాదరణీయ మట్టి వకు
　　ళాభరణాంఘ్రి యుగంబుఁ గొల్చెదన్. 2

శ్లో॥ భక్తిప్రభావభవ దద్భుతభావబంధ
సంధుక్షితప్రణయసారరసౌఘపూర్ణః।
వేదార్థరత్ననిధి రచ్యుతదివ్యధామా
జీయాత్ పరాంకుశపయోధి రసీమభూమా॥ 3

ప్రతి:- భక్తి.....పూర్ణః- భక్తి = భక్తియొక్క, ప్రభావ= మహిమచేత, భవత్ = పుట్టుచున్న, అద్భుత = ఆశ్చర్యకరమగు, భావబంధ = అభిప్రాయదార్ఢ్యముచేత, సంధుక్షిత = ప్రకాశింపఁ జేయఁ బడిన, ప్రణయసార = శ్రేష్ఠమగు ప్రణయము (ప్రేమము) అనెడు, రస = రసముయొక్క, ఓఘ = ప్రవాహముచే, పూర్ణః = నిండినదియు, వేదార్థ, రత్న, నిధిః = వేదార్థము లనెడు రత్నములకు గనియైనదియు, అచ్యుత, దివ్యధామా = శ్రీమన్నారాయణమూర్తికి దివ్యనివాసమైనదియు, అసీమ, భూమా = హద్దులేని మహిమ గలదియు, అగు పరాంకుశపయోధిః = పరాంకుశముని యను క్షీరసముద్రము జీయాత్ = సర్వోత్కర్షమై వెలయుఁ గాక.

విశేషము:- ప్రపన్నజనకూటస్థప్రథమాచార్యుఁ డగు శ్రీపరాంకుశ మహామునుల నిరంకుశభక్తియే శ్రీవైష్ణవసంతతికిఁ దారకం బని సంప్రదాయసూక్తి.

తాత్పర్యము:- భక్తిప్రభావమున నుద్భవించుచున్న యద్భుతమగు నభిప్రాయదార్ఢ్యముచేఁ బ్రకాశితమైన ప్రేమరస ప్రవాహముతో నిండినదియు, వేదార్థము లనెడు రత్నములకు గని యైనదియు, శ్రీమన్నారాయణమూర్తికి దివ్య

నివాస మైనదియు, హద్దు లేనిమహిమ (విస్తారము) గల దియు నగు పరాంకుశ మహాముని యను పాలసంద్రము సర్వోత్కర్షమై వెలయుఁగాక.

సీ॥ అతఁడు శ్రీహరిపదాద్భుత భక్తిరసఝరీ
పూరితుం డది రసపూరితంబు
ఆకర మ్మతఁడు వేదార్థసూక్తుల కాక
ర మ్మద్ది యుజ్జ్వలరత్నములకు
అచ్యుతునకు దివ్య మాధామ మాతఁ డ
య్యది దివ్యధామమహా నచ్యుతునకు
నిస్సీమమహిమతో నెగడు చుండు నతండు
నిస్సీమమహిమమై నెగడు నద్ది

గీ॥ శ్రీపరాంకుశమానికి క్షీరవారి
రాశికిన్ భేద మిలఁ గానరాదు రవయు
లక్ష్మి కమృతంబునకుఁ దావలములు వీరు
లోకకల్యాణమునకు వెల్గుదురు గాక. 3

అవతారిక:_ తరువాత శ్రీభగవానుని స్తుతింప నారంభించు చున్నారు.

శ్లో॥ యన్మంగలాయ మహతే జగతా ముశంతి
త్రైవిష్టపా న్యపి పదాని యదాశ్రయాణి ।
వందామహే సరసిజేక్షణ మద్వితీయం
వేదాంతవేద్య మనిదం ప్రథమం మహ స్తత్ ॥ 4

ప్రతి:- (తత్త్వజ్ఞాః = తత్త్వవేత్తలు) యత్ = దేనిని, జగతామ్ = లోకములయొక్క, మహతే = గొప్ప, మంగలాయ =

శుభముకొఱకు, ఉశంతి = కోరుచున్నారో, త్రైవిష్టపాని = త్రిలోకములకు సంబంధించిన, పదాని + అపి = స్థానములు కూడ, యత్ + ఆశ్రయాణి = ఏ తేజస్సు ఆధారముగాఁ గలవియో, అనిదంప్రథమమ్ = ఇది మొదలని చెప్పుటకు శక్యముకాని (కాలపరిచ్ఛిన్నముకాని) అద్వితీయమ్ = నిమిత్తాంతరానపేక్షమగు, వేదాంతవేద్యమ్ = వేదాంతవాక్యములచేఁ బ్రతిపాద్యమగు, సరసిజ + ఈక్షణమ్ = తామరల వంటి కన్నులుగల, తత్ = ఆప్రసిద్ధమగు, మహః = తేజస్సును, వందామహే = స్తుతించు చున్నాము. (లేదా) నమస్కరించు చున్నాము.

విశేషము:- భగవంతునకు జగజ్జన్మాది కర్తృత్వమును యతో వా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి। యత్ ప్రయం త్యభిసంవిశంతి। ఇత్యాది వేదవాక్యములు, 'ఓం జన్మాద్యస్య యతః' ఇత్యాది బ్రహ్మసూత్రములు లక్షణముగాఁ జెప్పు చున్నవి. ఈ శ్లోకమునందుఁగూడఁ దాదృశలక్షణలక్షిత మగు తేజస్సునే వర్ణించుటచే నది 'నారాయణపరో జ్యోతిః' అని పేర్కొనఁబడిన పరమజ్యోతి యగు శ్రీమన్నారాయణమూర్తి యనియే విశద మగుచున్నది. ఎట్లన ? 'యత్ జగతాం మహతే మంగళాయ ఉశంతి' ఏ తేజస్సును తత్త్వవేత్తలు సృష్టికారణమునుగా గ్రహించు చున్నారో యని ప్రథమపాదభావము. దీనిచే వర్ణ్యమానజ్యోతి సృష్టికర్తృత్వలక్షిత మగుచున్నది.

'మహతే మంగళాయ' అని మూలమునఁ జెప్పఁబడుటచేత 'పూర్వప్రళయ మర్థసిద్ధమై సంహారకర్తృత్వ పూర్వకసృష్టి కర్తృత్వము సిద్ధించుటవలన నేతజ్జ్యోతి సంహారకర్తృక మనియుఁ దేలుచున్నది.

'త్రైవిష్టపా న్యపి పదాని యదాశ్రయాణి' అను ద్వితీయపాదముచేత 'స్థాలీపులకన్యాయమున విభూతిద్వయ స్థితికర్తృత్వము ప్రతిపాదింపఁ బడినది. కనుక ఏతచ్ఛ్లోక మున వర్ణింపఁబడిన మహస్సు శ్రీమన్నారాయాణాత్మక మనియే భావము.

తాత్పర్యము:- దేనిని తత్త్వద్రష్టలు మహామంగళముకొఱకు వాంఛింతురో భువనత్రయమునకు సంబంధించిన పదవులకు ఏది యాధారభూతమో! ఏది కాలాద్యపరిచ్ఛిన్నమో! ఏది వేదాంతప్రతిపాద్యమో! ఏది సృష్టిస్థితి సంహారములం దితరసాహాయ్యాపేక్షారహితమో! అట్టి తామరలవంటి కన్నులుగల దివ్యజ్యోతిని స్తుతించు చున్నాము. (లేదా) నమస్కరించు చున్నాము.

దేని మూలము గాఁగ నెంతురు
ధీవరేణ్యులు సృష్టికిన్
దేనియండ జగంబు లన్నియుఁ
దీరుగా నటు నిల్చెడున్
కాన మన్యులతోడు దేనికిఁ
గార్యకోటుల నైగమం
బౌననాదిమహం బధోక్షజ
మంబుజాక్షముఁ గొల్చెదన్. 4

అవతారిక:- పూర్వశ్లోకమున 'సరసిజేక్షణమ్' అను పదముచే సంక్షిప్తమగు శ్రీ భగవానుని దివ్యమంగళవిగ్రహ మీ క్రింది శ్లోకముచే వివరింపఁ బడుచున్నది.

శ్లో॥ పీతాంబరం వరదశీతలదృష్టిపాత
మాజానులంబిభుజ మాయతకర్ణపాశమ్।
త న్మేఘమేచక ముదగ్రవిశాలవక్షో
లక్ష్మీధరం కిమపి వస్తు మమావిరస్తు. 5

ప్రతి:_ పీత+అంబరమ్ = పచ్చని పట్టువస్త్రము గలదియు, వరద, శీతల, దృష్టిపాతమ్ = వరముల నొసగునట్టి చల్లని క్రేగంటిచూపు గలదియు, ఆజానులంబిభుజమ్ = పిక్కల వఱకు వ్రేలాడు భుజములు గలదియు, ఆయత, కర్ణపాశమ్ = విశాలము లగు ప్రశస్తము లైన వీనులు గలదియు, మేఘ మేచకమ్ = మేఘమువలె నల్లనిదియు, ఉదగ్ర, విశాల, వక్షః = ఉన్నతమును, విశాలము నగు వక్షఃస్థలము గల దియు, లక్ష్మీధరమ్ = శ్రీమహాలక్ష్మిని ధరించినదియు, కి మపి=ఇట్టిది అని నిర్వచింప శక్యముగానిదియు, తత్ = ఆ పూర్వోక్తమగు, వస్తు=వస్తువు, (శ్రీమన్నారాయణ స్వరూప మగు జ్యోతి) మమ=నాకు, ఆవిరస్తు=ప్రత్యక్ష మగుఁ గాక.

విశేషము:- ఈ శ్లోకమునందు 'ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్, (ఆ వెలుగు తమస్సున కతీతమును సూర్యవర్ణము గలదియు) 'తస్య మహారజతం వాసః' (ఆ నారాయణమూర్తికి బంగా రమే వస్త్రము పీతాంబరధారి యనిభావము) 'కప్యాసం

పుండరీక మేవాక్షిణీ' (సూర్యునివలన వికాసమును బొందిన తెల్లదామరయే ఆ దేవునకుఁ గన్నులు) హ్రీ శ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ' (ఓ నారాయణమూర్తీ! నీకు హ్రీదేవియు లక్ష్మీదేవియు భార్యలు) అను వేదసూక్తులం గర్భితములై యున్నవి.

తాత్పర్యము:- పీతాంబరధారియు వరప్రదములును శీతలములును అగు కటాక్షములు గలదియు, ఆజానుబాహువులు గలదియు, ప్రశస్తకర్ణములు గలదియు, మేఘశ్యామలమైనదియు, ఉన్నత విశాలవక్షఃస్థలము గలదియు, లక్ష్మీధరమును అనిర్వాచ్యము నగు పూర్వోక్త దివ్యజ్యోతి నాకుఁ బ్రత్యక్షమగుఁ గాక.

ఉ॥ బంగరుఁ బట్టుఁ బుట్టపుఁ బ్ర
భల్ నలుదిక్కులఁ బర్వ, శీతలా
పాంగము కోర్కు లీను నిజ
భక్తులఁ బిల్వఁగ, జానులంబు లు
త్తుంగభుజంబు లొప్ప, నవ
తోయదతుల్యము పీనవక్షమున్
మంగళకర్ణపాశము ర
మాధర మాపరవస్తు వొప్పుతన్. 5

శ్లో॥ య త్తత్త్వ మక్షర మదృశ్య మగోత్రవర్ణ
మగ్రాహ్య మవ్యయ మనిర్దృశ మద్వితీయమ్।
ఈశాన మస్య జగతో య దణో రణీయ
స్త ద్వైష్ణవం పద ముదార ముదాహరామః 6

ప్రతి:- యత్ = ఏది, తత్త్వమ్ = సత్యమో!, అక్షరమ్ = అనంతమో (అంతము లేనిదో) అదృశ్యమ్ = కన్నుల కందనిదో, అగోత్ర వర్ణమ్ = నామరూపములు లేనిదో, అగ్రాహ్యమ్ = అనుమానాదులకు అవిషయమో, (తర్కముల కందదో) అవ్యయమ్ = అసంకుచితము లగు కల్యాణగుణ గణములు గలదియో, అనీదృశమ్ = ఇట్టిదని చెప్పుటకు శక్యముగానిదో, (చేతనాచేతన విలక్షణమో) అద్వితీయమ్ = సమమును అధికమును అగు మఱియొక వస్తువు లేనిదో, అస్య = ఈ, జగతః = లోకమునకు, ఈశానమ్ = నియామకమైనదో, యత్ = ఏది అణోః = అణువులలో, అణీయః = మిక్కిలి యణువో, ఉదారమ్ = మహాత్తులలో మహత్తో, వైష్ణవమ్ = విష్ణుసంబంధియగు, తత్ = అట్టి, పదమ్ = ఉపాస్యస్వరూపమును, ఉదాహరామః = స్తుతించు చున్నాము.

విశేషము:- ఈ శ్లోకమునందలి తత్త్వ- అక్షర- పదములు 'సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ' అను నుపనిషద్వాక్యము నందలి సత్య- అనంత పదములను స్మరింపఁ జేయుచున్నవి. 'ఈశాన మస్య జగతః' అనునది 'పతిం విశ్వ స్యాత్మేశ్వరమ్' అను వేదవాక్కును స్మరింపఁ జేయుచు వర్ణ్యమానవస్తువు చేతనాచేతనాత్మక సకలజగన్నియంతృక మని చాటుచున్నది. 'అణో రణీయః, ఉదారమ్,' ఈ పదములు 'అణో రణీయాన్ మహతో మహీయాన్' అను వేద వాక్యమును జ్ఞప్తిచేయుచున్నది. 'పదమ్' పద్యత ఇతి పదమ్' అను వ్యుత్పత్తిచేత ఉపాస్యస్వరూపము- అను నర్థమును చెప్పుచున్నది.

తాత్పర్యము:- ఏది సత్యమో యనంతమో యదృశ్యమో నామరూపరహితమో, యతర్క్యమో, యసంకుచిత కల్యాణగుణగణమో, చేతనాచేతనవిలక్షణమో, సమాధిక వస్తుశూన్యమో, చేతనాచేతన సకలజగన్నియామకమో, అణువులలోనణువో, మహత్తులలో మహత్తో అట్టి విష్ణుసంబంధియగు నుపాస్యస్వరూపమును స్తుతించుచున్నాము.

గీ॥ అవ్యయ మగోత్ర వర్ణంబనంత మప్ర
దృశ్యమగ్రాహ్యమీ శమనీదృశంబు।
అణువులందున నణువు మహత్తులందు
బల్ మహత్తగు విష్ణుతత్వంబు నెంతు. 6

శ్లో॥ ఆమ్నాయమూర్ధని చ మూర్ధని చోర్ధ్వపుంసాం
యద్ధామ వైష్ణవ మభీక్ష్ణతరం చకాస్తి।
తన్మాదృశా మపిచ గోచర మేతి వాచో
మన్యే తదీయ మిద మాశ్రిత వత్సలత్వమ్. 7

ప్రతి:- వైష్ణవమ్=విష్ణుసంబంధియగు; యత్ =ఏ, ధామ= జ్యోతి, (తేజోమయమగు దివ్యశరీరము) ఆమ్నాయ మూర్ధని = వేదాంతమునందును, ఊర్ధ్వపుంసామ్ = పూర్వాచార్యులయొక్క, మూర్ధని, చ=శిరసునందును, అభీక్ష్ణతరమ్=మిక్కిలి, చకాస్తి=ప్రకాశించుచున్నదో! తత్ ధామ=ఆ జ్యోతి, మాదృశామ్=మాబోటివారి యొక్క, వాచః, అపిచ=మాటలకుఁ గూడ, గోచరమ్ (గోచరత్వమును)=విషయమగుటను, ఏతి (ఇతియత్) = పొందుచున్నదనుట యేదిగలదో, ఇదమ్=ఇది,తదీయమ్=ఆ

విష్ణుసంబంధియగు, ఆశ్రితవత్సలత్వమ్=ఆశ్రితవాత్సల్యము (ఇతి=అని) మన్యే=తలంచు చున్నాను.

తాత్పర్యము:- ఏ తేజోమయ మగు దివ్యశరీరము వేదాంతము లందును పూర్వాచార్యుల శిరస్సునందును మిక్కిలి ప్రకాశించుచున్నదో యట్టి యప్రాకృత మగుదివ్యశరీరము మా బోంట్ల వాక్కులకుఁ గూడ విషయ మగుచుండుట యా విష్ణువునకుఁ గల యాశ్రితవాత్సల్య మని తలంతును.

ఉ॥ వేదసరస్వతీ ముకుట
వీథులఁ బ్రాక్తన దేశికాళి మే
లౌ దలలందు వైష్ణవ మ
హామహ మెయ్యది గ్రాలు నెంతయున్
మేదురదీప్తి నాశ్రితుల
మీఁది తదీయ సువత్సలత్వమే
మాదృశ పామరాత్మకుల
మాటల కయ్యది గోచరించుటల్ 7

అవతారిక:- శ్రీ భగవానునకు ఆశ్రితవాత్సల్య మున్నను చేత నారబ్ధ మగు నీ స్తుతిచేతఁ బరిచ్ఛిన్న స్వరూపాది మత్త్వము శ్రీహరికిని అపరిచ్ఛిన్నవిషయము గల భగవత్స్తుతితో దిగితి నన్నసిగ్గు స్తుతికర్తకును గలుగదా? అను శంకను క్రింది శ్లోకముతోఁ బరిహరించు చున్నారు.

శ్లో॥ జాన న్నపీహ కిల మా మనపత్రపిష్ణు
ర్విష్ణోః పదప్రణయినీం గిర మాద్రియేఽహమ్।
న శ్వావలీఢ మపి తీర్థ మతీర్థ మాహు
ర్నోదన్యతాఽపిచ శునా కిల లజ్జితవ్యమ్॥ 8

ప్రతి:- అహమ్ = నేను, మాం=నన్ను, జానన్ + అపి= అజ్ఞుఁడనుగాఁ దెలిసికొనుచున్నను, అనపత్రపిష్ణుః=సిగ్గు లేనివాఁడ నగుచు, విష్ణోః=విష్ణుమూర్తియొక్క, పద= పాదమునందు, ప్రణయినీమ్ = ప్రేమగల, గిరమ్ = వాక్కును, ఆద్రియే=ఆదరించుచున్నాను. (ఈ విషయమున దృష్టాంతము నిచ్చుచున్నారు) శ్వావలీఢమ్ + అపి= కుక్కచే నాకఁబడినప్పటికి, తీర్థమ్=శుద్ధికర మగుగంగాది తీర్థమును, అతీర్థమ్=తీర్థము కానిదానినిగా (సంతః= సజ్జనులు) న + ఆహుః= చెప్పరు, ఉదన్యతా=దప్పిగల, శునా + అపి=కుక్కచేఁగూడ, నలజ్జితవ్యంకిల=సిగ్గుచెంద నవసరము లేదుగదా!

విశేషము:- ఇందు దృష్టాంతవాక్యమునఁ దన్నుఁ గుక్కతోఁ బోల్చుకొనుట కవియొక్క వినయమునుఁ బ్రకటించుచు శ్రీవైష్ణవసంప్రదాయసిద్ధ మగు నైచ్యానుసంధానమును దెలుపుచున్నది. 'త్వద్భృత్యభృత్యపరిచారక భృత్యభృత్య భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ' అని కులశేఖరాళ్వారి దివ్యసూక్తి.

తాత్పర్యము:- నేను అజ్ఞుఁడ నని తెలిసియు సిగ్గులేనివాఁడనై విష్ణుపాదమునందలి ప్రణయాతిశయమున భగవన్నుతిఁ జేయ నాదరము గలిగి యున్నాను. అది యుచితమే. అజ్ఞుఁడ నగు నేను ముట్టినంతమాత్రమున భగవన్నుతికిఁ గొఱంత గల్గునా? కుక్క గతికినంతమాత్రమున శుద్ధికర మగు గంగాదితీర్థము తీర్థము గాకపోవునా? పుణ్యతీర్థము మైలపడునేమో యని కుక్క ముట్టదేని దానిదప్పి తీఱు టెట్లు? లజ్జపడి లాభము లేదని భావము.

గీ॥ నన్ను నజ్ఞుఁగ నెఱిఁగియు నాన లేక
హరిచరణరాగిణిని వాణి నాదరింతు।
కుక్క గతికిన గంగకుఁ గొదవ గలదె
సిగ్గుపడఁ గుక్కురపిపాస తగ్గు టెట్లు? 8

అవతారిక:- కొంచెము చవిచూచి నందువలన లాభమేమి? అనుశంకకు సమాధానము.

శ్లో॥ దేవస్య దైత్యమథనస్య గుణే ష్వియత్తా
సంఖ్యా చ వాఙ్మనసగోచర మత్యభూతామ్।
అ ప్యేవ మ ణ్వపిచ తత్ర మమా ర్తిశాంత్యై
కీటస్య తృష్యత ఉదన్వతి విప్రుషాలమ్. 9

ప్రతి:- దైత్య, మథనస్య = రాక్షసులను సంహరించునట్టి, దేవస్య = క్రీడాదిగుణవిశిష్టుఁ డగు నారాయణమూర్తి యొక్క, గుణేషు=కల్యాణ గుణములందు, సంఖ్యా= ఇన్ని అను లెక్కయు, ఇయత్తా చ=ఒకొక్క గుణము ఇంతప్రమాణము గలది యనుకొలతయు, వాఙ్మనస, గోచరమ్=వాక్కునకు మనస్సునకును విషయ మగుటను (అందుపాటును) అత్యభూతామ్=అతిక్రమించినవి ఏవమ్+ అపి=ఇట్లున్నను, తత్ర=ఆగుణములందు, అణు+అపి=ఒక గుణములో ఏకదేశ మైనను, మమ=నాయొక్క, ఆర్తి శాంత్యై=బాధను (దప్పికను) శమింపఁ జేయుటకొఱకు, అలమ్=చాలును. (ఈ విషయమున దృష్టాంతము నిచ్చుచున్నారు) తృష్యతః=దప్పిక గల, కీటస్య=పురుగునకు, ఉదన్వతి = సముద్రమునందు, విప్రుసా=నీటి బొట్టుచేత, అలమ్=చాలును.

విశేషము:- 'దైత్యమథనస్య' అను పదముచేత భగవాను నకు హేయప్రత్యనీకత్వము, 'దేవస్య' అను పదముచేఁ గల్యాణగుణగణాకరత్వము సూచింపఁ బడినవి.

తా॥ దైత్యమథనుఁడును క్రీడాది గుణవిశిష్టుఁడు నగు శ్రీ భగ వానుని గుణములందలి సంఖ్యయు నేకైకగుణమునందలి యియత్తయు (మితియు) వాక్కునకు మనసునకు నందవు. (అట్టిచో సాకల్యముగఁ దద్గుణానుభవ మేరికిని సాధ్యము గాదని భావము) ఐనను నా యార్తి శమించుట కా గుణములలోని యొక నలుసైనను జాలును. ఒక చిన్ని పురుగు దప్పి తీర్చుటకు మున్నీటి నీటిచుక్కయేనియుఁ జాలును గదా!

గీ॥ దనుజహరుఁ డైన దేవు నుదాత్తసుగుణ
సంఖ్యయు నియత్త వాఙ్మానసముల దాఁటు
ఐనను మదార్తిశాంతి కొక్కణువు చాలుఁ
బురుగుతృషఁ దీర్ప జలధిశీకరమె కొల్ల. 9

అవతారిక:- శక్త్యతిశయ, రచనామాధుర్య చాతుర్యవంతు లగు మహనీయులకే స్తోత్రాధికార ముండవలెనను శంకను పరిహరించు చున్నారు.

శ్లో॥ ప్రేమార్ద్రవిహ్వలగిరః పురుషాః పురాణా
స్త్వాం తుష్టువు ర్మధురిపో ! మధురై ర్వచోభిః।
వాచో విడంబన మిదం మమ నీచవాచః
క్షాంతి స్తు తే సవిషయా మమ దుర్వచోభిః ॥ 10

ప్రతి:- (హే) మధురిపో! = మధువను రక్కసునకు విరోధి వగునో వైకుంఠుఁడా! ప్రేమ, ఆర్ద్ర, విహ్వల, గిరః = భక్తిచే ద్రవించినవి గనుకనే తొట్రుపడుచున్న వాక్కులుగల, పురాణాః = ప్రాచీనులగు, పురుషాః = పురుషులు (భగవద్వ్యాసుని మునిప్రభృతులు) మధురైః = తియ్యని, వచోభిః = మాటలచేత, త్వామ్ = నిన్ను తుష్టువుః = స్తుతించిరి నీచవాచః = నీచమైన వాక్కు గల, మమ = నాయొక్క, ఇదమ్ = ఈ స్తోత్రము, వాచో విడంబనమ్ = ప్రాచీనుల వాక్కుల కనుకరణము, (దీనిచే వారికి సైతము నగుఁబాటని ఫలితము) దీనికిఁ బరిహార మెట్లన- మమ = నాయొక్క, దుర్వచోభిః = దుష్ట వాక్కులచేత, తే = నీయొక్క, క్షాంతిః - ఓర్పు, సవిషయా = విషయముగలది, భవతి = అగుచున్నది. (లాభముతోఁ గూడినదని భావము.) లేనిచోఁ దమక్షాంతి నిర్విషయమై యప్రసిద్ధ మగునని తాత్పర్యము.

తాత్పర్యము:- ఓ మధుసూదనా! ప్రేమార్ద్రింబులును భక్త్యుద్రేకంబుచేఁ బదపదంబున స్ఖలితంబులునగు మధుర వాక్కులచేత భగవద్వ్యాసుని ప్రభృతులు నిన్ను స్తుతించిరి. నీచవాక్యుఁడనగు నేను చేయు నీ స్తుతి యా పూర్వుల

వాక్కుల కనుకరణమై వారికిఁగూడ నగుఁబాటును గల్పించి నను నా దుర్వాక్కుల వినఁ గలిగిన నీ క్షమాగుణమునకు మంచి నిదర్శన మగుచున్నది.

ఉ॥ ప్రేమరసార్ద్రముల్ స్ఖలన
 పేశలముల్ మధురంబులైనవాక్
 స్తోమములన్ బురాణపురు
 షుల్ నుతియించిరి నిన్ను, నీచవా
 గ్ధాముఁడ మత్కృత స్తవము
 తద్వచనైక విడంబనంబ పో!
 మామక దుర్వచశ్శ్రుతి ర
 మాపతి! నీక్షమ నుగ్గడించెడిన్. 10

అవతారిక:- ప్రకృతము వేదాంతవాక్యార్థానుసారము సర్వేశ్వరుని స్తుతింపఁ బోవుచు తదితర దర్శనముల నిందించుచు శ్రుతిని భూషించుచున్నారు.

శ్లో॥ ఆజ్ఞా త వాత్రభవతీ విదితా త్రయీ సా
 తాం హి ప్రమాణ ముపజగ్ము రతీంద్రియార్థే।
 ఆభాసభూయ మభియాం త్యపరాణి దోషై
 రేషా తు దోషరహితా మహితా పురాణీ॥ 11

ప్రతి:- అత్రభవతీ = పూజనీయయగు, సా = ఆ, త్రయీ = వేదత్రయి (ఋగ్యజుస్సామ వేదములు మూఁడును.) తవ = నీయొక్క, ఆజ్ఞా = శాసనముగా, విదితా = ప్రసిద్ధ మైనది, తామ్ = ఆ వేదత్రయమును, అతీంద్రియ + అర్థే = ఇంద్రియ

ములకు గోచరించని విషయమునందు, (వైదికాః = వేద ప్రామాణ్యవాదులు) ప్రమాణమ్ = ప్రమాణమునుగా (యథార్థజ్ఞానమును గలిగించు దానినిగా) ఉపజగ్ముః =అంగీ కరించిరి. అపరాణి = వేదేతరములగు ప్రత్యక్షాను మానోపమానాది ప్రమాణములు, దోషైః=దోషముల చేత, ఆభాసభూయమ్ = ఆభాసత్వమును, అభియాంతి = పొందుచున్నవి. పురాణీ = నిత్యయు, (కనుకనే) దోష రహితా = పౌరుషేయ ప్రయుక్తభ్రమ విప్రలంభాది దోషములు లేనిదియు, అగు ఏషా, తు=ఈ వేదత్రయ మన్ననో, మహితా=(ప్రమాణము లన్నింటిలో) గొప్పది- కనుక శ్రుత్యనుసారమే స్తుతింప వలయునని భావము.

విశేషము:- 'ఆజ్ఞా తవాత్రభవతీ విదితా త్రయీ సా' 'శ్రుతి స్మృతీమమైవాజ్ఞే' శ్రుతిస్మృతులు నాయాజ్ఞావచనములని భగవానునిసూక్తి.

తాత్పర్యము:- పూజనీయములగు ఋగ్యజుస్సామవేదములు నీ యాజ్ఞా రూపములుగాఁ బ్రసిద్ధములు కావున వైది కోత్తము లతీంద్రియ విషయములందు వానినే ప్రమాణము లుగా నంగీకరించు చున్నారు. వేదేతరములగు ప్రత్యక్షాను మానాదులు పురుషదోషములచే నొకప్పుడు దుష్టములగు చుండును, నిత్యము నపౌరుషేయమునగు వేదమునందు భ్రమవిప్రలంభాది దోషముల కవకాశము లేదుగావున నది ప్రమాణశ్రేష్ఠము. కనుక వేదానుగుణముగా స్తుతింప వలయును.

మ॥ భవదీయంబగు నాజ్ఞ పూజ్యతమ మా
ప్రాఁబల్యా, విజ్ఞుల్ ప్రమా
ణవరం బందు రతీంద్రియార్థముల నె
న్నన్, దక్కు మానంబులన్
దవులున్ దోష, మపౌరుషేయ మగువే
దంబందుఁ దాదృక్షవ
క్తృవచోదోషము వ్యోమపుష్ప మగుటన్
శ్రేష్ఠప్రమాణం బిదే. 11

శ్లో॥ అంతర్హితో నిధి రసి త్వ మశేషపుంసాం
లభ్యోఽసి పుణ్యపురుషై రితరై ర్దురాపః।
తత్ర త్రయీం సుకృతినః కృతినోఽభిజగ్ముః
బాహ్యేషు బాహ్యచరితై రితరై ర్నిషేతే॥ 12

ప్రతి:- త్వమ్=నీవు, అశేషపుంసామ్ = సమస్త పురుషులకు (యోగులకు సైతము - అని భావము.) అంతర్హితః = అతీంద్రియమగు (కానరాని) నిధిః = గనివి, అసి = అగుచున్నావు, పుణ్యపురుషైః = పుణ్యాత్ములచేత, లభ్యః = పొందఁదగినవాఁడవు, అసి=అగుచున్నావు, ఇతరైః= అన్యులచేత (పాపాత్ములచేత) దురాపః=దుఃఖముచేత నేనియుఁ బొంద శక్యము గానివాఁడవు, (అసి = అగుచున్నావు) తత్ర=నీ స్వరూపజ్ఞానవిషయమున, సుకృతినః= పుణ్యాత్ములగు, కృతినః=పండితులు, త్రయీమ్=వేద త్రయమును, అభిజగ్ముః = ప్రమాణమునుగాఁ బొందిరి, బాహ్యచరితైః = శాస్త్రనిషిద్ధచరిత్రగల, ఇతరైః =

పామరులచేత, బాహ్యేషు = వేదవిరుద్ధవిషయములందు, నిపేతే=పడుట యగు చున్నది.

విశేషము:- 'త్వం అంతర్హితో నిధి రసి' అని భగవానుం డగు వైకుంఠుని అతీంద్రియమగు నిధిగా వర్ణించుటచేత నానాశాస్త్రములు సిద్ధస్వరూపమగు బ్రహ్మవస్తువునే ప్రతి పాదించు చున్నవి. అని యాశంకాపరిహారపరసమన్వయాధి కరణార్థము సూచిత మగుచున్న దని సంప్రదాయ విదులు తెలుపుచున్నారు. 'లభ్యోఽసి' 'లభి' ధాతువు ప్రాప్త్యర్థ కము గాన 'యే గత్యర్థకా స్తే జ్ఞానార్థకాః' (గత్యర్థక ధాతువు లెల్లను జ్ఞానార్థకములు) అను న్యాయముచేత 'జ్ఞేయోఽసి' తెలియఁ దగినవాఁడ వగు చున్నావు- అని యర్థము చెప్పికొనవలెను.

తాత్పర్యము:- ఓ వైకుంఠమూర్తీ! నీవు సమస్త పురుషులకు నతీంద్రియ మగు నిధివి. పుణ్యాత్ములచేతఁ దెలియఁ దగిన వాఁడవు. ఎంత తన్నుకొనినను పాపాత్ములు నిన్నుఁ జేర లేరు. నిన్నుఁ దెలియుటకుఁ బుణ్యాత్ములగు జ్ఞానులు ఋగ్యజుస్సామవేదములను ప్రమాణముగా నంగీకరించి కృతార్థులైరి. వేదనిషిద్ధాచరణము గల పామరులు వేద బాహ్యము లగు తామసశాస్త్రముల నవలంబనముఁ జేసి కొని నీకు దూరులై పతితు లగుచున్నారు.

గీ॥ నిఖిల జనుల కతీంద్రియనిధివి నీవు
పుణ్యకృల్లభ్యుఁడవు దురాపుఁడ వితరుల
కాశ్రయింతురు శ్రుతుల ని న్నరయ విజ్ఞు
లన్య లసదాగమంబులయందుఁ బడిరి.

(భంగ్యంతరము)

శా॥నీవంతర్హితమై వెలింగెడు మహానిక్షేపరాజంబవో
దేవా! చేతనకోటికెల్ల, సుకృతుల్ ధీరుల్ నినున్ గాంతు, రా
దేవానాం ప్రియు లుంద్రు దవ్వగనె, నీదివ్యాకృతింజూడ వి
ద్యావంతుల్ త్రయి నాశ్రయించి, రితరుల్ తద్భిన్నమార్గా
ధ్వగుల్.

అవతారిక:- ఇతరులు గూడఁ దమతమ మతమున కనుగుణముగా వేదమునే ప్రమాణమునుగా నుపన్యసించుచున్నారే! యను శంకకుసమాధానము నీక్రింది శ్లోకమునఁ జెప్పఁబడుచున్నది.

శ్లో॥ చిత్రం విధే ర్విలసితం త్విద మావిరస్తి
దుష్టాత్మనా మయ మహో! కిల దుర్విపాకః।
యత్ కేచి దత్రభవతీం శ్రుతి మాశ్రయంతోఽ
ప్యర్థే కుదృష్టివినివిష్టధియో వినష్టాః॥ 13

ప్రతి:- ఇదమ్=ఈ, విధేః=దైవముయొక్క, విలసితమ్=విలాసము, చిత్రమ్=ఆశ్చర్యకరమైనదిగా, ఆవిరస్తి=ప్రకాశించుచున్నది, యత్=ఎందువలన, కేచిత్=కొందఱు అత్రభవతీమ్=పూజ్యురాలగు, శ్రుతిమ్=వేదమును, ఆశ్రయంతః+అపి=ప్రమాణముగా అంగీకరించు చున్నను, అర్థే=పదార్థమునందు, వాక్యార్థమునందు, తాత్పర్యార్థమునందును, కుదృష్టి, వినివిష్ట, ధియః=అపసిద్ధాంతములందు విశేషమగు పట్టుదలతోఁ గూడిన బుద్ధిగలవారై, వినష్టాః=చెడిపోయిరో! (తత్=అందువలన) దుష్టాత్మ

నామ్ = చెడుమనసుగలవారియొక్క, అయమ్ = ఈ, దుర్విపాకః = దురదృష్టపరిపాకము, అహో, కిల = ఆశ్చర్యకరమైనది గదా!

విశేషము:- 'దుష్ట + ఆత్మనామ్ = అనేక జన్మములనుండి వెంటాడిన కల్మషములచే దూషితులైనవారికి, 'కేచిత్' = కొందఱు, పేర్కొనుటకు సైత మనర్హు లగు ప్రచ్ఛన్న బౌద్ధు లని భావము. లోపల శూన్యవాదులై బైటికి బ్రహ్మవాదులవలెఁ గన్పడువారు ప్రచ్ఛన్నబౌద్ధులు. 'వినష్టాః' ప్రాప్యవస్తువును చేరకచ్యుతు లగువా రని భావము.

'నతు మా మభిజానంతి తత్త్వే నైతత్ చ్యవంతి తే'

(వారు నన్నుఁ బరతత్త్వమునుగాఁ దెలిసికొనక చ్యుతు లగు చున్నారు.)

తాత్పర్యము:- దైవవిలాసము కడు చిత్రమైనది. ఎట్లనఁగా- నామనిర్దేశమునకుఁ గూడ ననర్హులగు కొందఱు ప్రచ్ఛన్న బౌద్ధులు పరమ పూజ్యమగు శ్రుతిని బ్రమాణముగా నంగీకరించియుఁ బదార్థ, వాక్యార్థ, తాత్పర్యార్థములందు నపసిద్ధాంతములఁ బట్టుదలతో నొనర్చుచుఁ బరతత్త్వమును గానక చ్యుతు లగుచుఁ జెడిపోవుచున్నారు. ఆహా! అనేక జన్మానువృత్తకిల్బిష దూషితాత్ముల దురదృష్టపరిపాకము నేమన వచ్చును?

మ॥ అహహా! దైవవిలాస మే మనుదు న
త్యాశ్చరము౦ గొల్పెడున్
బహుజన్మావృత దోషదూషితుల దు
ష్పాకం బిదే! విస్మయా
వహ మౌ, గొందఱు పూజ్యయౌ శ్రుతిని భ
వ్యంబౌ ప్రమాణంబుగా
మహిఁ జేర్కొంచుఁ దదర్థ మెల్లఁ గుదృశుల్
మార్తుర్ వినాశంబుకై.

అవతారిక:- వేదములోఁ గొంత భాగమును బ్రమాణముగా స్వీకరించుటవలన వీరిని వేదబాహ్యు లనుట యెట్లు పొసఁగును? అని శంకించుకొని వేదబాహ్యులతోఁడి సామ్యమును దృష్టాంతముఖమున దృఢపఱుచు చున్నారు.

శ్లో॥ బాహ్యాః కుదృష్టయ ఇతి ద్వితయేఽప్యపారం
ఘోరం తమ స్సముపయాంతి న హీక్షసే తాన్।
జగ్ధస్య కాననమృగై ర్మృగతృష్ణికేష్వోః
కాసారసత్త్వ నిహతస్య చ కో విశేషః॥ 14

ప్రతి:- బాహ్యాః=వేదమును ప్రమాణమునుగా నంగీకరింపని మాధ్యమికాదు లగు నాస్తికులును, కుదృష్టయః=వేదైక దేశమును వ్యావహారిక ప్రమాణముగా నంగీకరించియు నపసిద్ధాంతపరు లగు మిథ్యావాదిప్రభృతులును, ఇతి=ఈ విధముగాఁ జెప్పఁబడు, ద్వితయే+అపి=ఇరుతెగల వాదు లును, అపారమ్=అంతులేని, ఘోరమ్=భయంకరమగు,

తమః=తమోగుణమును, సముపయాంతి=పొందుచున్నారు, తాన్ =వారిని, (బాహ్యులను, కుదృష్టులను) న హీంక్షసే= (వారు పుట్టుసమయమున) కటాక్షింపవు, (ఈ విషయమున దృష్టాంతమును జూపు చున్నారు.) మృగతృష్ణికా + ఉపాస్నిః = (దప్పి తీర్చుకొనుటకు) ఎండమావులను జేరఁ దలఁచినట్టియు, కాననమృగైః = (దారినడుపు) అడవి మృగము లగు సింహ శార్దూలాదులచేత, జగ్ధస్య=తినఁ బడిన వానికిని, కాసార, సత్వ, నిహతస్య, చ=సరస్సులోవి జంతువులచేతఁ జంపఁ బడినవానికిని (సరోవరమును జేరు కొని రేవు గాని రేవులో దిగి నీటిలోఁ బడి యందలి మొసళ్లచేతఁ జంపఁబడిన వానికిని అని భావము) విశేషః= భేదము, కః=ఏమిటి? భేదములేదని తాత్పర్యము. దప్పి తీరకపోవుటలోను జీవితమును గోల్పోవుటలోను ఉభయు లును సమానులని తెలియ వలయును.

విశేషము:- 'బాహ్యాః=వేదమును బ్రమాణముగా నంగీకరింపని మాధ్యమికాదు లగు నాస్తికులు, 'కుదృష్టయః' అనాది పాపవాసనాదోషముచేత దూషితమతులై వేదములోఁ గొంతభాగమును వ్యావహారిక ప్రమాణముగా నంగీకరిం చియు అపసిద్ధాంతము లొనర్చు మిథ్యావాదులు మున్నగు వారు. 'న హీంక్షసే తాన్' జాయమానదశయందు జీవుల భగవంతుఁడు కటాక్షింపనిచో నా జీవులు, 'ఘోరం తమ స్సముపయాంతి' ఘోరమగు తమోగుణమును బొందు చున్నారు.

ఇందులకుఁ బ్రమాణము :-

'జాయమానం హి పురుషం యం పశ్యే న్మధుసూదనః
సాత్త్వికస్స తు విజ్ఞేయః సవై మోక్షార్థచింతకః'

మధుసూదనుఁడు జాయమానదశలో నున్న పురుషునిఁ గటాక్షించినచో వాఁడు సాత్త్వికుఁ డగునని తెలియవలెను. వాఁడే మోక్షప్రయోజనమును గూర్చి చింతించును.)

'పశ్య త్యేనం జాయమానం బ్రహ్మా రుద్రోఽథవా పునః
రజసా తమసా చాస్య మానసం సమభిప్లుతమ్'

(జాయమానుఁ డగు నీ పురుషుని బ్రహ్మ చూచినచో నీతని మానసము రజోగుణ విశిష్టమగును. రుద్రుఁడు చూచినచోఁ దమోగుణ విశిష్టమగును.)

దృష్టాంత వివరణము:- దప్పిగొని యుదకము గలదనుకొని యెండమావులకుఁ బరువెత్తుచు నడిదారిలో నడవిమృగము లగు సింహ శార్దూలాదులచేతఁ జంపఁ బడినవాఁడును, జలముగల సరోవరమును జేరియుఁ బరీక్షకులు కనిపెట్టిన మంచిరేవును విడనాడి మతిభ్రంశముచే నేదో యొక ప్రమాదకరమగు చోట దిగి నీటిలోఁబడి క్రూరనక్రాదుల బారిపడి ప్రాణములు గోలుపోయినవాఁడును, దప్పిక తీరక పోవుటలోను, ప్రాణములఁ బాయుటలోను సమానులే గదా! అట్లే పరమ ప్రమాణమగు వేదము నప్రమాణ ముగాఁ దలఁచి అప్రమాణ మగు ప్రతారకవాక్యమును ప్రమాణమనుకొని దుస్సమయములఁ గల్పించు వేద

బాహ్యులును, పరమ ప్రమాణముగు వేదైకదేశమును వ్యావహారిక ప్రమాణముగా నంగీకరించియుఁ దద్వాక్యములకు స్వకపోలకల్పితము లగు విరుద్ధార్థములఁ జెప్పుచు అపసిద్ధాంతములకు దారితీయు కుదృష్టులును, తత్వనిర్ణయము లేకపోవటలోను అధఃపతనము చెందుటలోను తుల్యులని భావము.

తాత్పర్యము :- ఓ వైకుంఠనాథా! పరమ ప్రమాణము లగు వేదముల నప్రమాణము లని భావించు వేదబాహ్యు లగు మాధ్యమికాదినాస్తికులును, వేదైకదేశమునకువ్యావహారిక ప్రామాణ్య మంగీకరించియుఁ దద్వాక్యములకు విపరీతార్థమును వచించుచు అపసిద్ధాంతముల లేవఁదీయు కుదృష్టులును, ఈ రెండు తెగలవారును ఘోరమగు తమోగుణంబును బొందుచున్నారు. జాయమానదశయందు వారిని నీవు కటాక్షింపవు. వేదప్రామాణ్య మంగీకరింపని బాహ్యులును, వేదప్రామాణ్య మంగీకరించి యావేదమునకు దురర్థములఁ గల్పించి యపసిద్ధాంతులగు కుదృష్టులును, నిన్నుఁ దెలియక చెడుటలో సమానులే యగుచున్నారు. ఎట్లనః- దప్పిఁ గొని నీరు గలదని భ్రమించి యెండమావులకుఁ బరువెత్తుచు నడిదారిలో అడవి మృగముల వాతఁబడి ప్రాణములఁ గోల్పోయిన వానికిని, నిజముగా జలముగల సరోవరముఁ జేరుకొని మంచిరేవున దిగక మతిభ్రాంతితోఁ గ్రూరజలజంతువులు గల రేవుగాని యొక ప్రమాదకరముగు

స్థలమున దిగి నీటఁ బడి మొసళ్ళ బారిఁ బడి మరణించిన వానికిని భేద మేమిగలదు? దప్పిక తీరక మరణించుటలో నిద్దఱును తుల్యులే యగుచున్నారు.

ఉ॥ దేవర! వేదబాహ్యులు కు
దృష్టులు నాఁ బడువీరి నిర్వ్యరిన్
నీ వటు చూడఁ బోవు, భజ
నీయము ఘోరతమంబె వారికిన్,
పోవుచు నెండమావులకుఁ
బుట్టినదప్పి నడంప వన్యస
త్త్వావళిభక్షితుండు ప్రాద
మందున నక్రగృహీతుఁ డొక్కటే.

అవతారిక:- అట్లేని శ్రుత్యర్థ నిర్ణయమున కుపాయ మేమి? అనుచో నుడువు చున్నాఁడు.

శ్లో॥ న్యాయశ్రుతిప్రభృతిభి ర్భవతా నిసృష్టై
ర్వేదోపబృంహణవిధా వుచితై రుపాయైః।
శ్రుత్యర్థ మర్థ మివ భానుకరై ర్విభేజు
స్త్వద్భక్తిభావిత వికల్మష శేముషీకాః॥ 15

ప్రతి:- త్వత్, భక్తి, భావిత, వికల్మష, శేముషీకాః = నీయందలి భక్తిచేత భావన చేయఁబడినది గనుకనే నిష్కల్మషమైన బుద్ధిగల పెద్దలు, భవతా = వైకుంఠనాథుఁడ వగు నీచేత, నిసృష్టైః = ఇయ్యఁబడినట్టియు, వేద+ఉప బృంహణవిధౌ = వేదమును వివరించు పనియందు,

ఉచితైః=యోగ్యములగు, ఉపాయైః = సాధనములగు, న్యాయ, స్మృతి, ప్రభృతిభిః = తర్కమీమాంసాన్యాయములచేతను, మన్వాది స్మృతుల చేతను, ఇతిహాసపురాణాదుల చేతను, శ్రుత్యర్థమ్=వేదార్థమును,

భానుకరైః=సూర్యకిరణములచేత, అర్థమ్+ఇవ = ఘటపటాది పదార్థమును వలె, విభేజుః=విభాగము నొనర్చిరి.

విశేషము:- 'భవతా, నిసృష్టైః' = నీచే నొసంగబడిన, ఇది యెట్లు పొసంగును? ఏల యన- తర్కము నొసంగినవారు కణాదగౌతములు, పూర్వమీమాంస నొసంగినవారు జైమిని, స్మృతుల ననుగ్రహించినవారు మనుపరాశరాదులు, ఇతిహాసపురాణములఁ గటాక్షించినవారు వాల్మీకిప్రభృతులు గదా! యన్నచో- సమాధాన మిది. శ్రీవైకుంఠనాథుఁడే వేదోపబృంహణమునకై కణాదగౌతమ జైమిని మను, పరాశర, వాల్మీకి ప్రభృతుల నావేశించి తర్కమీమాంసాస్మృతీతిహాస పురాణాదుల ననుగ్రహించెను. ఇప్పుడు 'భవతా నిసృష్టైః' అనునది యుపపన్నమగును.

'న్యాయస్మృతి ప్రభృతిభిః' ఇందలి 'న్యాయ' శబ్దము ఏకనాళావలంబిఫలద్వయన్యాయమున (ఒకకాడకు వ్రేలాడుచున్న రెండుపండ్లు- అను సామెత ననుసరించి) తర్కము (1) పూర్వమీమాంస (2) అని రెండర్థములను జెప్పు

చున్నది. తర్క మనగా- ఊహ- 'కాకస్య కతి వా దంతాః' అను శుష్కతర్కముగాదు.

శ్లో॥ పూర్వోత్తరావిరోధేన కోఽత్రార్థోఽభిమతో భవేత్ ।
ఇత్యాద్య మూహనం తర్కః, శుష్కతర్కం తు వర్జయేత్ ॥
(కౌర్మే)

(పూర్వోత్తర సందర్భములకు విరోధము లేకుండ ఇచ్చట నేయర్థ మనుకూలముగా నుండును. అని యూహించుట తర్కము గాని శుష్కతర్కమును గట్టి పెట్టవలెను.)

సమీచీనతర్కము, స్మృతులు, ఇతిహాసపురాణములు వేదోపబృంహకము లనుటకుఁ బ్రమాణములు.

శ్లో॥ ఆర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రావిరోధినా ।
య స్తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః ॥

(ఎవఁడు వేదశాస్త్రములకు విరోధించని తర్కముచేత ఆర్షమగు ధర్మోపదేశము ననుసంధాన మొనర్చునో వాఁడే ధర్మమును నెఱుఁగును- ఇతరుఁ డెఱుఁగఁడు)

శ్లో॥ వేదశాస్త్రరథారూఢాః । న్యాయఖడ్గధరా ద్విజాః ।
క్రీడార్థ మపి యత్ బ్రూయు స్తత్ ధర్మః పరమో మతః ॥

(వేదశాస్త్రము లనెడు రథములనెక్కి న్యాయములు (తర్కమీమాంసలు) అను కత్తులను దాల్చి ద్విజులు విలాసార్థ మేమి యన్నను అది పరమధర్మ మగును)

'ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్'
(ఇతిహాసపురాణములచేత వేదమును వివరింపవలెను.)
ఇత్యాదులు.

'శ్రుత్యర్థ మర్థ మివ భానుకరై ర్విభేజుః' అదివఱకు గాఢాంధకారములో విడఁదీయ శక్యము గాక పడియున్న పదార్థజాతమును చక్షుష్మంతు లగు పురుషులు సూర్య కిరణముల సాయముతో ఇది ఘటము, ఇది పటము అని యెట్లు విడివిడిగాఁ దెలియుదురో! యట్లే ఓ వైకుంఠ నాథుఁడా! త్వద్భక్తిభావిత వికల్మష శేముషీకు లగు పురుషులు న్యాయస్మృతి ప్రభృతుల సాయముచేత ఇది నిత్యము, ఇది యనిత్యము, ఇది హేయము (విడిచిపెట్టఁ దగినది) ఇది యుపాదేయము (స్వీకరింపఁ దగినది) అని వేఱు వేఱుగాఁ దెలిసికొందురు. ఈశ్లోకమునందు భగవ ద్భక్తియు తర్కమీమాంసాస్మృతీతిహాస పురాణములును సమీచీనజ్ఞానమునకు హేతువులుగాఁ బేర్కొనఁ బడినవి.

తాత్పర్యము:- ఓ వైకుంఠపతీ! భవత్పాదారవిందము లందలి భక్తిచే భావిత మగు నిష్కల్మష శేముషి (బుద్ధి) గల పూరుషులు నీచే ననుగ్రహింపఁబడి వేదవివరణ ముపాయ భూతము లగు తర్కమీమాంసాస్మృతీతిహాసపురాణముల చేత శ్రుత్యర్థమును సూర్యకిరణ ప్రభచేత ఘటపటాది పదార్థమును వలె విడివిడిగాఁ దెలిసికొనుచున్నారు.

చ॥ భవ దమలాంఘ్రి భక్తిరస
భావితపావిత శేముషీవి శే
షవిలసితుల్ త్వదీయకృప
సంగతముల్ శ్రుతిపోషకంబు లౌ
వివిధనయస్మృతి ప్రభృతి
విశ్రుతవాక్తతి వైదికార్థముల్
సువిదితముం బొనర్చెదరు
సూర్యకరంబుల వస్తువుం బలెన్.

అవతారిక:- వేదార్థనిర్ణయసాధనములలో భక్తియే ప్రధాన సాధన మని దృఢపఱుచుటకు వ్యతిరేకముఖంబున దృష్టాంత మొసఁగు చున్నారు.

శ్లో॥ యే తు త్వదంఘ్రి సరసీరుహ భక్తిహీనా
స్తేషా మమీభి రపి నైవ యథార్థబోధః ।
పిత్తఘ్న మంజన మనాప్నుషి జాతు నేత్రే
నైవ ప్రభాభి రపి శంఖసితత్వబుద్ధిః ॥ 16

ప్రతి:- యే, తు = ఏపురుషు లైతే, త్వత్, అంఘ్రి, సర సీరుహ, భక్తి, హీనాః = నీ పాదారవిందములందు భక్తి

లేనివారో! తేషామ్ = వారికి, అమీభిః = ఈ పైని చెప్పఁబడిన న్యాయస్మృతీతిహాసపురాణాదులచేత, యథార్థబోధః = సమీచీన మగు (మంచి) జ్ఞానము, న+ఏవ = నైవ = కలుగనే కలుగదు. నేత్రే = కన్ను, పిత్తఘ్నమ్ = పైత్యమును బోఁగొట్టు, అంజనమ్ = కాటుకను, అనాప్నుషి = పొందనిది కాఁగా, ప్రభాభిః అపి = పూర్వోక్తములగు సూర్యకిరణకాంతులచేతఁ గూడ, శంఖ, సితత్వ, బుద్ధిః = శంఖము తెల్లనిదియను బుద్ధి, జాతు = ఎన్నఁటికిని (ఒకప్పుడుగూడ) నైవ = (న+ఏవ) కలుగనే కలుగదుగదా!

విశేషము:- న+ఏవ - ఇచ్చట ఏవకారము ప్రసిద్ధిని సూచించును. తత్త్వజ్ఞానమునకు భక్తి ప్రధానసాధనము. అది లేకపోవుటచే నితరసాధనము లెన్ని యున్నను యథార్థజ్ఞానము గలుగఁ జాలదు.

తాత్పర్యము:- ఓ వైకుంఠనాయకా! ఎవరికి నీ పాదారవిందములందు భక్తి గలుగదో వారికి ఈ తర్కమీమాంసాస్మృతీతిహాసపురాణాదులచే యథార్థజ్ఞాన మెన్నఁటికిని గలుగఁ బోదు. పైత్యరోగము నడంచుకాటుకను కంటి కుపయోగింపకున్నచో నెన్నఁటికి నాతనికి నెంతసూర్యకిరణ ప్రభ యున్నను శంఖము తెల్లనిది యను నిశ్చితజ్ఞానము గలుగదు.

(పైత్యరోగికంటికి శంఖము పచ్చగాఁ గన్పడును.)

ఉ॥ వారిజనాభ ! యెవ్వరు భ
వచ్చరణాంబుజభక్తిహీనులో !
వారల కిట్టిసాధనల
వల్ల జనింపదు తత్త్వబోధ, మే
తీరునఁ గల్గుశంఖు మది
తెల్లన యన్నమనీష పైత్యరు
గ్వారక మంజనం బిడక
కంటికి వేవెలుఁ గెంత వెల్గినన్.

శ్లో॥ వేదార్థధీ స్త్వయి తు భక్తిత ఏవ లభ్యా
యావా న్సి యశ్చ భగవ న్నసి తత్త్వత స్త్వమ్।
జ్ఞాతుం తథా భువనభావన! వేదవేద్యం
ద్రష్టుం ప్రవేష్టు మపి భక్తిత ఏవ శక్యః॥ 17

(ఈ శ్లోకము వ్యాఖ్యానగ్రంథమున లేదు.)

ప్రతి:- (హే) భగవన్! = షడ్గుణైశ్వర్యసంపన్నుఁడ వగు ఓ వైకుంఠనాథా! తత్త్వతః = యథార్థముగా, త్వమ్ = నీవు, యావాన్ = ఎంతటి వాఁడవుగా, అసి = అగు చున్నావో!

యః, చ = ఎవఁడవుగా, అసి = అగు చున్నావో! జ్ఞాతుమ్ = తెలిసికొనుటకు, వేద, అర్థ, ధీః = వేదముల యొక్క అర్థజ్ఞానము, త్వయి=నీ యందలి, భక్తితః ఏవ = భక్తివలన నే, లభ్యా = పొందఁ దగియున్నది.

(హే)భువనభావన = జగజ్జనకుఁడ వగు ఓ వైకుంఠపతీ! తథా = అట్లే, వేదవేద్యమ్ = వేదములచేఁ దెలియఁ దగిన (త్వామ్ = నిన్ను) ద్రష్టుమ్=చూచుటకును, ప్రవేష్టుమ్, అపి= ప్రవేశించుటకును, భక్తితః, ఏవ=భక్తి వలననే, శక్యః = వీలగుచున్నది.

విశేషము :- 'భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప! (గీతా వచనము) పరంతపుఁడ వగు నోయర్జునా! విశ్వరూప మును దాల్చిన యిట్టి నన్ను యథార్థముగాఁ దెలిసికొనుట కును, దర్శించుటకును, ప్రవేశించుటకును, అనన్య మగు భక్తిచేతనే శక్య మగును. అని భావము. దీనిచేత భక్తి ప్రభావము వెల్లడి యగు చున్నది. అందుచేతనే (శ్రీ)భక్తి సంజీవనీ సంపాదకు లగు పూజ్య(శ్రీ) దాసశేషులవారు ముఖపత్రమునందే 'భక్తి రే వైనం గమయతి' (భక్తిః ఏవ = భక్తియే గీతలలోఁ జెప్పిన యనన్య భక్తియే, ఏనమ్ = ఈ సర్వేశ్వరుఁ డగు వైకుంఠనాథుని, గమయతి= పొందించుచున్నది.

'భక్తి రే వైనం దర్శయతి' భక్తిః ఏవ = భక్తియే, ఏనమ్ = ఈ వైకుంఠపతిని, దర్శయతి = చూపించు చున్నది.

'భక్తివశః పురుషః'—పురుషః = పరమపురుషుఁ డగు వైకుంఠనాథుఁడు, భక్తివశః = భక్తికి వశ్యుఁడు. అని ఘంటా

పథముగాఁ జాటుచున్నారు.

'భక్త్యా తుష్యతి కేశవః' భక్తిచేతనే భగవానుఁడు సంతోషించును, 'మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద! ఇత్యాదు లీశ్లోకమున కుపోద్బలకములు.

తాత్పర్యము :– షడ్గుణైశ్వర్య సంపన్నుఁడ వగు ఓ వైకుంఠపతీ! నీవు నిజముగా ఎటువంటివాఁడవో! యెంతటివాఁడవో! తెలిసికొనుటకుఁ గావలసిన వేదార్థజ్ఞానము నీయందలి భక్తివలననే లభింపఁ దగియున్నది. 'న హ్యాసురప్రకృత యః ప్రభవంతి బోద్ధుమ్' అన్నట్లు నీయందు భక్తిలేని యసుర ప్రకృతులకు అది యగమ్యాగోచర మని 'ఏవ' అవ్యయము చెప్పుచున్నది. ఓ జగజ్జనకుఁడా! అట్లే వేద వేద్యుఁడ వగు నిన్ను దర్శించుటకును ప్రవేశించుటకును భక్తివలననే శక్య మగు చున్నది.

ఉ॥ ఈ వెటువంటివాఁడవో! య
తెవ్వఁడవో! నిజ మోజగత్పతీ!
పావనమూర్తి! వేదములు
పల్కుఁ, దదర్థము నీదుభక్తినే
భావమునందుఁ దట్టు నను
భావ్యము నీపదభక్తినే జగ
ద్భావన! నీదుదర్శన సు
భాగ్యము నీదుతనూప్రవేశమున్.

శ్లో॥ తత్త్వార్థ తత్పరపరశ్శత వేదవాక్యైః
సామర్థ్యతః స్మృతిభి ర ప్యథ తాదృశీభిః ।
త్వా మేవ తత్త్వపరసాత్త్వికసత్పురాణై
ర్దైవజ్ఞధీభి రపి నిశ్చినుమః పరేశమ్ ॥ 18

ప్రతి:- తత్త్వా...వాక్యైః - తత్త్వ = నారాయణశబ్దముయొక్క ('తత్త్వం నారాయణః పరః' అను శ్రుతివలన) అర్థ = అర్థమగు శ్రీ వైకుంఠనాథునియందు, తత్పర = తాత్పర్యము గల, పరశ్శత = వందలకు మించిన (అనంతము లగు) వేద వాక్యైః = వేదవాక్యముల చేతను, తాదృశీభిః = అట్టి వేదోక్తవిశేషణ విశిష్టము లగు, స్మృతిభిః = స్మృతుల చేతను, సామర్థ్యతః = శక్తివలనను, తత్త్వ, పర, సాత్త్విక, సత్, పురాణైః = విష్ణుపరములు గనుకనే సాత్త్వికములును శ్రేష్ఠములు నగు భాగవతాది పురాణములచేతను, దైవజ్ఞ ధీభిః అపి = పరదైవము నెఱింగిన పరాశర, పరాంకుశ, మునిప్రభృతుల యుపదేశముల చేతనుగూడ, త్వామ్, ఏవ, = నిన్నే, పర + ఈశమ్=చేతనాచేతనములకు నియంతనుగా, నిశ్చినుమః = నిశ్చయించుకొను చున్నాము.

విశేషములు:- 'తత్త్వార్థ, తత్పర, పరశ్శత, వేదవాక్యైః' తత్త్వార్థ మనఁగా? నారాయణమూర్తి 'తత్త్వం నారాయణః పరః' అను శ్రుతి యీ విషయమునఁ బ్రమాణము. వేదము లన్నింటికి నారాయణమూర్తియందే తాత్పర్యము. తాత్పర్యమును నిర్ణయించు లింగములగు 'ఉపక్రమోప

సంహారా వభ్యాసోఽపూర్వతాఫలమ్ అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్యనిర్ణయే' అని చెప్పఁబడు ఉపక్రమోప సంహారాది షడ్విధతాత్పర్యలింగములు నారాయణ మూర్తియందే కలవు. కనుకనే 'వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః' అనియు.

'వేదే రామాయణే చైవ పురాణే భారతే తథా ఆదా వంతే చ మధ్యే చ విష్ణుః సర్వత్ర గీయతే' ఇత్యాద్రిప్రమాణ వచనములు పొసఁగుచున్నవి.

'సామర్థ్యతః' - సామర్థ్య మనఁగా ? ప్రతిపాదితార్థమునకు అవిరుద్ధములగు నర్థాంతరములను బేర్కొనుట.

'తత్త్వపర, సాత్త్విక, సత్పురాణైః' విష్ణుపరము లగుపురాణ ములు సాత్త్వికములు, పురాణాంతరములకంటె శ్రేష్ఠములు నని భావము. ఇందుకుఁ బ్రమాణములు-

'సాత్త్వికే ష్వథ కల్పేషు మాహాత్మ్య మధికం హరేః' తే ష్వేవయోగసంసిద్ధా గమిష్యంతి పరాంగతిమ్ అగ్నే శ్శివస్య మాహాత్మ్యం తామసేషు ప్రకీర్తితమ్, రాజసేషు చ కల్పేషు అధికం బ్రహ్మణో విదుః॥' ఇత్యాదులు.

మ॥పరతత్త్వార్థనిరూపణంబున సతా
త్పర్యంబులౌ తచ్ఛ్రుతో
త్తర వేదోక్తులచే, స్మృతిప్రతతి చే
తన్, శక్తిసంపత్తిచే,

హరిఁ గొండాడుటఁజేసి సాత్త్వికములౌ
నమ్మేల్ పురాణమ్ములన్,
గురుసూక్తిన్, నిను నిర్ణయించితి మి వై
కుంఠేశ! సర్వేశుఁగాన్.

అవతారిక :- ఈశ శబ్దము దేవతాంతరమునందుఁ బ్రసిద్ధ మగుటచేత భగవద్వాచక మెట్లగునన్న శంక నీ క్రింది శ్లోకముచే నివారించుచున్నారు.

శ్లో॥ అన్యత్ర తు క్వచన కేచి దిహేశశబ్దా
ల్లోకప్రసిద్ధి ముపగమ్య త మీశ మాహుః।
తైశ్చ ప్రసిద్ధివిభవస్య సమూలతాయై
గ్రాహ్యా త్రయీ త్వయి తు సాఽచ్యుత! సమ్ముఖీనా॥ 19

ప్రతి:- కేచిత్తు = కొందఱన్ననో, ఇహ = ఇక్కడ, క్వచన = కొన్నిగ్రంథములందు, అన్యత్ర = దేవతాంతరమునందు, ఈశ, శబ్దాత్ = ఈశశబ్దప్రయోగమువలన, లోక, ప్రసిద్ధిమ్ = లౌకిక మగు ప్రసిద్ధిని, ఉపగమ్య = అంగీకరించి, తమ్ = ఆ దేవతాంతర మగు రుద్రుని, ఈశమ్ = ఈశశబ్దమున కర్థమునుగా, ఆహుః = చెప్పుచున్నారు, తైః, చ = ఆ వాదులచేత, ప్రసిద్ధివిభవస్య = ప్రసిద్ధి ప్రాచుర్యము యొక్క, సమూలతాయై = (ప్రసిద్ధి ప్రమాణమూలమా! కాదా! అను శంక కలుగఁగా) ప్రామాణ్యముకొఱకు, త్రయీ = వేదత్రయము, గ్రాహ్యా = ప్రమాణముగా స్వీకరింపఁ దగియున్నది, సా తు = ఆ వేద

త్రయి యన్ననో! (హే) అచ్యుత! = చ్యుతిలేని యో వైకుంఠపతీ! త్వయి = నీ యందు, సమ్ముఖీనా = అభి ముఖ్యము గలది (భవతి = అగుచున్నది - దేవతాంతర మునఁ గా దని భావము).

విశేషములు:- 'అన్యత్ర - ఈశశబ్దాత్' 'శంభు రీశః పశుపతిః' అని యమరకోశము మున్నగుచోటులం దని భావము. 'సమూలతాయై'-లోకప్రసిద్ధి ప్రమాణమూలమా? కాదా? అనుశంక రాఁగా- అప్పుడు లోకప్రసిద్ధికి మూలము వేద ములోఁ బ్రసిద్ధి యని తేలును. ఆ వేదము 'శాశ్వతం శివ మచ్యుతమ్' అను నారాయణానువాకమునందు నీకే యను కూలముగా నున్నది. ఇతరులగు రుద్రాదులకుఁ గాదు. కావున ఈశశబ్దవాచ్యుఁడవు- అచ్యుతా! నీవే యని భావము.

'అచ్యుత! ఈ సంబుద్ధి హేతుగర్భితము- జాఱుపాటు గలవాఁ డీశ్వరుఁ డెట్టులగును? మఱియు నీ పదము 'శాశ్వతం శివ మచ్యుతమ్' అను శ్రుతివాక్యమును జ్ఞప్తి చేయుచున్నది.

తాత్పర్యము:- కొందఱు వాదులు లోకమునఁ గొన్నిగ్రంథ ములందు దేవతాంతరమునం దీశశబ్దప్రయోగము లుండుట వలన లౌకికవాక్యప్రసిద్ధి ననుసరించి రుద్రదేవుని 'ఈశ' శబ్ద వాచ్యునిగాఁ జెప్పుచున్నారు. కానీ - లోకప్రసిద్ధికి మూల మే మని విచారింపఁగా వేద మని తేలుచున్నది. ఓ

యచ్యుతా! 'శాశ్వతం శివ మచ్యుతమ్' ఇత్యాదిక మగు నా వేదము నీకే యభిముఖముగా నున్నదిగాన నీవే ఈశ శబ్ద ముఖ్యవాచ్యుఁడవు. రుద్రదేవుఁడు కాఁడు.

ఉ॥ కొందఱు వాదు లొక్కెడఁ
గోశములందున దేవతాంతరం
బందుఁ బ్రసిద్ధ మీశపద
మారసి యీశపదాభిధేయ మా
చందురుఁ దాల్చు వేలు పన
సాగిరి, దానికి మూల మద్దచో
నందుగు వేద మంచు, నది
యచ్యుత! చాటుఁ ద్వదాభిముఖ్యమున్.

అవతారిక :- ఈ శ్లోకమున వైకుంఠనాథునియందు వేదాభి ముఖ్యమును విశదీకరించు చున్నారు.

శ్లో॥ యః ఖ ల్వణో రణుతరో మహతో మహీయా
నాత్మా జనస్య జనకో జగత శ్చ యోఽభూత్ ।
వేదాత్మక ప్రణవ కారణవర్ణవాచ్యం
తం త్వాం వయం తు పరమేశ్వర మామనామః ॥ 20

ప్రతి :- వయంతు = మేము, యః = ఏ, (భవాన్ = నీవు) అణోః = అణువుకంటెను (నలుసుకంటెను) అణుతరః = పరమాణువు గాను, మహతః = మహత్తుకంటెను, మహీయాన్ = అతి మహత్తు గాను, జగతః = అచేతన మునకును, జనస్య, చ = చేతనమునకును, జనకః =

తండ్రివి గాను, (ఉత్పాదకుడవు గాను) ఆత్మా = అంత ర్యామివి గాను, అభూత్ = ఐతివో, తమ్ = అట్టియు, వేదా...వాచ్యమ్—వేద. ఆత్మక = వేదస్వరూపమగు, ప్రణవ = ఓంకారమునకు, కారణ = హేతు వగు, వర్ణ = 'అ' కార మను అక్షరమునకు, వాచ్యమ్ = అర్థ మగు, త్వామ్ = నిన్ను, పరమేశ్వరమ్ = పర మేశ్వరునిగా, ఆమనామః = ఆమ్నాయములచేత (వేద ములచేత) తెలిసికొను చున్నాము.

విశేషములు:_ అణో రణుతరో - మహతో మహీయాన్ - ఈ విశేషణద్వయముచేత అణుభూత జీవాంతర్వ్యాప్తియు, మహదాదికారణ ప్రకృతిబహిర్వ్యాప్తియు వివక్షింపఁ బడినవి.

వేదాత్మక ప్రణవకారణవర్ణ మనఁగా- అకారము - అకారో విష్ణువాచకః- అని నిఘంటుకారులు తెలుపు చున్నారు. 'అక్షరాణా మకారోఽస్మి' అని గీత అట్టివర్ణముచే వాచ్యుఁడు వైకుంఠనాథుఁడగు శ్రీ మహావిష్ణువే.

'పరమేశ్వరమ్' పరో మా యస్మాత్ సః అను విగ్రహ వాక్యముచే విష్ణువుకంటెను పురుషకార ప్రదాత్రి యగు లక్ష్మియే యధికురాలు అను శ్రీవైష్ణవ సంప్రదాయము వివ క్షింపఁ బడుచున్నది.

స చాసౌ ఈశ్వర శ్చ పరమేశ్వరః తమ్ – తనకంటెను లక్ష్మియే యధికురాలు గాఁగల యీశ్వరుఁడు పరమేశ్వరుఁడని భావము.

ఈ శ్లోకమునందలి 'యః ఖలు' అనుచోట 'ఖలు' శబ్దము వాక్యాలంకారార్థము.

ఈ శ్లోకమునందుఁ బూర్వార్ధమున–

'అణో రణీయాన్ మహతో మహీయా
నాత్మా గుహాయాం నిహితోఽస్య జంతోః
త మక్రతుః పశ్యతి వీతశోకో
ధాతుః ప్రసాదా న్మహిమాన మీశమ్ ॥'

అను శ్రుతియు – ఉత్తరార్థమునందు

'యద్వేదాదౌ స్వరః ప్రోక్తో
వేదాంతే చ ప్రతిష్ఠితః ।
తస్య ప్రకృతిలీనస్య
యః పర స్సమహేశ్వరః ॥'

అను శ్రుతియు

'త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్'
ఉతామృతత్వస్యేశానః
విశ్వస్యాత్మేశ్వరమ్ - ఈశానో భూతభవ్యస్య

ఇత్యాది శ్రుతులును–

'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి'
'అనాదినిధనం విష్ణుం సర్వలోకమహేశ్వరమ్'
'ఈశానః ప్రాణదః ప్రాణః'

ఇత్యాది స్మృతులును శబ్దతఃఅర్థతః సంగ్రహింపఁబడినవి.

తాత్పర్యము :- ఏ వేల్పు అణువులకంటె నణుతరంబై మహత్తులకంటె నతి మహత్తై ఈచరాచరాఖిల ప్రపంచమునకుఁ గారణభూతమై అఖిలాంతర్యామియై యున్నాఁడో! అట్టి వేదస్వరూప మగు ప్రణవంబునకుఁ గారణమైన అవర్ణమునకు వాచ్య మయిన నిన్ను మేము పరమేశ్వరునిగా వేదములచేతఁ దెలిసికొనుచున్నాము.

చ॥ అణువులలో నెవండు పర
మాణువో!, యెవ్వఁడు తా మహత్తులన్
బ్రణుత మహాపదార్థమొ!, యె
వండు చరాచరసర్వవిశ్వకా
రణమొ!, త్రయీమయ ప్రణవ
రాజదకారపరాభిధేయు స
ద్గుణుఁ బరమేశుఁగాఁ దెలిసి
కొందుము నిన్ నిగమాళిచేఁ బ్రభూ!

అవతారిక ;- పూర్వశ్లోకమునఁ జెప్పఁబడిన యర్థమునే యిట వివరించుచున్నారు.

శ్లో॥ ఆత్మేశ్వరోఽసి న పరోఽస్తి తవేశ్వరోఽన్యో
విశ్వస్య చాధిపతి రస్య పరాయణం చ ।
నారాయణాచ్యుత పర స్త్వ మిహైక ఏవ
బ్రహ్మాదయోఽపి భవదీక్షణలబ్ధసత్తాః॥ 21

ప్రతి :- హే నారాయణ ! = ఓ నారాయణమూర్తీ!,

అచ్యుత! = చ్యుతిలేనివాఁడా! ఇహ = ఈలోకమునందు, త్వమ్ = నీవు, ఏకః ఏవ = ఒక్కఁడవే, పరః = శ్రేష్ఠుఁడవు, ఆత్మ + ఈశ్వరః = చేతనులకు నియంతవును, అసి = అగుచున్నావు, తవ = నీకు, అన్యః = ఇతరుఁడగు, పరః = ఉత్కృష్టుఁడగు, ఈశ్వరః = నియంత, న + అస్తి = లేఁడు, విశ్వస్య = ప్రపంచమునకు, అధిపతిః, చ = ప్రభువును (ప్రాప్యుఁడవును) అసి = అగుచున్నావు; అస్య = ఈ విశ్వమునకు, పరాయణం చ = శరణమును (ప్రాపకుఁడవును) అసి = అగుచున్నావు, బ్రహ్మాదయః అపి = బ్రహ్మాదులు గూడ, భవత్, ఈక్షణ, లబ్ధ, సత్తాః = నీ దర్శనము చేతనే పొందఁబడిన పుట్టువు కలవారు, (భవంతి = అగుచున్నారు.)

విశేషము :- 'నారాయణ' — నార + అయన = నారశబ్ద వాచ్యులగు చేతనాచేతనములకు అంతర్యామి యైనవాఁడా! అని వ్యుత్పత్తి ఇందుకు ప్రమాణము—

'ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః
తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః'
'బ్రహ్మాదయోఽపి భవదీక్షణలబ్ధసత్తాః'

బ్రహ్మ నారాయణుని కుమారుఁ డనుటకు—

'యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై
వేదాంశ్చ ప్రహిణోతి తస్మై'

ఇత్యాదులు ప్రమాణములు.

తాత్పర్యము :- చ్యుతి రహితుఁడా! చేతనాచేతనాంతర్యామి వగు ఓ నారాయణమూర్తీ! ఈ లోకమున నీ వొక్కఁడవే పరమోత్కృష్టుఁడవు, సర్వనియంతవు నగు చున్నావు. అన్యుఁ డెవ్వఁడును నీకు నియామకుఁడు లేఁడు. పరుఁడును లేఁడు. ఈ విశ్వమునకు నీవు ప్రాప్యుఁడవును ప్రాపకుఁడవు నై యున్నావు. బ్రహ్మాదులు సైతము నీ దర్శనముచే నుద్భూతులై యున్నారు. ఓ వైకుంఠనాథా! నీ విట్టి సర్వోత్కృష్టుఁడవు.

ఉ॥ ఈయవనీతలిన్ బరుఁడ
    వీ వొకరుండ వె, నిన్ను మించువాఁ
డేయెడ లేఁడు, విశ్వమున
    కీశుఁడవున్ శరణంబ వీవ, నా
రాయణ! యచ్యుతా! హరి! చ
    రాచరసర్వజగన్నియంత వీ
వే, యజముఖ్యు లెల్ల భవ
    దీక్షణమాత్ర సముద్భవుల్ ప్రభూ!

శ్లో॥ నిత్యః సమాభ్యధికవర్జిత ఊర్జితశ్రీ
    ర్నిత్యేఽక్షరే దివి వసన్ పురుషః పురాణః।
    సత్యప్రవర్తనకరో జగతోఽస్య మూలం
    నాన్య స్త్వ దస్తి ధరణీధర! వేదవేద్యః॥ 22

ప్రతి:- హేధరణీధర! = భూమండలమును ధరించిన యో వైకుంఠనాథా! (త్వమ్, ఏకఏవ=నీ వొకఁడవే) నిత్యః= కాలాపరిచ్ఛిన్నుఁ డవును; సమ, అభ్యధిక, వర్జితః=సమానుఁడు, అధికుఁడు, లేని వాఁడవును, (వస్తుపరిచ్ఛేద రహితుఁ డవును) ఊర్జితశ్రీః = దార్ఢ్యవతియగు లక్ష్మి గలవాఁడవును, నిత్యే = త్రికాలములందు నుండునట్టియు అక్షరే = కాలకృతమగు మార్పు లేనట్టియు, దివి = పరమాకాశపద వాచ్యమగు (పరమపదే = పరమపదమందు) వసన్ = నివసించుచు, అస్య = ఈ, జగతః = జగత్తునకు, మూలమ్=కారణమైనవాఁడవును. సత్త్వ, ప్రవర్తన, కరః = సత్త్వకార్యమగు పాలనమును చేయువాఁడవును పురాణః = ఆద్యుఁడవగు, పురుషః = పురుషుఁ డవును (అసి = అగు చున్నావు) త్వత్ = నీ కంటె, అన్యః = ఇతరుఁడగు, వేదవేద్యః = వేదములచేఁ దెలియఁ దగిన వాఁడు, న+అస్తి = లేఁడు.

విశేషము:- ధరణీధర - ఇందు ధరణీపదము వైకుంఠమునకుఁ గూడ ఉపలక్షకము (గ్రాహకము) కనుక విభూతిద్వయ నిర్వాహకుఁడా! యని యర్థమును జెప్పికొన వలెను.

త్వమ్ - ఏకః - ఏవ - ఈ పదములను 'ఆత్మేశ్వరోఽసి' అను శ్లోకమునుండి తెచ్చుకొనవలెను. వేదవేద్యః - నిత్యత్వాదిగుణవిశిష్టుఁడై పురాణపురుషుఁడుగా వేదప్రతిపాదితుఁడు అని భావము-

ఈ శ్లోకమునం దీక్రింది వాక్యముల భావ మనుసంధించుకొన వలయును.

1. నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్
2. న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే
3. హ్రీశ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ
4. త దక్షరే పరమే వ్యోమన్
5. యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్
6. యతో వా ఇమాని భూతాని జాయంతే
7. మహాన్ ప్రభు ర్వై పురుషః సత్వస్యైష ప్రవర్తకః
8. సర్వే వేదా యత్పద మామనంతి

తాత్పర్యము:– విభూతిద్వయ నిర్వాహకుఁడవగు ఓ వైకుంఠపతీ! నీవు నిత్యుఁడవును (కాలాపరిచ్ఛిన్నుఁ డవును) నీతో సముఁడుగాని యధికుఁడుగాని లేనివాఁడవును, గాఢానురక్త యగు లక్ష్మి గలవాఁడవును, త్రికాలా బాధ్యమును కాలకృత పరిణామరహితము పరమాకాశపదవాచ్య మగు పరమ పదమునందు వసించుచున్న పురాణపురుషుఁడవు. ఈ జగత్తునకు మూలమైన వాఁడవు. సత్వగుణ కార్యమగు పాలనమును నిర్వర్తించువాఁడవునై యున్నావు. నీకంటె నన్యుఁడగు వేదవేద్యుఁడు మఱియొకఁడు లేఁడు.

3. మాతరం పద్మమాలినీం శ్రియం వాసయ.

4. సహస్రశీర్షా పురుషః—

తాత్పర్యము :- ఓ వైకుంఠపతీ! ఏ పురుషుఁడు భూతభవిష్య ద్వర్తమానకాలముల నుండు నెల్లరకును నియామకుఁడో! తనకు మఱియొకనియామకుఁడు లేనివాఁడో! ఏ పురుషుఁడు క్షీరాబ్ధిశాయియో! అనంతరూపుఁడో! త్రిలోకజనని యగు లక్ష్మీదేవి యే పురుషునకుఁ బట్టపురాణియో! సాక్షాత్సహస్రశీర్షుఁ డగు నా పురుషుఁడవు నీవేగదా!

చ॥ ఎవనిని భూత భవ్య భవ
దీశు ననీశుఁగ వేద మెన్ననో!
ఎవఁడు సరస్వదాలయుఁడో!
యెవ్వఁ డనంతవతారధారియో!
ఎవనికి లోకమాత యగు
నిందిర యాలో! సహస్రశీర్షముల్
సువిపులముల్ గలట్టి పురు
షుండవు నీవె వికుంఠనాయకా!

అవతారిక :- ఇఁక వైకుంఠనాథుఁడు పురుషసూక్త ప్రతి పాద్యుఁ డనియు నిట నిరూపించు చున్నారు.

శ్లో॥ సర్వశ్రుతి ష్వనుగతం స్థిర మప్రకంప్యం
నారాయణాహ్వయధరం త్వ మి వానవద్యమ్।
సూక్తం తు పౌరుష మశేషజగత్పవిత్రం
త్వా ముత్తమం పురుష మీశ ముదాజహార ॥

ప్రతి :- త్వమ్ + ఇవ = నీవలెనే, సర్వశ్రుతిషు = సమస్త వేదములందును, అనుగతమ్ = చొచ్చియున్నట్టియు, స్థిరమ్ = (సర్వవాదులచేతను భగవత్పరముగా) అంగీకరింపఁ బడినదియు, అప్రకంప్యమ్ = (కుతర్కములచే దేవతాంతర పరముగా) కదలింప శక్యము గానిదియు, నారాయణ, ఆహ్వాయ, ధరమ్ = నారాయణనామమును ధరించినదియు, (పురుషసూక్తమునకు నారాయణసూక్తమనియుఁ బ్రసిద్ధి గలదు.)అనవద్యమ్ = నిర్దుష్టమైనదియు, అశేష, జగత్, పవిత్రమ్ = సమస్తలోకములను పావనమొనర్చునదియు, (అగు) పౌరుషం, సూక్తం, తు = పురుషసూక్త మన్ననో, ఈశమ్ = సర్వనియామకుఁడవగు, త్వామ్ = నిన్ను, ఉత్తమమ్ = సర్వోత్తముఁడవగు, పురుషమ్ = పురుషునిగా, ఉదాజహార = ప్రతిపాదించెను.

విశేషము :- 'సర్వశ్రుతి ష్వనుగతమ్'- ఈ పురుషసూక్తము భగవంతునివలెనే సర్వవేదవ్యాపియై యున్నది. ఇందుకుఁ బ్రమాణము.

'ఋగ్వేదే షోడశర్చం స్యాత్, యజు ష్ష్వష్టాదశర్చకమ్।
సామవేదేషు సప్తర్చం, తథా వాజసనేయకే'

ఈ సూక్తము ఋగ్వేదమున 16 ఋక్కులు గల్గి యజుర్వేదమున 18 ఋక్కులు గల్గి, సామవేదమున 7 ఋక్కులు గల్గి,

యథర్వవేదమున 7 ఋక్కులు గల్గి, యన్ని వేదములలనుగత మైయున్న దని భావము.

'అనవద్యమ్' శ్రుతిసారాంశమై నిరవద్య మని హృదయము.

శ్లో॥ వేదేషు పౌరుషం సూక్తం ధర్మశాస్త్రేషు మానవమ్।
భారతే భగవద్గీతా పురాణేషు చ వైష్ణవమ్॥

వేదములలోఁ పురుషసూక్తము, ధర్మశాస్త్రములలో మనుస్మృతి, భారతములో భగవద్గీత, పురాణములలో విష్ణుపురాణము సారముగనుక పురుషసూక్త మనవద్యమని తాత్పర్యము.

'త్వా ముత్తమం పురుష మీశముదాజహార' 'వేదాహమేతం పురుషం మహాంతమ్' అని పురుషసూక్తము వైకుంఠనాథుని మహాపురుషునిగా (ఉత్తమపురుషునిగా) కంఠరవేణ చాటుచున్నది.

'ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః, అని గీత దానిని బలపఱుచు చున్నది.

'త్వా మివ' అను ఉపమచే నీ శ్లోకమునందలి విశేషణము లన్నియుఁ బురుషసూక్తమునకును వైకుంఠనాథునకును సమన్వితము లగుచున్నని.

తాత్పర్యము:- ఓ వైకుంఠనాథా! నీ వలెనే సర్వవేదములందు ననుగత మైనదియు, సర్వవాదులచేతను భగవత్పరముగా నంగీకరింపఁ బడినదియుఁ గుతర్కములచేత దేవతాంతర పరముగాఁ గదలింప శక్యము గానిదియు, నారాయణ

సూక్తమను నామాంతరము గలదియు, శ్రుతి సారభూత మగుటచే నిరవద్య మైనదియు, సమస్తలోకములను బవిత్రము చేయునదియు నగు పురుషసూక్తము సర్వేశుఁడ వగు నిన్ను 'వేదాహ మేతం పురుషం మహాంతమ్' అని యుత్తమ పురుషునిగాఁ బ్రతిపాదించు చున్నది.

ఉ॥ ఓ యమి లేశ! చాటుఁ బురు
షోత్తముగా నిను, నీవలెన్ స్థిరం
బై యనవద్యమై శ్రుతుల
నన్నిటఁ జొచ్చి యచాల్య మౌచు నా
రాయణనామ మూనుచుఁ జ
రాచర విశ్వవిశుద్ధిదాయి యా
ప్యాయనకారి భక్తులకుఁ
బౌరుషసూక్తము దేవతోత్తమా!

శ్లో॥ ఆనంద మైశ్వర మవాఙ్మనసావగాహ్యా
మామ్నాసిషు శ్శతగుణోత్తరితక్రమేణ।
సోఽయం తవైవ నృషు హి త్వ మి హాంతరాత్మా
త్వం పుండరీకనయనః పురుష శ్చ పౌష్ణః॥ 25

ప్రతి:- ఐశ్వరమ్ = ఈశ్వరత్వ ప్రయుక్తమగు, (పరబ్రహ్మ మగుటచేఁ బ్రాపించిన) ఆనందమ్ = ఆనందమును, శత గుణ, ఉత్తరిత, క్రమేణ = నూఱునూనుపానందముల కంటె నొక మనుష్య గంధర్వానందము హెచ్చును వరు సగా, అవాఙ్మనసావగాహ్యామ్ = వాక్కునకు మనస్సునకు

నందని దానినిగా (శ్రుతయః = వేదములు) ఆమ్నా సిషుః = మరల మరల నభ్యాస మొనర్చినవో! సః=అట్టి అయమ్ = ఈయానందము, తవ+ఏవ =నీదే, హి =ఎందు కనఁగా, ఇహ = ఈప్రకరణమునందు, నృషు = మాన వులయందు, త్వమ్ = నీవు. అంతరాత్మా = అంతర్యా మిగా, (వర్తసే = ఉన్నావు) పుండరీక నయనః = తెల్ల దామరలవంటి కన్నులు గలవాఁడవు, పౌష్ణః = సూర్య మండలాంతర్వర్తియగు, పురుషః చ = పురుషుఁడవును, త్వమ్ = నీవు (అసి = అగుచున్నావు.)

విశేషము :- 'శతగుణోత్తరిత క్రమేణ' 'సైషానందస్య మీమాంసా భవతి' అని తైత్తిరీయానందవల్లిలోఁ జెప్పిన ప్రకారము ఒకరి యానందముకంటె మఱియొకరి యానం దము నూఱురెట్లధిక మని వర్ణించుచు బ్రహ్మానంద మన్ని యానందములకన్న మిన్న యని నిరూపింపఁ బడినది.

మఱియు ఆనందము—

'అవాఙ్మనసావగాహ్యామ్' వాక్కులకు మనస్సునకు దూర మైనది. ఇందుకుఁ బ్రమాణము.

'యతో వాచో నివర్తంతే। అప్రాప్య మనసా సహ'—

'త్వం పుండరీకనయనః'- కప్యాసం పుండరీక మివాక్షిణీ తస్య'- అను శ్రుతి ఇందులకు మూలము.

'పురుషశ్చ పౌష్ణః- య ఏషోంత రాదిత్యే' అను శ్రుతి యీ యర్థమున కనుగ్రాహకము.

తాత్పర్యము :- వేదములు నూఱు మానుషానందము లొక మనుష్యగంధర్వానందమనియు,నూఱుమనుష్యగంధర్వుల యానంద మొక దేవగంధర్వానంద మనియు, నీ క్రమమున శతగుణోత్తరముగా నానందమీమాంస యొనర్చి యైశ్వర్యప్రయుక్త మగు నానందము నవాఙ్మానసగోచర మని వర్ణించినవి. ఓ వైకుంఠపతీ! ఆ యానందము నీదే కదా! ఏలయన నీ ప్రకరణమునందు నీవు సమస్తజీవులకు నంతర్యామివిగా నున్నావు. మఱియు 'కప్యాసం పుండరీకమి వాక్షిణీతస్య' అని వర్ణింపఁ బడు పుండరీకాక్షుఁడవు నీవే. 'య శ్చాసా వాదిత్యే' అని సూర్యమండలాంతర్వర్తిగా వర్ణింపఁ బడిన పురుషుఁడవును నీవేగదా!

ఉ॥ ఒక్కరి కౌతుకంబునకు
నొక్కరిహర్ష ము నూఱునూఱు రె
ట్లెక్కువ యంచుఁ బ్రౌఁజదువు
లెన్నుచుఁ గౌతుక మైశ్వరంబు హృ
ద్వాక్కుల కంద దం చనియెఁ
దావక మే యది యంతరాత్మ వీ
వెక్కతనన్ సితాంబుజ ద
ళేక్షుఁడవో రవిబింబ జృంభివో! (8)

శ్లో॥ యద్బ్రహ్మ కారణ మబుధ్యత సృష్టివాక్యై
ర్బ్రహ్మేతి వా సదితివాత్మగిరాఽథ వా తత్ ।
నారాయణ స్త్వితి మహోపనిష ద్బ్రవీతి
సౌబాలికీప్రభృతయోఽప్యనుజగ్ము రేనామ్ ॥ 26

ప్రతి:- యత్ = ఏ వస్తువు; సృష్టివాక్యైః = సృష్టికారణ బోధక వాక్యములగు, బ్రహ్మేతివా = 'బ్రహ్మ వా ఇద మేవాగ్ర ఆసీత్' అను వాక్యముచేతను, సత్ + ఇతి, వా = 'స దేవ సౌమ్యేద మగ్ర ఆసీత్' అను వాక్యము చేతను, అథవా = లేక, ఆత్మగిరా = 'ఆత్మా వా ఇద మేక ఏ వాగ్ర ఆసీత్' అను వాక్యముచేతను, మూలకారణమ్ = ప్రాథమిక కారణముగా (ఉపాదాన కారణముగా) అబుధ్యత = తెలియఁబడెనో! తత్ = ఆ మూలకారణ మగు వస్తువును, (కారణవాక్యములచేత బ్రహ్మ మనియు సత్తనియు ఆత్మయనియుఁ జెప్పఁబడిన యా వస్తువు నని భావము) మహోపనిషత్ = మహోపనిషత్తు, నారాయణః ఇతి = నారాయణుఁడని, బ్రవీతి = చెప్పుచున్నది. సౌబాలకీప్రభృతయః అపి = సుబాలోపనిషత్తు మొదలుగాఁగలవి కూడ, ఏనామ్ = ఈ మహోపనిషత్తును, అను జగ్ముః = అనుసరించినవి.

విశేషములు:- 'నారాయణ స్త్వితి మహోపనిష ద్బ్రవీతి-'

'ఏకో హ వై నారాయణ ఆసీత్ న బ్రహ్మా నేశానః
(మహోపనిషద్వాక్యమ్)

య ఆత్మని తిష్ఠన్ ఆత్మాన మంతరో య మయతి య మాత్మా
న వేద ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా
దివ్యో దేవ ఏకో నారాయణః - (సుబాలోపనిషత్)

తాత్పర్యము : 'బ్రహ్మా వా ఇద మేవాగ్ర ఆసీత్' ఇత్యాది సృష్టికారణవాక్యములచేత ఏ వస్తువు మూలకారణముగఁ దెలియఁ బడెనో, యామూలకారణ మగు వస్తువును మహోపనిషత్తు నారాయణుఁ డని వాకొనుచున్నది. ఈ మహోపనిషత్తునే సుబాలోపనిషత్ప్రభృతులు గూడ నను సరించుచున్నవి. కావున శ్రీమన్నారాయణమూర్తియే సృష్టికి మూలకారణ మనుట సర్వోపనిషన్మతము.

ఉ॥ ఏయది సృష్టివాక్యముల
నెల్లజగాలకు మూలకారణం
బై యలరారు నంచుఁ దెలి
యంబడెఁ, గా దది మూల, మొక్కనా
రాయణుఁడే నిదాన మని
యాడె మహోపనిషత్తు, తక్కునా
మ్నాయశిరంబు లన్నియు ని
నాద మొనర్చెను దాని యర్థమే.

అవతారిక :- పూర్వోక్త మగు నర్థమునే యిట వివరించు చున్నారు.

శ్లో॥ జ్యోతిః పరం పరమతత్త్వ మథో పరాత్మా
బ్రహ్మేతి చ శ్రుతిషు యత్ పరవ స్త్వధీతమ్ ।
నారాయణ స్త దితి త ద్విశినష్టి కాచిత్
విష్ణోః పదం పరమ మి త్యపరా గృణాతి ॥ 27

ప్రతి :- శ్రుతిషు = పలుశ్రుతులయందు, పరమతత్త్వమ్ = పరతత్త్వము, పరం, జ్యోతిః = పరజ్యోతి, అథో = తరువాత, పరాత్మా = పరమాత్మ, బ్రహ్మ, ఇతిచ = బ్రహ్మమనియు, యత్ = ఏ, పరవస్తు = సర్వోత్తమ మగు వస్తువు, అధీతమ్ = అధ్యయనము చేయఁ బడినదో, తత్ = ఆ ప్రసిద్ధ మగు, తత్ = పరవస్తువు, నారాయణ ఇతి = నారాయణుఁ డని, కాచిత్ = ఒక యుపనిషత్తు విశినష్టి = వివరించు చున్నది, అపరా = మఱియొక యుపనిషత్తు, (కఠవల్లి) విష్ణోః = విష్ణుమూర్తియొక్క, పరమమ్ = ఉత్కృష్ట మగు, పదమ్ = స్వరూపము, ఇతి = అని, గృణాతి = చెప్పుచున్నది.

విశేషము:- 'పరవస్తు' పర - అనుటచేత 'న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే' అన్నట్లు ఆ వస్తువుతో సమాన మైనదియు అధిక మైనదియు మఱియొక వస్తువు లేదని భావము. సర్వోత్కృష్టమని హృదయము. వస్తు! - అనుటచేత ఇట్టి యుత్కృష్టపదార్థము లోకమున నున్నదిగాని ఔత్ప్రేక్షి

కము కాదని రహస్యము. అధీతమ్ - సంప్రదాయావిచ్ఛేద రూపమునఁ దెలియఁ బడినది యని భావము. 'నారాయణ స్త దితి త ద్విశినష్టి కాచిత్' నారాయణానువాకములో నిట్లున్నది.

నారాయణపరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః
నారాయణపరో జ్యోతి రాత్మా నారాయణః పరః
'విష్ణోః పదం పరమ మి త్యపరా గృణాతి'

పద్యత ఇతి పదం - ఉపాస్యమ్ - ప్రాప్యం చ - స్వరూప మిత్యర్థః - ఉపాస్య మనియు, ప్రాప్య మనియు స్వరూప మనియు పదశబ్దమున కర్థములు.

కఠవల్లి యిట్లు వర్ణించుచున్నది.

'విజ్ఞానసారథి ర్యస్తు మనఃప్రగ్రహవాన్ నరః
సోఽధ్వనః పార మాప్నోతి త ద్విష్ణోః పరమం పదమ్'

మ॥ పరతత్త్వంబు పరాత్మ బ్రహ్మ మని ది
వ్యజ్యోతి యంచున్ మహా
త్తర మైనట్టిపదార్థ మేది సమధీ
తం బయ్యెనో! దాని ని
ర్ధర నారాయణుఁ డంచు నొక్కశ్రుతి యు
ద్ఘాటించె, వే ఱొండు వాక్
స్ఫురణన్ జాటెఁ బరమ్ము విష్ణుపద మం
చున్ బ్రాజ్ఞు లోహో! యనన్.

అవతారిక :-ప్రకృతము వస్తుసామర్థ్యము వలనఁగూడ వైకుంఠ నాథునకుఁ బరత్వమును బ్రతిపాదించు చున్నారు.

శ్లో॥ సంతీదృశః శ్రుతిశిరస్సు పరస్సహస్రా
వాచ స్తవ ప్రథయితుం పరమేశితృత్వమ్।
కించేహ న వ్యజగణః కృమిధాతృభేదం
క్రామన్ జగంతి నిగిరన్ పున రుద్గిరం శ్చ॥ 28

ప్రతి :- తవ = నీయొక్క, పరమ + ఈశితృత్వమ్ = సర్వేశ్వరత్వమును, ప్రథయితుమ్ = వెల్లడించుటకు, శ్రుతిశిరస్సు = వేదాంతములందు (ఉపనిషత్తులందు) పరస్సహస్రాః = వేలకు మించిన, ఈదృశః = ఇటువంటి (పూర్వోదాహృత శ్రుతులవంటి) వాచః వాక్కులు, సంతి = ఉన్నవి, కించ = మఱియు, జగంతి = లోకములను, క్రామన్ = (త్రివిక్రమావతారమున) ఆక్రమించుచు, నిగిరన్ = మ్రింగుచు (ప్రళయమునందు) పునః = మరల, ఉద్గిరన్ = క్రక్కుచు (సృష్టికాలమున) త్వమ్ = నీవు, కృమి, ధాతృ, భేదమ్ = ఇది పురుగు, ఇతఁడు చతుర్ముఖుఁడు – అనుభేదమును, ఇహ = ఈ యాక్రమణాదులయందు, న, వ్యజగణః = లెక్కింపలేదు,

విశేషము :- పరమేశితృత్వమ్- 'త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్' అను శ్రుతిచే గోచరించుచున్న సర్వేశ్వరత్వమును- అని భావము.

'కృమిధాతృభేదమ్'- త్రివిక్రమావతారమున భగవచ్చరణము సత్యలోకము నతిక్రమించి యూర్ధ్వమున కేఁగుట ప్రసిద్ధము.

సృష్టిలో భగవన్నాభికమలమునుండి బ్రహ్మ యుద్భవించుట వలన 'జాతస్య హి ధ్రువో మృత్యుః' అను న్యాయమునఁ బ్రళయమున నిగిరణ మర్థాత్ సిద్ధ మగుచున్నది.

తాత్పర్యము :- ఓ వైకుంఠనాథా! నీసర్వేశ్వరత్వమును జాటుటకుఁ బూర్వోదాహృతశ్రుతులవంటివి వేలకొలఁది యుపనిషద్వాక్యములు గలవు. మఱియు నీవు త్రివిక్రమావతారమున లోకముల నాక్రమించుచు మ్రింగుచు మరల వెళ్ళఁగ్రక్కుచుఁ బ్రళయమునందును సృష్టికాలమునను ఇది పురుగు, ఇతఁడు చతుర్ముఖుఁ డను విశేషమును విచారించ లేదు.

గీ॥ ఈదృశోపనిషద్వాక్కు లెన్ని వేలొ!
నీదు సర్వేశ్వరత్వమ్ము నిర్వచించు।
లోకముల నాక్రమించుచు లోన బైట
నుంచుచు విరించి కృమిభేద మెంచ వీవు.

అవతారిక :- బ్రహ్మవేత్తలకుఁ దత్వనిర్ణయోపాయ ప్రకారము నిట వివరించు చున్నారు.

శ్లో॥ రూపప్రియా పరమయా, పరమేణ ధామ్నా
చిత్రైశ్చ కైశ్చి దుచితై ర్భవత శ్చరిత్రైః।
చిహ్నై రనిహ్నవపరై రపరైశ్చ కైశ్చి
న్నిశ్చిన్వతే త్వయి విపశ్చిత ఈశితృత్వమే ॥ 29

ప్రతి :- విపశ్చితః = బ్రహ్మవేత్తలు, భవతః = ఏలినవారి యొక్క (తమయొక్క) పరమయా = శ్రేష్ఠమగు, రూప, శ్రియా -స్వరూపముయొక్క శోభచేత, పరమేణ= సర్వోత్కృష్టమగు, ధామ్నా = స్థానముచేతను, చిత్రైః= ఆశ్చర్యకరములును, ఉచితైః - మహిమానుగుణములును, అగు, కైశ్చిత్ = కొన్ని, చరిత్రైః, చ = సకల జగత్కారణాది చరిత్రముల చేతను, అనిహ్నవపరైః = కప్పిపుచ్చుటకు నలవిగాని (తత్త్వనిర్ణాయకములైన) కైశ్చిత్ = కొన్ని చిహ్నముల చేతను, అపరైః, = ఇతరములైన, చిహ్నైశ్చ = లక్ష్మీపతిత్వాది లక్షణములచేతను, త్వయి= నీయందు, ఈశితృత్వమ్ = సర్వేశ్వరత్వమును, నిశ్చిన్వతే= నిశ్చయించు చున్నారు.

విశేషము :- విపశ్చితః - వివిధం, పశ్యత్, చిత్త్వమ్ - విపశ్చిత్త్వమ్ - అను నిర్వచనముచేత స్వరూపముచేతను స్వభావముచేతను తత్త్వత్రయమును విమర్శించి తెలిసికొనిన జ్ఞానులని యర్థము.

'రూపశ్రియా పరమయా' భగవంతుని స్వరూపకాంతి లోకోత్తర మనుటకుఁ బ్రమాణములు.

1. 'తస్య భాసా సర్వ మిదం విభాతి'
2. దివి సూర్యసహస్రస్య భవే ద్యుగప దుత్థితా యది భాస్సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః

(సశేషము)

పరమేణధామ్నా- భగవంతుని స్థానము సైతము సర్వో త్తమము-'ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్' ఇత్యాదు లిందుకు ప్రమాణములు.

'చిత్రైః- చరిత్రైః - స్తంభావిర్భావము, హిరణ్యకశిపు నిబర్హణము, సేతునిర్మాణము, చరాచరమోక్ష ప్రదానము, గోవర్ధనోద్ధరణము, గీతోపదేశము మున్నగు చిత్ర చరిత్రముల చేత, అని భావము.

చిహ్నైశ్చ- తత్వనిర్ణయశక్తము లగు లక్షణములచేతను, లక్ష్మీపతిత్వ, శేషశాయిత్వ, వైనతేయవాహనత్వాది లక్షణ ములచేతను, అని తాత్పర్యము.

తాత్పర్యము :- ఓ వైకుంఠనాథా! బ్రహ్మవేత్తలు శ్రీవారి లోకోత్తర మగు శరీరకాంతిచేతను, సర్వోత్తమ మగు స్థానముచేతను, ఆశ్చర్యకరములును మహిమానుగుణములు నగు వేదాపహారమహాపాతకి దైత్యశిక్షణాదికములును, స్తంభోద్భవసేతునిర్మాణాదులు నగు కొన్ని దివ్యచరిత్ర ములచేతను, కప్పిపుచ్చినను డాగనిశంఖచక్రాది చిహ్నముల చేతను, లక్ష్మీపతిత్వ శేషశాయిత్వాది లక్షణములచేతను, భవదీయసర్వేశ్వరత్వమును నిశ్చయించుచున్నారు.

శా॥ దేవా! తావకదివ్యదేహరుచిచే
దివ్యోరుధామంబుచే,
భావత్కాద్భుతకారికార్యములచేఁ
బ్రచ్ఛాదనాశక్య ల
క్ష్మావేశాదుల, శ్రీపతిత్వఫణిప
ర్యంకాది చిహ్నంబులన్,
నీ విశ్వేశత నిర్ణయింతురు బుధుల్
నీరేజపత్రేక్షణా!

అవతారిక :- ఆ చిహ్నముల నన్నింటిలోను లక్ష్మీపతిత్వరూప చిహ్నము సర్వోత్తమ మని యిందుఁ జెప్పుచున్నారు.

శ్లో॥ యస్యాః కటాక్షణ మనుక్షణ మీశ్వరాణా
మైశ్వర్యహేతు రితి సార్వజనీన మేతత్ ।
తాం శ్రీ రితి త్వదుపసంశ్రయణా న్నిరాహు
స్త్వాం చ శ్రియః శ్రియ ముదాహు రుదారవాచః ॥ 30

ప్రతి :- యస్యాః = ఏ తల్లియొక్క, కటాక్షణమ్ = కటాక్షము, అనుక్షణమ్ = క్షణక్షణము, ఈశ్వరాణామ్ = ఇంద్రాదులయొక్క, ఐశ్వర్య, హేతుః = ఐశ్వర్యమునకుఁ గారణము, ఇతి, ఏతత్ = అని యీచెప్పుట, సార్వ, జనీనమ్ = సర్వజనప్రసిద్ధమో! తామ్ = ఆ తల్లిని, త్వత్, ఉపసంశ్రయణాత్ = నిన్నాశ్రయించి యుండుట వలన, శ్రీః, ఇతి = శ్రీ అని, ఉదారవాచః = గొప్పవాక్కులు గల వివేకులు, నిరాహుః = నిర్వచిం

చిరి, త్వామ్, చ = నిన్నుఁ గూడ, శ్రియః = శ్రీకి (శ్రీదేవికి) శ్రియమ్ = శ్రీనిగా, ఉదాహుః = ఉదాహరించుచున్నారు.

విశేషము :- శ్రీః - ఇతి-శ్రయతే ఇతి శ్రీః అను వ్యుత్పత్తిచే శ్రీః అను శబ్ద మేర్పడుచున్నది. సర్వదా భగవంతుని ఆశ్రయించి యుండు నది యని భావము.

'త్వాం చ శ్రియః శ్రియ ముదాహు రుదారవాచః
శ్రియః శ్రీ శ్చ భవదగ్ర్యా కీర్తేః కీర్తి క్షమాక్షమా'
(రామాయణము)

'కః శ్రీః శ్రియః' (అని స్తోత్రరత్నము)

తాత్పర్యము :- ఏ తల్లి యొక్క క్రేగంటిచూపు క్షణక్షణ మింద్రాదుల యైశ్వర్యమునకు హేతు వనుట సర్వజన ప్రసిద్ధమో! యా తల్లి నీ యాశ్రయమువలన శ్రీ యని యుదారవాక్కు లగు విజ్ఞులచే నిర్వచింపఁ బడుచున్నది. నిన్నుఁ గూడ నట్టితల్లి యగు శ్రీదేవికి శ్రీదాతనుగా నిర్వచించు చున్నారు.

చ॥ సకలజగత్ప్రసిద్ధ మిది
సర్వదిగీశ్వరవైభవ ప్రస
క్తికి మఱి మూల మేజనని
దివ్యకటాక్ష మనుక్షణంబు నా
సుకవినుతాంఘ్రి శ్రీ యనఁగ
శోభిలె నీపద మాశ్రయించి, పే

రుకొనుదు రుత్తముల్ కవివ
రుల్ నిను శ్రీకిని శ్రీవటంచొగిన్.

అవతారిక :- ఇతరుల కిట్టి ప్రమాణగుణశ్రవణము లేదా?
యను శంకకు సమాధానమును జెప్పుచున్నారు.

శ్లో॥ మాయా త్వయా గుణమయీ కిల యా నిసృష్టా
సా తే విభో! కి మివ నర్మ న నిర్మిమీతే।
కౌతస్కుతాః స్థిరకుతర్కవశేన కేచిత్
సత్యాం శ్రుతౌ చ బధిరా స్త్వయి తన్మహిమ్నా॥ 31

ప్రతి :- (హే) విభో! = ఓ సర్వేశ్వరా! త్వయా = నీ
చేత, గుణమయీ = సత్వరజస్తమోమయి యగు, యా=
ఏ, మాయా = ప్రకృతి, నిసృష్టా = (దేహేంద్రియాదు
లుగా) ప్రయోగింపఁబడినదో, సా = ఆమాయ = తే =
నీకు, కిమివ = దేనివలె, నర్మ = లీలను (క్రీడను)
న, నిర్మిమీతే, కిల = చేయదు? (సకలమైనలీలను జేయు
నని భావము) కేచిత్ = కొంతమంది, (పేరుచెప్పుటకుఁ
గూడఁదగని వారని తాత్పర్యము) కౌతస్కుతాః =
హేతువాదులు, స్థిర, కుతర్క, వశేన = (ప్రమాణముల
కననుగుణములైనను) గట్టిపట్టుదలతోఁ గూడిన కుతర్క
ముల వశముచేత, త్వయి = నీ విషయమున, (నీపార
మ్యమునందు) శ్రుతౌ = వేదము, సత్యామ్ = అను
కూలముగా నున్నను, తత్ + మహిమ్నా = ఆమాయ
యొక్క మహిమచేత, బధిరాః = చెవిటివాండ్రు,
(భవంతి = అగు చున్నారు.)

విశేషము :- 'గుణమయీ'—

'అజా మేకాం లోహితశుక్లకృష్ణాం ।
బహ్వీం ప్రజాం జనయంతీం సరూపామ్ ॥

అను శ్రుతిచేఁ జెప్పఁబడిన లోహిత శుక్లకృష్ణవర్ణములు గల సత్వరజ స్తమోగుణములతో నిండినది యని భావము.

'సత్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః (గీతా) 'మాయా'- ప్రకృతి- 'మాయాం తు ప్రకృతిం విద్యాత్' అను శ్రుతి యీవిషయమునఁ బ్రమాణము.

కిల :- ఈ యవ్యయము మాయాశబ్దవాచ్య మగు ప్రకృతి భగవల్లీలోపకరణ మను విషయమునఁ బ్రసిద్ధిని చాటు చున్నది.

కౌతస్కుతాః :- కుతః కుతః ఇతి వదంతః- ప్రతిదానికి ఎందు వలన ? ఎందువలన ? అని ప్రశ్నించు హేతువాదులు నాస్తికు లని హృదయము.

'సత్యాం శ్రుతౌ చ బధిరా స్త్వయి తన్మహిమ్నా' భగవత్పారమ్యమును బోధించు శ్రుతిశతము లున్నను మాయా మహిమముచేతఁ దదర్థమును గ్రహింపఁ జెవిటివారలువలె అసమర్థు లగు చున్నారు.

భగవదనుగ్రహము లేనిచో మాయను దాఁట నేరికి శక్య మగును ?

'దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతితే ॥

అని గీతావచనముగదా!

తా :- సర్వేశ్వరుఁడ వగు నో వైకుంఠనాథుఁడా! నీచేత దేహేంద్రియాదిరూపముగా మార్పఁ బడిన సత్వరజ స్తమో రూపిణి యగు నేమాయ (ప్రకృతి)గలదో, యది నీ కేవిధ మగు లీలాసాధనము గాదు ? (సర్వవిధలీల కుపయోగించు నని భావము) కొంతమంది హేతువాదులు పట్టుదలతోఁ గుతర్కము లొనర్చుచు శ్రుతిశతములు నీ సర్వేశ్వరత్వ మును జాటుట కనుకూలములుగా నున్నను, మాయావశ మునఁ దదర్థబోధనమున బధిరు లగుచున్నారు.

శా॥ వైకుంఠేశ! భవత్ప్రియుక్తగుణ సం
వర్ధిష్ణు వామాయ తా
నీ కేలీలకుఁ గాదు సాధనము తం
డ్రీ! చాటు చున్నన్ భవ
ల్లోకేశత్వ పరత్వముల్ శ్రుతిమత
ల్లుల్ పెక్కు కౌతస్కుతుల్
చేకో లేరు కుతర్కులై చెవుటులో!
జీర్ణించిరో! మాయకున్.

అవతారిక :- కౌతస్కుతు లగు మాయావాదుల ప్రలాప ముల ప్రకార మి ట్లుండు నని నుడువు చున్నారు.

శ్లో॥ యః స్థావరక్రిమిపతంగమతంగజాది
ష్వన్యేషు జంతుషు సదైవ విజాయమానః!
త్వం నిత్య ! నిర్మల ! నిరంజన ! నిర్వికార !
కల్యాణసద్గుణనిధే ! స ఇతీరిత స్త్రైః ॥ 32

ప్రతి :- త్రైః = బధిరు లగు నా కౌతస్కుతులచేత, హే నిత్య ! = ఓ నిత్యుండా !, హే నిర్మల ! = ఓ పరిశుద్ధుండా !, హే నిరంజన ! = ఓ నిస్సంగుండా !, హే నిర్వికార ! = ఓ పరిణామరహితుండా! (మార్పులేనివాండా!) హే కల్యాణ, సత్, గుణ, నిధే ! = ఓ మంగళప్రదము లగు మేలిగుణములకు గని వంటివాండా ! యః = ఏ చేతనుండు, స్థావర, క్రిమి, పతంగ, మతంగజ, ఆదిషు = జడములు పురుగులు పక్షులు ఏనుంగులు మొదలుగాం గల, జంతుషు = జంతువులందును, అన్యేషు = ఇతరములందును, సదా+ఏవ = ఎల్లప్పుడు, విజాయమానః = వివిధరూపములతోం బుట్టు చున్నాండో?, సః = ఆ చేతనుండే, త్వమ్ = నీవు, ఇతి = అని, ఈరితః = పలుకం బడితివి.

విశేషము :- 'నిత్య' ! నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్ అను శ్రుతి ప్రతిపాదిత నిత్యుండా ! యని భావము.

'నిత్యనిర్మల'- యనునది యేకపదముగా నైనను గ్రహింప వచ్చును. ఇందలి సంబుద్ధు లన్నియు సాభిప్రాయములు.

'అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో ।
విజిఘత్సోఽపిపాసః సత్యకామః సత్యసంకల్పః ॥

అను శ్రుతిని జ్ఞప్తియొనర్చు చున్నవి.

'సః త్వా మి తీరితః' బ్రహ్మమే స్వమాయచేత మోహితమై జీవభావమును జెందు నని మాయావాదుల సిద్ధాంతము.

'పరబ్రహ్మైవాజ్ఞం భ్రమపరిగతం సంసరతి' అని మాయి సూక్తి. ఇది యెంతయు నసమంజసము. హేయప్రత్యనీకత్వ కల్యాణగుణాకరత్వ, రూపోభయలింగవిశిష్టు లగు దేవరవారికి కర్మవశ్య మగుటచే నత్యంత హేయతాభాజన మగు జీవభావ కథన మనుచితము గదా!

తా॥ ఓ నిత్యనిర్మలా! నిరంజనా! నిర్వికారాకృతీ! కల్యాణ గుణసాగరా! వైకుంఠనాథా! నీ పారమ్యమును శ్రుతి శతములు వాకొనుచున్నను ఆలింపఁజాలని బధిరు లగు కుతర్కకర్కశు లైన మాయావాదులు జడములందును, కీటపక్షిగజాదులగు జంతువులందును అన్యములందును కర్మ వశముచే నెల్లప్పుడు వివిధరూపములతోఁ బుట్టుచున్న చేతనుఁడే నీ వని చెప్పుచున్నారు.

శా॥ ఓ నిత్యామల! నిర్వికార! గుణర
త్నోదన్వదాభా! శుభాం
గా! నిస్సంగ! జడాండజేభకృమి ము
ఖ్యశ్రేణి నన్యంబులన్ ।

నానాయోనులఁ గర్మపాకమున జ
న్మం బెత్తు జీవుండు దే
వా ! నీవే యని యందు రిద్ది యుచితం
బా ! మాయికౌతస్కుతుల్ ॥

శ్లో॥ త్వద్దృష్టిజుష్ట మిద మావిరభూ దశేషం
నో చేత్ కటాక్షయసి నైవ భవేత్ ప్రవృత్తిః ।
స్థాతుం చ వాంఛతి జగత్ తవ దృష్టిపాతం
తేన శ్రుతౌ జగదిషే హి జగత్ త్వ మేవ ॥ 33

ప్రతి :- ఇదమ్=ప్రళయమునం దతిసూక్ష్మరూపముతో నుండి దృశ్యమాన మగునిది, త్వత్, దృష్టి, జుష్టమ్=నీ సంకల్ప రూప మగు జ్ఞానముతోఁ గూడినదై, అశేషమ్=ఈ సమస్త చిదచిదాత్మక మగు ప్రపంచముగా, ఆవిరభూత్= ఆవిర్భావమును బొందినది, నో, కటాక్షయసి, చేత్= (ఈ ప్రపంచమును నీవు) కటాక్షింప వేని, ప్రవృత్తిః= ఆవిర్భావరూప మగు మార్పు, న, భవేత్, ఏవ=కలిగి యుండెడిది కానే కాదు, జగత్=ప్రపంచము, స్థాతుమ్= నిలుచుటకు, తవ = నీయొక్క, దృష్టిపాతమ్ = కటాక్ష మును, చ = ప్రవేశమును, వాంఛతి = కోరుచున్నది, తేన = ఆకారణముచేత, శ్రుతౌ = వేదమునందు, త్వమ్+ ఏవ=నీవే, జగత్ =లోకముగా, జగదిషే, హి =స్పష్ట ముగాఁ జెప్పఁబడుచున్నావు.

విశేషములు :- 'ఆవిరభూత్' ఈ పదముచేతఁ బ్రళయమందు ప్రపంచము నారాయణమూర్తియందు సూక్ష్మరూపమున నుండుట వ్యక్త మగుచున్నది. స్థాతుం చ వాంఛతి జగత్ తవ దృష్టిపాతమ్' ఇందులకుఁ బ్రమాణము- 'అంతః ప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా- తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్' ఇత్యాది శ్రుతిజాలము.

'తేన శ్రుతా జగదిపే. హి జగత్ త్వ మేవ।

నీవే జగత్తని చెప్పుశ్రుతు లెవ్వి? యన- సర్వం ఖ ల్విదం బ్రహ్మ- ఐతదాత్మ్య మిదం సర్వమ్- ఇత్యాదులు జగత్తు శరీరము, శ్రీవైకుంఠనాథుఁడుశరీరి యని భావము. జగత్పరమాత్మలకుఁ గల సంబంధము శరీరశరీరిభావసంబంధ మని శ్రీవైష్ణవసిద్ధాంతరహస్యము.

తా :- ఓ వైకుంఠపతీ! ప్రళయకాలమునందు విభజింప నశక్యమై అతి సూక్ష్మదశలో నున్న యిది, తరువాత (సృష్టికాలమున) 'తదైక్షత- బహు స్యాం ప్రజాయేయేతి' అన్న నీ సంకల్పరూపమగు జ్ఞానముతోఁ గూడినదై యీ సమస్తజగజ్జాలముగా నావిర్భవించినది. నీ వట్లు కటాక్షింపవేని ఈజగత్తే యుండెడిది కాదు. మఱియు జడ మగు నీ జగత్తు స్థితికొఱకు నీ కటాక్షమున నీ యనుప్రవేశమును క్షణక్షణము కోరుచున్నది. ఇట్లు నీవు జగత్తునకు బరమముఖ్యుఁడ వగుటచే వేదములు నీవే జగత్తు వని స్పష్టముగాఁ జెప్పుచున్నవి. దానిభావ మేమన శరీరము

నకు శరీరి యెంత ముఖ్యుఁడో నీవీజగత్తున కంత ముఖ్యుఁడ
వని చాటుటయే.

చ॥ ప్రళయమునందు సూక్ష్మత వి
భాగ మొనర్ప నశక్య మౌచు వ
ర్తిలు నిది సృష్టికాలమున
దేవరయిచ్చకు దృష్టి కగ్గమై
వెలసెఁ జరాచరం బఖిల
విశ్వము నీకృపఁ బాఱకున్న చో
నిలుచునె లోకముల్ కనుక
నే జగ మీవె యనున్ శ్రుతుల్ ప్రభూ !

అవతారిక :- పూర్వోక్తవిషయమునే యీ శ్లోకమునందు
వివరించు చున్నారు.

శ్లో॥ ఏవం భగో ఇహ భవత్పరతంత్ర ఏవ
శబ్దోఽపి రూపవ దముష్య చరాచరస్య ।
ఐశ్వర్య మీదృశ మిదం శ్రుతి షూదితం తే
పాపీయసా మయ మహో ! త్వయి మోహహేతుః ॥ 34

ప్రతి :- (హే) భగో=ఓ భగవానుఁడా ! అముష్య=ఈ కనఁ
బడుచున్న, చరాచరస్య=చేతనాచేతనముయొక్క, శబ్దః+
అపి-నామముకూడ, రూపవత్=రూపమువలెనే, ఏవమ్=
ఇట్లు, (ఈ జీవునితోఁబాటు శరీరములోఁ బ్రవేశించి నామ
రూపముల నేర్పాటు చేయుదును - అన్నట్లు అను ప్రవేశ
కార్యముగా) ఇహ=ఇక్కడ, ('జగత్ త్వ మేవ' అను

సామానాధికరణ్యమునందు) భవత్పరతంత్రః ఏవ = తవ స్వామిత్వమూలక మైనదియే, తే=నీయొక్క, ఈదృశమ్= విలక్షణమగు, ఇదమ్=ఈ, ఐశ్వర్యమ్ = ఈశ్వరత్వము, (మహిమ) శ్రుతిషు=వేదములందు, ఉదితమ్ = పలుకఁ బడినది, అయమ్=ఈ యైశ్వర్యగుణము, పాపీయసామ్= పాపాత్ములకు, త్వయి = నీవిషయమునందు, మోహహేతుః=భ్రాంతికిఁ గారణము, (భవతి= అగు చున్నది) అహో=ఆశ్చర్యము.

విశేషము :- 'పాపీయసామ్'- పుణ్యము చేసికొన్న జీవులను జననకాలమునందు శ్రీమన్నారాయణమూర్తి కటాక్షించును. వారు సాత్వికులై మోక్షచింతకు లగుదురు. అట్టి పుణ్యమునకు నోచనిపాపులను జననకాలమున బ్రహ్మయో! రుద్రుఁడో! చూతురు. వారు రాజసులో తామసులో అగుదురు. వారికి మోక్షచింత యుండక పోఁగా విపరీత జ్ఞానముకూడ నుండును. అట్టి పాపాత్ములకని భావము.

'త్వయి మోహహేతుః'- జగత్ త్వమేవ = అనుచోట జగత్ = ప్రపంచము, త్వం, ఏవ = త్వదాత్మకమే (లేదా) త్వదంతర్యామికమే, అని అర్థము చెప్ప వలయునే కాని 'మృదఘటః' అను చోటున మృదభిన్నము ఘట మన్నట్లు జగదభిన్నుఁడు పరమాత్మ యని యర్థము చెప్ప రాదు. జడ మగు జగత్తుతో- పరమచేతనుఁ డగు పరమాత్మకు అభేదము విరు

ద్ధము అనుచితము నగు చున్నది. ఇట్లు అభేదపదముగా నర్థము చెప్పుట భ్రమమూలక మని భావము.

'అహో !'- వేదములం దింత స్ఫుటముగా రాజమార్గ మగపించుచున్నను- అభేదవాదు లట్లు పొరపడుట యాశ్చర్య కర మని తాత్పర్యము.

తా॥ భగవానుఁడ వగు ఓ వైకుంఠనాథుఁడా! ఈపరిదృశ్యమాన చరాచరమునకు నామరూపవివరణములు నీవలననే కలుగు చున్నవి. ఇట్టి విలక్షణ మగునీయైశ్వర్యము వేదములందు నుడువఁ బడియున్నను పాపాత్ములు నీవిషయమున భ్రాంతు లగుట యాశ్చర్యకరమై యున్నది.

ఉ॥ ఈపరిదృశ్యమాన మయి
యెంతయు నొప్పు చరాచరాళికిన్
రూపమునట్ల నామము ని
రూపణముం బొనరింతు నీవె కా
శ్రీపతి ! చాటు వేదమె వి
శిష్టము తావక మీశ్వరత్వమున్,
పాపులు నీమహత్త్వమెడ
భ్రాంతి వహించుట విస్మయం బగున్.

అవతారిక :- ఇతరులయందు సైతమీశ్వరశబ్దము ప్రయుక్త మగుట కుపపత్తిని జెప్పుచున్నారు.

శ్లో॥ యే త్వత్కటాక్షలవలక్ష్య మివ క్షణం తై
రైశ్వర్య మీదృశ మలభ్య మలంభి పుంభిః ।

యత్ కేఽపి సంజగదిరే పరమేశితృత్వం
తేషా మపి శ్రుతిషు తన్మహిమప్రసంగాత్ ॥ 35

ప్రతి :- యే = ఏ పురుషులు, క్షణమ్ = క్షణకాలము, త్వత్, కటాక్ష, లవ, లక్ష్యమ్, ఇవ = నీ క్రేగంటిచూపులోని యొక నలుసునకు గుఱి యైనవారు వలె, (అభవన్ = ఐరో,) తైః = ఆ, పుంభిః = పురుషులచేత, అలభ్యమ్ = ఇతరులకు అందరాని, ఈదృశమ్ = ఇటువంటి, (జగత్సర్జనరూప మగు) ఐశ్వర్యమ్ = మహిమము, అలంభి = పొందఁ బడినది, యత్ = ఎందువలన, (కనుక నే) కేఽపి= కొందఱు, తేషాం, అపి = అట్టిపురుషులకుఁ గూడ, తత్, మహిమ, ప్రసంగాత్ = అట్టి యైశ్వర్యాతిశయ మను వర్తించుటవలన, పరమ + ఈశితృత్వమ్ = సర్వాధికమగు నైశ్వర్యము, శ్రుతిషు = వేదములందు, (ప్రతిపాదితమ్ = చెప్పఁబడినది. ఇతి = అని) సంజగదిరే = చెప్పిరి.

విశేషము :- హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే- యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై - (శ్రుతి)

ప్రాజాపత్యం త్వయా కర్మసర్వం మయి నివేశితమ్-(స్మృతి) ఇత్యాది శ్రుతి స్మృతులయందుఁ జతుర్ముఖబ్రహ్మకు గోచరించు జగత్సర్జనాద్యైశ్వర్యమునకు మూలము వైకుంఠనాథుని కటాక్షలవమునకు క్షణకాలము గుఱియగుటగా వర్ణించుట చేతఁ దరువాతివారి యైశ్వరమున కంతయు శ్రియఃపతి కరుణా

కటాక్షలవమే హేతు వని కైముతికన్యాయప్రాప్త మగు చున్నది. ఇతరులయం దీశ్వరశబ్దప్రయోగము భగవత్కటాక్ష లవలభ్య మని భావము.

లక్ష్యమివ - ఇచ్చట 'ఇవ' శబ్ద మనాదరమును సూచించు చున్నది. లక్ష్యము కా నవసరము లేదు. లక్ష్య మైనట్లు కనఁబడినఁ జాలు నన్నమాట. లక్ష్య మైనట్లు కనఁ బడిన వారే యీశ్వరశబ్దభాజను లైనప్పుడు లక్ష్య మైనవారి మాట వేఱే చెప్ప నవసరము లే దని భావము.

తా॥ ఓ పరమపదనాథుఁడా! నీనలుసంతకటాక్షమున కొక క్షణము గుఱి యైనట్లగుపించువారే అనన్యలభ్య మగు నిట్టి యైశ్వర్యమును బొందుదురు. నీయనుగ్రహముచేత వారి కట్టి మహిమ సంప్రాప్త మగుటవలన శ్రుతులయందు వారికి పరమైశ్వర్యము ప్రతిపాదింపఁ బడినది. దీని కంతయు మూలము నీకటాక్షలేశము గాన ఈ యైశ్వర్య మంతయు నీదే యని తాత్పర్యము.

ఉ॥ ఎవ్వరు నీకటాక్షమున
 కేనలుసంతకో లక్ష్య మైనటుల్
పువ్విలుకానిఁ గన్న నెఱ
 పొల్పుగలాఁడ! క్షణంబు పొల్తురో!
యవ్వరు లీశ్వరుల్ గ శ్రుతు
 లాడెడు నీశ్వరతానుషక్తిచే,

నివ్వాటిలన్ మహత్త్వ మెంట
సే నది తత్కారణాలవాప్తమే.

శ్లో॥ నిత్యేషు వస్తుషు భవన్నిరపేక్ష మేవ
తత్తత్స్వరూప మితి కేచి దిహ భ్రమంతః ।
ఐశ్వర్య మత్ర తవ సావధికం గిరంతే
బ్రూతే త్రయీ తు నిరుపాధిక మీశనం తే ॥ 36

ప్రతి :- ఇహ = ఈ లోకమునందు, భ్రమంతః = భ్రాంతులగు, కేచిత్ = కొందఱు, నిత్యేషు = శాశ్వతము లగు, వస్తుషు = పదార్థముల విషయమున, తత్, తత్, స్వరూపమ్ = ఆయానిత్యపదార్థముల స్వరూపమును, భవత్, నిరపేక్షమ్, ఏవ = నీతో అపేక్ష లేనిదానినిగానే, (స్వతస్సిద్ధమ్ = స్వభావసిద్ధము, ఇతి = అని, మత్వా = తలచి) అత్ర = ఈజగత్కారణత్వమున, తవ = నీయొక్క ఐశ్వర్యమ్ = మహిమము, సావధికమ్, ఇతి = హద్దుతోఁ గూడినది అని, గిరంతే = చెప్పుచున్నారు. త్రయీ, తు = వేదత్రయ మన్ననో, తే = నీయొక్క, ఈశనమ్ = ఐశ్వర్యమును, నిరుపాధికమ్ = స్వాభావికమునుగా, బ్రూతే = చెప్పుచున్నది.

విశేషము :- 'భవత్, నిరపేక్షమ్'-నీకటాక్షముతో జోక్యము లేకుండ (నీ సంకల్పముతో నిమిత్తము లేకయే యని భావము)

'బ్రూతే త్రయీ తు నిరుపాధిక మీశనం తే'
పతిం విశ్వ స్యాత్మేశ్వరం శాశ్వతం శివ మచ్యుతమ్ ।

"ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః, పరాఽస్య శక్తి ర్వివి ధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" ఇత్యాది శ్రుతులు శ్రీమన్నారాయణుని యైశ్వర్యము నిరుపాధిక మని చాటుచున్నవి. కనుక శ్రుతులే ప్రమాణములు గాని భ్రాంతులవచనము లెన్నఁటికిని ప్రమాణములు గా నేరవు. మూఁడవపాదమునఁ సావధికం గిరంతే' అనుచోట 'సావధిసంగిరంతే' అని పాఠాంతరముకలదు.

తా॥ ఈ లోకమున భ్రాంతులు కొందఱు నిత్యవస్తువుల తత్త్వరూపము నీ జోక్యము లేకుండనే సహజసిద్ధ మని తలఁచి జగత్కారణత్వవిషయమున నీ యైశ్వర్యము నిత్యవస్తువర్జిత మగుటచే సావధిక మనుచున్నారు. శ్రుతులు మాత్రము నీ యైశ్వర్యము నిరుపాధిక మని చాటు చున్నవి.

ఉ॥ భ్రాంతులు కొంద ఱీజగతిఁ
బద్మదళేక్షణ ! నిత్యవస్తువుల్
కొంతయు నీకటాక్షమున
కుఁ గుఱి కాకయె నైజభంగితో

సంతతమున్ వెలుంగు నని
సావధికంబుగ నీమహత్త్వరూ
పింతురు సృష్టివేదములు
పేర్కొనెదన్ నిరుపాధికంబుగన్.

అవతారిక :- నిత్యవస్తువులయునికి భగవదధీన మెట్లు? అని శంకించుకొని జవాబు చెప్పుచున్నారు.

శ్లో॥ ఇచ్ఛాత ఏవ తవ విశ్వపదార్థసత్తా
నిత్యం ప్రియా స్తవ తు కేచన తే హి నిత్యాః।
నిత్యం త్వదేకపరతంత్ర నిజస్వరూపా
భావత్కమంగళగుణా హి నిదర్శనం నః॥ 37

ప్రతి :- విశ్వ, పదార్థ, సత్తా = నిత్యములు ననిత్యము లగు సమస్తపదార్థములయొక్క యుత్పత్తి, తవ = నీయొక్క, ఇచ్ఛాతః ఏవ = (సృజింపవలయునన్న) సంకల్పమువలననే, (అట్లైని నిత్యత్వమునకు వ్యాఘాతము రాదా? అన్న చో సమాధాన మిది) కేచన = కొన్నిపదార్థములు, తవ = నీకు, నిత్యమ్ = నిత్యముగా, ప్రియాః = ప్రియములు, (అభవన్ = ఐనవి) తే = అవి, నిత్యాః = నిత్యములు, హి = ప్రసిద్ధము, (ఈ విషయమున నుత్తరార్థముతో దృష్టాంతమును చూపు చున్నారు) నిత్యమ్ = ఎల్లప్పుడు, త్వత్, ఏక, పరతంత్ర, నిజ, స్వరూపాః = నీయొక్కనికే యధీనమగు స్వస్వరూపము గల, భావత్క, మంగళగుణాః =

దేవరవారి (తమ) కల్యాణగుణములు, నః=మాకు, నిదర్శ
నమ్ = దృష్టాంతము.

విశేషము :-'నిత్యం ప్రియాః స్తవ తు కేచన తే హి నిత్యాః'
ఈపాదమునందు నిత్యానిత్యవస్తువివేచన మొనర్పఁబడినది.
భగవదిచ్ఛచేతనే (సంకల్పముచేతనే) అన్నివస్తువు లుత్ప
న్నము లైనను, భగవదిచ్ఛలోఁ గొన్ని పదార్థములు నిత్య
ముగా నుండ వలయు నని యుద్దేశింపఁ బడినవి మాత్రము
నిత్యపదార్థములుగాఁ బ్రసిద్ధి కెక్కినవి. అవి యే వనఁగా-
'భావత్కమంగళగుణాః' అని నిదర్శనమును ప్రసాదించు
చున్నారు. నిత్యము నీయొక్కనికే యధీనమగు నిజస్వరూ
పముగల నీ కల్యాణగుణములు, అనఁగా భగవంతునే కేవ
లము వలచిన భగవత్కల్యాణగుణములు భగవంతునివలెనే
నిత్యము లని భావము. భగవద్గుణములు నిత్యము లను
టకు 'సత్యకామః సత్యసంకల్పః య స్సర్వజ్ఞ స్సర్వవిత్'
ఇత్యాది శ్రుతులు ప్రమాణములు. గుణములు గుణి నాశ్ర
యింపక నిలువలేవు గావున నిది నిదర్శనమున కెంతయు
నొప్పి యున్నది. కనుక నిత్యవస్తువుల సత్తయు భగవదధీ
నమే యను విషయ మీశ్లోకమున విశదీకరింపఁ బడినది.

తా॥ ఓ జగత్పతీ! నిత్యములు గాని యనిత్యములు గాని
సమస్త పదార్థములు నీ సంకల్పమువలననే పుట్టుచున్నవి.
ఆ సంకల్పములో ఇవి నిత్యములు గావలయు నని నీచేత
నుద్దేశింపఁ బడినవిమాత్రము నిత్యపదార్థము లగు చున్నవి.

ఈ విషయమున- ఎల్లప్పుడు నిజస్వరూపమును నీ యొక్క నికే యంకిత మొనర్చిన తమ కల్యాణగుణములే మాకు నిదర్శనములు, కావున నిత్యగుణముల యునికియు నేలిన వారిమీఁదనే ఆధారపడియున్న దని భావము.

మ॥ భవదీయం బగు నిచ్ఛచేతనె కదా!
పద్మాకళత్రా! సము
ద్భవ మౌ సర్వపదార్థజాలములు ని
త్యంబున్ బ్రియంబుల్ గ నీ
కవు నేవస్తువు లాపదార్థములె ని
త్యం బుల్ త్వదేకాశ్రయ
ప్రవణంబుల్ భవదీయమంగళగుణ
ప్రాలంబముల్ లక్ష్యముల్.

అవతారిక :- భగవంతుఁడే జగదుపాదానకారణ మగు నెడల భగవానుఁడు నిర్వికారుఁ డని చెప్పు శ్రుతులకు గతి యేమి? అని శంకించుకొని సమాధానమును జెప్పు చున్నారు.

శ్లో॥ విశ్వస్య విశ్వవిధకారణ మచ్యుత! త్వం
కార్యం త దేత దఖిలం చిదచిత్స్వరూపమ్।
త్వం నిర్వికార ఇతి వేదశిరస్సు ఘోషో
నిస్సీమ మేవ తవ దర్శయ తీశితృతత్వమ్॥ 38

ప్రతి :- (హే) అచ్యుత! చ్యుతి లేని యో వైకుంఠనాథా!, త్వమ్ = నీవు, విశ్వస్య = సమస్తమునకును, విశ్వవిధ, కారణమ్ = వివిధరూప మగు కారణమవు (భవసి =

అగు చున్నావు) అఖిలమ్ = సమస్తమగు, తత్ = ప్రసిద్ధమైన, ఏతత్ = ఈ, చిత్, అచిత్, స్వరూపమ్ = చిదచిద్రూప మగు ప్రపంచము, తవ = నీ యొక్క, కార్యమ్ = కార్యము (ఉత్పాద్యము) వేద శిరస్సు = ఉపనిషత్తులందు, త్వమ్ = నీవు, నిర్వికారః = వికారరహితుఁడవు (మార్పులేనివాఁడవు) ఇతి = అను, ఘోషః = ప్రవాదము, నిస్సీమమ్ = హద్దు లేని, తవ = నీ యొక్క, ఈశితృత్వమ్ + ఏవ = ఐశ్వర్యమునే దర్శయతి = ప్రకాశింపఁ జేయు చున్నది.

విశేషములు :- అచ్యుత ! — ఈసంబుద్ధి సాభిప్రాయకము- నీవు చ్యుతిలేనివాఁడవు గనుక జగత్కారణమవు. తక్కిన వారు చ్యుతి కలవారు గావున జగత్తునకుఁ గారణము కాఁజాలరని యభిప్రాయము. విశ్వవిధకారణమ్-భగవంతుఁ డీ చిదచిదాత్మక ప్రపంచమునకు అన్నివిధము లగు కారణములు నగుచున్నాఁ డని యుపనిషత్తులు ఘోషించు చున్నవి. ఎట్లన- భగవానుఁ డీవిశ్వమునకు సూక్ష్మ చిదచిద్విశేషముతో ఉపాదానకారణమును, 'బహుస్యాం ప్రజాయేయేతి' అన్నట్లు సంకల్పవిశిష్టవేషముతో నిమిత్త కారణమును, కాలాదివిశిష్టవేషముతో సహకారికారణమును అగున్నాఁడు.

'నిర్వికారః' — భగవానుఁ డుపాదానకారణ మైనను నిర్వికారుఁ డనుట- 'నిస్సీమ మేవ తవ దర్శయతీ శితృత్వమ్'-

నిరవధి కైశ్వర్యమును వెల్లడించుచున్నది. 'ఈశితృత్వమ్' అను శబ్దముచే షడ్గుణపూర్ణత్వము వివక్షింపఁ బడినది. నిర్వికారత్వము షడ్గుణములలో నొక్కటి యగు వీర్యగుణ కార్యము. తాను నిర్వికారుఁడుగా నుండి ఇతరుల వికారము నకుఁ గారణమై యుండుట వీర్యమనఁ బడును.

తా॥ చ్యుతిరహితుఁడ వగు ఓ వైకుంఠపతీ! నీ వీ ప్రపంచము నకు వివిధకారణమై యున్నావు. చిదచిదాత్మకమగు నీ విశ్వ మంతయు నీకార్యకోటికిఁ జెందినదే. ఉపనిషత్తులు నిన్ను నిర్వికారుఁడ వని చాటుట నీనిరవధికైశ్వర్యమును వెల్ల డించుటయే యగు చున్నది.

శా॥ ఎన్నో రీతుల నొప్పుకారణముగా
నీవిశ్వకోశానకుఁ
ని న్నోయచ్యుత! పండితోత్తములు వ
ర్ణింతుర్, జగం బెల్లనీ
విన్నాణం బగుసృష్టి, యేవికృతియుఁ
వేదాంతముల్ నీకు లే
వన్నన్ నిక్కముగా నపార మగునీ
మైశ్వర్యముం జాటుటే.

అవతారిక :– భగవంతుఁడు లౌకికము నగు ఘటాదులను నిర్మించు కులాలాదులవంటివాఁడా? అను శంకను వారించు చున్నారు.

శ్లో॥ కింసాధనః క్వ నివసన్ కి ముపాదదానః
కస్మై ఫలాయ సృజ తీశ ఇదం సమస్తమ్ ।
ఇత్యా ద్యనిష్ఠిత కుతర్క మతర్క్యయంత
స్త్వద్వైభవం శ్రుతివిదో విదు రప్రతర్క్యమ్ ॥ 39

ప్రతి :- శ్రుతివిదః = వేదాంతతత్త్వమును దెలిసిన పెద్దలు, ఈశః = సర్వేశ్వరుఁడు, కింసాధనః = ఏసాధనములు గలవాఁడై, క్వ = ఎక్కడ, నివసన్ = నివసించుచు, కిమ్ = ఏవస్తువును, ఉపాదదానః = ఉపాదానకారణముగాఁ దీసికొనుచు, కస్మై = ఏ, ఫలాయ = ప్రయోజనముకొఱకు, సమస్తమ్ = సమస్తమైన, ఇదమ్ = ఈవిశ్వమును, సృజతి = నిర్మించుచున్నాఁడు, ఇతి + ఆది అనిష్ఠిత కుతర్కమ్ = ఈ మొదలుగాగల నిలవని శుష్కతర్కమును, అతర్క్యయంతః = చింతింపనివారగుచు, త్వత్, వైభవమ్ = నీమహిమను, అప్రతర్క్యమ్ = ఊహింపరానిదానినిగా, విదుః = తెలిసికొనిరి.

విశేషము :- కుమ్మరివాఁడు దండచక్రాదులను సాధనములుగాఁగొని మృత్పిండమును (బంకమన్నును) ఉపాదానముగా స్వీకరించి సారెముందు నిలిచి మంచితీర్థమును దెచ్చుకొనుటకుఁ గుండలు తయారు చేయునట్లు సర్వేశ్వరుఁడు వేనిని సాధనములుగాఁ గొని యేవస్తువు నుపాదానముగా స్వీకరించి యెచ్చట నుండి యేప్రయోజనమునకై సమస్తవిశ్వమును సృజించుచున్నాఁడను నిర్ణయము తేలని శుష్కతర్కమునకు దిగక వేదాంతరహస్యవిదులు 'పరాऽస్య

శ_క్తి ర్వివి ధైవ శ్రూయతే। స్వాభావికీ జ్ఞానబలక్రియా చ'
అను శ్రుతివాక్యము ననుసరించి భగవానుఁ డచింత్యైశ్వ
ర్యుఁడు. శ్రీహరిజ్ఞానబలక్రియలు స్వాభావికములు. అను
నిర్ణయమునే యనుసరించి రని భావము.

ఉ॥ ఎయ్యవి సాధనంబులు ? మ
  తెయ్యది వస్తువు ? సృష్టికిన్ ఫల
 బెయ్యది ? యెందు నుండి సృజి
  యించు జగంబుల నీశుఁ డంచుఁ దా
 రయ్యయి శుష్కతర్కముల
  యందు వ్యయింపక, కాల మెన్నెదర్
 త్రయ్యనుయాయులౌ బుధు ల
  తర్క్యము గాఁగ భవన్మహత్త్వమున్.

అవతారిక :- ఏమైనను అవాప్తసమస్తకామునకు ఫలాపేక్ష
యుండదు గనుకను, 'ప్రయోజన మనుద్దిశ్య న మందోఽపి
ప్రవర్తతే' ప్రయోజనము నుద్దేశింపక మందుఁడు కూడఁ
బ్రవర్తింపఁడు గనుకను భగవంతునకు సృష్ట్యాదిప్రవృత్తి
యెట్లు పొసఁగు? నని శంకించుకొని జవాబు చెప్పుచున్నారు.

శ్లో॥ యత్ సంవృతం దశగుణోత్తర సప్తతత్త్వై
 రండం చతుర్దశజగ ద్భవధాతృధామ ।
 అండాని తత్సదృశాని పరశ్శతాని
 క్రీడావిధేస్తవ పరిచ్ఛదతా మగచ్ఛన్. 40

ప్రతి :- దశగుణ, ఉత్తర, సప్తతత్త్వైః = పదిరెట్లు అధికము
 లగు సప్తతత్త్వములచేత, సంవృతమ్ = కూడినట్టియు,

చతుర్దశ, జగత్ = పదునాల్గు భువనములు గలదియు, భవ ధాతృ, ధామ = శివునకు, బ్రహ్మకు, నివాస మైనట్టియు, యత్ - ఏ, అండమ్ అండము, (అస్తి = కలదో) తత్, సు, సదృశాని = దానికి మిక్కిలి సమానము లగు, పరశ్శతాని = వందలకు మించిన (అసంఖ్యాకము లగు) అండాని = అండ ములు. తవ = నీకు, క్రీడావిధేః = లీలాగోష్ఠికి, పరిచ్ఛ దతామ్ - ఉపకరణ మగుటను, అగచ్ఛన్ - పొందినవి.

విశేషములు :- 'దశగుణోత్తర సప్తతత్త్వైః' పూర్వపూర్వ తత్త్వాపేక్షచే ఉత్తరోత్తరతత్త్వములు పదిరెట్లు హెచ్చని భావము. 'సప్తతత్త్వైః' పృథివి, జలము, అగ్ని వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తు అను నేడు తత్త్వముల చేత, అసంఖ్యాకము లగు అండముల నిర్మాణమునకుఁ బ్రయోజనము లీలయే యను సారాంశము.

'లోకవత్తు లీలాకైవల్యమ్'— అని బ్రహ్మసూత్రము కూడ సాక్ష్య మిచ్చుచున్నది.

తా॥ పూర్వపూర్వతత్త్వములకంటెఁ బదిరెట్లు హెచ్చగు నుత్తరోత్తర సప్తతత్త్వములతోఁ గూడి పదునాల్గుభువనముల కాటపట్టై శివధాతృనివాస మైన యండమును బోలెడు అసంఖ్యాకములగు నండములో వైకుంఠనాథా! నీకుఁ గ్రీడాస్థానములై యుపకరణములఁ బోలుచున్నవి.

గీ॥ దశగుణో త్తర స ప్తతత్వములతోడ
సంవృతం బయి పదునాల్గుజగము లొప్పి
హరవిరించులవాస మానండ మట్టి
బహువిధాండముల్ నీయాటపట్లు దేవ !

అవతారిక :- పూర్వో క్తవిషయమునే యనువదించి విశేషించుచు నిత్యవిభూతియోగమును జెప్పు చున్నారు.

శ్లో॥ ఇచ్ఛావిహారవిధయే విహితా న్యమూని
స్యా త్త్వద్విభూతిలవలేశకలాయుతాంశః ।
యా వై న జాతు పరిణామపదాస్పదం సా
కాలాతిగా తవ పరా మహతీ విభూతిః ॥ 41

ప్రతి :- ఇచ్ఛా, విహార, విధయే = స్వేచ్ఛావిహార మొనర్చుటకొఱకు, విహితాని = సృజింపఁ బడిన, అమూని = ఈ, యండములు, త్వత్......అంశః – త్వత్ = నీయొక్క విభూతి = మహిమయొక్క, లవ = స్వల్పమునయొక్క, లేశ = నలుసుయొక్క, కలా=అతిసూక్ష్మభాగముయొక్క అయుత + అంశః = పదివేలవ భాగము, స్యాత్ = అగును, యా = ఏ విభూతి, జాతు = ఎన్నఁటికి (ఒకప్పుడు కూడ) పరిణామ, పద, ఆస్పదమ్ = పరిణమించు నన్న వ్యవహారమునకుఁ దావు. న, భవతి = కాదో!, కాల+ అతిగా = కాలకృత మగు పరిణామమును గూడ నతిక్రమించినదో!, సా = ఆ, పరా = అన్య మగు, విభూతిః = విభూతి (మహిమ) మహతీ = గొప్పది.

విశేషము :- 'త్వద్విభూతిలవలేశకలాయుతాంశః' ఈపదము నందు- 'కస్యాయుతాయుతశతైక కలాంశకాంశే। విశ్వం విచిత్రచిదచిత్ప్రవిభాగవృత్తమ్' అను స్తోత్రరత్నములోని శ్లోకార్థ మనుసంధింపఁ బడినది.

'మహతీ విభూతిః' పాదోఽస్య విశ్వా భూతాని। త్రిపా దస్యామృతం దివి - అనుశ్రుతి యీవిషయమునఁ బ్రమాణము.

తా॥ ఓ వైకుంఠపతీ! నీ స్వేచ్ఛావిహారమునకు సృజింపఁబడిన యీయండము లన్నియు నీ విభూతి (మహిమ) యొక్క లవలేశకలాదశసహస్రతమభాగముచే నేర్పడినవి. ఈవిభూతి కంటెను విలక్షణమై యెన్నఁటికిని బరిణామముఁ జెందక కాలవశము గాక మఱియొకవిభూతి నీకుఁ గలదు. ఆవిభూతి చాల గొప్పది.

సీ॥ నీవు స్వేచ్ఛగ విహరింప నిర్మితైత
దండములు త్వద్విభూతిలేశాయుతాంశ
లవకణము లీశ! మాఱ్పుఁ గాలంబు సేతఁ
దెలియనిభవన్మహావిభూతి యది వేఱు.

అవతారిక :- ఈ మీఁద నైదు శ్లోకములతోఁ బరమపదమును వర్ణించు చున్నారు.

శ్లో॥ య ద్వైష్ణవం హి పరమం పద మామనంతి
ఖం వా య దేవ పరమం తమసః పరస్తాత్।
తేజోమయం పరమసత్త్వమయం ధ్రువం య
దానందకంద మతిసుందర మద్భుతం యత్॥

ప్రతి :- యత్ = దేనిని, వైష్ణవమ్ = విష్ణుసంబంధి యగు పరమమ్ = ఉత్తమ మైన, పదమ్ = స్థానమునుగా (పరమపదమునుగా) ఆమనంతి = (వేదములు) చెప్పుచున్నవో, యత్ + ఏవ = దేనినే, పరమమ్ = శ్రేష్ఠ మగు, ఖం, వా ఆకాశమును గాను, (ఆమనంతి = వేదములు చెప్పుచున్నవో,) యత్ = ఏది, తమసః = తమోగుణమునకు, పరస్తాత్ = అవలనుండెడు నదియో పరమ, సత్త్వ, మయమ్ = శ్రేష్ఠ మగు సత్త్వరూప మైన దియో, యత్ = ఏది, తేజోమయమ్ = తేజస్స్వరూప మైనదియు, ధ్రువమ్ = స్థిర మైనదియు (భవతి = అగు చున్నదో,) అతిసుందరమ్ = మిక్కిలి అందమైనది గనుకనే, అద్భుతమ్ = ఆశ్చర్యకర మగు, యత్ = ఏది, ఆనందకందమ్ = ఆనంద హేతువు, (భవతి = అగు చున్నదో,) తత్ = దానిని, వైకుంఠనామ = వైకుంఠ మను పేరుగల, తవ = నీయొక్క, ధామ = స్థానమునుగా, ఆమనంతి = చెప్పు చున్నారు, హి = సత్యము.

విశేషములు :- ఈమీంది యైదుశ్లోకములకును ఐదవశ్లోకము లోని 'వైకుంఠనామ! తవ ధామ త దామనంతి' అను దానితో నన్వయము. 'యద్వైష్ణవం హి పరమం పద మామనంతి' ఈపాదములోని యర్థము 'త ద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః'- అను శ్రుతి సిద్ధము.

'ఖం వా య దేవ పరమమ్' దీనిలోని విషయము 'తద క్షరే పరమే వ్యోమన్' అను శ్రుతి సిద్ధము. 'ఆనంద కందమ్ యతో వాచో నివర్తంతే। అప్రాప్య మనసా సహ। ఆనందం బ్రహ్మణో విద్వాన్। న బిభేతి కుతశ్చన' ఇత్యాది శ్రుతిబోధిత మగు నానందమునకు మూల మని భావము.

తా॥ వేదములు దేనిని విష్ణుసంబంధి యగు పరమపద మని కొనియాడునో దేనినిఁ దమోఽతీత మగు పరమాకాశ మందురో! ఏది తేజోమయమును పరమసాత్త్వికమునై స్థిర ముగా నుండునో! ఏది యతిసుందరము నద్భుతమునై యానందహేతు వగునో! వైకుంఠమను నామము గల దానిని నీస్థానమునుగాఁ గొనియాడుదురు.

ఉ॥ ఎయ్యది విష్ణుమూర్తి వసి
యించెడు నుజ్జ్వలదివ్యధామమో!
ఎయ్యది నిస్తమస్క మయి
యెన్నిక కెక్కిన మేటివ్యోమమో!
ఎయ్యది తైజసంబు ధ్రువ
మెయ్యది సాత్త్విక మొద్ది సుందరం
బెయ్యది హార్షదం బెది య
దే భవదాలయ మిందిరాపతీ!

శ్లో॥ యద్ బ్రహ్మరుద్రపురుహూతముఖై ర్దురాపం
నిత్యం నివృత్తినిరతైః సనకాదిభి ర్వా।

సాయుజ్య ముజ్జ్వల ముశంతి యదాపరోక్ష్యం
యస్మా త్పరం న పద మంచిత మస్తి కించిత్ ॥ 43

ప్రతి :- బ్రహ్మరుద్ర, పురుహూత. ముఖైః = సృష్టికర్త యగు బ్రహ్మ, సంహారకర్త యగు రుద్రుఁడు, త్రిలోకాధిపతియగు దేవేంద్రుఁడు మొదలుగాఁ గలవారిచేతను, యత్ = ఏది దురాపమ్=పొంద శక్యము గానిదో, నిత్యమ్=ఎల్లప్పుడు, నివృత్తినిరతైః=నివృత్తిమార్గమునందు నిష్ఠ గల (ప్రవత్తి ధర్మనిష్ఠు లగు) సనకాది భిః వా=సనకుఁడు మొదలుగాఁ గలవారిచేత నైనను, (యత్=ఏది, దురాపమ్=పొంద శక్యము గానిదో) యత్ + అపరోక్ష్యమ్ = దేని సాక్షాత్కారమును, ఉజ్జ్వలమ్=ముఖ్య మగు, సాయుజ్యమ్= జ్ఞానానందాద్యావిర్భావమునుగా, ఉశంతి - చెప్పుచున్నారో యస్మాత్ = దేనికంటె, పరమ్= ఇతర మగు, అంచితమ్= పూజిత మగు, పదమ్ = స్థానము, కించిత్ = ఒకటియు, నాస్తి= లేదో, (వైకుంఠనామ=వైకుంఠ మను పేరుగల' తత్ =దానిని, తవ నీయొక్క, ధామ = స్థానమునుగా, ఆమనంతి= చెప్పుచున్నారు.)

విశేషము :- 'బ్రహ్మరుద్రపురుహూతముఖైః' సృష్టికర్తృత్వ, సంహారకర్తృత్వ, త్రిలోకాధిపతిత్వ, రూపము లగు హోదాలతోఁ గూడిన వారికిఁగూడఁ బరమపదము దుర వాప మనుటచే దాని యాధిక్యము చాటఁ బడినది.

తా॥ సృష్టికర్తృత్వ, సంహారకర్తృత్వ, త్రైలోక్యపాలనకర్తృత్వాది శక్తులతోఁ గూడిన బ్రహ్మరుద్రమహేంద్ర ప్రభృతుల చేతను, నిత్యము నివృత్తిమార్గనిష్ఠు లగు సనకసనందనాదులచేతను ఏది పొంద శక్యము గాదో, దేని సాక్షాత్కారము ముఖ్య మగు జ్ఞానానందాద్యావిర్భావమును గటాక్షించునో, దేనిని మించినది మఱియొకటి లేదో యదియే వైకుంఠ మను పేర నీదివ్యధామ మని వేదములు నుడువుచున్నవి.

ఉ॥ ఎయ్యది బ్రహ్మరుద్రదివి
జేశ్వరముఖ్యులకున్ దురాపమో!
ఎయ్యది జ్ఞాననిష్ఠవిధి
హృద్భవతత్సనకాద్యగమ్యమో!
ఎయ్యది కంటఁ బడ్డ నుద
యించునొ! చిత్సుఖదాళి, లేదుపో!
ఎయ్యది మించు వేఱొక ట
దే! భవదాలయ మిందిరాపతీ!

శ్లో॥ రూపేణ సద్గుణగణైః పరయా సమృద్ధ్యా
భావై రుదారమధురై రపి వా మహిమ్నా।
తాదృక్త దీదృ గిద మి త్యుపవర్ణయంతో
వాచో యదీయవిభవస్య తిరస్క్రియాయై॥ 44

ప్రతి:- రూపేణ = రూపముచేతను, సత్, గుణ, గణైః = యోగ్యము లగు గుణసమూహముల చేతను, పరయా = గొప్ప, సమృద్ధ్యా = సమృద్ధిచేతను, ఉదార, మధురైః = గొప్ప

వియు మధురము లైనవియు నగు, భాసైః = పదార్థముల చేతను, మహిమ్నా, అపి, వా = మహిమచేతను గూడ, తత్ = అది, తాదృక్ = అట్టిది, ఇదమ్ = ఇది, ఈదృక్ = ఇట్టిది, ఇతి = అని, ఉపవర్ణయంత్యః = పైపైని వర్ణించుచున్న, వాచః = వాక్కులు, యదీయ, విభవస్య = ఏ పరమపదమహిమయొక్క, తిరస్క్రియా మైై = తిరోధానముకొఱకు, (భవంతి = అగుచున్నవో) వైకుంఠనామ = వైకుంఠ మను పేరుగల, తత్ = దానిని తవ = నీయొక్క, ధామ = స్థానమునుగా, ఆమనంతి= చెప్పుచున్నారు.

విశేషములు :- రూపేణ- 'న తత్ర సూర్యో భాతి' అను శ్రుతిచేఁ జెప్పఁబడిన తేజస్సుచేత, సత్, గుణ, గణైః- నిరతిశయానందకరము లగు గుణసమూహములచేత నని భావము. పరమా సమృద్ధ్యా- 'యత్ర నాన్యత్ పశ్యతి నాన్యచ్ఛృణోతి' అను శ్రుతివాక్యమున వర్ణింపఁబడిన సమృద్ధిచేత నని తాత్పర్యము.

'భాసై రుదారమధురైః'- ఉదాత్తములును భోగ్యములు నగు ఆస్థానరత్నాదులచేత, యదీయ విభవస్య తిరస్క్రియాయై- అవాఙ్మానసగోచరరూపాదిక మగు పరమపదమును మితిగా వర్ణించుట దానిని దక్కువపఱుచుటయే యని భావము.

(సశేషము)

తా॥ రూపముచేతను నిరతిశయానందావహము లగు కల్యాణ గుణగణములచేతను అధికసమృద్ధిచేతను ఉదారములును భోగ్యములు నగు పదార్థములచేతను బ్రహ్మాదులకును జేర శక్యముగాని మహామహిమచేతను అది యట్టిది, యిది యిట్టిది, యని పైపైని వర్ణించువాక్కులు దేని వైభవ మును క్రిందుసేయు చున్నవో వైకుంఠ మనఁబడు దానిని నీ నివాసమునుగా బ్రహ్మవేత్తలు నుడువుచున్నారు.

ఉ॥ త్రయ్యుదితస్వరూపమునఁ దత్తదుదాత్తలసద్గుణాళి న
క్షయ్యసమృద్ధిచేత నురుకమపదార్థతతిన్ మహత్తుచే
నయ్యది యట్టి దిట్టి దిదియంచు వచించునుడుల్ యదున్నతిన్
వ్రయ్యలు సేయు, నట్టిది భవన్నిలయంబు వికుంఠనాయకా!

శ్లో॥ య ద్వృద్ధ్యపక్షయవినాశముఖై ర్వికారై
రేతై రసంస్తుత మన స్తమితా స్తిశబ్దమ్।
యద్ద్వారవా చ్ఛ్రుతిషు ఫల్గు ఫలం క్రియాణా
మాదిష్ట మన్య దసుఖో త్తర మధ్రువం చ॥ 45

ప్రతి :- యత్ = ఏది, వృద్ధి, అపక్షయ, వినాశ, ముఖైః = పెరుఁగుట, తఱుగుట, నశించుట, మొదలుగా గల, ఏతైః = ఈ, వికారైః = మార్పులతో, అసంస్తుతమ్ = పరిచయము లేనిదో, అనస్తమిత, అస్తి, శబ్దమ్ = అస్తమించని 'అస్తి' (కలదు) అనుశబ్దము కలదియో, యద్ద్వారవాత్ = దేని

గౌరవమువలన, శ్రుతిషు = వేదములందు, అన్యత్ = ఇతర మైన, క్రియాణామ్ = జ్యోతిష్టోమాది కర్మములయొక్క, ఫలమ్ = ఫలము, ఫల్గు = నిస్సార మైనదిగను అసుఖ, ఉత్తరమ్ = దుఃఖోదర్కముగను, అధ్రువంచ = అస్థిరముగను, ఆదిష్టమ్ = చెప్పఁబడినదో (వైకుంఠనామ = వైకుంఠమను పేరుగల) తత్ = దానిని, తవ = నీయొక్క, ధామ = స్థానమునుగా, ఆమనంతి = (బ్రహ్మవిదులు) చెప్పుచున్నారు.

**విశేషములు:-** వృద్ధ్యపక్షయవినాశముఖైః - ముఖశబ్దముచేత జననము, పరిణామము, గ్రాహ్యములు,

అనస్తమితాస్తిశబ్దమ్- 'సదా పశ్యంతి సూరయః, అని యుండుటచే వైకుంఠము త్రికాలములందు అస్తి (కలదు) అను శబ్దమునకే పాత్ర మని భావము. 'అస్తి' (ఉన్నది) 2 జాయతే (పుట్టుచున్నది) 3 పరిణమతే (మారుచున్నది) 4 వర్ధతే (వృద్ధిచెందుచున్నది) 5 అపక్షీయతే (తగ్గిపోవుచున్నది) 6 ప్రణశ్యతి (నశించిపోవుచున్నది) అనెడు షడ్భావవికారములలో 'అస్తి' అనునది యొకటియే పరమపదమునందుఁ గలదు కాని తక్కిన యైదు వికారములును లేవని తాత్పర్యము. దీనిచేఁ బరమపదమహిమ మనన్యాదృశ మని తెలియుచున్నది.

1 త దక్షరే పరమే వ్యోమన్ 2 త ద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః 3 న చ పున రావర్తతే 4 తే హ నాకం మహిమాన స్సచంతే యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః—ఇత్యాదులందు నిత్యముక్తనిరంతరానుభావ్య మగు

పరమపదము యొక్క గౌరవము విశదీకరింపఁ బడినది. కర్మ ప్రాప్య మగు స్వర్గాదికము న్యూనతయు ఈ క్రింది ప్రమాణము లందు నిరూపింపఁ బడినవి.

1. గతాగతం కామకామా లభంతే
2. క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి

ఇచ్చటఁ గర్మచిత మగులోకము క్షీణించునట్లే పరత్ర కూడఁ బుణ్యాచితము లగు లోకములును క్షీణించును. అనుతర్కము సైత మిందుల కనుకూలము.

తా॥ ఏది షడ్విధభావవికారములలో 'అస్తి' అనునది తప్పఁ దక్కినమార్పులు లేనిదో, వేదములు దేనివైభవమును బురస్కరించుకొని యన్య మగు జ్యోతిష్టోమాదుల ఫలము నిస్సారము దుఃఖోదర్కము అస్థిర మని చాటెనో, యట్టి పరమపదమే వైకుంఠపతీ! నీనెలవని బ్రహ్మవిదులు నుడువు చున్నారు.

ఉ॥ ఎయ్యది వృద్ధి క్షీణత ల
యించుట మున్నగుమార్పు లందదో,
ఎయ్యది 'అస్తి' శబ్దమున
కే నెలవో, త్రయి దేనిగౌరవం
బొయ్యనఁ జాటు యజ్ఞఫల
మూన మసారము దుఃఖహేతువున్
క్షయ్య మటంచుఁ బల్కు యదె
గా! భవదాలయ మిందిరాపతీ!

శ్లో॥ నిష్కల్మషై ర్నిహతజన్మజరావికారై
ర్భూయిష్ఠభక్తివిభవై రభవై రవాప్యమ్।
అన్యై రధన్యపురుషై ర్మనసాఽప్యనాప్యం
వైకుంఠనామ తవ ధామ త దామనంతి ॥ 46

ప్రతి :- నిష్కల్మషైః = కల్మషము లేనట్టియు, అభవైః = సంసారేచ్ఛ లేనట్టియు, భూయిష్ఠ భక్తి, విభవైః = అత్యధిక మగు భక్తివైభవము గలట్టియు, నిహత, జన్మ, జరా, వికారైః = కొట్టివేయఁబడిన పుట్టువు ముదిమి మార్పులుగల ధన్యులచేత, అవాప్యమ్ = పొందఁదగినదియు, అన్యైః = ఇతరులగు అధన్యపురుషైః = నిర్భాగ్యులచేత, మనసా, అపి = మనస్సుచేతఁ గూడ, అనాప్యమ్ = పొంద శక్యము గానిదియు, (అగు) వైకుంఠనామ = వైకుంఠ మను పేరు గల, తత్ = దానిని, తవ = నీయొక్క, ధామ = స్థానమునుగా, ఆమనంతి = చెప్పు చున్నారు.

విశేషములు .- నిష్కల్మషైః - కర్మయోగానుష్ఠానము చేతఁ బోయినపాపము గల, అభవైః - జ్ఞానయోగముచేత సంసారేచ్ఛారహితులు, భూయిష్ఠ, భక్తి, విభవైః - భక్తి యోగనిష్ఠులు, అగు ధన్యులచేత నని భావము.

వైకుంఠనామ తవ ధామ త దామనంతి- ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ - యోఽస్యాధ్యక్షః పరమే వ్యోమన్ - ఇత్యాది శ్రుతు లిందులకుఁ బ్రమాణము.

తా॥ కర్మయోగానుష్ఠానముచే నిర్ధూతపాపులును, జ్ఞానయోగముచే సంసారేచ్ఛారహితులును, భక్తియోగముచే జన్మజరావికారములను రూపుమాపుకొన్నవారు నగు ధన్యులచేత నేది ప్రాప్యమో, కర్మజ్ఞానభక్తివిహీను లగు నభాగ్యుల కేది మనస్సుచే నైన నగమ్యమో వైకుంఠ మను పేరు గల యది వైకుంఠపతీ! నీ నివాస మని వేదములు పల్కెను.

ఉ॥ ఎయ్యది వీతకల్మషులు
హింసితజన్మజరావికారులున్
జయ్యభవామయుల్ పరమ
సత్త్వులు భక్తులచే నవాప్యమో,
ఎయ్యది భాగ్యహీనులకు
నెడ్డఁ దలంపఁగనే నశక్యమో
అయ్యదియే భవన్నిలయ
మైన వికుంఠ మటందు రచ్యుతా!

అవతారిక :- వైకుంఠవైభవవర్ణనము నుపసంహరించుచు భగవానుని యతిశయాంతరమును జెప్పుచున్నారు.

శ్లో॥ నిత్యా తవాన్యనిరపేక్షమహామహిమ్నాఽ
ప్యైతాదృశీ నిరవధి ర్నియతా విభూతిః।
జ్ఞానాదయో గుణగణాః సమతీతసీమా
లక్ష్మీః ప్రియా పరిజనాః పతగేంద్రముఖ్యాః॥

ప్రతి :- అన్య, నిరపేక్ష, మహత్, మహిమ్నః = ఇతరాపేక్ష లేని గొప్పమహిమ గల, తవ+అపి=నీకును, నిత్యా = శాశ్వత మైనట్టియు, నిరవధిః-హద్దు లేనట్టియు, ఏతాదృశీ ఇటువంటి, విభూతిః వైభవము, నియతా = ఎడఁబాయనిదిగా (భవతి అగుచున్నది) సమతీత, సీమాః = అతిక్రమింపఁ బడినహద్దు గల, (అంతము లేని) జ్ఞానాదయః=జ్ఞానము మొదలుగాఁ గల, గుణగణాః = గుణ సమూహము లు, (నియతాః=ఎడఁబాయనివి, భవంతి= అగుచున్నవి) ప్రియా -ప్రియురాలగు, లక్ష్మీః లక్ష్మీదేవి (నియతా ఎడఁబాయనిది, భవతి అగుచున్నది) పతగ+ఇంద్ర, ముఖ్యాః = పక్షులకు రాజైన గరుత్మంతుఁడు మొదలు గాఁగల, పరిజనాః సేవకులు, (నియతాః = ఎడఁబాయనివారు, భవంతి=అగు చున్నారు)

విశేషములు :- జ్ఞానాదయః—ఈపదముచేత స్వరూపనిరూపకము లగు జ్ఞానానందాదులును, నిరూపితస్వరూపవిశేషణ భూతము లగు జ్ఞానశక్త్యాదులును గ్రహింపఁ బడుచున్నవి.

లక్ష్మీః ప్రియా (నియతా)-ప్రియురాలైన లక్ష్మి భగవంతుని ఎన్నఁడు నెడఁబాయదు. ఇందులకుఁ బ్రమాణము.

'రాఘవత్వేఽభవ త్సీతా । రుక్మిణీ కృష్ణజన్మని
అన్యేషు చావతారేషు । విష్ణో రేషాఽనపాయినీ'॥

శ్రీమన్నారాయణమూర్తి రామకృష్ణులుగా నవతరించి నప్పుడు శ్రీమహాలక్ష్మి సీతగా రుక్మిణిగా నవతరించెను. ఇత

రావతారములందును శ్రీమహాలక్ష్మి యెన్నఁడును శ్రీమహా విష్ణువు నెడఁబాసి యుండదు. అని పై శ్లోకమునకు భావము.

పతగేంద్రముఖ్యాః- పరివారములో గరుత్మంతునకు ముఖ్యాత్వ మెట్లన? వేదమయుఁ డగుటచేతను, భగవంతుని స్వరూపరూపగుణవిభూత్యాదులను నిత్యము సన్నిధిలో నుండి యనుభవించుటకు అద్దమువంటివాఁ డగుటచేతను అని తెలియ వలెను. శ్రీపరాశరభట్టారకులు గూడ 'శ్రుతిమయ' మను శ్లోకమున నీ విషయమును అనుసంధించియున్నారు.

తా॥ ఓ వైకుంఠనాథా! కారణాంతర నిరపేక్షక మగు మహా మహిమము గల దేవరవారికిని నిత్యయు నిరవధికయు నగు నిట్టి విభూతియు, అనంతానంతము లగు జ్ఞానానందాది గుణగణములును, ప్రియురాలగు లక్ష్మియు, గరుత్మన్ముఖ్యు లగు పరిజనులును నిత్యము నియతభోగోపకరణములు.

చ॥ పరనిరపేక్షకం బగు న

పారమహామహిమంబు గల్గు దే

వరకును శాశ్వతంబు నిర

వద్య మనంత మిదం విభూతియున్,

నిరవధులౌ చిదాదిగణ

నీయగుణంబులు, లక్ష్మియున్ హృదీ

శ్వరి, పతగేంద్రముఖ్యపరి

చారులు పాయని నిత్యభోగ్యముల్.

అవతారిక:- ఇప్పుడు భగవద్గుణములకు సర్వవిధముల నతిశయమును, వానిజోక్యము లేకయే భగవానుని కాధిక్యము కలిమియు, వర్ణించుచున్నారు,

శ్లో॥ ఏకస్య యేషు హి గుణస్య లవాయుతాంశః
స్యాత్ కస్యచిత్ స ఖలు వాఙ్మనసాతిగశ్రీః ।
తే తాదృశోఽత్యవధయః సమతీతసంఖ్యా
స్త్వత్సద్గుణా స్త్వమసి తన్నిరపేక్షలక్ష్మీః ॥ 48

ప్రతి :- యేషు = ఏనీగుణములందు, ఏకస్య = ఒక, గుణస్య = గుణముయొక్క, లవ, అయుత, అంశః = లేశముయొక్క పదివేలవ భాగము, కస్యచిత్ = ఎవని కేని యొకనికి, స్యాత్ (యది) = ఉన్నయెడల, హి = ఆకారణముచేత, సః = వాఁడు, వాఙ్మనస, అతిగ, శ్రీః = వాక్కును మనస్సును అతిక్రమించినశోభ గలవాఁడు, స్యాత్ ఖలు = అగును గదా !, తాదృశః = అట్టివియు, అత్యవధయః = హద్దును మీఱినట్టివియు, తే = ప్రసిద్ధములగు, త్వత్, సత్, గుణాః = నీకల్యాణగుణములు, సమతీత, సంఖ్యాః = సంఖ్య నతిక్రమించినవి (అసంఖ్యాకములు, భవంతి = అగుచున్నవి) త్వమ్ = నీవు, తన్నిరపేక్షలక్ష్మీః = ఆగుణములతో అపేక్షలేనిసంపద గలవాఁడవు, అసి = అగుచున్నావు.

విశేషము :- 'త్వమసి తన్నిరపేక్షలక్ష్మీః'— ఓవైకుంఠపతీ ! నీయతిశయము నీకల్యాణగుణాయత్తముకాదు. మఱేమనగా స్వాభావికము— స్వాభావికీ జ్ఞానబలక్రియా చ— అని శ్రుతి.

తా॥ ఓ వైకుంఠపతీ! దేవరవారి గుణములలో ఒక గుణము యొక్క లేశములో బదినేలవ వంతుభాగ మెవరికేని కలిగియున్నచో అతఁడు వాక్కులకు మనస్సునకు నందని యతిశయము గలవాఁ డగును. అట్టి నిరవధికమహిమము లగు దేవరవారి కల్యాణగుణము లసంఖ్యాకములై యున్నవి. కాని దేవరవారి యతిశయ మాకల్యాణగుణములమీఁద నాధారపడి యుండ లేదు. అది స్వాభావికము.

ఉ॥ దేవరవారి సద్గుణతి
తిక్ గలయొక్కగుణంబులో లవం
బై విలసిల్లుదాని యయు
తాంశము గల్గినవాఁ డతీత వా
గ్భావమహాప్రభావుఁ డగు,
వారిజలోచన! యట్టిమేల్గొనాల్
తావకముల్ ప్రసంఖ్యములు
తన్నిరపేక్షము నీమహత్త్వముక్.

అవతారిక :- పూర్వోక్తవిషయమునే వివరించుచున్నారు.

శ్లో॥ సర్వస్య చైవ గుణతో హి విలక్షణత్వ
మైశ్వర్యత శ్చ కిల కశ్చి దుదంచితః స్యాత్ ।
తత్ ప్రత్యుత త్వయి విభో! విభవో గుణాశ్చ
సంబంధత స్తవ భజంతి హి మంగళత్వమ్ ॥ 49

ప్రతి :- సర్వస్య, చ = ప్రతిమానవునకును, విలక్షణత్వమ్ = ఆధిక్యము, గుణతః ఏవ = గుణములవలననే, హి = అగు

చున్నది, (గుణవంతుడనకే యాధిక్యమని భావము) కశ్చిత్ = ఒకానొకఁడు, ఐశ్వర్యతః-చ, కిల=ఐశ్వర్యమువలనఁ గూడ. ఉదంచితః - మిక్కిలి పూజింపఁ బడువాఁడు, స్యాత్ = అగును, హేవిభో = ఓ వైకుంఠపతీ! తత్ = ఆయుభయము మును, త్వయి =నీయందు, ప్రత్యుత=పైపెచ్చు, (విపరీతమ్=విరుద్ధము) హి=ఎందుకనఁగా, విభవః ఐశ్వర్యమును గుణాశ్చ=గుణములును, తవ = నీయొక్క, సంబంధతః = సంబంధము వలన, మంగళత్వమ్ = కల్యాణత్వమును, భజంతి=పొందుచున్నవి.

విశేషములు :- విలక్షణత్వమ్- సజాతీయేభ్యః ఉత్కృష్టత్వమ్- తమ జాతివారికంటె ఆధిక్యము,

ప్రత్యుత- విపరీత మితి శేషః- నీయందు ఐశ్వర్యము గుణములు ఆధిక్యమును గల్గింపక పోఁగాఁ బైపెచ్చు నీ సంబంధము వలన అవియే మంగళత్వమును బొందుచున్నవి. ఇట్లనుటచేత నీ యతిశయము ఐశ్వర్యముచేతఁ గాని గుణములచేతఁ గాని క్రొత్తగా వచ్చినదిగాదు. స్వాభావికమైనదే యని భావము. జీవునియందు జ్ఞానానందాది స్వరూపగుణము జ్ఞానశక్త్యాది ధర్మభూతగుణము ఉన్నను అది 'స ఏకో మానుష ఆనందః' ఇత్యాదులందుఁ బరిచ్ఛిన్నముగానే కనఁబడుచున్నది. ఆ గుణములే నీ సంబంధముచేత 'యతో వాచో నివర్తంతే। అప్రాప్యమనసా సహ' ఇత్యాదులందు అపరిచ్ఛిన్నములై

యొప్పుచున్నవి. కనుకనే గుణముల యతిశయము స్వరూప
ప్రయుక్తము కా దని సంప్రదాయజ్ఞులసూక్తి

తా॥ ఓ వైకుంఠనాథా! లోకములో నందఱకు గుణములవల
నసే యాధిక్యము గల్గుచున్నది. ఒకానొకఁ డైశ్వర్యము
వలనఁ గూడఁ బూజింపఁ బడుచున్నాఁడు. దేవా! యీ
రెండును నీ యెడల విరుద్ధములుగాఁ గన్పడు చున్నవి.
ఐశ్వర్యము, గుణములు నీ సంబంధమువలననే కల్యాణత్వ
మును బొందుచున్నవి.

చ॥ గుణములఁ బట్టి యెల్లరకు
గొప్పతనంబు ఘటిల్లు, నొక్కచోఁ
గణుతి వహించు వైభవము
కల్మి నొకానొకరుండు దైవతా
గ్రణి! యివి రెండు నీయెడలఁ
గల్ల విరుద్ధము గూడ, భూతియున్
గుణములు నీదు సంగతి వి
కుంఠపతీ! కనె మంగళత్వమున్.

అవతారిక :- అట్లైని నిర్గుణశ్రుతికి గతియేమి? యన్నచోఁ
జెప్పు చున్నారు.

శ్లో॥ మారే గుణా స్తవ తు సత్త్వరజ స్తమాంసి
తేన త్రయీ ప్రథయతి త్వయి నిర్గుణత్వమ్।
నిత్యం హరే! నిఖిలసద్గుణసాగరం హి
త్వా మామనంతి పరమేశ్వర మీశ్వరాణామ్॥ 50

ప్రతి :- హేహరే!=ఓవైకుంఠపతీ!, సత్త్వ రజః తమాంసి= సత్త్వము, రజస్సు, తమస్సు, (అనెడు) గుణాః, తు=గుణము లన్ననో, తవ=నీకు, దూరే=దూరమునందు, (భవంతి= ఉన్నవి) నీ వాగుణములచేతఁ దాఁకఁ బడని కేవలశుద్ధ సత్త్వగుణాకరుఁడవని భావము. తేన = ఆకారణముచేత, త్రయీ వేదత్రయము, త్వయి=నీయందు, నిర్గుణత్వమ్= గుణరాహిత్యమును, ప్రథయతి వెల్లడించుచున్నది, ఈశ్వ రాణామ్=ఐశ్వర్యవంతులలో, పరమేశ్వరమ్ = పరమై శ్వర్యవంతుఁడ వగు, త్వామ్=నిన్ను, నిత్యమ్ ఎల్లప్పుడు, నిఖిల, సత్, గుణ, సాగరమ్ = సమస్తకల్యాణగుణము లకు, సముద్రునివంటివానినిగా, ఆమనంతి చెప్పుచున్నారు, హి=సత్యము.

విశేషములు :- 'దూరే గుణా స్తవ తు సత్త్వరజ స్తమాంసి,- ఇందులకుఁ బ్రమాణము 'సత్త్వాదయో న సంతీశే యత్ర స్తే ప్రకృతేర్గుణాః' సత్త్వరజ స్తమోగుణములు ప్రకృతివి గనుకఁ బరమాత్మయందు లేవు. అందువలనఁ బరమాత్మ నిర్గుణుఁడు. 'పరమేశ్వర మీశ్వరాణామ్'-త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్ అని ప్రమాణము. దీనిచేత- ఈశ్వ రునికి సగుణత్వము పరబ్రహ్మకు నిర్గుణత్వము కలదను మాటయునిరస్తమైనది.

'నిఖిలసద్గుణసాగరమ్' నిఖిలసద్గుణములకు సాగర మని చెప్పుటచేత గుణముల కపరిచ్ఛిన్నత్వము సూచింపఁ బడినది.

ఆగుణములను 'యస్సర్వజ్ఞః సర్వవిత్, పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ, సత్యకామః సత్యసంకల్పః' ఇత్యాదిశ్రుతులు వర్ణించుచున్నవి.

తా॥ ఓవైకుంఠనాథా! సత్త్వరజస్తమోగుణములు నీకుఁ జాల దవ్వున నున్నవి. కావున వేదములు నిన్ను 'నిర్గుణుఁ' డని నుడువుచున్నవి. ఈశ్వరులకు సైతము పరమేశ్వరుఁడ వగు నిన్ను నిగమములు నిఖిలసద్గుణసముద్రుఁడ వని వర్ణించుచున్నవి.

చ॥ సలుచును నీకు దూరమున
నే యలసత్త్వరజస్తమోగుణం
బులు మఱి దానిచే నిగమ
ముల్ నిను నిర్గుణుఁ డంచుఁ జాటుఁబో!
అలఘువిభూతి! యీశ్వరుల
కందఱకుం బరమేశ్వరుండవై
వెలిఁగెడునిన్నుఁ బేరుకొను
వేదము సద్గుణవారిరాశి గా॥ ౬॥

అవతారిక :- జ్ఞానస్వరూపుఁ డగుభగవంతునకు జ్ఞానగుణకత్వ మెట్లు? రెండిటియందును జ్ఞానత్వము సమాన మగుటచే గుణగుణిభావ ముపపన్నము గాదు గదా! అనుశంకను దృష్టాంతముఖమునఁ బరిహరించు చున్నారు.

శ్లో॥ జ్ఞానాత్మన స్తవ త దేవ గుణం గృణంతి
తేజోమయస్య హి మణే ర్గుణ ఏవ తేజః।

తేనైవ విశ్వ మపరోక్ష ముదీక్షసే త్వం
రక్షా త్వదీక్షణత ఏవ యతోఽఖిలస్య ॥ 51

ప్రతి :- జ్ఞాన+ఆత్మనః=జ్ఞానస్వరూపుఁడ వగు, తవ=నీకు, తత్+ఏవ=ఆ జ్ఞానమే, గుణమ్=గుణమునుగా (ధర్మమునుగా) గృణంతి చెప్పుచున్నారు. (బ్రహ్మవిదులని భావము) హి=ఎందువలన ననఁగా, తేజోమయస్య = తేజోరూపమగు, మణేః=మణికి, తేజః=ప్రభ, గుణ ఏవ=గుణమే గదా! యతః=ఎందువలన, అఖిలస్య = సమస్తప్రాణివర్గమునకు, రక్షా=రక్షణము, త్వత్+ఈక్షణతఃఏవ=నీ చూపువలననే భవతి అగుచున్నదో, తతః=అందువలన, తేన, ఏవ ఆ జ్ఞానముచేతనే. త్వమ్ నీవు, విశ్వమ్=సమస్తమును, అపరోక్షమ్ ప్రత్యక్షముగా, ఉదీక్షసే=చూచుచున్నావు.

విశేషములు:- తేజోమయస్య హి మణేః- మణేః = రత్నమునకు, ద్యుమణికి (సూర్యునకు)

తేజస్సుద్రవ్య మైనను ఆశ్రయాశ్రయిభావ నియమముచేత ప్రభాప్రభావద్రూపమున గుణిగుణభావ ముపపన్న మగునట్లే జ్ఞానము ద్రవ్య మైనను స్వరూపభూతజ్ఞానమునకు ధర్మభూతజ్ఞానమునకును ఆశ్రయాశ్రయిభావము నియతముగా నుండుటచేత గుణిగుణభావ ముపపన్న మగుచున్నది.

తా॥ ఓవైకుంఠపతీ! జ్ఞానస్వరూపుఁడ వగు నీకా జ్ఞానమునే ధర్మమునుగా బ్రహ్మవిదులు నుడువుచున్నారు. ఎట్లనఁగా

తేజోరూప మగుమణికిఁ దేజమే గుణముగదా! సకలజీవ రాశికి నీకరుణావలోకనము రక్ష గావున నీవాజ్ఞానము చేతనే సమస్తమును బ్రత్యక్షముగాఁ జూచుచున్నావు.

జ్ఞానరూపుఁడ వైననీ కల
 జ్ఞానమే గుణ మంచు వి
జ్ఞాను లంద్రు గుణంబు తేజమె
 గా జ్వలన్మణి కెందు నేన్
సూనృతప్రియ! నీదుచల్లని
 చూపె చేతన రక్షయౌఁ
గాన జ్ఞానముచేతనే సము
 ఖానఁ గాంతువు విశ్వమున్.

అవతారిక:- పూర్వము భగవత్స్వరూప నిరూపణ ప్రకరణము నందుఁ బ్రతిపాదిత మగు ఆనందము యొక్క యపరిచ్ఛిన్న త్వము నే గుణప్రకరణమునందు వివరించుచున్నారు.

శ్లో॥ త్రయ్యుద్యతా తవ యువత్వముఖై ర్గుణౌఘై
 రానంద మేధిత మియానితి సన్నియంతుమ్ ।
 తే యే శతం త్వితి పరంపరయా ప్రవృత్తా
 నైవైవ వాఙ్మనసగోచర ఇత్యుదాహ ॥ 52

ప్రతి :_ తవ = నీయొక్క, ఏధితమ్ - వృద్ధిచెందిన, ఆనందమ్ = ఆనందమును, యువత్వ, ముఖైః యౌవనము మొదలుగాఁ గల, గుణ, ఓఘైః = గుణసమూహములచేత, ఇయాన్, ఇతి = ఇంతపరిమాణము గలది యని, సన్నియంతుమ్ = చక్కఁగా విభజించుటకు, ఉద్యుక్తా = ఉద్యమించినదై,

త్రయీ = ఆనందవల్లి, పరంపరయా = ఒకటితరువాత నొకటిగా, తే యే శతమ్, ఇతి, ప్రవృత్తా = తేయేశతమ్, అనుచొప్పునఁ బ్రవర్తిల్లినదై, ఏషః తు = ఈబ్రహ్మానంద మన్ననో, వాఙ్మనస, గోచరః = నాక్కులకు, మనస్సునకు గోచరించునది, న + ఏవ = కానే కాదు, ఇతి = అని, ఉదాహ = గట్టిగాఁ జెప్పినది, అందఱకుఁ దెలియునట్లు పెద్దగాఁ జెప్పిన దని భావము.

విశేషములు :- యువత్వాద్యుపాధిః — ఆనందతారతమ్యమును 'యువా స్యాత్సాధుయువాధ్యాయకః' ఈ ప్రకారముగా నుపక్రమించి,

తే యే శత మితిప్రవృత్తా—'తేయేశతం మానుషానందాః' పూర్వోక్తములందు ఆనందమునకుఁ బర్యవసానము గోచరించకపోవుటవలన 'తే యే శతమ్' అనుచుఁ బ్రవృత్తమై

నైవైష వాఙ్మనసగోచర ఇత్యుదాహ— ఈబ్రహ్మానందము మనోవాచామగోచర మని గట్టిగాఁ జాటిన దని భావము. ఈవిషయమును ఆనందవల్లి 'యువా స్యాత్ సాధు యువాధ్యాయకః ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్ । స ఏకో మానుష ఆనందః । తే యే శతం మానుషాః ఆనందాః । అని ఆరంభించి, తే యే శతం ప్రజాపతే రానందాః । స ఏకో బ్రహ్మణ ఆనందః— అని నుడివి పిదప— యతో వాచో నివర్తంతే । అప్రాప్య మనసా సహ । ఆనందం బ్రహ్మణో విద్వాన్ అని యుపసంహరించెను.

(సశేషము)

తా। ఓ వైకుంఠనాథా! ప్రవృద్ధ మగు నీయానందము నానంద వల్లి (త్రయి) యౌవనముఖ్యములగు గుణసమూహముల చేత నింతపరిమాణము గలది (ఇట్టిది) అని కొలుచుటకుఁ బూనినదై పూర్వపూర్వానందములందుఁ బర్యవసానము కనఁబడక పోవుటవలన 'తే యే శతమ్' అని నడుము వివరణమునకు దిగినదై చివర కీయానందము మనస్సునకును వాక్కులకు నంద దని సర్వజనులకుఁ దెలియునట్లు పెద్దగా నుడివినది.

శా॥ నీయానందవిశేష మిట్టి దని వ
ర్ణింపంగఁ దారుణ్యవి
ద్యాయోగాదిగుణాళిచేఁ దొలుతఁ బ్ర
స్తావించి, 'తే యే శత'
ప్రాయోక్తిన్ వివరించి కొంత నడుమన్
వాక్రుచ్చి వాఙ్మానసా
మేయం బంచుఁ ద్రయీమతల్లి యన స్వా
మీ! శక్తులే తక్కొరుల్.

అవతారిక :- ఆనందగుణమునకుఁ జెప్పఁబడిన అవాఙ్మనసగోచరత్వము స్థాలీపులాకన్యాయమున భగవంతుని సకలకల్యాణ గుణములకును అపరిచ్ఛిన్నత్వప్రదర్శనమున కని యీ శ్లోకమున నుడువు చున్నారు.

శ్లో॥ ఏవం తయా చతురయా తవ యౌవనాద్యాః
సర్వే గుణా స్సహ సమస్తవిభూతిభి శ్చ।
ప్రవ్యాహృతాః స్యు రవధీ నవధీరయంతో
వాచా మగోచర మహామహిమాన ఏవ॥ 53

ప్రతి:- చతురయా = నేర్పుగల, తయా = ఆఆనందవల్లిచేత, ఏవమ్ = ఇట్లు, తవ = నీయొక్క, యౌవనాద్యాః = యౌవనము మొదలుగాఁ గల, సర్వే = సమస్తము లగు, గుణాః = గుణములు, సమస్తవిభూతిభి శ్చ, సహ = సకలవైభవములతోఁ గూడ, అవధీన్ = హద్దులను, అవధీరయంతః = తిరస్కరించుచు, వాచామ్ = వాక్కులకు, (మనస్సునకును) అగోచర, మహత్, మహిమానః, ఏవ = అందనిమహామహిమ గలవిగనే, ప్రవ్యాహృతాః = అధికముగాఁ బలుకఁ బడినవి, స్యుః = అగును.

విశేషములు:- చతురయా- ఆనందేతర గుణములకును, విభూతులకును, అపరిచ్ఛిన్నత్వమును ప్రతిపాదించుటయందు సమర్థయని భావము.

యౌవనాద్యాః, సర్వే, గుణాః - యౌవనసౌందర్యాది శారీరగుణములు, జ్ఞానాదిస్వరూపగుణములును, అని తాత్పర్యము. వాచామ్ - వాక్ శబ్దము మనస్సునకును ఉపలక్షణము. వాఙ్మనసముల కని యర్థము.

తా॥ ఆనందేతరగుణములకును విభూతులకును అపరిచ్ఛిన్నత్వమును జాట సమర్థ యగు నానందవల్లిచేత నీచెప్పఁ బడిన

విధముగా నీ యౌవనసౌందర్యాది శారీరగుణములును జ్ఞానాదిస్వరూపగుణములును సమస్తవిభూతులతోఁ బాటు నిరవధికములు నవాఙ్మానసగోచరములు నగు మహామహిమ గలవిగనే చెప్పఁ బడినట్లయ్యెను.

శా॥ ఆనందం బటె నీదుయౌవనసురూ
పాదుల్ గుణానీకముల్
నానాదివ్యవిభూతులున్ నిరుపమా
నంత్యాపరిచ్ఛిన్నతా
స్థానుల్ వాఙ్మనసాతిశాయిమహిమ
స్తవ్యంబులే యంచు న
య్యానందాభిధవల్లి నేర్పుమెయి వ్యా
హారించు లక్ష్మీపతీ!

అవతారిక:- ఇప్పుడు సంకల్పరూప మగుభగవంతునిజ్ఞానవిశేష మున కపరిచ్ఛిన్నమహిమత్వమును నుడువు చున్నారు.

శ్లో॥ సంవర్తవర్తి నిఖిలం నిరభిజ్ఞ మజ్ఞం
చిత్రే చ కర్మణి యథార్హ మహో నియచ్ఛన్।
సద్యః క్రిమిద్రుహిణభేద మభేద మేత
ద్విశ్వకర్త సకృదీక్షణ దీక్షణేన॥ 54

ప్రతి:- సంవర్తవర్తి = ప్రళయమువం దుండునట్టియు, అభేదమ్ - విభజించుటకు వీలు గానిదియు (సూక్ష్మదశను బొందినదియు), నిరభిజ్ఞమ్=అనుభవరూప మగుజ్ఞానము లేనిదియు, అజ్ఞమ్=ప్రత్యభిజ్ఞారూప మగుజ్ఞానము లేనిదియు,

నిఖిలమ్ = సమస్త మగు, ఏతత్ = ఈప్రాణిలోకమును, కర్మణి=దాని కర్మము, చిత్రేచ = (సత్యపి) విచిత్ర మైన దైనను, సకృత్, ఈక్షణ, దీక్షణేన = ఒకమారుచూచుట యను దీక్షచేత (సంకల్పముచేత) యథార్హమ్ = తత్తత్కర్మానురూపముగా, నియచ్ఛన్ = నియమించుచు, సద్యః = తత్క్షణమే, కృమిద్రుహిణభేదమ్ = పురుగు మొదలు కొని బ్రహ్మవఱకు భేదము గలిగినదానినిగా, అఖేదమ్ = పక్షపాతశూన్యముగా, ఆవిశ్చకర్థ = ఆవిర్భవింపఁ జేసితివి, అహో! = ఔరా! కనుక నీసంకల్పము మహాప్రభావము గలది యని భావము.)

విశేషములు:- కారణవాక్యములం దన్నింటియందును సృష్టి ప్రళయపూర్వకముగనే వర్ణింపఁబడినది. ఎట్లన?

1 స దేవ సౌమ్యేద మగ్ర ఆసీత్, 2 బ్రహ్మ వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్, 3 ఆత్మా వా ఇదమేక ఎవాగ్రఆసీత్, ఇత్యాదివేదవాక్యములు, 4 ఆసీదిదంతమో భూతమ్ — మనుస్మృతి.

ఇట్లే యీశ్లోకమునందును సృష్టి ప్రళయపూర్వకముగా నిరూపింపఁ బడినది. సకృదీక్షణదీక్షణేన—త దైక్షత బహుస్యామితి సంకల్పేన—

తా॥ ఓవైకుంఠపతీ! విభజింప వీలు గాని సూక్ష్మదశను జెంది యనుభవజ్ఞానశూన్యమై ప్రత్యభిజ్ఞారహితమై ప్రళయములో

నున్న సమస్త మగు నీ ప్రాణిలోకమును దానిదాని కర్మ విశేషము చిత్రచిత్ర మైన దైనను ఒకమారు సమీక్షణ సంకల్పముచేతఁ దత్తత్కర్మానుగుణముగా నియమించుచు వైషమ్యము గాని నైర్ఘృణ్యము గాని లేకుండ వెంటనే కృమిమొదలు బ్రహ్మవఱకుఁ గలభేదముతో వానిని సృజించుచున్నావు ఔరా! నీసంకల్పము మహామహిమము గలది.

గీ॥ ప్రళయమున సూక్ష్మదశ నవిభాజ్య మగుచు
నను భవ ప్రత్యభిజ్ఞల నెనయకుండు
జంతుజాలముఁ గర్మవశ్యము సృజింతు
సమముగా నాకృమివిధాత్మకము రమేశ!

## భంగ్యంతరము

మ॥ ప్రళయంబం దతిసూక్ష్మతాదశకుఁ బ్రా
ప్తై, యేర్పటింపంగఁ దా
వలముం గా కనుభూతిశూన్యము విలు
ప్తప్రత్యభిజ్ఞంబు ప్రా
ణులవర్గంబు విచిత్రకర్మవశ మే
నోదూర! యాకీట మా
జలజాతాసన మొక్కభంగి సకృదీ
క్షాదీక్ష సృష్టింతువా॥

అవతారిక:- ఇప్పుడు సంకల్పముతోఁ బాటు శక్తిప్రభావము ననుసంధించు చున్నారు.

శ్లో॥ అస్తం యదుద్య దుపచా య్యపచాయి చైవ
మీశం దరిద్ర మథ జంగమ మప్యనింగమ్।
విశ్వం విచిత్ర మవిలక్షణవీక్షణేన
విక్షోభయ స్యనవధి ర్బత శక్తిరైశీ॥ 55

ప్రతి:- (హే ఈశ = ప్రభు వైనటివైకుంఠనాథా!) అస్తమ్ = వినాశనమును, యత్ = పొందునదియు, ఉద్యత్ = ఉద్భవించునదియు, ఉపచాయి = వృద్ధిచెందు నదియు, అపచాయి = క్షీణించునదియు, ఈశమ్ = సంపద గలదియు, దరిద్రమ్ = సంపద లేనిదియు, జంగమమ్ = చైతన్యము గలదియు, అనింగమ్ = స్థావరమైనదియు, విచిత్రమ్ = పైనిఁజెప్పినప్రకారము విచిత్ర మైనదియు, అగువిశ్వమ్ = సమస్తమును, అవిలక్షణవీక్షణేన = ఏకరూప మగుసంకల్పముచేత, (ఒక్కమారు సంకల్పించినంతమాత్రముచేత) విక్షోభయిష్యసి = విశేషముగా క్షోభయుక్తమునుగా జేయుచున్నావు (తవ = నీయొక్క), ఐశీ = ఈశ్వరత్వప్రయుక్త మగు, శక్తిః = అఘటితఘటనాసామర్థ్యము, అనవధిః = అంతు లేనిది, బత = ఆశ్చర్యము!

విశేషము :- విక్షోభయసి = విశేషేణ వికారయుక్తం కరోషి- విశేషవికారములతో మార్పులతోఁ గూడినదానినిగాఁ జేయు చున్నావు.

తా॥ ఓ వైకుంఠపతీ! అస్తమించునదియు నుదయించునదియు, పెఱుగునదియుఁ దఱుగునదియు సంపన్న మైనదియు దరిద్ర

మైనదియు చేతన మైనదియు స్థావర మైనదియుఁగా విచిత్ర మైన యీ విశ్వము నేకరూప మగు సంకల్పముచేత విశేష వికారయుక్త మైనదానినిగా నొనర్చుచున్నావు. ఔరా! ఈశ్వరత్వప్రయుక్తమగు నీయఘటితఘటనాసామర్థ్య మపరిచ్ఛిన్నముగదా!

మ॥కమలాక్షా! భవ దేకరూప మగు లవసం
కల్పంబుచేఁ జిత్ర మ
స్తమితంబుల్ ప్రభవిష్ణువుల్ సుబహుపు
ష్టంబుల్ బరిక్షీణ మ
త్యమితశ్రీకము నిర్ధనం బసుయుతం
బన్యంబుగా నెల్లవి
శ్వము మార్పించెద వప్రమేయము భవ
త్సామర్థ్య మైశం బహో!

అవతారిక :- ఈ శ్లోకమునందు భగవంతుని స్వాతంత్ర్యము నిరంకుశమని నుడువుచున్నారు.

శ్లో॥రూపప్రకార పరిణామ కృతవ్యవస్థం,
విశ్వం విపర్యసితు మన్య దసచ్చకర్తుమ్।
జ్ఞామ్యన్ స్వభావనియమం కిముదీక్ష సేత్వం
స్వాతంత్ర్య మైశ్వర మపర్యనుయోజ్యమాహుః॥ 37

ప్రతి :- రూప ... వ్యవస్థమ్ - రూప = రూపముయొక్కయు, ప్రకార = స్వభావముయొక్కయు, పరిణామ = మార్పుచేత, కృత = చేయఁబడిన, వ్యవస్థమ్ = నియమముగల, విశ్వమ్ =

చేతనాచేతనాత్మకమగు సమస్తజగత్తును, విపర్యసితుమ్ = వ్యత్యస్తమును (ప్రలీనమును) చేయుటకును, అసత్ = అసత్కల్ప మగుదానిని (అసత్తును) అన్యత్, చ = సత్తును గాను, (కర్తుమ్ చేయుటకు) శూష్మ్యాక్ = శక్తిగలవాఁడ వగుచు, త్వమ్ = నీవు, స్వభావనియమమ్ = ఆయాపదార్థముల కర్మఫలస్వభావనియమమును, ఉదీక్షసే, కిమ్ = కటాక్షించెద వేటికి? (అతః = కనుక) ఐశ్వరమ్ = ఈశ్వరత్వప్రయుక్తమగు, స్వాతంత్ర్యమ్ = (శ్రీవారి) స్వాతంత్ర్యమును, అపర్యనుయోజ్యమ్ = ప్రశ్నమున కనర్హమైనదానినిగా, (వేదాంతవిదః = వేదాంతవేత్తలు) ఆహుః = చెప్పుచున్నారు.

విశేషములు :- రూపప్రకారపరిణామకృతవ్యవస్థమ్ - జడపదార్థములకుఁ బరిణామమనఁగా స్వరూపము మఱియొకవిధముగా నుండుట, చేతనపదార్థములకుఁ బరిణామమనఁగా స్వభావము వేఱొకవిధముగా మాఱుట యని గ్రహింపవలెను. స్వభావనియమం కిముదీక్షసేత్వమ్ — పూర్వకర్మానుగుణముగా దేవాదిశరీరముల నొసఁగుచున్నను సృష్టిప్రళయము లందలి యాగపద్యము శ్రీవారి నిరంకుశ స్వాతంత్ర్యమును చాటుచున్నది.

తా॥ ఓవైకుంఠనాయకా! నీవు జడపదార్థములకు రూపపరిణామములను భేదములతోఁ గూడిన యీ సమస్తజగత్తును ప్రళయము గావించుటకును సృజించుటకును శక్తుఁడవై

యుండియు నా యా పదార్థముల స్వభావనియమము నేటికిఁ బరిశీలించెదవు? కనుక దేవరవారి స్వాతంత్ర్యము ప్రశ్నార్హమైనది కాదని వేదాంతులు వచించెదరు.

గీ॥ రూపశీలాన్యథాత్వ నిరూపితమ్ము
జగముఁ బ్రళయింప సృజియింప క్షముఁడవయ్యుఁ
జూతు వేటికిఁ దత్కర్మసూత్రనియతిఁ
దగదు ప్రశ్నకు నీదు స్వాతంత్ర్యమీశ!

అవతారిక :- ఇప్పుడు పరుల నెదిరింప సమర్థమగు తేజస్సును వర్ణించుచున్నారు.

శ్లో॥ సంవర్త సంభృతకరస్య సహస్రరశ్మే
రుస్రం తమిస్రయ దజస్రవిహారిహారి।
నిత్యానుకూల మనుకూల నృణాం పరేషా
ముద్వేజనం చ తవ తేజ ఉదాహరంతి॥ 58

ప్రతి :- సంవర్త, సంభృత, కరస్య = ప్రళయకాలమునందు సంపూర్ణకిరణములుగల, సహస్రరశ్మేః=(వేయికిరణములు గల) సూర్యునియొక్క, ఉస్రమ్=కిరణమును, తమిస్రయత్ = అంధకారమునుగాఁ జేయుచున్నట్టియు (తిరస్కరించునట్టియు) అజస్ర, విహారి = ఎల్లప్పుడు విహరించునట్టియు, హారి=మనోహరమైనట్టియు, పరేషామ్=శత్రువులకు, ఉద్వేజనమ్=వెగటుకొలుపునట్టియు, (భయంకరమైనట్టియు) తవ=నీయొక్క, తేజః=తేజస్సు, (ప్రతా

పము) అనుకూలన్నృణామ్=భక్తులకు, నిత్యానుకూలమ్=నిరంతరము భోగ్యమునుగా, ఉదాహరంతి = చెప్పుచున్నారు.

విశేషము :- అజస్రవిహారి - నిత్యము సంకుచితముగాని,

నిత్యానుకూల మనుకూల నృణాం పరేషా ముద్వేజనమ్— ఒకే తేజస్సు శత్రువులకు భయంకరమును భక్తులకుఁ బరమ భోగ్యము నగుట యాశ్చర్యకరమని భావము.

తా॥ ఓ వైకుంఠపతీ! ప్రళయకాలమునందు నిండుగా వేయి కిరణములతో నొప్పు సూర్యుని కిరణమును సైతము క్రిందు సేయుచు, నిత్యవిహారియై మనోహారియై శత్రువులకు భయము గొల్పు నీ తేజస్సును భక్తులకుఁ బరమభోగ్యమునుగా విజ్ఞులు నుడువుచున్నారు.

చ॥ ప్రళయమునందు లోకముల
భస్మమొనర్చెడు పూన్కి వెల్గు వే
వెలుగు వెలుంగు ధ్వాంతమని
పించుచు నిత్యవిహారి హారియై
వెలసిన నీదు తేజమును
విశ్వపతీ! వచియించు వేదముల్
ఖలులకు గుండెగాలమును
గా సుజనాళికి మేటివిందుగా॥

అవతారిక:- భగవంతుని యౌదార్యమును వివరించుచున్నారు:

శ్లో॥ నైవ హ్యవాప్య మనవాప్య మిహాస్తియస్య
సత్తా పితస్య తవ వీక్షణతః ప్రజానామ్।
సంపత్తుకిం పునరితో వదాన్య మన్యం
మన్యేత్వ మేవ ఖలు మందిర మిందిరాయాః॥ 58

ప్రతి :- యస్య=ఏ, తవ=నీకు, ఇహ=ఇక్కడ, (ఈ విభూతి ద్వయమునందు) అనవాప్తమ్=పొందఁబడనదియు, అవాప్యమ్ = (ఈమీఁద) పొందఁదగినదియు, నైవాస్తి, హి= లేదుగదా! తస్య=అట్టి, తవ=నీయొక్క, వీక్షణాతః= చూపువలననే, ప్రజానామ్ = బ్రహ్మాది స్తంబపర్యంతముగల చేతనులకు, సత్తా, అపి=ఉత్పత్తియు, (భవతి=అగుచున్నది) త్వం, ఏవ, ఖలు-నీవేగదా, ఇందిరాయాః = లక్ష్మీదేవికి, మందిరమ్-నివాసమవు, సంపత్, తు=సంపదయన్ననో, కింపునః = ఉన్నదని వేఱుగాఁ జెప్పవలయునా? ఇతః= ఈకారణమువలన, అన్యమ్ = మఱియొక, వదాన్యమ్= దాతను, న, మన్యే = తలఁచను.

విశేషములు :- సత్తాపి - ఇందలి సత్తాశబ్దము స్థితికి, ప్రవృత్తికి నుపలక్షణము.

సంపత్ - తు - లక్ష్మీకటాక్షాధీనభోగ్య వస్తుసమృద్ధి.

అవాప్త సమస్తకాముఁడవును, బ్రహ్మాది స్తంబపర్యంతజీవులకు సృష్ట్యాదికారణభూతుఁడవును శ్రియఃపతివియు నగు దేవర వారి యౌదార్యము సర్వాతిశాయి యని సారాంశము.

తా॥ ఓ వైకుంఠనాయకా! నీకీ విభూతిద్వయమునందు లభింపఁబడనిదియు, లభింపవలసినదియు నగు వస్తువొకటియు లేదు. కావున అవాప్తసమస్తకాముఁడవు. నీ కటాక్షమువలననే బ్రహ్మాది స్తంబ పర్యంతముగల చేతనులకు సృష్టిస్థిత్యాదులుప్పతిల్లుచున్నవి. లక్ష్మీదేవికి నీవు నివాసభూతుఁడవు. సంపదలో లక్ష్మీకటాక్షాధీనములు. ఇట్టి సర్వోత్కృష్ట దాతవు నీవుండఁగా మే మన్యులఁ జింతింపఁబోవుదమా. పోము. పోము.

శా॥ దేవా! నీకు నవాప్యవస్తువు విభూ
తి ద్వంద్వ మం దేదియున్
భావింపన్ గనరాదు, బ్రహ్మ మొదలా
స్తంబంబు నీదృష్టి ను
జ్జీవించున్, సిరికీవుఠావు, విభవ
శ్రీలిందిరా సత్కటా
క్షావాసంబులు, కోర నేమిటికి మా
కన్యున్ వదాన్యున్ హరీ!

శ్లో॥ హా వైర నాదిభవ సంభవ వాసనోత్థైః
దుఃఖేషు యఃఖలు మిమంక్షతి హంతజంతుః!
తం కేవలం ను కృపయైవ సముద్ధరిష్యం
స్తద్దుష్కృతస్య నను నిష్కృతిమాత్థశాస్త్రైః॥ 59

ప్రతి :- అనాది...ఉత్థైః - అనాది=ఆదిలేని, భవ=సంసారమునందు, సంభవ=పుట్టుకచేతఁ గలిగిన, వాసనా = సంస్కా-

రమువలన, ఉత్థైః=బయలు వెడలిన, పాపైః=పాపములచేత, జంతుః = జీవుఁడు, దుఃఖేషు=ఆయా పాపఫలములైన నరకాది వ్యసనములందు, మిమంక్షతి = మునుఁగఁదలఁచు చున్నాఁడు,హంత, ఖలు =అయ్యో! యిదియాశ్చర్యముగదా, తమ్ = ఆజీవుని, కేవలం, కృపయా, ఏవ = నిర్హేతుకకృప చేతనే, సముద్ధరిష్యన్ = చక్కఁగా నుద్ధరింపఁ బోవుచు, శాస్త్రైః మన్వాదిశాస్త్రములచేత, (లేదా) గీతాదులచేత, తత్, దుష్కృతస్య = వాని పాపమునకు, నిష్కృతిమ్ = ప్రాయశ్చిత్తమును, అత్థ నను =చెప్పుచున్నావు గదా!

విశేషములు:_ హంత, ఖలు — ఇది యెంతయు నాశ్చర్యము కదా! ఏల యన? స్వయముఁగనే స్వానర్థకర మగుకార్య మొనర్చుట వింతయే కదా!

కేవలం ను కృప యైవ—నిర్హేతుక కృపచేత. కృప రెండు రకములు. 1. స్వార్థనిరపేక్షక మగుకృప, 2. పరదుఃఖాసహిష్ణు రూప మగు కృప. కనుక వైకుంఠనాథా! నీకృపావైభవము అపరిచ్ఛిన్నము అని భావము.

తా॥ అనాదిసంసారసంభూత సంస్కారవిశేషముచే నేర్పడిన పాపములచేతఁ జేతనుఁడు తత్తత్పాపఫలభూతనరకాదివ్యస నములందు మునిఁగి పోవు చున్నాఁడు. ఔరా! తన యన ర్థములకుఁ దానే దారిచేసికొనుచున్నాఁడుగదా! అట్టి

చేతనుని నీవు స్వార్థనిరపేక్షకమును పరదుఃఖాసహిష్ణు రూపము నగు కృపచేత నుద్ధరింపఁ బోవుచు మన్వాదిశాస్త్ర ములచేత వాని దుష్కృతమునకుఁ బ్రాయశ్చిత్తమును విధించు చున్నావు. దేవా! నీకృపావిభవ మనన్యాదృశము.

ఉ॥ అది యెఱుంగ నట్టిభవ
మందునఁ జిక్కి తదీయవాసనా
పాదిత పాపసంభవ దు
పద్రవకోటుల మ్రగ్గుచేతనుల్,
వేదన మాన్పి ప్రోవ నతి
వేలకృపన్ బ్రకటించినావు మ
న్వాదిస్మృతుల్ తదుగ్రవృజి
నాళికి నిష్కృతిఁ దెల్ప శ్రీహరీ!

అవతారిక :- ఇదివఱకుఁ జెప్పినదానినే వివరించు చున్నారు.

శ్లో॥ శాస్త్రై రనాదినిధనైః స్మృతిభి స్త్వదీయ
దివ్యావతారచరితైః శుభయా చ దృష్ట్యా।
నిశ్శ్రేయసం యదుపకల్పయసి ప్రజానాం
సా త్వత్కృపాజలధితల్లజవల్గితశ్రీః॥ 60

ప్రతి :- అనాదినిధనైః = ఆద్యంతములు లేని, శాస్త్రైః = శాస్త్ర ములచేతను (శ్రుతులచేతను), స్మృతిభిః = మన్వాది స్మృతుల చేతను, త్వదీయ, దివ్య, అవతార చరితైః = నీసంబంధము లగు దివ్యము లైన అవతారచరిత్రములచేతను, శుభయా =

మంగళకర మగు, దృష్ట్యా = చూపుచేతను, ప్రజానామ్ = జనులకు, నిశ్శ్రేయసమ్ = మోక్షమును, ఉపకల్పయసి (ఇతి) యత్ = కల్పించుచున్నా వనుట యేది గలదో! సా = అది, త్వత్, కృపా, జలధి, తల్లజ, వల్గిత, శ్రీః = నీకరుణ యనెడు సముద్రశ్రేష్ఠముయొక్క, (పాలసముద్రముయొక్క) తరంగవైభవము.

విశేషములు :- శాస్త్రైః-శాసనాత్ శాస్త్రమ్-అను వ్యుత్పత్తి చేత వేదము లని భావము. అనాదినిధనైః - అను విశేషణ మీభావమున కుపోద్బలకము.

స్మృతిభిః—ఈపదము ఇతిహాసపురాణములకు నుపలక్షకము. అవికూడ స్మృతులవలెనే వేదోపబృంహకములే గదా! కావున స్మృతిభిః = వేదోపబృంహకము లగు స్మృతిపురాణేతిహాసముల చేత నని యర్థము. శుభయా చ దృష్ట్యా = శ్రేయో హేతుభూత మగు కటాక్షముచేత నని భావము.

శ్లో॥ జాయమానం హి పురుషం
యం పశ్యే న్మధుసూదనః ।
సాత్త్వికస్స తు విజ్ఞేయః
స వై మోక్షార్థచింతకః ॥

తా॥ మధుసూదనుఁడు జాయమానుఁడగు నే చేతనుని గటాక్షించునో వాఁడు సాత్త్వికుఁడై మోక్షార్థచింతకుఁ డగును.

నీ దయాతరంగోల్లాసము భక్తులకు మోక్షఫలము నొసంగు నని పిండితార్థము.

తా, ఓవైకుంఠనాథా! ఆద్యంతములు లేని వేదములచేతను, వేదోపబృంహకము లగు స్మృతిపురాణేతిహాసములచేతను, తమ దివ్యావతార చరిత్రములచేతను, శుభకటాక్షము చేతను, చేతనులకు మోక్షమును జేకూర్చు చుండుట శ్రీవారి కరుణాకలశాబ్ధిలహరీవిలాసమే సుమా!

మ॥ తుది యేదో మొద లేదొ తేలనివచః
స్తోమంబుచేతం జగ
ద్విదితంబౌ స్మృతికోటిచే శుభదమౌ
దృష్టిన్ ద్వదీయావతా
రదశోదంతముచేత భక్తులకు ని
ర్వాణంబుఁ గల్పించు ట
య్యది యుష్మత్కరుణాసుధాబ్ధిలహరీ
హారిప్రభోల్లాసమే.

అవతారిక :- ఒక్కచో భాగ్యహీనులయెడ కృపాసంకోచము ననుసంధించు చున్నారు.

శ్లో॥ హైహ హంత జంతుషు నిరంతరసంతతాన్మా
పాప్మా హి నామ వద కోఽయ మచింత్యశక్తిః।
య స్త్వత్కృపాజలధి మ ప్యతివేలఖేల
ముల్లంఘయ త్యకృతభాసురభాగధేయాన్॥

ప్రతి :- జంతుషు = చేతనులయందు, నిరంతర, సంతత, ఆత్మా = ఎల్లప్పుడును చక్కఁగా వ్యాపించిన స్వరూపము గలదియు. అచింత్య, శక్తిః =(మా బోంట్లచేత) చింతింప శక్యముగాని శక్తి గలదియు (అగు) అయమ్ = ఈ, పాప్మా = పాపము, కః+నామ = ఎటువంటి స్వరూపము గలది ? (లేదా) ఎటువంటి శక్తిగలది? వద = చెప్పుము. హై, హంత = అత్యాశ్చర్యకర మగుటచేత దేవర వారికిఁ గూడ అనిర్వచనీయ మని భావము. హి = ఎందుకనఁగా, యః = ఏ పాపము, అకృత, భాసుర, భాగధేయాన్ = అనుష్ఠింపఁ బడని యుజ్జ్వల మగు భాగ్యము గల పురుషులను, అతివేలఖేలమ్ = హద్దు మీఱిన లీలలు గల, త్వత్, కృపా, జలధిమ్, అపి = నీ దయా సముద్రమును గూడ, ఉల్లంఘయతి = దాఁటినవారినిగాఁ జేయుచున్నది.

విశేషము :- అకృత, భాసుర, భాగధేయాన్ = ఆచరింపఁ బడని శరణవరణాదికము లేని కల మానవులను,

తా :- ఓ వైకుంఠనాథా! ప్రాణులయందు నిరంతరము ప్రసరించు స్వరూపము గల యీ పాప మనునది యెట్టి స్వరూపము గలది? మఱియు నెట్టి శక్తిగలది? సెలవిమ్ము.

అత్యాశ్చర్యకరమైన దగుటచేత నిది దేవరవారికి సైతము నిరూపింపరానిదేమో! ఎందుకనఁగా నిన్ను శరణాగతి చేయని మానవులను నిరవధికలీల మగు నీ దయాసముద్రమును దాఁటించుచున్నది. అనఁగా ఆ పాపము మూలమున దురదృష్టవంతు లగు వారు నిన్నాశ్రయింపక శరణాగతి చేయక నీ దయాసముద్రమునకు ద వ్వగుచున్నారని భావము.

ఉ॥ ఎప్పుడు జంతుసంతతుల
నీసడవెట్టుచు వెంట నంటు నీ
దెప్పరమైన పాతకముఁ
దెల్పుమ యెట్టిదో! యెట్టిశక్తియో
నొప్పునో! నీకు నందదో! య
హో! యిది దివ్యభవత్కృపాంబుధిన్
జొప్పడనీక త్వచ్ఛరణ
శూన్యులఁ ద్రిప్పులఁ బెట్టు శ్రీపతీ!

అవతారిక :— ఈ శ్లోకమున దయను వికసింపఁ జేయు నపరాధసహిష్ణుతారూపమును వాత్సల్యహేతువు నగు ఓర్పు నను సంధించు చున్నారు.

శ్లో॥ య ద్బ్రహ్మకల్పనియుతానుభవే౽ప్యనాశ్యం
తత్కిల్బిషం సృజతి జంతు రిహ క్షణార్ధే।
ఏవం సదా సకలజన్మను సాపరాధం
క్షామ్య స్యహో! తదభిసంధివిరామమాత్రాత్ ॥ 62

ప్రతి :- యత్ = ఏపాపము, బ్రహ్మకల్పనియుత, అనుభవే, అపి = బ్రహ్మకల్పముల పదివేలింటిచే అనుభవింపఁ బడినను, అనాశ్యమ్ = నశింపఁ జేయ శక్యముగాదో, తత్ = ఆ, కిల్బిషమ్ = పాపమును, ఇహ = ఈలోకమున, జంతుః = ప్రాణి, క్షణార్ధే = అఱక్షణములో, సృజతి = చేయుచున్నాఁడు, ఏవమ్ = ఇట్లే, సదా = ఎల్లప్పుడు, సకల జన్మసు = అన్నిజన్మములందు, సాపరాధమ్ = అపరాధములతోఁ గూడిన యాప్రాణిని, తత్, అభిసంధి, విరామ, మాత్రాత్ = ఇఁకమీఁదఁ బాపము నొనర్ప ననుసంకల్పముతోఁ దత్ప్రవృత్తిని విరమించినంతమాత్రము వలన, క్షామ్యసి = క్షమించుచున్నావు, అహో! = ఆశ్చర్యము.

విశేషము : తత్ కిల్బిషమ్ - బ్రహ్మహత్యాదిపాపమును.
సకలజన్మసు = దేవతిర్యగాది సమస్తజన్మములందు.

తా :- ఓ వైకుంఠపతీ! దేహి యొక యఱక్షణములోఁ బది వేల బ్రహ్మకల్పము లనుభవించినను నశింపని బ్రహ్మహత్యాదికమగు పాపము నొనర్చు చున్నాఁడు. ఇట్లే సకలజన్మములందును బాప మొనర్చుచున్న యీతని ఇఁకమీఁద బాపము లొనర్ప నని సంకల్పించి నంతమాత్రముననే క్షమించు చున్నావు. దేవా! నీ క్షమాగుణ మాశ్చర్యకరమైనది.

మ॥పదివేల్ బ్రహ్మలకాలమే ననుభవిం
పన్ దీఱ దేపాప, మ
య్యది యీదేహ త్రుటిం బొనర్పు నిటు లౌ
రా! జన్మజన్మంబులన్
గొద లేకుండఁగఁ దప్పులన్ సలుపు నీ
క్షుద్రుండు నేఁ జేయఁ ద
ప్పిద మీపై ననుడున్ క్షమింతువు దయా
బ్ధీ! నీక్షమన్ మెచ్చరే.

అవతారిక :- ఈ శ్లోకమునఁ బూర్వోక్తమగు నర్థమునే యను వదించుచు క్షమాగుణకార్య మగు వాత్సల్యగుణము నను సంధించు చున్నారు.

శ్లో॥ క్షాంతి స్తవేయ మియతీ మహతీ కథం ను
ముహ్యే ద్దహా త్వయి కృతాంజలిపంజరేషు ।
ఇత్థం స్వతో నిఖిలజంతుషు నిర్విశేషం
వాత్సల్య ముత్సుకజనేషు కథం గుణ స్తే ॥ 63

ప్రతి :- ఇయతీ = ఇట్టి ప్రమాణముగల, మహతీ = గొప్పది యగు, తవ = నీయొక్క, క్షాంతిః = ఓర్పు, త్వయి = నీవిషయమున, కృత, అంజలి, పంజరేషు = చేయఁ బడిన నమస్కారముద్ర యనెడు కవచము గలవారియెడల, కథమ్ = ఎట్లు, ముహ్యేత్ = మోహమును జెందును? అహో! = ఆశ్చర్యము, స్వతః = సహజముగా, ఇత్థమ్ = ఇట్లు, నిఖిలజంతుషు = సమస్త ప్రాణుల విషయమున

నిర్విశేషమ్ = పక్షపాతము లేని, తే = నీయొక్క, వాత్సల్యమ్ = దయ, ఉత్సుకజనేషు = నీయెడలఁ బ్రీతి గల జనులయందు, కథమ్ = ఎట్లు, గుణః = గుణము, (స్యాత్ = అగును ?)

విశేషములు :- ఇయతీ, మహతీ = పూర్వోక్త మగు ఇట్టి మహిమ గల- కృతాంజలిపంజరేషు = స్వదోషములఁ బోఁగొట్టుటకు హేతు వగుటచే అంజలియందుఁ బంజర త్వారోపణ మొనర్పఁ బడినది.

అహో ! = ఆశ్చర్యము- ఇఁకఁ బాప మొనర్ప నను సంకల్పమునకే తృప్తిఁ గాంచిన నీ యోర్పు అంజలి లాభము చేకూరఁగా నెట్లు మఱవఁ గల దని భావము.

తా :- ఓ వైకుంఠనాథా ! ఇంతటి మహామహిమగల దేవర వారి యోర్పు (శ్రీ)వారి నెప్పుడు నంజలిముద్రచే సేవించు వారి నెట్లు మఱవఁ గలదు ? ఇఁకఁ బాప మొనర్ప నని సంకల్పించినవారికి తృప్తి చెందిన తమ క్షమాగుణము సర్వదా కైమోడ్పు గావించు వారి నెన్నఁటికిని మఱవ దని భావము. ఇట్లు సహజముగా నాశ్రితానాశ్రితభేదము లేని తమ వాత్సల్యము నీయెడలఁ బ్రీతిఁ గలవారియెడల గుణ మెట్లగును ?

ఉ॥ ఇంత మహామహత్త్వమున

కెంతయుఁ బేరు వహించినట్టినీ

జొంతి యహా! యెటుల్ మఱచు
సారెకు నంజలిపంజరస్థులై
స్వాంతము నీకుఁ గాన్క యిడు
సాధులఁ, బ్రాణుల నెల్లఁ దుల్యతఁ
గాంతువు వత్సలత్వ మెటు
గా గుణ మాశ్రితులందు శ్రీపతీ!

అవతారిక :- ఇంకను వాత్సల్యాతిశయమునే అనుసంధించు చున్నారు.

శ్లో॥ విశ్వం ధియైవ విరచయ్య నిచాయ్య భూయః
సంజహ్రుషః సతి సమాశ్రితవత్సలత్వే।
ఆజగ్ముష స్తవ గజోత్తమబృంహితేన
పాదం పరామమృశుషోఽపి చ కా మనీషా॥ 64

ప్రతి :- ధియా+ఏవ = సంకల్పరూప మగు జ్ఞానముచేతనే, విశ్వమ్=ప్రపంచమును, విరచయ్య=నిర్మించి, నిచాయ్య= పెంచి, భూయః=మరల, సంజహ్రుషః=సంహారించు చున్న నీకు, సమాశ్రిత, వత్సలత్వే సతి = ఆశ్రితుల విషయమున వాత్సల్యము పుట్టినది కాఁగా, గజోత్తమ, బృంహితేన= (మొసలిచే గ్రహింప బడినపాదముగల) గజేంద్రుని ఘీంకారముచేత, ఆజగ్ముషః=వచ్చినట్టియు, పాదమ్=గజేంద్రుని పాదమును, పరామమృశుషః = పరామర్శించినట్టియు (తాఁకినట్టియు) తవ=నీయొక్క, మనీషా=బుద్ధి, కా= ఏమిటి?

విశేషములు :- ఆజగ్ముష స్తవ ...... కా మనీషా - సంకల్ప మాత్రముచేతనే విశ్వమునకు సృష్టిస్థితిలయములను గటా

క్షించు నీకు ఆశ్రితవాత్సల్య మేర్పడుచుండఁగా గజేంద్రుని మొఱచేత.

మ॥ సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం
జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిన్
బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్కనొత్తఁడు వివా
దప్రోద్ధతశ్రీకుచో
పరిచేలాంచల మైన వీడఁడు గజ
ప్రాణావనోత్సాహియై.

అన్నంత సంభ్రమముతో మడుగుచెంతకు వచ్చుటయు గజ రాజు పాదమును బరామర్శించుటయు నేటికి ? విశ్వసర్గనాది కమువలెనే సంకల్పముచేతనే గజేంద్రునిఁ గావ రాదా ? ఈ యభిప్రాయ మేమిటి యన్నచో - భక్తులయెడఁ గల యాశ్రిత వాత్సల్యము సంకల్పమును గూడ జయించిన దని భావము.

తా :- ఓ వైకుంఠనాథా ! ఆశ్రితవాత్సల్యము లేకెత్త సంకల్ప మాత్రముచేతనే జగముల సృజించి పెంచి సంహరించు నీకు గజేంద్రుని రక్షించుటయు సంకల్పముచే నెఱవేఱక పోయెనా ? దాని ఘీంకారము విని సరస్తీరమున కరుదెంచి గజరాజు పాదమును బరామర్శించుట నీకు భక్తజనము లందుఁ గల వాత్సల్యము నీసంకల్పబలమునకంటె మిన్న యని చాటుచున్నది.

మ॥ నిజసంకల్పముచే సమస్తజగముల్
నిర్మించి పోషించి నా

శజ మహామూర్పు ఘటించుచుండె స్వజనవా
త్సల్యంబు వే చాటు నీ
కజరుద్రేంద్రముఖామరార్చితపదా
బ్జా! నీదు సంకల్పమే
గజముం గావదె? మద్గు కేల చనితో!
కర్యంఘ్రి నే లంటితో!

అవతారిక :_ తిర్యగ్జాతియందుఁ బుట్టిన గజేంద్రునందు దేవర వారి కింత వ్యామోహ మేటికి కని శంకించుకొని సమాధానము చెప్పు చున్నారు.

శ్లో॥ యః కశ్చి దేవ యది కించన హంత జంతు
ర్భవ్యో భజేత భగవంత మనన్యచేతాః।
తం సోఽయ మీదృశ ఇయా నితి వాఽప్యజాన
న్హా వైనతేయసమ మప్యురరీ కరోషి॥ 65

ప్రతి :- భవ్యః=భవిష్యత్తున బాగు పడఁ గల, యః కశ్చిత్ + ఏవ = ఎవఁడే గాని, జంతుః = ప్రాణి, భగవంతమ్ = భగవానుఁడ వగు, (నిన్ను) అనన్య, చేతాః = ఏకాగ్ర మనస్సు గలవాఁ డగుచు, కించన = కొంచెము, భజేత, యది = సేవించు నేని, తమ్ = ఆప్రాణిని, సః = అతఁడు అయమ్=ఈజాతికిఁ జెందినవాఁడు, ఈదృశః=ఇట్టి యాచారాదులు గలవాఁడు, ఇయాన్ = ఇన్ని గుణములు గల వాఁడు, ఇతి, వా అని కాని, అజానన్ = తెలియని (చూడని) వాఁడవగుచు, వైనతేయసమమ్ = గరుత్మంతునితో సమానునిగా, ఉరరీకరోషి = అంగీకరించుచున్నావు. హా = ఆశ్చర్యము, హంత = సంతోషము.

( సశేషము )

విశేషములు :- భవ్యః యః కశ్చి దేవ జంతుః = జాత్యా దులచే నికృష్టుఁడైనను భవదీయచరణ సమాశ్రయణమున కనుగుణ మగు శుభస్వభావముగలవాఁడు అని భావము.

భగవంతమ్- ఆశ్రితుని సదాచారాది గుణములఁ జూడని క్షమాగుణ ముగల నిన్ను అనన్యచేతాః = ఉపాయోపేయ వస్తువునందు మనస్సులేని వాఁడగుచు, 'సోఽయ మీదృశ ఇయా నితి వాఽప్యజానన్' దోషములపై దృష్టిలేని స్నేహవిశేషమే వాత్సల్యము గాన ఆశ్రితుని జాత్యాదులను గమనింపక యని యాశయము.

వైనతేయసదృశమ్- గరుడుఁడుభగవత్కటాక్ష పాత్రుఁడు గాన వానితో సమానునిగా ననుట హృద్యముగా నున్నది.

అపిచే త్స దురాచారో భజతే మా మనన్యభాక్ ।
సాధు రేవ స మంతవ్యః । సమ్యగ్వ్యవసితో హి సః ॥

అను గీతాసూక్తి నిట ననుసంధించుకొనునది.

తా॥ ఓ వైకుంఠపతీ! జాత్యాదులచేతనికృష్టుఁడే యగు నెవఁడే కాని తుదకు నీచరణసమాశ్రయణమునకు నువ్విళు లూరు మేలిస్వభావము గలవాఁడై యాశ్రితులదోషములఁ

జూడనిక్షమావంతుఁడ వగునిన్ననన్యచిత్తముతో నించుక భజించె నేని వానిజాతిని గాని, యాచారమును గాని, గుణములను గాని, గమనింపక యాయాశ్రితుని గరుత్మంతుని వలెఁ గటాక్షించి తత్తుల్యభక్తునిగా నంగీకరింతువు. ఔరా సంతోషము.

మ॥ ఎవఁ డేనిన్ భవదీయపాదశరణం
బేపారుశీలంబువాఁ
డవుచున్ నిన్ను క్షమాగుణాంబుధి ననన్యం బైనచిత్తంబుతో
రవసేవెన్నఁ దదీయజాతిగుణచర్చల్ వీడి తోడ్తోడఁ జూ
డవె నీప్రేమకుఁ బాత్రమౌ గరుడుతోడన్ దుల్యుఁగా శ్రీపతీ!

అవతారిక :- గొప్పవానికి మందులతోడి యెడఁదెగని సహవాసమే సౌశీల్య మని నిర్వచింపఁబడిన యా సౌశీల్యము నీక్రిందిశ్లోకమున ననుసంధించు చున్నారు.

శ్లో॥ త్వత్సామ్య మేవ భజతా మభివాంఛసి త్వం
తత్సాత్కృతై ర్విభవరూపగుణై స్త్వదీయైః ।
ముక్తిం తతో హి పరమం తవ సామ్య మాహుః
త్వద్దాస్య మేవ విదుషాం పరమం మతం తత్ ॥ 66

ప్రతి :- భజతామ్ = సేవించుచున్న (భక్తులగు) (పుంసామ్ = పురుషులకు, తత్సాత్, కృతైః = వారి వశము చేయఁ

బడిన, త్వదీయైః = నీ సంబంధములగు, విభవ, రూప, గుణైః = విభవములచేతను, విగ్రహముచేతను, జ్ఞాన శక్త్యాది గుణములచేతను, (ఉపలక్షితః = చూడఁ బడిన, త్వమ్ = నీవు) త్వత్, సామ్యమ్ = నీతోడిసమానత్వ మును, (ఉత్పాదయితుమ్ = పుట్టించుటకు,) అభివాం ఛసి = కోరుచున్నావు, తతః, హి = ఆకారణమువలన, తవ = నీయొక్క, పరమమ్ = అధిక మగు, సామ్యమ్ = సాదృశ్యమును, ముక్తిమ్ = ముక్తినిగా. ఆహుః = చెప్పుచున్నారు, విదుషామ్ = జ్ఞానులకు, తత్ = ప్రసిద్ధ మగు, త్వత్, దాస్యమ్ + ఏవ = నీకైంకర్యమే, పర మమ్ = ఉత్కృష్ట మైనదిగా, మతమ్ = తలఁచఁబడినది.

విశేషములు :- త్వ త్సామ్యమ్- నీతోడిసమాన మగు జ్ఞానాది ధర్మములు గలిగి యుండుటను, 'ముక్తిం తతో హి పరమం తవ సామ్య మాహుః'— 'నిరంజనః పరమం సామ్య ముపైతి' 'మమ సాధర్మ్య మాగతాః' ఇత్యాది శ్రుతి స్మృతులీవిషయమునందుఁ బ్రమాణములు.

విదుషామ్- అనన్యార్హ మగు భగవచ్ఛేషత్వరూప మగు స్వాత్మయాథాత్మ్యజ్ఞానము గలవారికి, తత్ = అట్టిశేష త్వమునకు అనురూప మగు,

త్వద్దాస్య మేవ పరమం మతమ్- నీకైంకర్య మే యుత్కృష్ట మని భావింపఁ బడినది. నిరంతర (నీరంధ్ర) సంశ్లేష మే పరమ సామ్యపద మని భావము.

తా॥ ఓ వైకుంఠపతీ! నీవు భక్తపరాధీనుఁడ వగుటచేత నిన్ను సేవించు భక్తులకు భవదీయము లగు విభవరూపగుణములను వారి.వశము చేయుచున్నావు. అందుచేతనే నీతోడి పరమ సామ్యమునే ముక్తి యందురు. అనన్యార్హ మగు దేవరవారి కైంకర్యమునకే తా మని భావించు జ్ఞానులు శ్రీవారి దాస్యమునే యుత్కృష్ట మని తలంచుచున్నారు.

ఉ॥ నిన్ను భజించు భక్తులకు
నీ విభవంబును రూపమున్ గుణాల్
మున్నె యొసంగి సామ్యగుణ
మున్ దయచేయుదు. వందుచేతనే
సన్నుతిసేయుఁ ద్వత్పరమ
సామ్యమె ముక్తిగ శాస్త్రకోటి, వి
ద్వన్నికరంబు తావకము
దాస్యమె మిన్నగ నెంచు శ్రీపతీ!

అవతారిక :- పూర్వోక్తమగు సౌశీల్యమునే కారణాంతరముచే ననుసంధించుచున్నారు.

శ్లో॥ తద్వై తథాఽస్తుక తమోఽయమహో స్వభావో।
యావాన్ యథావిధగుణో భజతే భవంతమ్।
తావాంస్తథా విధగుణస్తద ధీనవృత్తిః
సంశ్లిష్యసిత్వ మిహ తేన సమానధర్మా॥ 67

ప్రతి :- తత్ = పూర్వోక్తమగు సౌశీల్యము, వై = యథార్థముగా, తథా = అట్లే. అస్తు = అగుఁగాక,

యావాన్ = ఎంతటి జ్ఞానాదికము గలవాఁడు (ఎంతటి వాఁడు) యథావిధగుణః = ఎటువంటి గుణములుగల వాఁడు, (అగుచు) భవంతమ్ = నిన్ను, భజతే = సేవించునో, ఇహ = ఈ ముక్తివిషయమున, తావాన్ = అటువంటి వాఁడవును, తథావిధగుణః = అటువంటి గుణములు గలవాఁ డవును, తత్, అధీన, వృత్తిః = ఆ యుపాసకున కధీనమగు వర్తనముగలవాఁడవునై, త్వమ్ = నీవు, తేన = ఆ యుపాసకునితో, సధర్మా = సమాన ధర్మముగలవాఁడ వగుచు, సంశ్లిష్యసి = కలయికను బొందుచున్నావు, అయమ్ = ఈ, స్వభావః = స్వభావము, కతమః = ఎట్టిది ? అహో = ఆశ్చర్యము.

విశేషములు :- శ్రీభాష్యమునందు 'తత్క్రతుశ్చ' అను సూత్రమునకు విషయవాక్యముగా 'యథా క్రతు రస్మిన్ లోకే పురుషో భవతి ఏవ మే వేతః ప్రేత్య భవతి' అను శ్రుతిని గ్రహించి చేతనుఁడు భగవంతుని ఎట్టి స్వరూప రూపగుణాదివిశిష్టునిగా నుపాసించునో అట్టి స్వరూపరూప గుణాదివిశిష్టుఁ డగు భగవంతునే పొందు నని తాత్పర్యార్థము ప్రతిపాదింపఁ బడినది. ఆయర్థమే యీశ్లోకమున విశదీకరింపఁ బడినది.

యావాన్ — ఎంతమాత్రము జ్ఞానాదికము గల పురుషుఁడు అని భావము.

తథావిధగుణః — తనరుచి కనుగుణముగా ఉపాసింప గ్రహింపఁ దగినంత గుణాదికముతోఁ గూడినవాఁడు. లేదా- సర్వవిద్యాసాధారణానందాదిగుణవిశిష్టుఁడు.

సంశ్లిష్యసి— సంగతిం ప్రాప్నోషి సంశ్లేషమును పొందు చున్నావు.

కతిమోఽయ మహో ! స్వభావః— నిరంకుశస్వభావుఁడ వగు నీకు నీయిష్టము వచ్చినట్లు ఫలము నొసంగుటకు శక్తి యున్నను ఉపాసనానుగుణముగానే ఫల మిచ్చు నిర్బంధ మేమిఁటికి ? ఆహా ! ఈ నీ స్వభావము- అవాఙ్మానసగోచరము గదా !

తా :- ఓ వైకుంఠనాథా ! ఉపాసకుఁ డెట్టిజ్ఞానముగలవాఁడు నెట్టి గుణములు గలవాఁడు నై నిన్ను భజించునో ఈముక్తి విషయమున నట్టి జ్ఞానాదికము గుణాదికము గలవాఁడవై యాయుపాసకాధీనవృత్తివై యతనితో సమానము లగు ధర్మములతో నతనిఁ గటాక్షించుచున్నావు. నిరంకుశ స్వతంత్రుఁడ వగు నీ కీనిర్బంధ మేటికో! తెలియదు. ఈ నీ స్వభావ మవాఙ్మానస గోచరము మహాశ్చర్యకరమునై యున్నది.

మ॥ అగుఁగా కయ్యది యట్లె, యీప్రకృతి య
త్యాశ్చర్య, మిాశీలముఁ
బాగడం జాల విభూ ! యుపాసకుఁ డెటుల్
పొల్పారునో యట్లె నీ

వారిఁ దత్తుల్యగుణుండవై యిడుదు త
ద్యోగ్యంబులౌ భోగముల్,
భగవానుండ! నిరంకుశాత్మునకు ని
ర్బంధంబు నీ కేటికో!

అవతారిక :- ఇప్పుడు తనరుచి కనువగు ఫలమును ప్రార్థించు చున్నారు.

శ్లో॥ నీలాంజనాద్రినిభ మున్నస మాయతాక్ష
మాజానుజైత్రభుజ మాయతకర్ణపాశమ్।
శ్రీవత్సలక్షణ ముదారగభీర నాభిం
పశ్యేమ దేవ! శరదాం శత మీదృశం త్వామ్॥ 68

ప్రతి :- హేదేవ! = ఓవైకుంఠనాథా! నీల, అంజన, అద్రి, నిభమ్ = నల్లనికాటుకకొండతో సమాన మైనట్టియు, ఉన్నసమ్ = ఉన్నతమగు ముక్కు గలట్టియు, ఆయత, అక్షమ్ విశాలములగు కన్నులు గలట్టియు, ఆజాను, జైత్ర భుజమ్=పిక్కలవఱకు వ్రేలాడు జయశీలము లగు భుజములు గలిగినట్టియు, ఆయత, కర్ణపాశమ్=విశాలములగు చెవితమ్మెలు గలట్టియు, శ్రీవత్స, లక్షణమ్=శ్రీవత్స మనెడు పుట్టుమచ్చ గుర్తుగాఁ గలట్టియు, ఉదార, గభీర, నాభిమ్=గొప్పలోతైనబొడ్డు గలట్టియు, ఈదృశమ్ ఇట్టిదివ్య మంగళ విగ్రహము గల, త్వామ్=నిన్ను, శరదః శతమ్ నూఱేండ్లు పశ్యేమ=చూచెదముగాక.

విశేషములు :- దేవ !—'దివ్ = క్రీడా, విజిగీషా, వ్యవహార, ద్యుతి, స్తుతి, మోద, మద, స్వప్న కాంతి, గతిషు' అను ధాతువుచేఁ బ్రతిపాద్యమానము లగు గుణములతోఁ గూడిన వేలుపు శ్రీవైకుంఠనాథుఁడే యగును గాన ఓవైకుంఠనాథా ! అని యర్థము వ్రాయఁ బడినది.

నీలాంజనాద్రినిభమ్ — శ్రీవైకుంఠనాథుఁడు కాలమేఘ శ్యాముఁ డని ప్రసిద్ధి.

పశ్యేమ దేవ ! శరద శ్శతమ్—'సదా పశ్యంతి సూరయః' అనునట్లు నిరంతరదర్శన మొనర్తు నని భావము. భగవత్స్వరూపానుభవముకంటె విగ్రహానుభవమే హృద్యమని యాశయము.

తా :- ఓవైకుంఠపతీ ! నల్లనికాటుకకొండకు దీటు వచ్చునట్టియు, ఉన్నత మగు నాసికగలట్టియు, ఆజానులంబులును జయశీలములు నగు భుజములు గలట్టియు, ఆయతములగు కర్ణపాశములు గలట్టియు, శ్రీవత్సమను పుట్టుమచ్చ గలట్టియు నిన్ను నూఱేండ్లును గనుగొందుము గాక.

ఉ॥ ఉన్నస మాయతాక్షము మ
హోజ్జ్వలకజ్జల నీలభూమిభృ
త్సన్నిభరోచి జానుతత
జైత్రభుజమ్ము సుకర్ణ పాశముం
జె న్నగుపుట్టుమచ్చ విల
సిల్లునురమ్ము గభీరనాభిసం

పన్నము నీదురూప మభ
వా! కనుగొందును వందయేండులున్.

శ్లో॥ అంభోరుహాక్ష మరవిందనిభాంఘ్రియుగ్మ
మాతామ్రతామరసరమ్యకరాగ్రకాంతి।
భృంగాలకం భ్రమరవిభ్రమకాయకాంతి
పీతాంబరం వపు రద స్తు వయం స్తువామః॥ 69

ప్రతి:- వయం, తు = మే మన్ననో, అంభోరుహా, అక్షమ్= తెల్లదామరలవంటి కన్నులు గలిగి నట్టియు, అరవింద, నిభ, అంఘ్రి, యుగ్మమ్ = పద్మములతో సమాన మగు పాదములజంట గలిగినట్టియు, ఆతామ్ర, తామరస, రమ్యా, కరాగ్ర, కాంతి = ఎఱ్ఱకలువవలె నంద మగు కరాగ్రముల కాంతి గలిగినట్టియు, భృంగ, అలకమ్ = తుమ్మెదల వంటి ముంగురులు గలిగినట్టియు భ్రమర విభ్రమ, కాయ, కాంతి = తుమ్మెదల విలాసమువంటి విలాసములు గల శరీరకాంతి గలిగినట్టియు, పీతాంబరమ్ = పచ్చని పట్టు బట్టగలిగినట్టియు, అదః = ఈ, వపుః = శరీరమును, స్తువామః = స్తుతించు చున్నాము.

విశేషములు:- వయంతు — స్వరూపగుణానుభవనిష్ఠులకంటె భిన్నుల మగు మేము. అనఁగా భవదీయ విగ్రహానుభవ ప్రవణుల మగు మేము– అని భావము.

'పీతాంబరం వపు రద స్తవ సంస్తవామ' అను పాఠము నందు— తవ = నీయొక్క, అదః = ఈ, వపుః =

శరీరమును, సంస్తవామ = పరిచిత మొనర్చుకొందము, అని యర్థము.

తా :- పద్మములవంటి కన్నులు గలదియు, తామరలతో సమానము లగు పాదములజంట గలదియు, చెంగల్వలవలె నందము లగు కరాగ్రముల కాంతిగలదియు, తుమ్మెదల వంటి ముంగురులు గలదియు, భ్రమరవిలాసములవంటి దేహకాంతి గలదియు, పీతాంబరధారియు నగు నీ శరీరమును వైకుంఠపతీ! మేము స్తుతించుచున్నాము.

ఉ॥ కన్నులు తెల్లదామరలు,
కంజము లంఘ్రులు, నెఱ్ఱగల్వబా
గు న్నగుఁ బో! కరాగ్రములు
కుంతలముల్ భ్రమరీవిలాసముల్,
చె న్నగుమైనిగన్నిగలు,
శ్రీహరినీలము, లోకడానియే
సన్ననివల్వ, నీతనువు
సన్నుతిఁ జేతుము మేము శ్రీపతీ!

శ్లో॥ భ్రూవిభ్రమేణ మృదుశీతవిలోకితేన
మందస్మితేన మధురాక్షరయా చ వాచా।
ప్రేమప్రకర్షపిశునేన వికాసినా చ
సంభావయిష్యసి కదా ముఖపంకజేన॥ 70

ప్రతి :- భ్రూ, విభ్రమేణ = కనుబొమల విలాసము గలట్టియు, మృదు, శీత, విలోకితేన = సౌమ్యమును, దయార్ద్రమునగు

చూపుగలట్టియు, మందస్మితేన=అత్యల్ప మగు చిఱునవ్వు గలట్టియు, ప్రేమ, ప్రకర్ష, పిశు నేన = వాత్సల్యాతిశయ మును సూచించు నట్టియు, (కనుక నే) వికాసినా=వికసించు చున్న, ముఖపంకజేన = ముఖపద్మముచేత, మధురాక్షరయా=తియ్యనీ అక్షరములుగల, వాచా, చ=మాటచేతను, కదా = ఎప్పుడు, (మామ్ = నన్ను) సంభావయిష్యసి = గౌరవింతువు ?

విశేషములు :- ఈశ్లోకములోని పూర్వార్థమునందలి పదములను స్వతంత్రముగా నైనను అన్వయించుకొన వచ్చును. ఎట్లన ? భ్రూవిభ్రమేణ=కనుబొమల విలాసముచేతను, మృదు, శీత, విలోకితేన=సౌమ్యము దయార్ద్రము నగు చూపుచేతను, మందస్మితేన=అత్యల్ప మగు చిఱునవ్వు చేతను. అని—

తా :- ఓవైకుంఠనాథా ! కనుబొమల విలాసములు గలట్టియు, సౌమ్యమును దయార్ద్రము నగు చూపుగలట్టియు, అత్యల్ప మగు చిఱునవ్వు గలట్టియు, వాత్సల్యాతిశయమును సూచించు నట్టియు, వికాసము గలట్టియు, నీముఖపద్మము చేతను, మధురాక్షరములుగల వాక్కులచేతను నన్నెప్పుడు గౌరవింతువో కదా !

ఉ॥ భ్రూలతికావిలాసముల

ఫొల్పులు, శీతలదృష్టిపాతముల్

లాలితమందహాసము లె
లర్పఁగ జాలి వెలార్చు తామరం
బోలెడు మోముతోఁ నమృత
ముక్కుల వాక్కుల నన్ను నెప్పుడో
శ్రీలలనాకరాంబుజని
షేవితపాద! బహూకరింతువో!

శ్లో॥ వజ్రాంకుశధ్వజసరోరుహ శంఖచక్ర
మత్స్య సుధాకలశ కల్పక కల్పితాంకమ్।
త్వత్పాదపద్మయుగళం విగళత్ప్రభాభి
ర్భూయోఽభిషేక్ష్యతి కదా ను శిరో మదీయమ్॥ 71

ప్రతి :- (హే వైకుంఠనాథ! = ఓ వైకుంఠపతీ! వజ్ర......తాంకమ్ = వజ్రాయుధముచేతను, అంకుశ = అంకుశము చేతను, ధ్వజ=ధ్వజముచేతను, సరోరుహ=పద్మముచేతను, శంఖ=శంఖముచేతను, చక్ర =చక్రము చేతను, మత్స్య=ఆఁడు చేపచేతను, సుధాకలశ=అమృతకలశముచేతను, కల్పక= కల్పవృక్షముచేతను, కల్పిత = ఏర్పఱచఁ బడిన, అంకమ్= చిహ్నములు గలిగిన, త్వత్, పాద, పద్మ, యుగళమ్ = దేవరవారి పద్మములవంటి పాదములజంట, భూయః = పలుసార్లు, విగళత్, ప్రభాభిః = జాఱుచున్న కాంతుల చేత, కదా, ను = ఎప్పుడు, మదీయమ్ = నా సంబంధి యగు, శిరః = తలను, అభిషేక్ష్యతి = అభిషేకము చేయఁగలదు.

విశేషములు :- అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుఁడగు శ్రీ వైకుంఠనాథుని పాదపద్మములందు రేఖాకారములతో వజ్రాంకుశధ్వజసరోరుహ శంఖచక్ర మత్స్యసుధాకలశకల్పక చిహ్నము లుండె నని భావము. లేనిచోఁ బురుషోత్తముఁ డెట్లు లగు ?

తా :- ఓ వైకుంఠపతీ! రేఖాకారము లగు వజ్రాంకుశధ్వజ సరోరుహ శంఖచక్రాది చిహ్నములతో నలరారు నీ పాద పద్మ యుగళము పలుసార్లు కాంతిపూరంబుల వర్షించుచు నా శిరము నెప్పు డభిషేకము చేయఁగలదో!

మ॥ కులిశం బంకుశమున్ ధ్వజంబును సుధా
కుంభంబు నీరేజమున్
జలజాతాస్త్ర సిడంబు కల్పతరువున్
శంఖంబు చక్రంబు గు
ర్తులుగా నొప్పు భవత్పదాబ్జయుగ మ
స్తోకప్రభావర్షియై
కలితాపాపహ! నాశిరంబు నభిషే
కం బెప్డు గావించునో!

అవతారిక :- అప్రాకృతసౌకుమార్యాదులు గల మదీయచరణ మును నీయుత్తమాంగమునం దుంచుట యెట్లని భగవా నుని యభిప్రాయ మేమో! యని శంకించుకొని దానికిఁగా సాధారణమును అసాధారణము నగు దృష్టాంతద్వయమును నుడువుచుఁ దన యభిలాషము నావిష్కరించుచున్నారు.

శ్లో॥ త్రైవిక్రమక్రమకృతాక్రమణ త్రిలోక
ముత్తంస ముత్తమ మనుత్తమభక్తిభాజామ్।
నిత్యం ధనం మమ కదా హి మదుత్తమాంగ
మంగీకరిష్యతి చిరం తవ పాదపద్మమ్! 72

ప్రతి :- త్రైవిక్రమ......త్రిలోకమ్—త్రైవిక్రమ=త్రివిక్రమ మూర్తిసంబంధి యగు, క్రమ=పాదన్యాసముచేత, కృతాక్రమణ=ఆక్రమింపఁబడిన, త్రిలోకమ్=మూఁడులోకములు గలదియు, అనుత్తమ, భక్తి, భాజామ్=ఏకాంతభక్తి సంపన్నులకు, (ప్రపన్నులకు) ఉత్తమమ్ = శ్రేష్ఠమగు, ఉత్తంసమ్=శిరోభూషణ మైనదియు, మమ=నాకు, నిత్యం ధనమ్ = నిరంతరము స్పృహణీయ మైనదియు, (అగు) తవ=నీయొక్క, పాదపద్మమ్=పద్మమువంటి పాదము, కదా, హి=ఎప్పుడో, చిరమ్=చిరకాలమునకు, మత్, ఉత్తమాంగమ్=నాశిరస్సును, అంగీకరిష్యతి=అంగీకరింపఁ గలదు.

విశేషములు :- త్రివిక్రమావతారమున ముజ్జగములనుగొలుచుకొనుటచేత తదంతఃపాతి యగు నా శిరస్సును దేవరవారి వస్తువే గనుక నెప్పుడో తన యంగీకారసూచక మగు పాదముద్రను వేయఁగలరని భావము.

తా :- ఓ వైకుంఠపతీ! త్రివిక్రమావతారమున ముజ్జగముల నాక్రమించినదియుఁ బ్రపన్నులకు నుత్తమ శిరోభూషణ

మైనదియు నాకు నిరంతర స్పృహణీయ మైనదియు నగు నీ పాదకమల మెప్పుడో చిరకాలమునకు నా యుత్తమాంగము నంగీకరింపఁ గలదు.

గీ॥ ముజ్జగముఁ గొల్చె నడుగుల మూఁట నేది,
ఎది శిరోభూష భక్తుల, కేది మదీయ
నిత్యధన, మట్టి నీపాద నీరజం బ
దెప్పుడో ! యంగీకరించు నా యీ శిరస్సు.

శ్లో॥ ఉన్నిద్రపత్రశతపత్రసగోత్ర మంత
ర్లేఖారవింద మభినందన మింద్రియాణామ్।
మన్మూర్ధ్ని హంత ! కరపల్లవతల్లజం తే
కుర్వన్ కదా కృతమనోరథయిష్యసే మామ్ ॥ 73

ప్రతి :- ఉన్నిద్ర, పత్ర, శతపత్ర, సగోత్రమ్ = వికసించిన రేకులు గల పద్మముతో సమాన మైనట్టియు, అంతః, లేఖా, అరవిందమ్ = లోపల రేఖారూపమగు పద్మము గలట్టియు, ఇంద్రియాణామ్ = ఇంద్రియములకు, అభినందనమ్ = ఆనందమును గలిగించునట్టియు, తే=నీయొక్క కర, పల్లవ, తల్లజమ్ = హస్తమనెడు శ్రేష్ఠమగు చిగురుటాకును, మత్, మూర్ధ్ని=నా శిరస్సునందు, కుర్వన్= చేయుచు (ఉంచుచు) కదా = ఎప్పుడు, మామ్ = నన్ను, కృతమనోరథయిష్యసే = కృతార్థుని జేయుదువు.

విశేషము :- అభినందన మింద్రియాణామ్— మార్దవము, ఔజ్జ్వల్యము, సౌగంధ్యము మున్నగు గుణము లుండుట

చేత, ఇవి పెక్కు ఇంద్రియములకు ననుభావ్యము లగుట
చేతను ఇంద్రియాణామ్— అని బహువచనము వేయఁ
బడినది.

తా :- ఓ వైకుంఠనాథా! వికసితదళంబులు గల పద్మమును
బోలినదియు లోపల రేఖారూప మగు కమలము గలదియు,
సకలేంద్రియములకు మార్దవ సౌగంధ్యాది గుణములచే
నానందదాయక మైనదియు, ప్రశ స్తమైనదియు నగు నీ కర
పల్లవంబును నా మౌళిపై నుంచి నన్నెప్పుడు కృతార్థు
నొనర్తువో గదా!

మ॥ శతపత్రంబునకున్ సగోత్రము విలా
సశ్రీదళోపేత మం
చిత రేఖారుచిరాంతరబ్జము గుణో
త్సేకంబుచే నింద్రియ
ప్రతతిన్ దన్పు సుహస్తపల్లవము భా
వత్కంబు నామౌళిపైఁ
గుతుకం బొప్పఁగ నుంచి యెన్నఁ డిఁక వై
కుంఠేశ! నన్ దేల్చెదో!

శ్లో॥ అంగే నిసర్గనియతా త్వయి హంతకాంతి
ర్నిత్యం తివాల మియ మేవ తథాపి చాన్యా।
వైభూషణీ భవతి కాంతి రలం తరాం సా
హై పుష్కలైవ నిఖిలాపి భవద్విభూతిః॥ 74

ప్రతి :- త్వయి = నీవిషయమున (నీయందు) అంగీ = శరీరము నందున్న, కాంతిః = కాంతి, నిసర్గనియతా = స్వాభావిక మైనది, ఇయ మేవ = ఇదియే, నిత్యమ్ = ఎల్లప్పుడు, తవ = నీయొక్క యనుభవమునకు, అలమ్ = చాలును, హంత = ఆనందము. తథాపి = ఐనను, అన్యా = మఱియొక, సా = ప్రసిద్ధ మగు, వైభూషణీ = భూషణ సంబంధ మగు కాంతిః = శోభ, అలంతరామ్ = మిక్కిలి చాలినది, భవతి = అగుచున్నది, నిఖిలా, అపి = సమస్త మైన, భవద్విభూతిః = నీవైభవము, పుష్కలా, ఏవ = పరిపూర్ణ మైనదియే, హై = ఆశ్చర్యము.

తా:- ఓ వైకుంఠనాథా! నీ శరీరకాంతియే స్వాభావిక మైనది. ఇది యొకటియే నిన్ను ముక్తపురుషు లనుభవించుటకుఁ జాలును. ఐనను ప్రసిద్ధములగు నాభరణములవలనఁ గలిగెడు మఱియొకవిలక్షణకాంతి యెంతయేనియు భోగ్యతకుఁ జాలియున్నది. ఒక టేమి స్వామీ! నీ సకలవిభూతియు నానందమును గూర్చుటకుఁ బరిపూర్ణ మైనదియే. ఆశ్చర్య మాశ్చర్యము.

గీ॥ కడు సహజ మైననీదేహకాంతి యొకటె
ముక్తజనభోగ్యతకుఁ జాలు మురవిదారి!

ఆభరణకాంతి పై పెచ్చు శోభ నిచ్చు
నిఖిలమును బుష్కలంబె పో! నీవిభూతి.

అవతారిక :- ఇప్పుడు విభూషణకాంతి భోగ్యతను ప్రార్థించు చున్నారు.

శ్లో॥ శ్రీవత్సకౌస్తుభకిరీటలలాటికాభిః
కేయూరహారకటకోత్తమకర్ణికాభిః।
ఉద్దామదామమణినూపురనీవిబంధై
ర్భాంతం భవంత మనిమేష ముదీక్షిషీయ ॥ 75

ప్రతి :- శ్రీవత్స, కౌస్తుభ, కిరీట, లలాటికాభిః = శ్రీవత్స మనెడు పుట్టుమచ్చచేతను, కౌస్తుభమణిచేతను, కిరీటముచేతను, నొసట నుంచునాభరణముచేతను, కేయూర, హార, కటక, ఉత్తమకర్ణికాభిః = భుజకీర్తులచేతను, ముత్యాలపేరులచేతను, మురుగులచేతను, ఉత్తమము లగు కర్ణాభరణములచేతను, ఉద్దామ, దామ, మణినూపుర, నీవిబంధైః = ప్రకాశించుచున్న వనమాలచేతను, రత నాలయందెలచేతను, మొలకుఁ గట్టిన పట్టబంధముచేతను, భ్రాంతమ్ = ప్రకాశించు చున్న, భవంతమ్ = నిన్ను, అనిమేషమ్ = ఱెప్పపాటు లేకుండ, ఉదీక్షిషీయ = చూతును గాక.

విశేషములు :- శ్రీవత్సము పుట్టుమచ్చయైనను శ్రీవారి దివ్య విగ్రహమున కలంకారముగా నుండుటచే భూషణకోటిలోఁ జేర్పఁ బడినది.

కర్ణికాభిః— అనుచోట 'కంఠికాభిః' అని పాఠాంతరము గలదు. కంఠికాభిః = కంఠాభరణములచేత నని యర్థము.

నీవిబంధై— అనుచోట 'పట్టబంధైః' అనియుఁ బాఠాంతరము. అప్పుడు పట్టబంధైః - ఉదరబంధముచేత నని యర్థము.

తా :- ఓ వైకుంఠపతీ! శ్రీవత్స కౌస్తుభ కిరీట లలాటాభరణములచేతను భుజకీర్తులచేతను ముత్యాలపేరులచేతను మురుగులచేతను ఉత్తమ కర్ణాభరణములచేతను ప్రకాశమానమగు వనమాలచేతను మణినూపురములచేతను మణిమేఖలచేతను ప్రకాశించుచున్న నిన్ను తెప్పవాల్చకుండఁ జూతును గాక.

శా॥ శ్రీవత్సంబును గౌస్తుభంబు నొసటం
జెన్నారు మేల్ భూషయుక్
వేవెల్గట్టికిరీటముక్ మురుగులుక్
విభ్రాజికేయూరము
క్తావల్లీ వనమాల లందెలు మొదల్
గా భూష లొప్పారుని
న్నో వైకుంఠపతీ! కనుంగొనుదు నెం
తో నిర్నిమేషాక్షులక్.

అవతారిక :- ఇప్పుడు భగవానునివిగ్రహావయవశోభను ఆభరణశోభను రెంటిని అనుభవింపఁ బ్రార్థించు చున్నారు.

శ్లో॥ ఇందీవరీ క్వచి దపి క్వచ నారవిందీ
చాంద్రాతపీ క్వచన చ క్వచ నాథ హైమీ।

కాంతి స్తవోఢపరభాగపరస్పరశ్రీః
పార్యేత పారణయితుం కిము చక్షుషో ర్మే ॥ 76

ప్రతి :- క్వచిత్, అపి = ఒకానొకచోట, (విగ్రహము కంటి పాప మున్నగువానియందు) ఐందీవరీ = నల్లకల్వసంబంధ మైనదియు, క్వచన = ఒకానొకచోట (ముఖము కరపాద తలములు మున్నగువానియందు) ఆరవిందీ = పద్మసంబంధ మైనదియు, క్వచన, చ = మఱియొకచోట (మందహాస ముక్తాహారాదులందు) చాంద్రాతపీ = వెన్నెలసంబంధ మైనదియు, అథ = తరువాత, క్వచన = ఒకచోట (పీతాంబ రాదులందు) హైమీ = బంగారుసంబంధ మైనదియు, (అగు) ఊఢ, పరభాగ, పరస్పర, శ్రీః = ధరింపఁబడిన వర్ణాంతరసాన్నిధ్యలబ్ధగుణోత్కర్ష గల యన్యోన్యశోభ గలిగిన, తవ = నీయొక్క, కాంతిః = కాంతి, మే = నాయొక్క, చక్షుషోః = కన్నులకు, పారణయితుమ్ = తృప్తిని గలి గించుటకు, పార్యేత, కిము = చాలునా ?

విశేషము :- పార్యేత పారణయితుం కిము చక్షుషో ర్మే — ఏతాదృశ మైన నీశరీరకాంతి నాకన్నులను దనియఁ జేయు భాగ్యము నా కెప్పటి కైనను గలుగునా ? అని కవి యార్తి యిందు సూచిత మగు చున్నది.

తా:- విగ్రహ కనీనికాదులందు నీలోత్పల సంబంధినియు, వదన కరతలాదులందుఁ బద్మసంబంధినియు, మందహాస ముక్తా హారాదులందుఁ జంద్రికాసంబంధినియు, పీతాంబరాదులందు

హేమసంబంధినియు, ఐ, వర్ణాంతరసాన్నిధ్యలబ్ధ మగు వర్ణోత్కర్ష ముతోఁ గూడిన పరస్పరశోభ గల నీకాంతి యో వైకుంఠపతీ! నాకన్నులఁ దనిపెడు భాగ్యము నా కెన్నఁటికైనను గలుగునా ?

ఉ॥ ఒక్కెడ నల్లకల్వజిగి,
యొక్కెడఁ దామరసప్రభాచయం,
బొక్కెడఁ బండువెన్నెలల
యొప్పిద, మొక్కెడఁ బైఁడియంద, మి
ట్లొక్కొకదివ్యవస్తుసమ
యోగముచేఁ బెనుపొంది యున్ననీ
చక్కనిమేనికాంతి గుణ
సాగర! తన్పునె నాదుకన్నులన్ ॥

శ్లో॥ త్వాం సేవితం జలజచక్రగదాసిశార్ఙ్గై
స్తార్క్ష్యేణ సైన్యపతినాఽనుచరై స్తథాఽన్యైః।
దేవ్యా శ్రియా సహ వసంత మనంతభోగే
భుంజీయ సాంజలి రసంకుచితాక్షిపక్ష్మా ॥ 77

ప్రతి :- జలజ, చక్ర, గదా, అసి, శార్ఙ్గైః = శంఖముచేతను, చక్రముచేతను, కౌమోదకి యను గదచేతను, నందక మను కత్తిచేతను, శార్ఙ్గ మను చాపముచేతను, తార్క్ష్యేణ = గరుత్మంతునిచేతను, సైన్యపతినా = సేనాపతి యగు విష్వక్సేనునిచేతను, తథా = అట్లే, అన్యైః = ఇతరు లగు,

అనుచరైః = కుముదచండప్రచండాది సేవకులచేతను, సేవితమ్ = సేవింపఁబడినట్టియు, శ్రియా, దేవ్యా సహ = శ్రీదేవితోఁ గూడ, అనంత, భోగే - శేషుని శరీరమునందు, వసంతమ్ = నివసించు చున్న, త్వామ్ = నిన్ను, సాంజలిః = దోసిలితోఁ గూడినవాఁడనై, అసంకుచితాక్షిపక్ష్మా = సంకోచములేని కంటిరెప్పలు గలవాఁడనగుచు (ఱెప్పపాటు లేనివాఁడనై) భుంజీయ = అనుభవింతును గాక.

తా :- ఓ వైకుంఠపతీ! శంఖచక్రగదాఖడ్గములచేతను చాపముచేతను, గరుడునిచేతను, సేనాధిపతి యగు విష్వక్సేనుని చేతను అట్లే యన్యు లగు ననుచరులచేతను సేవింపఁ బడుచున్నట్టియు రాణి యగు శ్రీదేవితో గూడ శేషతల్పమునం దున్నట్టి నిన్ను నిర్నిమేషదృష్టితో దోసిలి కట్టి యనుభవింతును గాక.

గీ॥ శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గలతలు
గరుడసేనానులన్యులుఁ గలసి కొలువ
ఉవిదతో శేషశయ్యపై నొప్పునిన్నుఁ
జేతులఁ మోడ్చి యనుభవించెదను శౌరి!

శ్లో॥ కైంకర్యనిత్యనిరతై ర్భవదేకభోగై
ర్నిత్యై రనుక్షణనవీనరసార్ద్రభావైః।
నిత్యాభివాంఛిత పరస్పర నీచభావై
ర్మద్దైవతైః పరిజనై స్తవ సంగసీయ॥ 78

ప్రతి :- కైంకర్య, నిత్య, నిరతైః=శ్రీవారి కైంకర్యమునందే నిత్యము మిక్కిలి ఆసక్తి గలవారును, భవత్, ఏక, భోగైః = నీయొకనియందే అనుభవము గలిగినవారును, నిత్యైః=నిత్యసిద్ధులును, అనుక్షణ, నవీన, రస, ఆర్ద్ర, భావైః=క్షణక్షణము నూతన మగు భగవదనుభవరాగముచే ద్రవీభూత మయిన భావము గలవారును, నిత్య, అభివాంఛిత, పరస్పర, నీచభావైః = నిత్యమును కోరఁబడిన యొండొరుల శేషత్వము (దాస్యము) గలవారును, మత్, దైవతైః = నాకు దైవతములవంటివారును, అగు, తవ= నీయొక్క, పరిజనైః = సేవకులతో, సంగసీయ = కలిసి కొందును గాక.

విశేషములు :- భవదేకభోగైః—నీయందుమాత్రమే భోగము గలవారని భావము. భవదనన్యభోగులని నిష్కృష్టార్థము. 'నిత్యాభివాంఛితపరస్పరనీచభావైః' — భాగవతశేషత్వము సర్వప్రార్థనీయము గనుక నట్లు పేర్కొనఁబడినది. మద్దైవతైః = దైవతములవలె నాచే ఆరాధ్యమానులని భావము.

తవ, పరిజనైః—పూర్వశ్లోకమునఁ జెప్పఁబడినగరుడవిష్వక్సేనాదులతోడను, ఆశ్లోకమున అనుక్తు లగుముక్తపురుషులతోను అని యాశయము.

తా :- ఓవైకుంఠనాథా! నిరంతరము నీకైంకర్యమునందే పరినిష్ఠితులును, భవదనన్యభోగులును నిత్యసిద్ధులును, అను

క్షణము నూతన మగుభగవదనుభవరసముచేతఁ గరఁగిన భావము గలవారును నిత్య మెుండొరుల శేషత్వమును గోరుకొనువారును నాకు దైవతము లట్టి లారాధ్యమానులు నగు నీగరుడవిష్వక్సేనాదిపరివారజనులతోఁ గలిసికొందును గాక.

శా॥నీకైంకర్యమునందె నిత్యనిరతుల్
నీయందె భోగేచ్ఛువుల్
నీకల్యాణగుణానుభూతికలనా
నిత్యద్రవన్మానసుల్
నాకుల్ దైవతముల్ పరస్పరమహా
నైచ్యానుసంధాయు లో
వైకుంఠా! భవదీయు లాఘనులతో
వాంఛింతు సంగాతముల్.

అవతారిక:- పరమప్రాప్యమగు భగవత్పరిజనముయొక్క సమాగమానంతర మనుష్ఠేయ మగు శ్రీభూనీలాసమేతుఁ డగు భగవానుని యనుభవమును బ్రార్థించుచు మెుట్టమెుదటఁ బ్రధానమహిషి యగు శ్రీదేవితోడఁ గూడిన దేవరవారి యనుభవరూపపరిచర్యను శ్లోకత్రయముతోఁ బ్రార్థించుచున్నారు.

శ్లో॥ య త్కించి దుజ్జ్వల మిదం యదుపాఖ్యయాహుః
సౌందర్యమృద్ధి రితి యన్మహిమాంశలేశః।
నామ్నైవ యాం శ్రియ ముశంతి యదీయధామ
త్వా మామనంతి యతమా యతమానసిద్ధిః॥ 79

ప్రతి :- ఉజ్జ్వలమ్ = తేజస్వి యగు, ఇదమ్ = ఈదృశ్యమాన మైన, యత్, కించిత్ = ఏవస్తువేనియు. యత్, ఉపాఖ్యాయా = ఏ శ్రీదేవి పేరితో, ఆహుః = చెప్పుచున్నారో!, యత్, మహిమ, అంశ, లేశః = ఏ తల్లి యొక్క మహిమైక దేశములోని నలుసు, సౌందర్యమ్ = అవయవశోభ, బుద్ధిః = సంపద, ఇతి = అని (ఉచ్యతే = చెప్పఁబడుచున్నదో) యామ్ = ఏ తల్లిని, నామ్నా, ఏవ = పేరిచేత నే, శ్రియమ్ = శ్రీనిగా, ఉశంతి = చెప్పు చున్నారో, త్వామ్ = నిన్ను, యదీయధామ = ఏతల్లికి స్థానమునుగా, ఆమనంతి = తలఁచుచున్నారో, యతమా = ఏ తల్లి, యతమానసిద్ధిః = యోగులకు సిద్ధిస్వరూపిణియో, (తామ్ = అట్టి, శ్రియమ్=శ్రీదేవిని, త్వాం చ = నిన్నును, అంచితః = పొందినవాఁడనై, ఉదీర్ణభావః = గొప్ప కైంకర్యభావము గలవాఁడనై, పరిచరేయమ్ = సేవింతును గాక- అని మూఁడవశ్లోకముతో నన్వయము.)

విశేషములు :- 'యత్కించి దుజ్జ్వల మిదం యదుపాఖ్యాయాహుః '— తేజస్వి యగు పదార్థము నెల్లను శ్రీ యని యే చెప్పుదు రని భావము.

యదీయధామ త్వా మామనంతి— వైకుంఠనాథుఁడు శ్రీనివాసుఁడు గదా!

(6)

యతమా — ఇది యచ్ఛబ్దముమీఁద 'తమప్' ప్రత్యయాంతరూపము. ఏతల్లి యని యర్థము.

యతమానసిద్ధిః — 'మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే' అని గీతలోఁ జెప్పఁ బడినట్లు శ్రీదేవి యోగులకు సిద్ధిస్వరూపిణి యని తెలియ నగును.

తా :- ఓవైకుంఠపతీ! తేజస్వీగాఁ బరిదృశ్యమాన మగు నే వస్తువు నేని విజ్ఞులు శ్రీపేరఁ బిలుతురో, సౌందర్యము గాని సమృద్ధి గాని యేతల్లి మహిమైక దేశలేశమువలన బ్రాపించునో, యోగముచేతను రూఢిచేతను ఏతల్లిని శ్రీ యని యందురో, దేవరవారినే యేతల్లికి నివాస మని యెన్నుదురో, యోగులయోగసిద్ధి కేతల్లి మూలమో, అట్టి శ్రీదేవిని నిన్ను నితరంతరభక్తితో నుపచరింతును గాక.

మ॥ అతితేజస్వి పదార్థ మే దయిన శ్రీ
యన్ పేరితోఁ బిల్తురో!
తతసౌందర్యమువృద్ధి యన్మహిమగా
థాలేశలవాంశమో!
కృతు లేయమ్మకు శ్రీ య టం చిడిరో పే
రీ వున్కి యేతల్లికిన్,
యతమానాళికి సిద్ధి యేజనని నే
నాయమ్మ సేవించెదన్

శ్లో॥ యా వై త్వయా ప్యుదధిమంథనయత్నలభ్యా
యాంతర్హి తేతి జగదున్మథనోద్యతోఽభూః।
యా చ ప్రతిక్షణ మపూర్వరసానుబంధై
ర్భావై ర్భవంత మభినందయతే స దైవ॥ 80

ప్రతి :- త్వయా, అపి = సత్యసంకల్పుండ వగు నీచేతఁ గూడ, యా=ఏతల్లి, ఉదధి, మంథన, యత్న, లభ్యా=సముద్ర మథన మనెడు ప్రయత్నముచేతఁ బొందఁదగినదియో, యా = ఏతల్లి, అంతర్హితా = అదృశ్యయైనది, ఇతి=అని, (త్వమ్=నీవు) జగత్, ఉన్మథన, ఉద్యతః=జగత్సంహార మున కుద్యుక్తుఁడవు, అభూః=అయితివో, యా, చ= ఏతల్లి, ప్రతిక్షణమ్=క్షణక్షణము, అపూర్వ, రస, అను బంధైః=క్రొత్తవానివలె నాశ్చర్యకరము లగు రసముల ప్రాపు గల, భావైః = సాత్వికాదిభావములచేత, భవం తమ్ = దేవరవారిని (తమను) సదా + ఏవ = ఎల్లప్పుడు, అభినందయతే = ఆనందపెట్టుచున్నదో, (తామ్ = అట్టి) శ్రియమ్ = శ్రీదేవిని, త్వాంచ = నిన్నును, అంచితః = ప్రాపించినవాఁడనై, ఉదీర్ణ భావః=గొప్పకైంకర్యభావము గలవాఁడ నగుచు, పరిచరేయమ్=సేవింతును గాక.

విశేషములు :- త్వయా, అపి—అనుటచేత సత్యసంకల్పు లగు దేవరవారికి సైతము మీతల్లి క్షీరాబ్ధిమథనప్రయత్నముచేత సంపాదిత యయ్యెఁ గావున నత్యుత్తమురా లని తేలు చున్నది.

'యాంతర్హి తేతి జగదున్మథనోద్యతోఽభూః' ఈ విష యము శ్రీమద్రామాయణమున అరణ్యాకాండమునందును ఉత్తరరామాయణమునందును జూడ నగును.

తా:- ఏజనని సత్యసంకల్పు లగు దేవరవారికి సైతము క్షీరాబ్ధి మథనప్రయాసముచేత లభ్య యాయెనో! యేమాత యదృశ్యురా లైనప్పుడు దేవరవారు జగత్సంహారమున కుద్యుక్తు లైతిరో, ఏతల్లి నిరంతరానుభవ మున్నను నూత నములవలె నాశ్చర్యమునుగూర్చు రసానుబద్ధము లగు సాత్వికాదిభావములచేత శ్రీవారిని సర్వదా యానంద పెట్టునో అట్టిశ్రీదేవిని శ్రీవారిని నిరంతరము సేవింతును గాక.

చ॥ వననిధిఁ ద్రచ్చి యేరమణి
వల్లభగాఁ బ్రయతించికాంచితో
కనఁ బడ కున్న నేసతి జ
గమ్ములఁ ద్రుంపఁగఁ జూప మెత్తితో!
అనుకల మేలతాంగి ప్రణ
యాంచితనిత్యనవీనలీలలన్
నినుఁ గరగించు నారమను
నిన్ను భజింతు సదా పరాత్పరా!

శ్లో॥ రూపశ్రియా గుణగణై ర్విభవేన ధామ్నా
భావై రుదారమధురై శ్చతురై శ్చరిత్రైః।

నిత్యం తవైవ సదృశీం శ్రియ మీశ్వరీం తాం
త్వాం చాంచితః పరిచరేయ ముదీర్ణభావః ॥ 81

ప్రతి:- రూపశ్రియా=సౌందర్యముయొక్క శోభచేతను, విభవేన=విభవావతారముచేతను, గుణగణైః గుణసమూహములచేతను, ధామ్నా = స్థానముచేతను, ఉదార, మధురైః=గొప్పవియు మధురములైనవియునగు, భావైః= చిత్తవృత్తులచేతను, చతురైః=నేర్పుగల, చరిత్రైః = నడతలచేతను, నిత్యమ్=ఎల్లప్పుడు, తవ+ఏవ = నీకే, సదృశీమ్=తగినదియు, ఈశ్వరీమ్=సమస్తప్రాణులకు ప్రభ్వియైనట్టియు, తామ్ = ఆ, శ్రియమ్ = శ్రీదేవిని, త్వాం చ=నిన్నును, అంచితః=ప్రాపించిన, (అహమ్ = నేను) ఉదీర్ణ, భావః = గొప్పకైంకర్యభావము గలవాఁడ నగుచు, పరిచరేయమ్ = సేవింతును గాక.

విశేషములు :- రూపశ్రియా — రూపముయొక్క శ్రీయనఁగా లావణ్యసౌందర్యసౌకుమార్యాదు లని భావము. చతురైశ్చరిత్రైః = ఆశ్రితసంరక్షణాదిసమర్థము లగు వ్యాపారములచేత, నిత్యం తవైవ సదృశీమ్ — శ్రీమ ద్రామాయణమున

శ్లో॥ తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్ ।
రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా ॥

తుల్యశీలవయోవృత్తయు, తుల్యాభిజాత్యయు నగు సీతకు రాముఁడే తగును రామునకు సీతయే తగును. అన్నట్లు ఒకరి కొకరు తగినవా రని భావము.

ఈశ్వరీమ్— 'ఈశ్వరీం సర్వభూతానాం త్వా మిహోప హ్వయే శ్రియమ్'- ఈ శ్రుతియందుఁ జెప్పఁ బడినట్లు సర్వ భూతములకు ప్రభ్వి యని భావము.

తా :- ఓ వైకుంఠపతీ! రూపలావణ్యసౌందర్యసౌకుమార్యా దులచేతను, దయావాత్సల్యాది గుణసమూహములచేతను, సీతారుక్మిణ్యాద్యవతారములచేతను, స్థానముచేతను, ఉదార మధురము లగు చిత్తవృత్తులచేతను, ఆశ్రితసంరక్షణాది సమర్థంబు లగు వ్యాపారములచేతను, సర్వదా నీకే తగి నదియు సమస్తభూతములకుఁ బ్రభ్వి యైనదియు నగు శ్రీదేవిని నిన్ను సర్వదా భక్తికైంకర్యములతో సేవింతును గాక.

శా॥ఓ దేవా! యసమానరూపము గుణ
వ్యూహంబు లోకోత్తర
ప్రాదుర్భావము దివ్యధామము శ్రిత
త్రాణంబు మున్నైన చి
త్తౌదార్యాదులచేత నీకుఁ దగుని
ల్లా లైనయయ్యీశ్వరిన్
శ్రీదేవిన్ నిను నాశ్రయించి తలపైఁ
జేమోడ్చి సేవించెదన్.

శ్లో॥ యా బిభర్తి స్థిరచరాత్మక మేవ విశ్వం
విశ్వంభరా పరమయా క్షమయా క్షమా చ।
తాం మాతరం చ పితరం చ భవంత మస్య
వృశ్చ్ఛంతు రాత్రయ ఇమా వరివస్యతో మే॥ 82

ప్రతి :- యా=ఏదేవి, స్థిర, చర, ఆత్మకమ్ = స్థావరజంగమా త్మక మగు, విశ్వమ్=జగత్తును, బిభ్రతీ+ఏవ=భరించు చునే, విశ్వంభరా = విశ్వంభర యనుపేరు గలదియు, పరమయా=అధిక మగు, క్షమయా=క్షమాగుణముచేత, (ఓర్పుచేత) క్షమా, చ = క్షమ యనుపేరుగలదియు (భవతి=అగు చున్నదో,) తామ్=అట్టి మాతరంచ= తల్లి యగు భూదేవిని, పితరమ్=తండ్రి వగు, భవంతం,చ= నిన్నును, వరివస్యతః=సేవించు చున్న, అస్య=ఈ, మే= నాకు, ఇమాః=ఈ, రాత్రయః=రాత్రులు, వ్యుచ్ఛంతు= తెల్లవాఱును గాక.

విశేషములు :- విశ్వంభరా — జగత్తును భరించునది యని వ్యుత్పత్తి. భూదేవి యని యర్థము. 'క్షమా' క్షమ యనఁగా - అపరాధసహిష్ణుత. అది కలది గనుక భూదేవికి క్షమ యని నామధేయము.

మాతరమ్—క్షమయు భరణము తల్లి కుండవలసిన యసా ధారణగుణములు, అవి పుష్కలముగా నుండుటచేత భూదేవి సర్వసాధారణనిరుపాధికమాత యని తెలియ నగును.

తా :- ఓవైకుంఠనాథా! ఏతల్లి స్థావరజంగమాత్మక మగు నీవిశ్వము నెల్లను భరించుటచేత విశ్వంభర యనియు నిర వధిక మగు క్షమాగుణముచేత క్షమ యనియుఁ బ్రసిద్ధిఁ గాంచెనో జనని యగునాభూదేవిని జనకుఁడ వగు నిన్నును నిత్యము సేవించు చున్నయీనాకు రాత్రులు నీసేవకొఱకు సుఖముగాఁ దెల్లవాఱుఁ గాక.

ఉ॥ శంభువిరించి పూజ్యపద
సారస! విశ్వము నెల్లఁ దాల్చి వి
శ్వంభర నాఁగ, మేల్ క్షమకుఁ
బట్టగుచుఁ క్షమ నాఁ బ్రసిద్ధ యా
కుంభిని మత్సవిత్రి, జన
కుఁ గుణరాశిని నిన్ను నెల్ల వే
శం భజియించునాకు నవి
లంబత రాత్రులు తెల్లవాఱుతన్.

శ్లో॥ భావై రుదారమధురై ర్వివిధై ర్విలాసై
ర్భ్రూవిభ్రమస్మితకటాక్షనిరీక్షణైశ్చ।
యా త్వన్మయీ త్వ మపి యన్మయ ఏవ సా మాం
నీలా నితాంత మురరీకురుతా ముదారా ॥ 83

ప్రతి :- ఉదార, మధురైః=గంభీరములును మనోహరములు నగు, భావైః = భావములచేతను (చిత్తవృత్తులచేతను) వివిధైః = నానావిధము లగు, విలాసైః = విలాసముల చేతను, భ్రూవిభ్రమ, స్మిత, కటాక్షనిరీక్షణైః చ=బొమ ముడి, చిఱునవ్వు, క్రేగంటిచూపులచేతను, యా=ఏనీలా దేవి, త్వన్మయీ=నీతో అనన్యయో, (ఎడఁబాయనిదో,) త్వమపి=నీవును, యన్మయః ఏవ=ఏనీలాదేవితో అనన్యుఁ డవో(ఎడఁబాయనివాఁడవో)నితాంతమ్=మిక్కిలి, ఉదారా =ఉదారురాలగు, సా=ఆ, నీలా=నీలాదేవి, మామ్=నన్ను, ఉరరీకురుతామ్ = నిత్యకింకరునిగా నంగీకరించుఁగాక.

విశేషములు:- విలాసైః = చిత్తవృత్తిసూచకశృంగారచేష్టల చేత.

యా త్వన్మయీ త్వమపి యన్మయ ఏవ— 'మనస్వీ తద్గత స్తస్యాం నిత్యం హృది సమర్పితః' అన్నట్లు నీలావైకుంఠనాథు లన్యోన్యభోగ్యు లని భావము.

నితాంతముదారా =: ఆశ్రితాభిలషితప్రదానశౌండ యని తాత్పర్యము.

నీలా నితాంత మురరీకురుతామ్— 'నీలాతుంగ స్తనగిరితటీ సుప్త' మిత్యాది వర్ణనలచేత నీలాదేవి భగవంతునకు అభిమత వల్లభ గనుకఁ దన నిత్యకైంకర్యమునకు నీలాదేవి యంగీకార మావశ్యక మని భావము.

తా:- ఓ వైకుంఠపతీ! గంభీరములు మనోహరములు నగు భావములచేతను, భ్రూభంగమందహాసకటాక్షవీక్షణముల చేతను, ఏతల్లియు నీవు నన్యోన్యానురక్తులై యుందురో దానశౌండ యగు నా నీలాదేవి నన్ను నిత్యకింకరునిగా నంగీకరించుఁగాక.

శా॥ భ్రూలీలాస్మితదృగ్విలాసముల నిం
పుల్ నింపు భావంబులన్

లాలిత్యాదులఁ గూడి యాడెదరు నీ
లన్ నీవు నిన్ నీలయున్
వాలాయంబుగ నయ్యుదారగుణ నీ
వాల్లభ్యపాత్రంబునౌ
నీలాలోలదృగబ్జ కింకరుఁగ నీ
విన్ వే కటాక్షించుతన్.

శ్లో॥ భావై రనుక్షణ మపూర్వరసానువిద్ధై
రత్యద్భుతై రభినవై రభినంద్య దేవీః ।
భృత్యాన్ యథోచితపరిచ్ఛదినో యథార్హం
సంభావయంత మభితో భగవన్ ! భవేయమ్ ॥ 84

ప్రతి :- హే భగవన్!—ఓ వైకుంఠపతీ! అనుక్షణమ్—క్షణక్షణము, అపూర్వ, రస అనువిద్ధైః—(భోగ్యతాతిశయము వలన) క్రొత్తదివలెఁ దోఁచు శృంగారరసవిశేషముతోఁ గలసినట్టియు, అత్యద్భుతైః — మిక్కిలి ఆశ్చర్యకరములైనట్టియు, అభినవైః—నూతనములైన, భావైః=సాత్వికాదిభావములచేత, దేవీః — శ్రీభూనీలాదేవులను, అభినంద్య=మిక్కిలిగా నానందపెట్టి, యథోచిత, పరిచ్ఛదినః=తమతమ యధికారమునకుఁ దగినట్లు వేత్ర, ఛత్రాదిపరికరములు గల, భృత్యాన్—సేవకులను (విష్వక్సేనాదులను) యథార్హమ్=అధికారమునకుఁదగినట్లు, సంభావయంతమ్=సత్కరించు చున్న, (భవంతమ్—నీకు) అభితః—సమీపమున (సకలకైంకర్యములఁ జేయువాఁడనై) భవేయమ్=ఉందును గాక.

తా :- ఓవైకుంఠనాథా! క్షణక్షణమును భోగ్యతాతిశయమున అపూర్వమువలెఁ దోఁచు శృంగారరసవిశేషముతోఁ గూడినవియు, అత్యద్భుతము లైనవియు, నూతనము లైనవియు నగు సాత్వికాదిభావములచేత శ్రీభూనీలాదేవుల నానందపెట్టి తమతమ యధికారమునకుఁ దగినట్లు వేత్రచ్ఛత్రాదుల ధరించిన విష్వక్సేనాదిభృత్యులను సంభావించుచున్న దేవరవారిచెంత సకలకైంకర్యముల నిర్వర్తించుచునుందును గాక.

ఉ॥ నూతనముల్ క్షణక్షణ మ
నోహరముల్ రసభావమాధురీ
స్ఫీతములౌ విలాసముల
శ్రీతరళాక్షిని భూమినీలలన్
గౌతుకితాంతరంగలను
గా నొనరించుచు వేత్రభృన్ముఖుల్
జోత లొనర్పఁ గొంచు దయఁ
జూచెదు వేల్ప! నినున్ భజించెదన్.

అవతారిక :- ఇట్లు పరిపూర్ణభగవదనుభవప్రార్థన నొనర్చి స్వనైచ్యానుసంధానముచేత నిట్టి ప్రార్థనయు నాశ్చర్యకరమే యని నుడువు చున్నారు.

శ్లో॥ హా! హంత! హంత! హతకోఽస్మి ఖలోఽస్మి ధి జ్మాం
ముహ్యా న్నహో! అహ మిదం కి మువాచ వాచా।

త్వాం మంగ మంగలగుణాస్పద మస్తహేయ
మా స్స్మర్తు మేవ కథ మర్హతి మాదృగంహః॥ 85

ప్రతి:- అంగ = ఓవైకుంఠపతీ! హా, హంత, హంత! = అయ్యయ్యో, హతకః = హతప్రాయుఁడను, అస్మి = అగు చున్నాను, ఖలః = క్రూరుఁడను, అస్మి = అగు చున్నాను, మామ్=నన్నుఁ గూర్చి, ధిక్=ఛీ, ముహ్యన్= భ్రాంతుఁడ నగుచు, వాచా = కేవలవాక్కుతో, ఇదమ్= దీనిని, కిమ్ = ఏమి, ఉవాచ = పలికితిని, అహో! = ఆశ్చర్యము! అస్తహేయమ్ = నిరసింపఁ బడిన సమస్త హేయగుణములు గలట్టియు, మంగల, గుణ, ఆస్పదమ్= కల్యాణగుణములకు నిలయ మైనట్టియు, త్వామ్ = దేవర వారిని (నిన్ను) స్మర్తు మేవ = తలఁచుట కే, మాదృక్, అంహః = మాబోటివారిపాపము, కథమ్=ఎట్లు, అర్హతి = తగును? (తగ దని భావము) ఆః = ఎంత బాధ (కలుగు చున్నది).

విశేషములు:- అంగ- ఈ యవ్యయము సంబోధనమున వాడఁ బడును.

హా, హంత, హంత— ఈ మూఁడును గలిసి ఖేదాతిశయ మును సూచించును.

హతకోఽస్మి—దుష్కర్మములచేత మృతప్రాయుఁడనుగాఁ జేయఁ బడితిని.

ఖలోఽస్మి— విషయాంతరప్రవీణుఁడ నగు చున్నాను.

ముహ్యాన్ — అభోగ్యము లగు శబ్దాదివిషయములను భోగ్యములనుగాఁ దలంచిన భ్రాంతుఁడను.

అహ మిదం కి మువాచ వాచా — ఇప్పుడు మతిలేని మాటతో నేనే మంటిని. పాపాత్ముఁడ నగు నాకు నీ భోగానుభవమును ప్రార్థింప నేమిహక్కు గల దని భావము.

మాదృగంహః త్వాం స్మర్తు మేవ కథ మర్హతి- నా బోంట్లపాపము నిర స్తసమ స్తహేయగుణుఁడవును కల్యాణ గుణాస్పదుఁడవు నగు నిన్ను నంటుటకైన నెట్లు తగును.

ఆః— ఇట్లు నిన్నుఁ బ్రార్థించుట నా కెంత బాధాకరము.

తా:- ఓ వైకుంఠనాథా! అయ్యయ్యో! నే నెంత మృత ప్రాయుఁడ నైతిని. ఎంత విషయలంపటుఁడను, ఛీ నాజన్మ మేల, అభోగ్యము లగు శబ్దాదివిషయములను భోగ్యము లనుగాఁ దలంచి యెంతమోసపోయితిని. ఇట్టి ఖలుఁడ నగు నేను మతిలేని మాటతో నేమి ప్రార్థించితిని. నా బోంట్ల పాపము నిర స్తహేయగుణుఁడవును సమ స్తకల్యాణగుణనిల యుఁడవు నగు నిన్నుఁ బొందుట మాట యటుంచుము, అంటుటకు నైనను దగునా? అవివేకినై నీ గుణానుభవ మును బ్రార్థించి యందనిపండున కట్టు చాచితిని. ఇది నాకు బాధగా నున్నది.

శా॥అయ్యయ్యో! హతకుండ మూర్ఖుఁడను ఛీ!
యజ్ఞుండ భోగాళిపై
నెయ్యంబున్ విడనట్టి భ్రాంతుఁడ వృథా
నే నేమియంటిన్ రమా
శయ్యోరస్థల! యస్తహేయగుణ వి
శ్వస్తుత్యభాస్వద్గుణా
శయ్యావాసు స్పృశింప నేని నిను న
స్మత్పాపముల్ చాలునే?

అవతారిక :- నన్ను స్మరించుయోగ్యతను లేకుండఁ జేసినది పాపప్రాచుర్యము గాన దానిని దొలఁగునట్లు చేసి నీసేవ నంగీకరించెద నని వైకుంఠనాథుఁడు భావించినట్లు శంకించు కొని అనాదిపాపవాసనాదూషితుఁడ నగునేను దేవరవారి పరిచర్యకు ననర్హుఁడ నని మనవి చేయుచున్నారు.

శ్లో॥ అంహః ప్రసహ్య వినిగృహ్య విశోధ్య బుద్ధిం
వ్యాపూయ విశ్వ మశివం జనుషాఽనుబద్ధమ్।
ఆధాయ సద్గుణగణా నపి నాహ మర్హ
స్త్వత్పాదయో ర్యదహ మత్ర చిరం నిమగ్నః ॥ 86

ప్రతి :- యత్ = ఎందువలన, అహమ్ = నేను, అత్ర = ఈ పాపములందు, చిరమ్ = చాలకాలము, నిమగ్నః = మునిఁగితినో, (అతః = ఇందువలన, అంహః = (నా) పాపమును, ప్రసహ్య = బలాత్కారముగా, వినిగృహ్య = అణఁచివేసి, బుద్ధిమ్ = బుద్ధిని, విశోధ్య = బాగు చేసి

(మురికి లేకుండఁ జేసి) జనుషా=జన్మతో, అనుబద్ధమ్= కూడియున్న, విశ్వమ్ = సమస్త మగు, అశివమ్ = అమంగళకర మైన విషయవాసనాదికమును, వ్యాపూయ= శోధించి, సత్, గుణ, గణాన్ = మేలిగుణములసమూహములను, ఆధాయ, అపి = చేకూర్చుకొనియు, అహమ్ = నేను, త్వత్, పాదయోః = నీపాదముల యొక్క (సేవకు) అర్హః = తగినవాఁడను, న = కాను.

విశేషములు :- అంహః ప్రసహ్య వినిగృహ్య - ధర్మేణ పాపమపనుదతి (ప్రాయశ్చిత్తాది ధర్మకార్యముచేతఁ బాపమును పోఁగొట్టుకొనుచున్నాఁడు) అనున్యాయముచేతఁ గ్రమముగాఁ జిరకాలానుష్ఠితప్రాయశ్చిత్తముచేత దుష్కర్మజనితము లగుపాపముల నణఁచి వేసి యని భావము.

విశోధ్య బుద్ధిమ్—

జన్మాంతరసహస్రేషు తపోజ్ఞాన సమాధిభిః ।
నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే ॥

వేలకొలఁది జన్మములకుఁ దపోజ్ఞానసమాధులచేత క్షీణపాపులగు మానవులకు (శ్రీకృష్ణునియందు భక్తి జనించును.) అన్నవిధముగాఁ బ్రక్షీణాశేషకల్మషుఁ డగు పురుషునిచిత్తములో భక్తి జనించునట్లు నాబుద్ధిని శోధించి భక్తి నుద్భవింపఁ జేసికొని యని యాశయము.

వ్యాపూయ—అనుచోట 'వ్యాధూయ' అని పాఠాంతరము. అప్పుడు - పోఁగొట్టి యని యర్థము.

తా:- ఓవైకుంఠపతీ! బలాత్కారముగా నాపాపముల నణఁగఁ
ద్రొక్కి నాబుద్ధిని బాగు చేసి భక్తిని గలిగించి జన్మాది
బద్ధమై యమంగళకర మగు నీ సమస్తవిషయవాసనాదిక
మును బోఁద్రోలి సద్గుణజాతమును గలిగించుకొనియు
నేను చిరకాలము పాపకూపములో మునిఁగినవాఁడ నగుట
చేత నీపాదపరిచర్యకుఁ దగను.

శా॥ప్రాయశ్చిత్తముచేతఁ బాపముల సం
బాళించియుఁ బుద్ధి నా
యాయోగంబున శుద్ధి సల్పియు నభ
వ్యంబై జనుర్వాసనా
భూయిష్ఠం బగునార్తిఁ బాసియు గుణం
బుల్ చెందియున్ నేఁ దగన్
నీయంఘ్రిన్ గొలువన్ జిరంబు దురితా
నీకాబ్ధిలో మున్గుటన్.

అవతారిక :- భగవానుని దయావాత్సల్యాదిగుణముల ననుసం
ధించుకొనుచు మఱల సమాహితచిత్తు లగు చున్నారు.

శ్లో॥ జానేఽథవా కి మహ మంగ ! య దేవ సంగా
దంగీకరోషి యది మంగళ మన్య దస్మాత్ ।
తేన త్వ మేన మురరీకురుషే జనం చే
న్నైవాముతో భవతి యుక్తతరో హి కశ్చిత్ ॥ 87

ప్రతి :- అథవా = అట్లు కానియెడల, అంగ ! = ఓవైకుంఠ
నాథుఁడా !, అహమ్=నేను, కిమ్=ఏమి, జానే=ఎఱుఁ

గుదును ? యత్ + ఏవ = పూర్వోక్త మగు ఏపాపమునే, సంగాత్ = స్వస్వామిభావరూప మగు సంబంధమువలన, అస్మాత్ = ఈపాపముకంటెను, అన్యత్ = ఇతర మగు, మంగలమ్=(నీవు పరిగ్రహించుటకుఁ గారణ మగు) సుకృతము, నహి=లేదు, (ఇతి, మత్వా=అని తలఁచి) అంగీకరోషి, హి = అంగీకరించు చున్నావు గదా ! (పాపమునే పుణ్యమునుగా అంగీకరించుచుంటివి గదా యని భావము) లేదా—అంగ ! = ఓదేవా ! యత్ +ఏవ=ఏపాపమునే సంగాత్=స్వస్వామిభావసంబంధమువలన, అంగీకరోషి= అంగీకరించు చున్నావో, అస్మాత్ = ఈనీయంగీకారముకంటెను, అన్యత్ =ఇతర మగు, మంగలమ్=సుకృతము, నహి=లేదు, (అని యేనియుఁ జెప్పికొన వచ్చును) తేన= అందుచేతఁ దోషములందు గుణత్వబుద్ధికి మూలకారణ మగు స్వస్వామిభావ సంబంధముచేత, త్వమ్ = నీవు ఏనమ్ = పూర్వోక్తకలుషదూషితుఁడ నగు ఈ నన్ను, ఉరరీకురుషేచేత్ =అంగీకరింతు వేని, అముతః=ఈజనుని కంటె, యుక్తతరః = మిక్కిలి యోగ్యుఁ డగువాఁడు, కశ్చిత్ =ఒక్కఁడును, నైవ, భవతి, హి = లేనేలేఁడు గదా!

విశేషములు :- య దేవ సంగాత్, అంగీకరోషి నహి మంగల మన్యదస్మాత్ – ఓ వైకుంఠనాథుఁడా! నా కున్నపాపమునే

స్వసామి భావసంబంధమువలన నీవు దగ్గఱదీయఁ దగినపుణ్యా ముసుగా నంగీకరింతు వేని నన్ను మించినవాఁ డెవఁడు? అని భావము.

భగవంతుఁడు భక్తులయందలిదోషములను గుణములను గానే యనుభవించు నని భావము,

ఇందులకు రామాయణము ప్రమాణము

'దోషో యద్యపి తస్య స్యాత్ । సతా మేత దగర్హితమ్।
విభీషణో వా సుగ్రీవ । యదివా రావణః స్వయమ్

ఏనంజనం, ఉరరీకురు షే చేత్ —

'అః స్మర్తు మేవ కథ మర్హతి మాదృగంహాః' అన్నట్లు నిన్నుఁ దలంచుటకే యోగ్యత లేని యెన్నో పాపములఁ జేసిన యీ జడుని అని యాశయము.

'నైవాముతో భవతి యుక్తతరో హి కశ్చిత్' తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తి ర్విశిష్యతే— అని గీతలోఁ జెప్పఁ బడిన యోగిశ్రేష్ఠుఁడు గూడ నితనితో సమానుఁడు కాఁ డని తాత్పర్యము.

తా :- ఓ వైకుంఠపతీ! నే నేమి యెఱుఁగుదును, నీ యంగీకారమునకుఁ గారణ మగు భవదీయ వాత్సల్యాదికమును విడఁదీసి యిది యీ యనుగ్రహమునకు హేతు వని తెలియఁ జాలను, పాప మితని దగ్గఱఁ బాపముకంటె నితర మైనది యేమియు లేదు. స్వస్వామి భావసంబంధముచే

నీ పాపమునే పుణ్యముగా గ్రహించి వీనినిఁ జేపట్టెద నను కొని యో దేవా! పాపదూషితుఁడ నగు నన్నుఁ గనికరిం చెదవేని నా కంటె లోకమున గొప్పవాఁ డెవఁ డుండును.

ఉ॥ నన్నుఁ బరిగ్రహించెడిగు
ణం బది నీయెడ నేదో! సద్గుణా
భ్యున్నత! నే నెఱుంగ నఘ
పుంజముదప్ప గుణంబు నాయెడన్
జిన్నది యేని లే దదియె
శ్రీపతి! భోగ్యముగాఁ దలంతువే
నిన్ నినుఁ బోలు నెవ్వఁ డవ
నీతలిలో నఖిలాండనాయకా!

అవతారిక :- నిరంతరము పాపములనే యాచరించు చున్న తాను కేవలవాత్సల్యమూలాల మగు భగవత్కృప కెట్లు విషయ మగుదు నని మరల శంకించుకొను చున్నారు.

శ్లో॥ య న్నాభవామ భవదీయకటాక్ష లక్ష్యం
సంసారగర్తపరివర్త మతోఽగమామ।
ఆగాంసి యే ఖలు సహస్ర మజస్ర మేవం
జన్మ స్వతన్మహి కథం త ఇమేఽనుకంప్యాః॥

ప్రతి :- యత్ = ఏకారణమువలన, భవదీయ, కటాక్ష, లక్ష్యమ్ = దేవరవారి సంబంధ మగు, క్రేగంటిచూపునకు గుఱి, న+అభవామ = కామో, అతః = ఈకారణమువలన సంసార, గర్త, పరివర్తమ్ = సంసార మనెడు బిలమునందు

(గుంటయందు) తిరుగుచును, అగమామ = పొందితిమి, ఏవమ్=ఇట్లు, జన్మసు=అనేక జన్మములందు, అజస్రమ్= ఎల్లప్పుడు (తెంపులేకుండ) సహస్రమ్=వేలు, ఆగాంసి, ఖలు=అపరాధములనే కదా, అతన్మహి = చేసితిమి, తే, ఇమే=ఆవీరు, కథమ్=ఎట్లు, అనుకంప్యాః=దయదలఁచఁ దగినవారు, (భవేయుః=అగుదురు)

విశేషములు :- సంసారగర్తపరివర్తమ్—సంసారమును గర్తముతో (గుంటతో) పోల్చుట దురారోహత్వసూచనము కొఱకు, సంసారమనెడు గుంటలోఁ బడినవాఁడు మరలఁ బైకి రాలేఁడని భావము. జాయమానకాలమునందుఁ బరమాత్మ వారిని కటాక్షించకుండుటయే వారు నిత్యసంసారు లగుటకు హేతువు.

'త ఇమే'— అనేకజన్మములందు నిరంతర మనేకాపరాధముల నొనర్చునీమే మని భావము.

'వధార్హ మపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్' అంతఃపురాపరాధ మొనర్చి వధార్హుఁడగు కాకాసురుని శ్రీరాముఁడు కృపచేసి కావలేదా ? అన్నచో ఆ కాకాసురుఁ డొకమారే యపరాధ మొనర్చెను గాని, మావలె జన్మజన్మములందు ననేకాపరాధము లొనర్ప లేదని భావము.

తా :- ఓవైకుంఠపతీ ! దేవరవారి కరుణాకటాక్షమునకు గుఱి కాకపోవుటచేత మేమీ సంసారగర్తమునఁ బడి తిరుగు

చున్నాము. జన్మజన్మములందును వేలకొలఁది యపరాధ
ముల నిరంతర మొనర్చు చున్నాము. ఇట్టి మేము నీదయ
కెట్లు పాత్రులము కాఁగలము ?

ఉ॥ తామరసాక్ష ! నీదుసము
దాత్త దృగంత విలాసలక్ష్యముల్
కామి నిటుల్ దురంతభవ
గర్తములం బడి పొర్లుచుండ్ సహా
స్రామితముల్ జనిం జని మ
హాఘములం బొనరించు మే మెటుల్
కోమలదేహా! నీకరుణ
కుం గుదు రయ్యెదమో ! యనూహ్యమా.

అవతారిక :- ఇప్పుడు సంసారమనెడు గుంటలోఁ బడి పరిశ్రమ
చెందుచుఁ గర్మజ్ఞానభక్తిశూన్యుఁడనై యున్నాను 'ఏవం
సంసృతిచక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః జీవే దుఃఖాకులే
విష్ణోః కృపా కా ప్యుపజాయతే' (ఇట్లు సంసారచక్రమున
నుండి నిజకర్మలచేతఁ ద్రిప్పఁ బడుచు దుఃఖాకులుఁడై
యున్న జీవునిపై విష్ణుమూర్తికి నిరుపాధికకృప కలుగును)
అని నుడువఁ బడిన నిర్హేతుకకృపయే గతి యని విశదీక
రించు చున్నాను.

శ్లో॥ సత్కర్మ నైవ కిల కించన సంచినోమి
విద్యాప్యవద్యరహితా న తు విద్యతే మే ।

కించ త్వదంచితపదాంబుజభక్తిహీనః
పాత్రం భవామి భగవన్! భవతో దయాయాః॥ ౬౨

ప్రతి :- (హే) భగవన్! = షడ్గుణైశ్వర్యసంపన్నుఁడ వగు నోవైకుంఠనాయకా!, కించన = కొంచె మేనియు, సత్, కర్మ = యోగ్య మగు కర్మమును, నైవ, సంచినోమి = సంపాదించుకొన నేలేదు, కిల=ప్రసిద్ధము, అవద్యరహితా= నిర్దుష్ట మైన, విద్యా, అపి = జ్ఞాన మైనను, మే = నాకు, నతు, విద్యతే=లేదు, కించ=మఱియు, త్వత్, అంచిత, పదాంబుజ, భక్తి, హీనః = దేవరవారియొక్క, అందఱి చేతఁ బూజింపఁబడు పాదపద్మములందును భక్తి లేని వాఁడను, (అహమ్=ఇట్టి నేను) భవతః=నీయొక్క, దయా యాః=నిర్హేతుక మగు కృపకు, పాత్రమ్ = పాత్రమును, భవామి=అగు చున్నాను.

విశేషములు :- సత్, కర్మ — ఫలాసక్తి, కర్తృత్వబుద్ధియు, లేని కేవలభగవదారాధనరూపమగు యజ్ఞదానాదికమును నిత్యనైమిత్తికభేదముచేత వర్ణాశ్రమవిహితము నగు కర్మ మని భావము.

విద్యాఽప్యవద్యరహితా—సంశయ, విపర్య, యాదిదోష ములు లేనిజ్ఞాన మని యాశయము. అర్థపంచకవిషయక మగు సమీచీనజ్ఞాన మని సారాంశము.

... భక్తిహీనః — మహనీయవిషయక మగుప్రీతిని భక్తి యందురు. కర్మజ్ఞానభక్తి యోగములలో నొక్కదానియందును

ప్రవేశములేనివాఁడ నని తాత్పర్యము.

తా :- ఓవైకుంఠనాయకా! నేను కొంచె మేనియు సత్కర్మ మును గూడఁ బెట్టికొని యుండ లేదు. సందేహము మిథ్యా జ్ఞానము మున్నగుదోషములు లేని యర్థపంచకవిషయమగు సమీచీనజ్ఞాన మేనియు నాకు లేదు. అంతే కాదు. అందఱి చేత నారాధింపఁ బడు దేవరవారి పాదపద్మములం దైనను భక్తి లేదు. ఇట్లు కర్మజ్ఞానభక్తియోగములకు దూరుఁడ నైననాకు శ్రీవారి నిర్హేతుకజాయమానకృప యొక్కటే యింక దిక్కు.

శా॥కొంచెం బేనియుఁ గూడఁ బెట్టుకొన వై
కుంఠేశ! సత్కర్మ, మా
ర్జించన్ బో! నిరవద్యవిద్య నయినన్
శ్రీవారిపాదాల య
త్కించిద్భక్తియు లేదు సంసృతిపయో
ధిన్ దాఁట నిర్హేతుకో
దంచత్త్వత్కృప యొండె నౌకవలె నా
ధారంబు దేవోత్తమా!

శ్లో॥ కిం భూయసా ప్రలపితేన య దేవ కించిత్
పాపాహ్వ మల్ప మురు వా త దశేష మేషః।

జానన్నవా శతసహస్రపరార్థకృత్వో
యోఽకార్ష మేన మగతిం కృపయా క్షమస్వ॥ 90

ప్రతి :- భూయసా = ఎక్కువ, ప్రలపితేన = ప్రలాపముచేత (వాగుడుచేత) కిమ్=ఏమి ప్రయోజనము ? అల్పం, వా= కొంచెము గాని, ఉరు, వా=ఎక్కువ గాని, యత్, ఏవ, కించిత్ =ఏకొంచెమే కాని, పాపాహ్వామ్ = పాప మనెడు పేరు గల యేకర్మము గలదో, తత్ =దానిని, అశేషమ్= అంతయును, జానన్, వా= తెలియుచుఁ గాని, న, వా= తెలియక కాని, యః=ఏ, ఏషః=ఈ, అహమ్=నేను, శత, సహస్ర, పరార్థ, కృత్వః=నూఱుసార్లు, వేయిసార్లు, పరార్థముసార్లు (పలుసార్లు) అకార్షమ్=చేసితినో, అగతిమ్=దిక్కు లేని (నీకంటె వేఱే రక్షకుఁడు లేని) ఏనమ్= వీనిని, కృపయా= కేవలదయచేత, క్షమస్వ=క్షమింపుము.

తా :- ఓవైకుంఠనాయకా! పెక్కుమాటలతో నేమి ప్రయోజనము ? కొంచెము గాని, గొప్ప గాని, యేమాత్రమే యైనను పాప మనెడి నాదుష్కర్మ మేది గలదో దాని నంతయుఁ దెలిసియో తెలియకో నేను వందలు వేలు పరార్థములసార్లు చేసియే యున్నాను. దేవా! దిక్కు లేని అనన్యశరణుఁడ నగు నన్ను నీవు నీ నిర్హేతుకజాయమాన కృపచేత రక్షింప వలయును.

(సశేషము)

ఉ॥ ఏమి ఫలంబు గల్గు నిటు
లెన్ని వచించినఁ బాపనామకం
బై మహి నొప్పుదుష్కృతము
నంతయొ యింతయొ నే నెఱింగియో
నామదిలో నెఱుంగకొ యొ
నర్చితి వందలు వేలు సారు లో
స్వామి! భవత్కృపాగుణమె
సైఁపవలెన్ గతి లేనియీతనిన్.

అవతారిక :— ఇప్పుడు శ్రీవారిపరిగ్రహాతిశయసూచకంబు లగు జ్ఞానభక్త్యాదులకు నిలయమైన భగవద్రామానుజాచార్యుల వారిచేఁ బరిగృహీతుఁడ నైనను నన్ను విషయవాసన లట్టిట్టు చేయుచున్నవని విచారపడుచున్నారు.

శ్లో॥ దేవ! త్వదీయచరణ ప్రణయప్రవీణ
రామానుజార్యవిషయీకృత మప్యహో! మామ్
భూయః ప్రధర్షయతి వైషయికో విమోహో
మత్కర్మణః కతర దత్ర సమానసారమ్॥ 91

ప్రతి :— దేవ=ఓ వైకుంఠనాయకా! త్వదీయ......విషయీకృతమ్—త్వదీయ=నీసంబంధము లగు, చరణ = పాదము లందలి, ప్రణయ=భక్తియందు, ప్రవీణ = నిపుణుఁ డగు, రామానుజార్య=రామానుజాచార్యవర్యునిచేత, విషయీ

కృతమ్, అపి = పరిగ్రహింపఁ బడినవాఁడ నైనప్పటికిని, మామ్ = నన్ను, వైషయికః = విషయసంబంధి యగు, విమోహాః = వ్యామోహము (భ్రాంతి) భూయః = మాటి మాటికి, ప్రధర్ష యతి = పరిభవించుచున్నది (తనవలలో వేసికొను చున్నది) అహో = ఆశ్చర్యము, అత్ర = ఈ లోకమునందు, మత్, కర్మణః = నాకర్మమునకు, సమాన సారమ్ = తుల్యబలము గలది, కతరత్ = ఏది గలదు ?

విశేషములు :- త్వదీయచరణ—అనుచోట 'త్వదంఘ్రియుగళీ' అని పాఠాంతరము గలదు - అప్పుడు త్వత్ = నీయొక్క, అంఘ్రి = పాదములయొక్క, యుగళ = జంటయందలి అని యర్థము.

వైషయికోవిమోహాః — అత్యంత హేయవిషయములందు భోగ్యతాబుద్ధి.

తా :- ఓవైకుంఠనాథా ! నీ పాదారవిందములందు భక్తిప్రప త్తులు గల భగవద్రామానుజాచార్యులవారిచేఁ జేపట్టఁ బడిన నన్ను సైతము విషయవ్యామోహము తనవలలో వేసికొని బాధించు చున్నది. ఆహా ! నాకర్మకుఁ దుల్య బలము గలది యేది గలదు ?

శా॥ దేవా ! త్వచ్చరణారవిందయుగళీ
దేదీప్యమానోజ్జ్వల
ద్భావుం డైనప్రపన్నమూర్తి భగవ
ద్రామానుజాచార్యుచే

మావాఁ డంచు గృహీతుఁడౌ నితని నీ
మాడ్కిం గలంపంగ భో
గావేశంబు సమానసార మెది యా
హా! నాదు దుష్కర్మకుఁ ?

అవతారిక :- ఇప్పుడు సాంసారికదుఃఖము లత్యంతదుస్సహము లని యైదుశ్లోకములతో నిరూపించు చున్నారు.

శ్లో॥ గర్భేషు నిర్భరనిపీడనఖిన్నదేహః
క్షోదీయసోఽపి మహతోఽప్యఖిలస్య జంతోః।
జన్మాంతరా ణ్యనువిచింత్య పరః సహస్రా
ణ్యత్రాహ మప్రతివిధి ర్నిహత శ్చరామి॥ 92

ప్రతి :- క్షోదీయసః = మిక్కిలి చిన్న దైనట్టియు, అతిమహతః = మిక్కిలి గొప్పదైనట్టియు, అఖిలస్య = సమస్తమైన, జంతోః = ప్రాణికి, గర్భేషు = మాతృగర్భములందు, నిర్భర, నిపీడన, ఖిన్న, దేహః = మిక్కిలి యొత్తిడిచేత క్లేశమును బొందిన దేహము గలవాఁడ నగుచు, పరః సహస్రాణి = వేలను మించిన, జన్మాంతరాణి = ఇతరజన్మములను, అనువిచింత్య = వరుసఁగాఁ దలఁచుకొని, నిహతః = మృతప్రాయుఁడనై, అహమ్ = నేను, అత్ర = ఈకాలమునందు, అప్రతివిధిః = ప్రతిక్రియ లేనివాఁడనై, చరామి = తిరుగుచున్నాను

విశేషములు :- క్షోదీయసః — అల్పశరీరపరిమాణము గల చీమ మున్నగు ప్రాణియొక్క.

అతిమహతః — అతిస్థూలపరిమాణము గల యేనుఁగు మొదలగు ప్రాణియొక్క.

జన్మాంతరాణ్యనువిచింత్య — ప్రాణికి గర్భములో నున్నప్పుడు జాతిస్మరణ ముండును. జన్మించినతరువాత నాజ్ఞానము భ్రష్ట మగును. ఈవిషయము శ్రీవిష్ణుపురాణమునం దీ క్రింది శ్లోకములలోఁ జూడ నగును.

శ్లో॥ నిరుచ్ఛ్వాస స్సచైతన్య స్స్మరన్ జన్మశతా న్యపి
ఆస్తే గర్భేఽతిదుఃఖేన నిజకర్మనిబంధనః
విజ్ఞానభ్రంశ మాప్నోతి జాతశ్చ మునిసత్తమ!

తా॥ ఓ వైకుంఠపతీ! అత్యల్పశరీరపరిమాణముగల చీమ, అతిస్థూలశరీరపరిమాణముగల యేనుఁగు మున్నగు ప్రాణుల గర్భమునందు మిక్కిలి ఒత్తిడిచేత క్లేశపడుచున్న శరీరముతో వేలసంఖ్యకు మించిన తొలుతటి జన్మములను వరుసగాఁ దలంచుకొనుచు జీవచ్ఛవంబు నైననే నీకాలమునఁ బ్రతిక్రియాశూన్యుఁడ నగుచు సంచరించుచున్నాను.

ఉ॥ చిన్నశరీరముల్ గలుగు
చీమలకద్దున స్థూలకాయసం
పన్నగజాలిమత్తుల న
పారపుటొత్తిడి నల్గుచున్ గటా!
యెన్నియొ జన్మముల్ వరుస
నెంచుచు జీవముతో శవంబునై
యెన్నఁడ! కుంది యూవెతల
వీడఁ బ్రతిక్రియఁ జేయ నిత్తఱిన్.

శ్లో॥ భూయశ్చ జన్మసమయేషు సుదుర్వచాని
దుఃఖాని దుఃఖ మతిరిచ్య కి మప్యజానన్।
మాఢోఽనుభూయ పున రేవ తు బాలభావాత్
దుఃఖోత్తరం నిజచరిత్ర మముత్ర సేవే॥

ప్రతి :- భూయః, చ = తిరిగియు (గర్భక్లేశానుభవానంతరము సైతము) జన్మ, సమయేషు = జన్మకాలములందు, సుదుర్వ్చాని = ఇట్టివి యిన్ని యని చెప్పుటకు వీలుగాని, దుఃఖాని = దుఃఖములను, అనుభూయ = అనుభవించి, దుఃఖమ్ = దుఃఖమును, అతిరిచ్య = అతిక్రమించి, కిమపి = దేనిని గూడ, అజానన్ = ఎఱుఁగని వాఁడ నగుచు, మూఢః = తెలివిలేనివాఁడనై, పున, రేవ తు = తిరిగియు, బాలభావాత్ = బాలత్వమువలన, అముత్ర = పరలోకమునందు, దుఃఖ + ఉత్తరమ్ =, దుఃఖప్రచుర మగు నిజ, చరిత్రమ్ = స్వకర్మమును. సేవే = సేవింతును.

విశేషములు :- సుదుర్వ్చాని — ఇట్టివి, ఇన్ని అని చెప్ప శక్యములు కాని,

మూఢః — దుఃఖనివృత్తికి ఉపాయజ్ఞానము లేనివాఁడు (దుఃఖనివర్తకోపాయజ్ఞానశూన్యః) అముత్ర = పరలోకమునందు.

తా :- ఓవైకుంఠనాథా! గర్భదుఃఖానుభవానంతరము జనన సమయములందలి యిట్టివి యిన్ని యని నిర్వచించుటకు శక్యములు కాని దుఃఖముల ననుభవించి దుఃఖముతప్ప మఱి యొకదాని నెఱుఁగక దుఃఖనివర్తనోపాయమును దెలియక బాలుఁడ నగుటచేత సుఖోపాయానుష్ఠానము లేని వాఁడు మరలఁ బరలోకమునందును దుఃఖప్రచుర మగు నాకర్మమునే సేవింపఁ గలను.

ఉ॥ వెండియు జన్మకాలముల
విస్తృతరూపము లిట్టి వంచు నె
వ్వండును జెప్ప లేనివల
వంతలఁ బొక్కుచు వంతదప్ప వే
ఱొండు నెఱుంగక వ్వెతల
నూడ్పఁగఁ జాలక బాల్యలీలలో
నుండితిఁ బొందువాఁడఁ దుది
నుగ్రతరార్తులనే పరంబునన్.

అవతారిక :- ఇప్పుడు యౌవనకాలిక మగు జీవితము ననుసంధించుకొను చున్నాము.

శ్లో॥ భూయాంసి భూయ ఉపయన్ వివిధాని దుఃఖా
న్యన్య చ్చ దుఃఖ మనుభూయ సుఖభ్రమేణ ।
దుఃఖానుబంధ మపి దుఃఖవిమిశ్ర మల్పం
క్షుద్రం జుగుప్సితసుఖం సుఖ మి త్యుపాసే ॥ 94

ప్రతి :- భూయః = తిరిగియు, వివిధాని = పెక్కురకము లగు, భూయాంసి = అనేకము లైన, దుఃఖాని = దుఃఖములను, ఉపయన్ = పొందుచు, (అహమ్ = నేను) అన్యత్ = ఇతర మగు, దుఃఖం, చ = దుఃఖమును గూడ, సుఖ, భ్రమేణ = సుఖ మనెడు భ్రాంతితో, అనుభూయ = అనుభవించి, దుఃఖ విమిశ్రమ్ = (అనుభవదశయందే) దుఃఖముతోఁ గలసి నట్టియు, దుఃఖానుబంధ మపి = (కాలాంతరమున) దుఃఖోత్పాదక మైనట్టియు, అల్పమ్ = స్వల్పమైనట్టియు. క్షుద్రమ్ = అల్పకాలిక మైనట్టియు, జుగుప్సితసుఖమ్ = శిష్టులచేత

గర్హింపఁ బడిన విషయసుఖమును, సుఖమ్, ఇతి—నిజమైన సుఖ మని, ఉపాసే—సేవించు చున్నాను.

విశేషములు :- క్షుద్రమ్ — అల్పకాలముమాత్రమే యుండు నది. క్షీణించు నదియు, స్వప్నకల్ప మైనదియు నని భావము.

తా :- ఓ వైకుంఠపతీ! తిరిగి యౌవనకాలమున నానావిధము లగు ననేకదుఃఖముల నొందుచు వీనికంటె భిన్నము లగు దుఃఖములను గూడ సుఖభ్రాంతితో ననుభవించి దుఃఖము లతోఁ గలసినట్టియు, భావికాలమున దుఃఖమునే పెంచు నట్టియు, శిష్టులచే గర్హింపఁ బడినట్టియు, అల్ప మైనట్టియు, క్షుద్ర మగు విషయసుఖమునే నిజమైన సర్వోత్తమ మైన సుఖమునుగా నుపాసించు చున్నాను.

శా॥ తారుణ్యంబునఁ బెక్కుదుఃఖముల ని
త్యం బందుచుఁ దత్సమా
కారంబౌ పెఱదుఃఖముల్ సుఖమతిన్
గాంక్షించుచుఁ దుఃఖవి
స్తారోత్పాది విమిశ్రదుఃఖము నతి
స్వల్పంబు గర్హ్యంబు ని
స్సారంబౌ కలఁ బోలుగ్రామ్యసుఖమే
సౌఖ్యంబుగా నెంచితిన్.

శ్లో॥ లోలదృష్టి రింద్రియహయై రపథేషు నీతః
దుష్ప్రాపదుర్లభమనోరథ మథ్యమానః ।
విద్యాధనాభిజనజన్మమదేన కామ
క్రోధాదిభి శ్చ హతధీ ర్న శమం ప్రయామి ॥ 95

ప్రతి :- లోలద్భిః = చంచలము లగు, ఇంద్రియహయైః = ఇంద్రియము లనెడు గుఱ్ఱములచేత, అపథేషు = అపమార్గములందు, నీతః = తీసికొని పోఁబడినవాఁడనై, దుష్ప్రాప, దుర్భగ, మనోరథ, మథ్యమానః— పొందరానివియు నిందితములును అగు మనోరథములచేఁ బీడింపఁబడుచు, విద్యా, ధన, అభిజన, జన్మ, మదేన = విద్యవలన, ధనమువలన, ఆభిజాత్యమువలనఁ బుట్టుక గల మదముచేతను, కామ, క్రోధాదిభిః, చ = కామము క్రోధము మొదలుగాఁ గలవానిచేతను, హతధీః = కొట్టఁబడినబుద్ధిగల వాఁడనై, శమమ్ = శాంతిని, న, ప్రయామి = పొందను.

విశేషములు :- 'లోలద్భి రింద్రియహయై రపథేషు నీతః' ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః — (ఇంద్రియములు వేధించి వేధించి బలవంతముగా మనస్సును హరించి వేయును.) అని గీతావచనము.

శమమ్ = ఇంద్రియజయమును.

తా॥ ఓ వైకుంఠనాయకా! చంచలము లగు నింద్రియములనెడు గుఱ్ఱములచేతఁ జెడుదారికి లాగఁ బడినవాఁడనై దుర్లభములును గర్హితములు నగు మనోరథశతములచేఁ బీడింపఁబడుచు, విద్యాధనాభిజాత్యమదముచేతను కామక్రోధాదులచేతను కలుషితబుద్ధినై శాంతిని జెందకున్నాను.

శా॥ దుర్వారేంద్రియచంచలాశ్వములు బల్
దుర్మార్గమం దీడ్వఁగా,

నిర్వేలాసులభాభిలాషశతముల్
 నిత్యంబుఁ బీడింపఁగా,
గర్వంబుల్ సుకళాధనాభిజన సం
 క్రాంతంబు లాడింప, నం
తర్వైరుల్ మదిఁ దూఁటు సేయ శమ మొం
 దన్ రాదు భక్తావనా!

అవతారిక :- ఇదివఱకుఁ జెప్పఁ బడినదానినే వివరించు చున్నారు.

శ్లో॥ లభ్యేషు దుర్లభతరే ష్వపి వాంఛితేషు
జాతా సహస్రగుణతత్ప్రతిలంభనేఽపి।
విఘ్నై ర్హతే ష్వపిచ తేషు సమూలఘాతం
వర్ధిష్ణు రేవ నతు శామ్యతి హంత తృష్ణా! 96

ప్రతి :- లభ్యేషు=సులభములును, దుర్లభ, తరేషు=అత్యంత దుర్లభములును అగు, వాంఛితేషు = ఇష్టవస్తువులందు, జాతా=పుట్టిన, తృష్ణా=ఆశ, సహస్రగుణ, తత్, ప్రతిలంభనే, అపి = వేయిరెట్లు హెచ్చుగా ఆసులభవాంచితముల లాభము గల్గినను, తేషు, ఆ యత్యంతదుర్లభవాంఛితములు, సమూలఘాతమ్ = మొదలంట నాశముతోఁ గూడినట్లు, విఘ్నైః = విఘ్నములచేత, హతేషు, అపి= హింసింపఁ బడినప్పటికి, వర్ధిష్ణుః ఏవ=వృద్ధిచెందు నదియే, (భవతి = అగుచున్నది) తు = ఇఁక నేమి యనఁగా న, శామ్యతి=శమింపదు, హంత! = అయ్యో!

విశేషములు :- సహస్రగుణతః ప్రతిలంభనేఽపి—అని పాఠాంతరము - అప్పు డర్థము,

సహస్రగుణతః = వేయిరెట్లుగా (తేషామ్ = ఆ సులభగుణములయొక్క) ప్రతిలంభనేపి - లాభము గల్గినను. అని చెప్పుకొనవలెను. సులభవాంఛితములు వేయిరెట్లు హెచ్చుగా సిద్ధించినను తృష్ణ శమింపదు ; దుర్లభతరవాంఛితములు మొదలంట నశించినను తృష్ణ శమింప దని భావము.

తా :- ఓ వైకుంఠపతీ ! సుఖలభ్యము లగు వాంఛితము లను కొన్నదానికంటె వేయిరెట్లు హెచ్చుగా లభించినను వానిపైఁ దృష్ణ శమింపదు. అత్యంతదుర్లభములగు వాంఛితములు విఘ్నములచేత మొదలంట నశించినను వాని మీఁదను దృష్ణ తగ్గుటలేదు. పైపెచ్చు వృద్ధి చెందుచున్నది. ఇది చాల విచారకరము.

మ॥ సులభంబుల్ కడు దుర్లభంబు లగుచున్
జూపట్టుబల్ వాంఛితం
బులపైఁ దృష్ణ శమింప దార ! సులభం
బుల్ వేయిరెట్లెచ్చుగా
నలవడ్డన్ మఱి దుర్లభంబులును వి
ఘ్నారంభవిధ్వంసితం
బులునై మూలము ముట్టఁగాఁ జెడిన ను
బ్బుం గాని క్షీణింపదా.

అవతారిక :- ప్రాతికూల్యమును విడనాడఁ జాలమిని వివరించి యానుకూల్యసంకల్ప మేనియు లే దనుచున్నారు.

శ్లో॥ త్వత్కీర్తనస్తుతినమస్కృతివేదనేషు
శ్రద్ధా న భక్తి రపి శక్తి రథో న చేచ్ఛా ।
నైవానుతాపమతి రేష్వకృతేషు కింతు
భూయా నహో ! పరికరః ప్రతికూలపక్షే ॥

ప్రతి :- త్వత్, కీర్తన, స్తుతి, నమస్కృతి, వేదనేషు = దేవర వారి నామసంకీర్తనమందును, స్తోత్రమునందును, నమస్కారమునందును ధ్యానమునందును, భక్తిః = భక్తి. న = లేదు, శ్రద్ధా = విశ్వాసత్వర, (న=లేదు) శక్తిః అపి= అనుష్ఠానశక్తియైనను, (న=లేదు) అథో=అవిలేకున్నను ఇచ్ఛా, చ = రుచియైనను, న = లేదు, ఏషు = ఇవి, (దేవరవారికీర్తన స్తుతిప్రణామ ధ్యానములు) అకృతేషు= చేయఁబడనివి కాఁగా, అనుతాపమతిః, చ=పశ్చాత్తాప బుద్ధియైనను, న + ఏవ = లేనేలేదు, కింతు = కాని, ప్రతికూలపక్షే = వ్యతిరేకపక్షమునందు, భూయాన్ = అధికమగు. పరికరః = సామగ్రి (ఉపకరణము) అస్తి = ఉన్నది. అహో! = ఆశ్చర్యము.

విశేషములు :- భక్తిః మిక్కిలి అభినివేశముతోఁ గూడిన భోగ్యతాబుద్ధి.

నైవానుతాపమతిరేష్వకృతేషు—ఒక ముహూర్తకాలము భగవద్ధ్యానము లేకుండఁ గడచినను మిక్కిలి పశ్చాత్తాప పడవలె నని ప్రమాణములు ఘోషించు చున్నవి.

శ్లో॥ ఏకస్మిన్నప్యతిక్రాంతే ముహూర్తే ధ్యానవర్జితే।
దస్యుభిర్ముషితే నేవ యుక్తమాక్రందితుం నృణామ్॥

తా :- ఓవైకుంఠనాథా! నీనామకీర్తనమునందును, స్తోత్రమునందును, నమస్కారమునందును, ధ్యానమునందును, శ్రద్ధ గాని భక్తి గాని యనుష్ఠానశక్తి గాని చివర కభిరుచి గాని లేదు. ఇవి చేయక పోయితినే యన్న పశ్చాత్తాపబుద్ధిగాని

నాకు లేదు. ఆహా! ప్రతికూలపక్షమున నెంతసామగ్రీ బలము కలదు.

మ॥ భవదీయం బగుకీర్తన స్తుతి నమో
వాకంబులన్ ధ్యానమం
దపురా! శ్రద్ధయు భక్తి యాచరణకృ
త్యంబందునన్ శక్తియున్
జవియున్ లే విది చేయలే దనెడుప
శ్చాత్తాపమున్ లే దహో!
భువనేడ్యా! ప్రతికూలపక్షమున కే
పొల్పున్ బలాధిక్యముల్.

అవతారిక :- ఈ శ్లోకమునందుఁ బ్రాతికూల్యము గల దని నుడువు చున్నారు.

శ్లో॥ ఏతేన వై సువిదితం బత! మామకీనం
దౌరాత్మ్య మప్రతివిధేయ మపార మీశ!।
సమ్మూర్ఛతోఽప్యపద మస్మి యత స్త్వదీయ
నిస్సీమభూమ కరుణామృత వీచి వాయోః॥ 98

ప్రతి :- హేఈశ! = ఓవైకుంఠపతీ!, యతః = ఎందువలన, సమ్మూర్ఛతః అపి=అంతట విజృంభించుచున్న దైనప్పటికిని, త్వదీయ......వాయోః—త్వదీయ = నీసంబంధ మైన, నిస్సీమ = హద్దులేని, భూమ = మహిమగల, కరుణా= కరుణ యనెడు, అమృతవీచి = అమృతపుటలకు సంబంధించిన, వాయోః=వాయువునకును, అపదమ్=పాత్రము కానివాఁడను, అస్మి = అగుచున్నానో, ఏతేన = ఈకారణముచేత, అపారమ్ = అంతు లేనిదియు, అప్రతివిధే

యమ్ = ప్రతిక్రియ చేయ శక్యము కానిదియు, (అని) మామకీనమ్=నాసంబంధమగు, దౌరాత్మ్యమ్=దుస్స్వభావము, సువిదితంవై = సుప్రసిద్ధము గదా. బత! = అయ్యో!

విశేషములు:- దౌరాత్మ్యమ్=దుస్స్వభావత్వమ్ సువిదితంవై = ఇందలి 'వై' అను అవ్యయము ప్రసిద్ధివాచకము.

విషయవిభాగము లేకుండ — అనఁగా వీఁడర్హుఁడు వీఁడనర్హుఁ డనుభేదమును జూడక సర్వత్ర నిరాఘాటముగా వీచుచున్న భగవదనుకంపాపయోనిధి తరంగశీకర సంబంధిగంధవాహామునకు సైతము గుఱికాక పోవుటచే నాదుష్కృతము నిష్కృతిశూన్య మని పిండితార్థము.

తా:- ఓ వైకుంఠనాయకా! సర్వత్ర నిరాఘాట ప్రసారము గల మహామహిమోపేత మగు భవదీయకరుణామృతవీచీసమీరమునకు సైతము గుఱి కాకపోవుటచేత నా దౌరాత్మ్య మపారమును ప్రతిక్రియాశూన్య మనియు విదిత మగుచున్నది.

చ॥ నిరవధికప్రభావమహ
నీయభవత్కరుణామృతోర్మిని
స్సరదతిమాత్రసారభవి
సారి సమీర కుమార విక్రమ
స్ఫురణ కపాత్ర మాట గుణ
భూషణ! యియ్యది చాటదొక్కొ! మ
ద్దురితము నప్రతిక్రియము
దుర్గమపారము దుస్స్వభావముఁ.

అవతారిక :- అట్లైని- ఇంక గతి యేమియని శంకించుకొని నన్నుం జేపట్టినయెడల శ్రీవారి కల్యాణగుణములకు విషయ లాభము గలుగు నని నుడువుచున్నారు.

శ్లో॥ ఐశ్వర్యవీర్యకరుణాగరిమక్షమాద్యాః
స్వామి న్నకారణసుహృత్త్వ మథో విశేషాత్ ।
సర్వే గుణా స్సవిషయా స్తవ మా మపార
ఘోరాఘపూర్ణ మగతిం నిహతం సమేత్య ॥ 99

ప్రతి .- హేస్వామిన్=ఓ స్వామీ! వైకుంఠనాథా! ఐశ్వర్య, వీర్య, కరుణా, గరిమ, క్షమా, ఆద్యాః=ఐశ్వర్యము, వీర్యము, కృప, గొప్పతనము (గరిమ) ఓర్పు, మొదలుగాఁ గల, తవ = నీయొక్క, సర్వే =సమస్తము లైన, గుణాః = గుణములు, అథో = తరువాత, విశేషాత్ = విశేషించి, అకారణసుహృత్త్వమ్=నిర్హేతుక మగు మైత్రి, అపార ఘోర, అఘ, పూర్ణమ్ = అంతులేని దారుణ పాపములతో నిండినట్టియు (కనుకనే) నిహతమ్ = మృత ప్రాయుఁడ నైనట్టియు, మామ్ = నన్ను, సమేత్య = చేరి, సవిషయాః=చోటు గలవి (భవంతి=అగుచున్నవి)

విశేషములు :- స్వామిన్ !— ఈ సంబుద్ధి యనాయాసముగా నాశ్రితుని దుఃఖము నెఱింగి యనిష్టనివారణపూర్వకముగా నిష్టప్రాప్తిని జేకూర్చుటలో భగవానునకుఁ గల శక్తిని జాటు చున్నది.

'ఐశ్వర్య. వీర్య. కరుణా, గరిమ, క్షమా, ద్యాః'— ఇందలి భగవద్గుణంబు లన్నియు సాభిప్రాయికములు. ఎట్లన:- ఐశ్వర్యవంతుఁడు గాన భగవానుఁ డాశ్రితునివలనఁ గించిత్కా

రము నపేక్షింపఁడు. వీర్యవంతుఁడు గాన శ్రియఃపతి సంక ల్పానుగుణముగా రక్షించును. కరుణాశాలి గావున వైకుంఠ నాథుఁడు 'వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః' అన్నట్లు స్వదుఃఖనివృత్తిగా భావించి యాశ్రితుల దుఃఖమును నివర్తింపఁ జేయును. గరిష్ఠుఁడు (గొప్పవాఁడు) కనుక మాధవుఁ డాశ్రితులదోషముల నెన్నక యే దగ్గఱ తీయును. క్షమావంతుఁడు గాన నారాయణుఁ డాశ్రితుల యపరాధము లను సహించును, ఆద్యపదముచేత వాత్సల్య సౌశీల్యాదులు గ్రాహ్యములు.

సుహృత్త్వమ్ = అనుపకారిణ్యపి సౌహార్దమ్.

ఉపకారి కానివానిపైఁ గూడ నెయ్యము. ఈ గుణము అనిష్టనివృత్తి పూర్వకేష్టప్రాపణమునకు హేతువు.

అగతిమ్ = ప్రాయశ్చిత్తాది శూన్యుని.

తా :- ఓ వైకుంఠనాథప్రభూ! అపార ఘోర పాపపరిపూర్ణుఁ డను నిరాశ్రయుఁడను నిహతప్రాయుఁడ నగు నన్నుఁ జేపట్టనిచో దేవరవారి యైశ్వర వీర్య కరుణా గరిమ క్షమాది కల్యాణ గుణములకును విశేషించి సుహృత్త్వ గుణమునకును విషయము లభించునా?

ఉ॥ నన్ను నపార ఘోర వృజి
నమ్ములపాఁతఁజ దిక్కు లేనివా
ని న్నిహతోపమాను రమ
ణీ రమణీయ విశాలవక్ష! కై

కొన్నఁ గదా! త్వదీశ్వరత
కున్ గృపకున్ క్షమకున్ సుహృత్త్వకున్
సన్నుతవత్సలత్వముఖ
సర్వగుణాళికిఁ జోటు గల్గెడిన్.

అవతారిక :- ఏదో విధముగా నపరాధముల సహించినను మోక్షప్రదానము సాధనానుష్ఠాన మొనర్చినవారికే యని భగవానుఁ డను నేమో! యని శంకించుకొని సమాధానమును నుడువు చున్నారు.

శ్లో॥ త్వత్పాదసంశ్రయణహేతుషు సాధికారా
నుద్యుంజత శ్చరితకృత్స్నవిధీం శ్చ తాం స్తాన్ ।
త్వం రక్షసీతి మహిమా తవ నాల మేవ
మాం చే దనీదృశ మనన్యగతిం న రక్షేః ॥ 100

ప్రతి :- హేస్వామిన్ ! = ఓ ప్రభూ! వైకుంఠనాథా! అనీదృశమ్ = ఎట్టియధికారాది గుణములును లేనట్టియు, అనన్యగతిమ్ = గత్యంతరము లేనట్టియు, మామ్=నన్ను, న, రక్షేః, చేత్ = రక్షింప వేని, త్వత్, పాద, సంశ్రయణ, హేతుషు = దేవరవారి పాదప్రాప్తికి సాధనభూతము లగు కర్మయోగాదులందు, సాధికారాన్ = అధికారముతోఁ గూడినట్టియు, ఉద్యుంజతః = అనుష్ఠానమును ఉద్యుక్తులైనట్టియు, చరిత, కృత్స్న, విధీన్ = ఆచరింపఁ బడిన సమస్తవిధులు గలిగినట్టియు, తాన్, తాన్=

ఆయాసాధకులను, త్వమ్ = నీవు, రక్షసి = రక్షించు చున్నావు, ఇతి = అనెడు, తవ = నీయొక్క, ఏషః = ఈ, మహిమా=గొప్పతనము (మహిమము) న+అలమ్= నాలమ్ = చాలదు.

విశేషములు :- 99 వ శ్లోకమునుండి 'స్వామిన్' అను సంబుద్ధి యీశ్లోకమున కనువర్తించును.

సాధికారాన్—ఉపనయనాధ్యయనాద్యధికారసహితులను - అని భావము.

అనీదృశమ్ — శ్లోకములోఁ బూర్వార్ధమునఁ జెప్పఁబడిన యధికారములు (యోగ్యతలు) లేని,

త్వాం రక్షసీతి మహిమా తవ నాల మేషః— సాంగముగా సాధనానుష్ఠాన మొనర్చినవారిని రక్షించుట 'కృతే తు ప్రతి కర్తవ్య ఏష ధర్మ స్సనాతనః' అన్నట్లు కృతమునకుఁ బ్రతి కృతముతో సమాన మగునే కాని యది యొక మహిమ మని పించుకొనదు. ఏ సాధన మొనర్పని పాపినగు నన్నుఁ గటా క్షించిననే నీ గొప్పతనము బైటఁ బడు నని కవి మొఱ.

తా :- ఓ వైకుంఠపతీ! నీ పాదములను జేర్చుటకు సాధన భూతము లగు కర్మయోగాదులం దధికారము గల్గి యను ష్ఠానమున కుద్యమించుచు సాంగముగా సమస్త సాధనముల

నొనర్చిన యాయా పుణ్యాత్ములను రక్షించినంతమాత్ర మున నీ మహిమ వెల్లడి కాదు. అది కృతమునకుఁ బ్రతి కృత మొనర్చుటవంటిది గాన గొప్పతనమునకుఁ గారణము గాదు. ఏ యధికారము లేక యే సాధన మొనర్చని దిక్కు లేని యీ పాపిని గాపాడినచో నీమహిమ లోకవిశ్రుత మగును.

మ॥ భవదీయాంఘ్రులఁ జేర్చు సాధనములన్
ప్రాప్తాధికారుల్ క్రియా
ప్రవణుల్ సమ్యగనుష్ఠిత శ్రుతి శుభ
వ్యాపారు లౌవారి మా
ధవ! రక్షింతు వటన్న నీమహిమ మే
తన్మాత్ర ముత్కృష్ట మె
ట్లవు? నే యోగ్యత లేని నిశ్శరణు నీ
యజ్ఞున్ గటాక్షింప వేన్.

అవతారిక :- అట్లైన మోక్షసాధనానుష్ఠానవిధికి వైయర్థ్యము గలుగదా ? అనిన సమాధానమును జెప్పు చున్నారు.

శ్లో॥ యా కర్మణా మధికృతి ర్య ఇహోద్యమ స్తే
ష్వా ప్యే ష్వనుష్ఠితి రశేష మిదం హి పుంసామ్ ।
త్వా మంతరేణ న కథంచన శక్య మాప్తు
మేవం చ తేషు మయి చాస్తి న తే విశేషః ॥

ప్రతి :- యా=ఏ, కర్మణామ్=కర్మములయొక్క, అధికృతిః= అధికారము, ఇహ = ఇక్కడ, తేషు = ప్రసిద్ధము లగు, ఏషు=ఈ, కర్మసు=ముక్తి సాధనములందు, ఉద్యమః = ప్రయత్నము, అనుష్ఠితిః, అపి=అనుష్ఠానముకూడ. (ఒక టేమి) అశేషమ్=సమస్త మగు, ఇదమ్=దీనిని, త్వాం, అంతరేణ=నీవు లేకుండ, (నీసంకల్పము లేకుండ) పుంసామ్= పురుషులకు, ఆప్తుమ్=పొందుటకు, కథంచన=అతిప్రయాసముచేతఁ గూడ, శక్యమ్ = శక్య మైనది, న = కాదు, ఏవంచ = ఇట్లుండఁగా, (అంతయు నీసంకల్పాధీనమై యుండ) తేషు = వారియందును (సాధనానుష్ఠాతల యందును) మయి, చ = నాయందును, తే=నీకు, విశేషః=అతిశయము, నాస్తి=లేదు.

విశేషములు :- అశేష మిదమ్ — సమస్త మగు దీనిని - అనఁగా అధికారమును, ఉద్యమమును, అనుష్ఠానమును అని భావము.

ఏవం చ తేషు మయి చాస్తి న తే విశేషః — సర్వము నీసంకల్పాయత్తమై యుండఁగా సాధనానుష్ఠాతలయందును నాయందును విశేష మే మున్నది. లే దని భావము. సాధకుల సాధనానుష్ఠానము గూడ దేవరవారి సంకల్పాయత్త మైన

ప్పుడు నాకును శ్రీవారు స్వీయపాదాశ్రయమును సంకల్పింప వచ్చును గదా!

తా :- ఓ వైకుంఠనాయకా! పూర్వోక్తకర్మాధికారము, ఈ లోకమునం బ్రసిద్ధము లగు తత్కర్మలయందుం బ్రవృత్తి యనుష్ఠానము మున్నగు సమస్తము దేవరవారి సంకల్ప బలము లేకుండ నెవ్వరికిని బొందశక్యము గాదు. అట్టిచో దేవా! సమ్యగనుష్ఠాత లగు పూర్వోక్త సాధకులకును నాకును విశేష మేమి గలదు? దేవరవారు తమ సంకల్పముచే వారిని సాధకులనుగాం జేసినట్లు నన్ను స్వీయపాదాశ్రయునిగాం జేయవచ్చును గదా!

ఉ॥ కర్మములం బొనర్పు నధి
కారము పూనిక ముక్తిదంబు లా
ధర్మము లాచరించు చెయి
దం బొకం డేల యశేష మిద్ది నీ
కూర్మి త్వదిచ్ఛ లేక సమ
కూరునె యెవ్వని కేని నట్టిచో
భర్మదుకూల! వారకను
పట్టునె నాకును సాధకాళికిన్.

అవతారిక :- సాధనానుష్ఠాన ముఖముననే రక్షింప వలయు నని భగవత్సంకల్ప మేని అప్పు డేమి చేయవలెనో నుడువు చున్నారు.

శ్లో॥ నిర్బంధ ఏష యది తే య దశేషవైధ
సంసేవినో వరద ! రక్షసి నేతరాం స్త్వమ్ ।
తర్హి త్వ మేవ మయి శ క్త్యధికారవాంఛాః
ప్రత్యూహశాంతి మితర చ్చ విధేహి విశ్వమ్ ॥ 102

ప్రతి :- హేవరద ! = శ్రేష్ఠపురుషార్థ మగు మోక్షము నొసంగెడి ఓ వైకుంఠనాథా ! అశేష, వైధ, సంసేవినః = సమస్తమైన విధ్యుక్తధర్మములను సేవించినవారినే, త్వం= నీవు, రక్షసి = రక్షించు చున్నావు, ఇతరాన్ = అన్యులను, న, రక్షసి = రక్షింపవు, ఇతియత్ = అనుట యేది గలదో, ఏషః = ఇది, తే = నీకు, నిర్బంధః, యది = పట్టుదల యేని, తర్హి = ఆ పక్షమున (అప్పుడు) త్వం, ఏవ = నీవే, మయి = నాయందు, శక్తి, అధికార, వాంఛాః = శక్తిని, అధికారమును, వాంఛను ప్రత్యూహ, శాంతిమ్ = విఘ్ననివారణమును, ఇతరత్ = ఇతర మగు, విశ్వమ్ = సమస్తమును, విధేహి = చేయుము.

విశేషములు :- శక్త్యధికారవాంఛాః — ఇందలి శక్త్యధికార శబ్దములచేతఁ దత్కార్యము లగు ఉద్యమము, అనుష్ఠానము లక్షణావృత్తిచేతఁ జెప్పఁ బడినవి కనుక.

శక్తి, అధికార, వాంఛాః = ఉద్యమమును, అనుష్ఠానమును, కోరికను - అని యర్థము తేలుచున్నది.

ప్రత్యాహ శాంతి మితరచ్చ విధేహి విశ్వమ్ — భగవానుఁడే యందఱికి నుపాయభూతుఁడు ఈ విషయమునఁ బెద్దల యీనుడిని అనుసంధించునది.

శ్లో॥ 'సుదుష్కరేణ శోచే ద్యో। యేన యే నేష్టహేతునా।
స స తస్యాహ మేవేతి చరమశ్లోకసంగ్రహః'॥

తా :- పురుషార్థశ్రేష్ఠమగు మోక్షము ననుగ్రహించు ఓ వైకుంఠపతీ! విధ్యుక్త సమస్తసాధనానుష్ఠాతలనే రక్షింతును. అన్యులను రక్షింపను అని నీకుఁ బట్టుదల యేని ఆపక్షమున నీవే నాకు పూనికను అనుష్ఠానమును ఇచ్చను అనుగ్రహించి విఘ్నములను వారించి సాంగోపాంగముగా నవి నెఱవేఱుటకుఁ గావలసిన వన్నియుఁ గటాక్షింపుము.

ఉ॥ వైదిక కర్మనిష్ఠు లగు
వారినె కాక త్రయీవిదూరులా
వేదలఁ గావ నే ననుచు
బిట్టు వ్రతంబును బట్టియున్న చో
శ్రీదయితా! తదర్థ్వాతలఁ
జేకుఱఁ జేసి తదీయసిద్ధి కే
దేది యవశ్యమో! యొసఁగు
మీ! తొలఁగించుచు నంతరాయముల్.

శా॥ వైకుంఠ స్తవటీక వ్రాసెడుతఱిన్
వచ్చెన్ మహావిఘ్నముల్
సాకల్యం బిది యౌనొ! కాదొ! యనుచున్
జంకేటికో యేర్పడెన్
నా కీయూడిగముం బొనర్పఁ దగుపు
ణ్యం బున్నదో! లేదొ! యం
చాకంపించె మనంబు, వాసెను భయం
బావేల్పు మేల్కొల్పుచే॥

క॥ భయము గలిగించు నతఁడుఱ్
భయమును దీరిచెడు దీనబంధుం డాశ్రీ

దయితుండె యనుచు 'భయకృ
ద్భయనాశన' యన్నసూక్తి పాడుకొనె మదిన్.

సీ॥ వైకుంఠనాథు దివ్యద్గుణాంభోరాశి
నిన్నాళ్ళఁ దేలినపున్నెమునను
మించుభక్తిన్ ప్రబోధించు పంచస్తవీ
వరివస్య కొన్నాళ్ళు వరలుకతన
తనదు పంచ స్తవిన్ దెనిఁగించు నితనిపై
శ్రీవత్సచిహ్నునాశీస్సు కలిమి
దాస శేషస్వామి తనయిలు వేల్పుతో
ననుఁ గావు మని వేఁడుకొనుటఁ జేసి

ఆ॥వె॥ వచ్చువెతల నెట్టివైచి పూర్ణప్రజ్ఞ
కోవిదుండు పళ్ళెకులభవుండు
తెనుఁగు టీక నిట్టు లొనరించె వైకుంఠు
స్తవమునకును బుధులు సంతసింప.

గద్యము :— ఇది శ్రీశ్రీ వత్సాంకమిశ్రవిరచిత శ్రీ వైకుంఠ స్తవంబునకు కవి శేఖర, మహోపాధ్యాయ మధ్వశ్రీ పళ్ళెపూర్ణప్రజ్ఞాచార్య కృతంబగు 'భావాదర్శ' మను నాంధ్ర వివరణము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ.

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీవత్సాంక మిశ్రవిరచిత పంచస్తవీవిరాజమానము

# అతిమానుషస్తవము

## కవిశేఖర, మధ్వశ్రీ పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్య కృతాంధ్రవివరణ

## పద్యసహితము

అవతారిక :- శ్రీవత్సాంకమిశ్రపాదులు శ్రీవైకుంఠనాథ విషయికమగు శ్రీవైకుంఠస్తవమును బూర్తిగావించి వ్యూహావతారము గూడఁ దత్సమానయోగక్షేమము గలది యగుటచేత దాని నట్లుంచి భగవద్విభవావతారమును స్తుతింపఁ దలఁచినవారై అతిమానుషంబులగు భగవద్విచిత్రచరిత్రములం దాసక్తి గల భగవద్వాల్మీకి పరాశర పారాశర్యశుకప్రభృతులచేతను, భట్టనాథ, పరాంకుశ, పరకాల, ప్రభృతి పరమాచార్యులచేతను ఆవిష్కృతమై యతిరహస్యమై యున్న యతిమానుషచరిత్ర వైచిత్ర్యమునే యస్మదాదులకు సైతము ప్రకాశింపఁ జేయు మున్ముందు నమస్క్రియారూప మగు మంగళమును శిష్య శిక్షార్థము గ్రంథమునందు నిబంధించు చున్నారు.

శ్లో॥ అతిమానుషశీల వృత్తవేషై
రతివృత్తామర విక్రమప్రతాపైః ।
అతిలంఘిత సర్వలోకసామ్యం
వరయే వైష్ణవవైభవావతారమ్ ॥ 1

ప్రతి :- అతివృత్త, అమర, విక్రమ, ప్రతాపైః = అతి క్రమించిన వేల్పుల విక్రమము ప్రతాపము గల అతిమానుష,

శీల, వృత్త, వేషైః = మానవాతీతములైన సుస్వభావ సద్వర్తన, సురూపములచేత, (లేదా) అతివృత్త...ప్రతాపైః= అతిక్రమించిన దేవతలుగల విక్రమ ప్రతాపములుగల, అతి... వేషైః = మానవాతీతములైన సుస్వాభావ సద్వర్తన సువేషములచేత, అతిలంఘిత, సర్వ. లోక, సామ్యమ్ = అతిక్రమింపఁ బడిన సర్వజనములతోడి (లేదా - సకలలోకముల తోడి) పోలికగల, వైష్ణవ = విష్ణుసంబంధియగు, వైభవావతారమ్ =విభవావతారమును (వ్యూహావతారమును) వరయే= సమాశ్రణీయముగా స్వీకరించుచున్నాను.

విశేషము :- ఈ శ్లోకమునందలి 'విక్రమ, ప్రతాప, శబ్దముల కర్థము - విక్రమము = నిర్విశంకముగా శత్రుసేనలోఁ జొచ్చుట. ప్రతాపము = శత్రువులకు ఎదిరింప శక్యము గాకుండుట, మఱియు, సహింపశక్యము గాకుండుట.

'అతిలంఘితసర్వలోకసామ్యమ్' జన్మ కర్మ చ మే దివ్యే' అను గీతావచనానుసారము భగవంతుని జననము చర్యయు విలక్షణములు గనుక వానితోఁ బోల్చుట కితరములు తగవు. 'వరయే' అట్టి శ్రీ మహావిష్ణువు విభవావతారమునే సమాశ్రయణీయముగా వరించుచున్నాను. భగవంతుఁడుత్తమోత్తముఁడు గాన అతఁడే సమాశ్రయణీయుఁడు. 1 'సఉశ్రేయాన్ భవతి జాయమానః' 2 య స్సర్వజ్ఞః సర్వవిత్ 3 పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ 4 తమీశ్వరాణాం పరమం మహేశ్వరం న తత్సమ శ్చాభ్యధిక శ్చ

దృశ్యతే- 5 అపహతపాప్మా విజరః ఇత్యాది శ్రుతులలోఁ జెప్పఁబడిన కల్యాణగుణగణము లవతారరూపములందే చక్కఁగాఁ బ్రకాశించు చున్నవి గనుక విభవావతారమే విశేషించి సమాశ్రయణీయ మని భావము.

తాత్పర్యము :- మానవుల నతిక్రమించిన సుశీల సువర్తన సురూపములచేతను, వేలుపుల నతిశయించిన విక్రమప్రతాపములచేతను, జగత్తులో నెవ్వరితోను బోల్ప శక్యముగాని శ్రీమహావిష్ణువు విభవావతారమును సమాశ్రయణీయముగా వరించు చున్నాను.

ఉ॥ శీలము సాధువర్తనము
చెల్వగు వేషము హేలమై మను
ష్యాళి నతిక్రమింపఁ బర
మాద్భుతవిక్రమముం బ్రతాపముఁ
వేలుపులఁ జయింప నతి
వేల నిరస్తసమస్తసామ్యముఁ
శ్రీలము వైష్ణవం బెద వ
రించెద శ్రీవిభవావతారముఁ. 1

అవతారిక :- తరువాత సర్వావతారప్రధాన శ్రీ దాశరథి ప్రతినిధి శ్రీరంగనాథ చరణారవింద ప్రణామరూపంబు లగు నాల్గుశ్లోకంబుల నుడువు చున్నారు.

శ్లో॥ శ్రేయః కిరంతు కిరణా శ్చరణారవింద
నిష్యందమాన మకరందరసాభ దేశ్యాః ।

తజ్జాః శ్రుతే ర్మధున ఉత్స ఇతి ప్రతీతా
మాంగల్యరంగనిలయస్య పరస్య ధామ్నః ॥ 2

ప్రతి :- మాంగల్య, రంగ, నిలయస్య=మంగళప్రద మగు శ్రీరంగవిమానమే నివాసము గాఁగల, పరస్య = ఉత్తమమైన, ధామ్నః = తేజస్సుయొక్క, (పరంధామునియొక్క) చరణ, అరవింద, నిష్యందమాన, మకరంద, రస, ఓఘ, దేశ్యాః=పాదపద్మములనుండి స్రవించుచున్న పూఁదెనెసోనలఁ బోలునట్టియు, శ్రుతేః=వేదమునుండి (పొడమిన) మధునః=మకరందముయొక్క, ఉత్స ఇతి=ప్రవాహ మని, ప్రతీతాః = ప్రసిద్ధి కెక్కిన, తజ్జాః-(తత్ + జాః) ఆరంగనాథుని పాదములనుండి వెడలెడు, కిరణాః=కాంతులు, శ్రేయః=శ్రేయస్సును (మేలును) కిరంతు=విస్తరింపఁ జేయుఁ గాక.

విశేషము :- 'పరస్య,ధామ్నః' నారాయణపరో జ్యోతిః అని వేదప్రసిద్ధ మగు పరంజ్యోతి యని భావము.

'శ్రుతే ర్మధున ఉత్స ఇతి ప్రతీతాః' విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః - అను శ్రుతియందుఁ బ్రసిద్ధిఁ జెందిన వని తాత్పర్యము.

'శ్రేయః కిరంతు కిరణాః' నాకు శరణ్యము లగు శ్రీరంగనాథ చరణారవిందముల యొక్క కిరణములు మత్కరిష్యమాణాతిమానుషచరిత్రస్తోత్రానుగుణ మధురవాణిని నాకుఁ గటాక్షించుఁ గాక యని కవిగారి హృదయము.

తా :- మంగళప్రద మగు శ్రీరంగమున వేంచేసి యున్న పరంధాముఁ డగు శ్రీరంగనాథస్వామి పాదపద్మమకరంద ప్రవాహమును బోలి శ్రుతి యందుఁ బేర్కొనఁ బడినట్లు మధుధారలో ! యన నొప్పు నప్పరమజ్యోతి పాదకిరణములు శ్రేయస్సును వర్ధిల్లఁ జేయుఁ గాక.

ఉ॥ మంగళదాయి యన్నగరి
మంబు గణించిన రంగధామమం
దుం గల దివ్యరుక్స్ఫురణ
తోయజరాజిమరందపూరముల్
పొంగెనొ ! 'మధ్వ ఉత్స' శ్రుతి
బోధితముల్ మధుధారలో ! యనన్
రంగని యంఘ్రులన్ గెరలు
రమ్యగభస్తులు శ్రేయ మీయుతన్.

శ్లో॥ శ్రీమత్పరాంకుశమునీంద్ర మనోనివాసాత్
తజ్జానురాగరసమజ్జన మంజసాఽఽప్య ।
అద్యా ప్యనారతతదుత్థితరాగయోగః
శ్రీరంగనాథచరణాంబుజ మున్నయామః ॥ 3

ప్రతి :- శ్రీమత్, పరాంకుశ, (ముని + ఇంద్ర) మునీంద్ర, మనః, నివాసాత్ = శ్రీపరాంకుశమునీంద్రుల మనస్సునందు నిరంతరము వాసము చేయుటవలన. తజ్జ = (తత్ + జ) అను రాగ, రస, మజ్జనమ్ = ఆమనస్సునఁ బుట్టిన ప్రేమరసమునందు స్నానమును, అంజసా = త్వరగా, ఆప్య = పొంది, అద్య, అపి =

నేఁటికిని, అనారత, తత్, ఉత్థిత, రాగ, యోగమ్=ఎడ తెగని యా యనురాగరసముచే నేర్పడిన రక్తిమసంపర్కము గలదానినిగా, శ్రీరంగరాజ, చరణాంబుజమ్=శ్రీరంగనాథుని పాదపద్మమును, ఉన్నయామః = ఊహించు చున్నాము. (లేదా) నమస్కరించు చున్నాము.

విశేషము :- అనురాగరస మెఱ్ఱగా నుండు నని కవిసమయము. అందుచే ని ట్లుత్ప్రేక్షింపఁ బడినది.

ఉన్నయామః=ఉన్నతం కుర్మః—అనఁగా నమస్కరించిన వార మగుచున్నాము. అని యర్థము.

శ్రీపరాంకుశమునీంద్రుల యంతరంగము శ్రీరంగనాథ స్వామి చరణవిషయకానురాగభరితము గాన నందు నిరంతరము నివసించుటచే శ్రీరంగనాథుని పాదమునకు శ్రీపరాంకుశుల యనురాగ మంటినదని భావము.

తా :- శ్రీపరాంకుశమునీంద్రుల మనస్సున నిత్యనివాసము చేయుటవలన సమ్మునీంద్రుల యంతరంగానురాగరసమున నవగాహన మాచరించుటచేత నయ్యనురాగరక్తిమ మంటి నేఁటికిని శ్రీస్వామివారి పాదపద్మ మెఱ్ఱగా నున్నదని యూహించు చున్నాము.

ఉ॥ మానక శ్రీపరాశర స
మాఖ్య మహాముని మానసంబునం

దే నిరతంబు వర్తిలుట
నిప్పటికిన్ హృదయానురాగ పూ
రానుదినావగాహముల
నాశ్రితమానస రాగరక్తిమం
బా నసఁ దోఁచు రంగవిభు
నంఘ్రిపయోజయుగంబుఁ గొల్చెదన్

శ్లో॥ వజ్రధ్వజాంకుశ సుధాకలశాతపత్ర
పంకేరుహాంక పరికర్మ పరీత మంతః।
ఆపాదపంకజ విశృంఖల దీప్తమాళేః
శ్రీరంగిణ శ్చరణయో ర్యుగ మాశ్రయామః॥ 4

ప్రతి :- అంతః = లోపల, వజ్ర...పరీతమ్ - వజ్ర = వజ్రాయుధము యొక్క, ధ్వజ = పతాకయొక్క, అంకుశ = అంకుశముయొక్క, సుధా, కలశ = అమృతకలశము యొక్క, ఆతపత్ర = గొడుగుయొక్క, పంకేరుహ = పద్మముయొక్క, అంక = గుర్తు లనెడు, పరికర్మ = అలంకారముతో, పరీతమ్ = కూడినదియు, ఆ, పాదపంకజ, విశృంఖల, దీప్తమాళేః = పాదపద్మములవఱకు, అడ్డులేకుండఁ బ్రకాశించిన కిరీటముగల, శ్రీరంగిణః = రంగనాయకుని యొక్క, చరణయోః = పాదములయొక్క, యుగమ్ = జంటను, ఆశ్రయామః = ఆశ్రయించుచున్నాము.

విశేషము :- శ్రీరంగనాథుని పాదతలములకు వజ్రధ్వజాంకుశ సుధాకలశాతపత్రపంకేరుహ రేఖాంకములే దివ్యాభరణ

శోభను గల్పించుచు భక్తులకుఁ బరమభోగ్యములై శ్రీవారి సర్వేశ్వరత్వమును జాటుచున్నవి.

తా :- పాదతలములందు వజ్రధ్వజామృత కలశాతపత్ర పంకేరుహాంకము లనెడు సర్వేశ్వరత్వ సూచకాభరణముల నొప్పి యడ్డులేకుండఁ బాదపద్మములవఱకుఁ బ్రసరించు కిరీట కాంతులుగల శ్రీరంగనాయకుల చరణ యుగళము నాశ్రయించుచున్నాము.

ఉ॥ పాదముదాఁక మౌళిమణి
　　పంక్తులకాంతులు పర్వ లెత్తి నూ
ర్యోదయశోభఁ బూర్వ నగ
　　లో! యనఁ బద్మ, పవి, ధ్వజాంకుశా
హ్లాదకరాతపత్ర, కల
　　శాద్భుతచిహ్నము లుల్లసిల్లుల
క్ష్మీదయితుంబు రంగవిభు
　　శ్రీచరణద్వయ మాశ్రయించెదన్.

శ్లో॥ శ్రీరంగరాజచరణౌ ప్రణుమో యయోః ఖ
ల్వేక స్త్రివిక్రమవిధా వసుధా మశేషామ్ ।
వ్యాక్రంస్త సాచలకులా మపి విప్రకీర్ణ
స్థూలావలగ్నసికతా మివ నిర్ణతోచ్చమ్ ॥ 5

ప్రతి :- యయోః = ఏ రెండుపాదములలో, ఏకః = ఒక పాదము, త్రి, విక్రమ, విధౌ = మూఁడు పాదములమేరను గొలుచుకొను పనియందు, సాచలకులామ్ = కులపర్వతము

లతోఁ గూడిన, అశేషాం అపి=సమస్తమైన, వసుధామ్=భూమిని, విప్రకీర్ణ, స్థూల, అవలగ్న, సికతాం ఇవ = వెదఁజల్లఁబడినవియు, లావైనవియు, పాదమున కంటుకొన్నవియు నగు ఇసుక రేణువులు గలదానినిగా, నిర్ణతోచ్ఛ్రమ్ = పల్లము మిట్ట లేనట్లు, వ్యక్రంస్త, ఖలు=ఆక్రమించెనో (తౌ=అటువంటి) శ్రీరంగరాజచరణౌ=శ్రీరంగనాయకులవారి రెండు పాదములను, ప్రణుమః=భక్తిశ్రద్ధలతో స్తుతించు చున్నాము.

తా :- ఏ పాదములజంటలో నొకటి బలిచక్రవర్తిముందు మూఁడడుగుల నేలఁ గొలచుకొన్నప్పుడు కులాచలములతోఁ గూడిన యీ నేల నంతయు వెదఁజల్లఁబడి పాదమున నంటుకొనఁ బడిన స్థూలము లగు నిసుక రేణువులు గలదానిని వలె నెగుడుదిగుడు లేనట్టు లాక్రమించుకొనెనో యట్టి శ్రీరంగనాయకుల చరణయుగళమును భక్తితో నుతించు చున్నాము.

విశేషము:- 'స+అచల, కులామ్'- ఆహితాగ్న్యాదిషు, అగ్న్యాహితుఁడు, అన్నట్లు సాచలకులామ్ - సకులాచలామ్ — అనియగును. ఇది ఆహితాగ్నిగణ మాకృతిగణము గాన దానిలోఁ జేర్చుకొన వలెను. 'వ్యక్రంస్త = విక్రమించెనో! — విష్ణువు మూఁడడుగులతోఁ గొల్చుట వేదప్రసిద్ధము.

'ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధే పదమ్'.

శా॥ఏ పాదంబులలో నొకండు బలిముం
దేనాఁడు త్రైవిక్రమ

వ్యాపారంబున సాద్రియా ధరణి ని
ర్వ్యత్యాసలీలన్ సవి
క్షేపస్థూలవిలంబమానసికతా
శ్రీకై వడిన్ దాల్చె నో
పాపఘ్నంబుల నట్టి రంగపతి శ్రీ
పాదంబులన్ గొల్చెదన్.

శ్లో॥ జ్ఞానం బలం విపుల మీశనవీర్యశక్తి
తేజాంసి చ త్రియుగభూయ ముపాగతాని।
పూర్ణాని షట్ చ పరిగృహ్య భవం శ్చతుర్ధా
భక్తం జనం త్వ మనుజగ్రహీథాఽనురాగాత్ ॥ 6

ప్రతి :- విపులమ్ = విస్తార మగు, జ్ఞానమ్ = జ్ఞానము, బలమ్ = బలము, (విపులాని = విస్తారము లగు) ఈశన వీర్య - శక్తి, తేజాంసి = ఐశ్వర్య వీర్యములు, శక్తితేజస్సులు, (ఇతి = అనెడు) త్రియుగభూయమ్ = మూఁడుజంట లగుటను, ఉపాగతాని = పొందిన, పూర్ణాని = సమస్తము లగు, షట్, చ = ఆఱింటిని, పరిగృహ్య = స్వీకరించి, చతుర్ధా = నాల్గు విధములుగా, భవన్ = అగుచు, త్వమ్ = నీవు, అనురాగాత్ = ప్రేమవలన, భక్తమ్ = నీయెడల భక్తి గల, జనమ్ = జనమును, అనుగ్రహీథ = అనుగ్రహించితివి.

విశేషములు :- త్రియుగభూయ ముపాగతాని - జ్ఞాన, బలములు - ఒకజంట, ఐశ్వర్య, వీర్యములు - ఒకజంట, శక్తి,

తేజములు - ఒకజంట. ఈ విధముగా మూఁడు జంట లని భావము. చతుర్ధా భవన్ - వాసుదేవ, సంకర్షణ; ప్రద్యు, మ్నానిరుద్ధ, రూపములతో నాల్గు విధములుగా నగుచు.

భక్తం జనం త్వ మనుజగ్రహీథ - ఈనాల్గు రూపములను దాల్చుట భక్తజనానుగ్రహార్థమని భావము.

ఈ యభియుక్తోక్తి నిట ననుసంధించు కొనునది.

శ్లో॥ షాడ్గుణ్యా ద్వాసుదేవః పర ఇతి స భవాన్,
ముక్తభోగ్యో, బలాఢ్యాత్ । బోధా త్సంకర్ష
ణ స్త్వం రహసి వితనుషే శాస్త్ర మైశ్వర్య
వీర్యాత్ । ప్రద్యుమ్న స్సర్గధర్మౌ నయసి చ
భగవాన్ శక్తితేజోనిరుద్ధో । బిభ్రాణః
పాసి చ త్వం గమయసి చ తథా వ్యూహ్య రంగాధిరాజ!

(ఓ రంగనాయకా! నీవు షడ్గుణైశ్వర్యసంపన్నుఁడ వయి పరవాసుదేవుఁ డను పేర ముక్తభోగ్యుఁడవై యొప్పుచున్నావు. జ్ఞానబలముల జంటతోఁ గూడినవాఁడవై సంకర్షణుఁ డను పేర శాస్త్రమును విస్తరింపఁ జేయు చున్నావు. వీర్యైశ్వర్యము లనెడు జంటతోఁ గూడినవాఁడవై ప్రద్యుమ్నుఁ డను పేర సృష్టికార్యము నొనర్చుచున్నావు. శక్తితేజము లనెడు జంటతో నలరారుచు ననిరుద్ధుఁ డను పేర నెల్లర రక్షించు చున్నావు. ఇట్లు చతుర్వ్యూహరూపములఁ దాల్చి లోకము ననుగ్రహించుచుఁ గాలమును బుచ్చు చున్నావు.)

తా :- ఓ వైకుంఠపతీ! ఆశ్రితానురాగముచేత విస్తారము లగు జ్ఞానబలములు, వీరైశ్వర్యములు, శక్తితేజస్సులు, అనెడు ఈ మూఁడుజంటలను ధరించి నీవు వాసుదేవసంకర్షణ, ప్రద్యు, మ్నానిరుద్ధరూపములతో నలరారుచు భక్తుల ననుగ్రహించు చున్నావు.

శా॥ జ్ఞానంబున్ బలమున్ మహత్తరమహై
శ్వర్యంబు వీర్యంబు నెం
తేనిన్ శక్తియుఁ దేజు నాఁ ద్రియుగళం
బీషట్కముం దాల్చి నిం
డౌనమ్మాడ్కిఁ జతుర్విధాకృతులతో
నాహ్లాదముం గూర్పవే
శ్రీనీలాధరణీకళత్ర! సుజన
శ్రేణిన్ గటాక్షించుచున్.

శ్లో॥ ఏకాంతమంగళగుణాస్పద మస్తహేయం
నిత్యం పదం తవ యత స్తత ఏవ దేవ!
ఆమ్నాయతే త దిహ విశ్వవిరూపరూపం
తేనైవ న స్వద మశబ్ద మరూప మాహుః ॥ 7

ప్రతి :- హే దేవ! = క్రీడాదిగుణవిశిష్టుఁడవగు నో వైకుంఠ నాథా!, తవ = నీయొక్క, పదమ్ = స్వరూపము, యతః = ఎందువలన, నిత్యమ్ = శాశ్వత మైనదియో, ఏకాంత, మంగళ గుణ, ఆస్పదమ్ = అసాధారణము లగు కల్యాణగుణములకు నిలయ మైనదియో, అస్తహేయమ్ = నశించిన దోషములు

గలదియో, తత ఏవ = అందువలననే, తత్ = ఆస్వరూపము, ఇహ = ఇచ్చట, విశ్వ, విరూప, రూపమ్ సకలవిలక్షణాకారము గలదిగా, ఆమ్నాయతే = వేదములచేతఁ బ్రతిపాదింపఁ బడు చున్నది. తేన + ఏవ = అందుచేతనే, ఇదమ్ = ఈ స్వరూపమును, అరూపమ్ = రూపరహితము గాను, అశబ్దమ్ = నామరహితము గాను, ఆహుః + నను = వేదములు చెప్పు చున్నవి గదా!

విశేషములు :- పదమ్ — పద్యతే, ప్రాప్యతే, ఇది, ఉపా సకులచేతఁ బొందఁ బడునది. భగవత్స్వరూప మని భావము.

అశబ్ద మరూప మాహుః—లౌకికసకలవిలక్షణత్వ, హేయ ప్రత్యనీక సకలకల్యాణగుణైకతానత్వ, రూపలింగవిశిష్ట మగుట చేత భగవత్స్వరూపమును వేదము లశబ్ద మరూప మని చెప్పు చున్నవే కాని నిజమునకు భగవత్స్వరూప మటువంటిది గాదు. అట్టిదే యైనచో నీశ్రుతి యింత స్పష్టముగా నా పరమాత్మకు నామరూపముల నెట్లు నిర్వచించును ? 'య ఏషోంత రాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే । తస్యో దితి నామ' సూర్య మండలాంతర్వర్తియై యేహిరణ్మయుఁ డగుపురుషుఁడు కన్పించు చున్నాఁడో! ఆదివ్యపురుషునకు 'ఉత్' అని నామము. అని పై శ్రుతికి భావము. ఇందు హిరణ్మయుఁ డనుటవలన రూపము 'ఉత్' అనుటవలన నామము చెప్పఁ బడు చున్నవి గదా.

తా :- ఓవైకుంఠపతీ! నీ స్వరూపము నిత్య మగుటచేత అనన్యసాధారణము లగు కల్యాణగుణములకు నిలయమును

హేయగుణప్రత్యనీకము నగు చున్నది. కనుకనే వేదములు నీస్వరూపమును సకలవిలక్షణాకార మని నుడువు చున్నవి. అందుచేతనే దేవరవారి స్వరూప మశబ్ద మరూప మని యా వేదములు చాటుట యొప్పిదమై యున్నది.

ఉ॥ నీదుస్వరూప మోసుగుణ !
నిత్యము మంగళసద్గుణాళికిం
బాదు నిరస్తహేయ మని
పల్కెడు వేదము లందుచేతనే
కాదె జగద్విలక్షణత
గల్గె నశబ్ద మరూప మంచనేఁ
వేదశిరస్సు స్వర్ణమయ
విగ్రహుఁ డుత్పదుఁ డట్టిఁ డె ట్లగున్ ?

అవతారిక :- ఉక్తార్థమునే వివరించు చున్నారు.

శ్లో॥ శబ్దాదిహేయ ఇహ గోచర ఇంద్రియాణాం
తత్ప్రత్యనీకవిభవ స్త్వ మతీంద్రియోఽసి !
తేనైవ తే న బత దర్శన మస్తి కించిత్
వాచో ధియ శ్చ తత ఏవ న గోచరోఽసి ॥

ప్రతి :- ఇహ = ఈలోకమునందు, శబ్ద, ఆది, హేయః = హేయములు (దుష్టములు) అగు శబ్దాదులకు విషయమైన

ట్టియు, ఇంద్రియాణామ్=శ్రోత్రాదీంద్రియములకు, గోచరః= కనఁబడునట్టిదియు, (యః=ఏది, అస్తి=కలదో) తత్, ప్రత్యనీక, విభవః = దానికిఁ బ్రతిభట మగుకల్యాణగుణవైభవము గల, త్వమ్=నీవు, అతీంద్రియః=ఇంద్రియములకుఁ గానరానివాఁడవు, అసి=అగు చున్నావు, తేన+ఏవ=ఆకారణముచేతనే, తే = నీయొక్క, దర్శనమ్ = సాక్షాత్కారము, కించిత్ = కొంచె మైనను, న+అస్తి=లేదు, తతః ఏవ=అందువలననే, వాచః= వాక్కునకు, ధియఃచ=బుద్ధికిని, న గోచరః = గోచరింపని వాఁడవు, అసి=అగు చున్నావు బత! = అయ్యో!

విశేషములు :- తత్ ప్రత్యనీక విభవః—అంధకారమునకు ఆతపమునకు నెట్లు సహావస్థాన ముండదో యట్లే హేయ గుణంబులకును భగవానుని కల్యాణగుణములకును ఏకాధికర ణ్యాము లే దని భావము. తేనైవ తే న బత దర్శన మస్తి కించిత్—'న మాంసచక్షు రభివీక్షతే తమ్' ఇత్యాదిశ్రుతు లీవిషయమునఁ బ్రమాణములు, మాంసచక్షువు నన్నుఁ జూడఁ జాలఁ డని పైశ్రుతి కర్థము.

'వాచో ధియ శ్చ తత ఏవ న గోచరోఽస్తి' వైకుంఠ నాథుఁడు మనోవాచామగోచరుఁ డనుట. ఇందులకుఁ బ్రమాణములు. 'న చక్షుషా గృహ్యతే నాపి వాచా' (భగవానుఁడు కంటిచేతను వాక్కుచేతను గ్రహింపఁ బడఁడు) 'యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః' (ఎవఁడు భగవత్స్వరూపము తెలియఁ బడనిదిగాఁ

దలంచునో వాఁడు కొంతవఱకు భగవత్స్వరూపమును దెలిసినవాఁడు. ఎవఁడు తత్స్వరూపమును దెలిసికొంటి ననుకొనునో వాఁడు తెలియనివాఁడే యగు చున్నాఁడు)

బత - ఈ యవ్యయము ఖేదమును దెల్పును. ఇట్టి దేవరవారి దర్శనము నాకెన్నటికి సంభవింపదు కాఁబోలు నని శ్రీవత్సాంకులకుఁ జింత.

తా :- ఓ వైకుంఠనాథా! హేయములును ఇంద్రియ గ్రాహ్యములు నగు దోషములతోఁ దేజస్తిరములకుఁ బోలె సహావస్థానము నొల్లని యనంతకల్యాణగుణసంపద గలవాఁడవు గనుకనే నీ వతీంద్రియుఁడ వగు చున్నావు. కనుకనే నీ దర్శన మించుకేనియుఁ గాదు. కావుననే వాక్కులకును బుద్ధికిని అంద కున్నావు. అయ్యో! నీ దర్శనభాగ్యము నాకు లేదుకాఁబోలు.

ఉ॥ హేయపదాభిధేయములు
నింద్రియగమ్యము లౌనవద్యముల్
దాయలు వెల్గుఁ జీకటి వి
ధాన భవత్సుగుణాళికో సుర
ధ్యేయపదాబ్జ! యందుకె య
తీంద్రియుఁ డందురు నిన్ను దానఁ గ
న్దోయికిఁ గానరావు సరె
తోఁపవు వాణికి బుద్ధి కేనియున్.

శ్లో॥ ఏవం స్థితే త్వదుపసంశ్రయణాభ్యుపాయో
మానేన కేనచి దలభ్యత నోపలబ్ధుమ్ ।
నోచే దమర్త్యమనుజాదిషు యోనిషు త్వ
మిచ్ఛావిహారవిధినా సమవాతరిష్యః ॥ 9

ప్రతి :- ఏవమ్ = ఇట్లు, స్థితే = ఉండఁగా, (అతీంద్రియత్వ మేర్పడి యుండఁగా) త్వమ్ = నీవు, ఇచ్ఛా, విహార, విధినా = స్వేచ్ఛాసంచారవిధానముచేత, అమర్త్య, మనుజ, ఆదిషు = దేవతలు మనుజులు మొదలుగాఁగల, యోనిషు = యోనులయందు నో, సమవాతరిష్యః, చేత్ = అవతరించని యెడల, త్వత్, ఉపసంశ్రయణ, అభ్యుపాయః = దేవరవారి (తమ) ఆశ్రయమనెడు ఉపాయము, ఉపలబ్ధుమ్ = తెలిసికొనుటకు, కేన చిత్ = ఏదేనొక, మానేన = ప్రమాణముచేత, (ఏప్రమాణము చేతనైనను) న × అలభ్యత = దుర్లభమై యుండెడిది.

విశేషములు:- అమర్త్యమనుజాదిషు — ఇందలి ఆదిపద గ్రాహ్యములు తిర్యక్, స్థావరములు. 'త్వదుపసంశ్రయణాభ్యుపాయోమానేన కేనచి దలభ్యత నోపలబ్ధుమ్' — అవతారము సమస్త జనములకును నయనగోచరమగును గనుక దేవరవారి నాశ్రయింప వలె నను జ్ఞానము సులభముగాఁ గలుగును. కావున శ్రీవారు దేవమనుష్య తిర్యక్స్థావరాదులలో నవతరించుట జనులకు మహోపకారకము. శ్రీరామకృష్ణాదులుగా

నవతరించుటచేత నే కదా! 'త మేవ శరణం గతః, రాఘవం శరణం గతః, మా మేకం శరణం వ్రజ, నమ శ్చక్రు ర్జనార్ద నమ్'– ఇత్యాది మహాభాగ్యము లానాఁటివారికిఁ జేకూరెను.

తా:- దేవా! అతీంద్రియు లగు శ్రీవారిదర్శనభాగ్య మెన్ని జన్మములకైనను సామాన్యజనముల కెట్లు గల్గెడిని. శ్రీవారు స్వైరలీలావిహారము కారణముగా దేవమానవతిర్యక్ స్థావర యోనులందు నవతార మెత్తనియెడల నిన్నాశ్రయించ వలె నను నుపాయజ్ఞాన మైనను ఏప్రమాణముచేఁ దెలియ వీలయ్యె డిని. నిన్నుఁ జేరుటకు మూలమగు 'రాఘవం శరణం గతః, మా మేకం శరణం వ్రజేత్యాది శరణాగతి జ్ఞానము నీ యవతా రములే గదా! యనుగ్రహించినవి.

ఉ॥ ధీరుల కేనిఁ గల్గునె య
తీంద్రియులౌ తమదర్శనం బటుల్
స్వైరవిహారలీల యను
సాకున దేవమనుష్యతిర్యగా
కారజడంబులన్ బొడమి
కన్నులకుం బొడసూప కున్న నిన్
జేర నుపాయ మేని దరి
సింపఁగఁగల్గాయె యుండెడిం గదా!

అవతారిక:- వెనుకటివిషయమునే వివరించు చున్నారు.

శ్లో॥ శిలః క ఏష తవ హంత దయైకసింధో!
క్షుద్రే పృథగ్ జనపదే జగదండమధ్యే।

క్షోదీయసోఽపి హి జనస్య కృతే కృతీ త్వ
మత్రావతీర్య నను లోచనగోచరోఽభూః ॥ 10

ప్రతి.- హేదయా × ఏక, సింధో ! = దయకు ముఖ్యముగా సముద్రమువంటి యో వైకుంఠపతీ ! కృతీ = కృతకృత్యుండ వగు, త్వమ్ = నీవు, జగత్, అండ, మధ్యే = ప్రపంచరూప మగు నీ బ్రహ్మాండమునడుమ, క్షుద్రే = నీచ మగు (అత్యల్ప మైన) పృథగ్జన, పదే = పామరజనులకు నివాస మైన, అత్ర=ఇచ్చట, క్షోదీయసః=అతిక్షుద్ర మగు, జనస్య, కృతే, అపి=జనములకొఱకు సైతము, అవతీర్య=అవతరించి, లోచన గోచరః=కన్నులకుఁ గనఁబడువాఁడవు, అభూః నను=అయితివి గదా! తవ=నీయొక్క, ఏషః=ఈ, శీలః=శీలము, కః=ఎట్టిది (ఎంత గొప్పది!) హంత ! = సంతోషము.

విశేషములు.- శీలః — మహతః మందైః సహ సంశ్లేషః— గొప్పవానికి మందులతోఁ గలసి మెలసి వర్తించుట.

కః—ఇట్టిది. ఇంత యని కొలచి చెప్పుటకు సాధ్యము గాదని భావము.

హంత—ఇది హర్షమునందు వాడఁ బడినది. శేషశేషా సనాది సూరిపరిషత్సేవ్యులును, ఉభయవిభూతులకు నాథు లును, అగు శ్రీవారికి ఒక బ్రహ్మాండమునడుమ నతిక్షుద్ర మగు పామర జనపదం బగు నొక జనపదంబున అతిక్షుద్ర జన నిమిత్తమై యవతార మెత్తెడు శీలమునకు ఇయత్త లే దని భావము. ఇట్టిశీలము మహానందపెట్టు చున్నది.

తా॥ దయాంబురాశి వగు నో వైకుంఠనాథా! అవాప్త సమస్తకాముఁడవై కృతార్థుఁడ వగు నీవీ జగదండమధ్యమున అతిక్షుద్రమును పామరజనావాసము నగు నొక జనపదంబున నొకచోట క్షుద్రజననిమిత్త మవతరించి కనులపండు వొనర్చితివి. ఆహా! దేవరవారి యీ శీల మెట్టిది. దీనికి హద్దు లెక్కడ? దీనిని గొలుచుటకు సాధన మేమి?

శా॥ ఈశీలంబున కేమి పేరు? తుది హ
ద్దెచ్చోటఁ గారుణ్యవా
రాశీ! యీజగదండమధ్యమున క్షు
ద్రంబై యతిక్షుద్రయా
పాశేషప్రజ కిక్కయౌ నిచట క్షు
ద్రార్థంబుగా నుద్భవం
బై శయ్యాసనఖేలనాదుల వయ
స్యాళిం గటాక్షించి తే॥

అవతారిక:- ఇప్పుడు సౌశీల్యప్రయుక్త మగు స్వాతంత్ర్యము నుడువు చున్నారు.

శ్లో॥ యం పాతకాత్ సుమహతోఽప్యదధారయస్త్వం
త్వత్పాదవారిపరిపూతశిరా శ్చయోఽభూత్ ।
తం వందసే కిల తతశ్చ వరం వృణీషే
క్రీడావిధి ర్భత! విలక్షణలక్షణ స్తే॥ 11

ప్రతి:- త్వమ్=నీవు, యమ్=ఎవనిని, సుమహతః = మిక్కిలి గొప్పది యగు, పాతకాత్, అపి = పాపమునుండియు, ఉద

ధారయః =ఉద్ధరించితివో, యః=ఎవఁడు, త్వత్, పాద, వారి, పరిపూతశిరాః చ = దేవరవారి పాదజలముచేఁ బవిత్ర మైన శిరస్సు గలవాఁడును, అభూత్ =ఆయెనో! తమ్ = ఆ రుద్రుని, వందసే = నమస్కరించుచున్నావు, తతః = ఆ రుద్రునివలన, వరం చ=వరమును సైతము, వృణీషే = వరించుచున్నావు. కిల = పురాణములు నుడువు చున్నవి. తే = నీయొక్క, క్రీడా విధిః=లీలావ్యాపారము, విలక్షణలక్షణః=లోకవిలక్షణలక్షణ ములు గలది, బత = ఔరా!

విశేషములు:- 'యం పాతకాత్ సుమహతః'—తండ్రియగు బ్రహ్మదేవుని తలఁ ద్రుంచిన మహాపాపమునుండి. ఈశ్వరుఁడు బ్రహ్మతలద్రుంచుట పురాణప్రసిద్ధము

తం వందసే కిల తత శ్చ వరం వృణీషే – కైలాస యాత్రలో శ్రీకృష్ణుఁడు సదాశివుని నమస్కరించి పుత్త్రో త్పత్తిరూప మగువరమును గోరుట హరివంశాది పురాణ ప్రసిద్ధము.

బత—ఆశ్చర్యార్థకము. ఇచ్చట నాశ్చర్యమునకుఁ గారణ మే మన? తనకు రక్షణీయుఁడగు శివునకు మ్రొక్కుటయు వరమును గోరుటయు ఆశ్చర్యకరములు. భగవంతునిలీల లని భావము.

తా:- ఓ వైకుంఠనాథా! ఏరుద్రుని నీవు స్వపితృవదనచ్ఛే దనరూప మగుఘోరపాతకమునుండి కాచితివో! నీ పాదోదక

మును శిరమునఁ దాల్చి యే శివుఁడు పవిత్రుఁ డాయెనో! ఆ సదాశివుని నీవు మ్రొక్కుటయు నతనినుండి పుత్త్రోత్పత్తిరూప వరమును గోరుటయు నాశ్చర్యకరములు. స్వామీ! నీ లీలలు లోకవిలక్షణములు గదా!

చ॥ జనకుశిరంబు ద్రుంచిన ప్ర
చండతరాఘమునుండి కాచి తె
వ్వాని, తలఁ దాల్పఁ ద్వచ్చరణ
వార్లహరిన్ బరిపూతుఁ జేసి తె
వ్వాని, నటువంటి ధూర్జటికి
వందనముం బొనరించి పుత్త్రభి
క్షను మఱి వేఁడు టచ్చెరువు
గాదె, విలక్షణముల్ భవత్కృతుల్

అవతారిక :-శ్రీకృష్ణుఁడు ప్రణామాదిక మొనర్ప రుద్రుఁడు తన్మహిమను దెలియనివానివలె నట్లూరకుండుటకు హేతువును దెలుపు చున్నారు.

శ్లో॥ క్రీడావిధేః పరికర స్తవ యా తు మాయా
సా మోహినీ న కతమస్య తు హంత జంతోః।
హైమ ర్త్యసింహవపుష స్తవ తేజసోంశే
శంభు ర్బభూవ హి శరభ శ్శలభో బభూవ॥ 12

ప్రతి :- యా, తు = ఏది, తవ = దేవరవారియొక్క, క్రీడా విధేః = లీలావిధికి, పరికరః = ఉపకరణమో, సా = అట్టి, మాయా = మాయ, (ప్రకృతి) కతరస్య = ఏ, జంతోః =

ప్రాణికి, మోహినీ = మోహపెట్టునది (అజ్ఞానమును గలిగించునది) న = కాదు ?, హై = ఓ వైకుంఠనాథా !, శరభః = శరభమృగము (సింహమును జంపెడు నెనిమిదికాళ్ళ మృగము) భవన్ = అగుచు, మర్త్యసింహ, వపుషః = నరసింహదేహము గల, తవ = నీయొక్క, తేజసః = తేజస్సు యొక్క, అంశే = భాగమునందు, శంభుః = శివుఁడు, శలభః = మిడుత, బభూవ = ఆయెను.

విశేషములు :- 'యా తు మాయా'- పరిదృశ్యమానములగు వస్తువులందు విచిత్రస్వభావవైషమ్యములను దోఁపఁజేయుప్రకృతి.

మోహినీ, న? :- మాయ జ్ఞానాధికు లగు జీవులనైతము మోహింపఁ జేయు నని భావము. 'శంభు ర్భవన్ హి శరభశ్శలభో బభూవ' ఈ పురాణవచనము లీవిషయమునఁ బ్రమాణములు.

> ' హంతు మభ్యాగతం రౌద్రం శరభం నరకేసరీ
> నఖై ర్విదారయామాస హిరణ్యకశిపుం యథా
> నమోఽస్తు నరసింహా య లక్ష్మీస్థితిజితక్రుధే
> యత్ క్రోధాగ్నౌ పురా రౌద్రః శరభ శ్శలభాయితః '

(తా॥ నరసింహమూర్తి తన్ను సంహరించుట కభిముఖముగా వచ్చిన రుద్రసంబంధి యగు శరభమును హిరణ్యకశిపునివలెనే గోళ్ళతోఁ జీల్చివైచెను. పూర్వ మెవని క్రోధాగ్నియందు రుద్రాత్మక మగు శరభమృగము శలభమువలె దగ్ధ

మాయెనో! లక్ష్మీసాన్నిధ్యముచేతఁ గ్రోధమును జయించిన యట్టి నరసింహమూర్తికి నమోవాకము లొనర్చు చున్నాను.)

మాయ :- భగవత్స్వరూపమును తిరోధానపఱుచుచు స్వవిషయక మగు భోగ్యతాబుద్ధిని జనింపఁ జేయును. 'మాయయా మోహితం జగత్' 'అనీశయా శోచతి ముహ్యమానః' ఇత్యాదు లీవిషయమును జాటును. భగవన్మాయచేత మోహితుఁడై శరభరూపముతో యుద్ధమునకే సన్నద్ధుఁడైన శివుఁడు శ్రీకృష్ణప్రణామాదులను స్వీకరించుట యొకవింత గాదు. ఉచితమే.

తా॥ ఓ వైకుంఠపతీ! గుణమయి యగు నీ దేవమాయ నీలీలావిధి కొకయాటవస్తువు. అది యెంతటి జ్ఞానాధికుల నైనను మోహింపఁ జేయఁగలదు. దేవా! దేవరవారు నరసింహరూపమును దాల్చినపుఁడు జ్ఞానాధికుఁడౌ రుద్రదేవుసంతవాఁడు శరభరూపమును ధరించి శ్రీవారి తేజోంశమునందు మిడుత వలె భస్మము గాలేదా?

శా॥ నీలీలావిధి కాట వస్తువు రమా
నీలాంబుజాతేక్షణా
లోలా! మాయ, య దెంతవారి నయినన్
లోఁగొంచు వర్తింపదే?
శూలిన్ నాఁడు భ్రమింపఁ జేసి శరభ
స్ఫూర్తిన్ బయిం బంపి యా

భీలత్వన్నృహరిక్రుధాగ్ని శలభం
బౌ నట్లు గావింపవే ?

అవతారిక:- భగవానుని పారతంత్ర్యము కూడ స్వాతంత్ర్యమువలె నతిశయావహమే యని నుడువు చున్నారు.

శ్లో॥ యస్యాత్మతాం త్రిపురభంగ విధావధా స్త్వం
త్వచ్ఛక్తితేజిత శరో విజయీచయోఽభూత్ ।
దక్షక్రతౌ తు కిల తేన వినిర్జిత స్త్వం
యుక్తో విధేయవిషయేషు హి కామచారః॥ 13

ప్రతి:- త్రిపుర, భంగ, విధౌ = త్రిపురాసుర సంహార కార్యమునందు, యస్య=ఎవనికి, ఆత్మతామ్ = అంతరాత్మ యగుటను, త్వమ్=నీవు, అధాః=ధరించితివో, యః=ఎవఁడు, త్వత్, శక్తి, తేజిత, శరః = దేవరవారిశక్తిచే మెఱుఁగు పెట్టఁబడినబాణము గలవాఁడై, విజయీ,చ = జయము గల వాఁడును, అభూత్ = ఆయెనో, తేన=అట్టి రుద్రదేవునిచేత, దక్షక్రతౌ,తు=దక్షుని యజ్ఞమునందు, త్వమ్ = నీవు, వినిర్జితఃకిల=జయింపఁ బడితివఁట, విధేయవిషయేషు = వశ్యుల పట్ల, కామచారః = స్వేచ్ఛావర్తనము, యుక్తః, హి = న్యాయ్యమే కదా !

విశేషములు:- త్వచ్ఛక్తితేజితశరః — శరాగ్రమునందు నీ శక్తిచే నుంచఁ బడిన తేజస్సు గలవాఁడై —

పూర్వార్ధములోని విషయమునకుఁ బ్రమాణము

'విష్ణు రాత్మా భగవతో భవ స్యామిత తేజసః
తస్మాత్ ధను ర్జ్యాసంస్పర్శం స విషేహే మహేశ్వరః
పురా పరాభవం ప్రాప్య సమరే త్రిపురాసురాత్'
'యుక్తో విధేయవిషయేషు హి కామచారః'

స్వాధీనజనులయెడఁ బారతంత్ర్య మతిశయావహమే యని భావము.

తా:- త్రిపురాసుర సంహారకార్యమున నెవనికి నీ వంత రాత్మవో, శరాగ్రమున నీ శక్తిచేత మోపఁ బడిన తేజము గల వాఁడై విజయము నార్జించెనో యట్టి రుద్రునిచేత దక్షయజ్ఞ మున నీవు జయింపఁ బడుట వశ్యులవిషయమునఁ బార తంత్ర్యము సైత మతిశయావహమే యనెడు నీ నియమమును జాటు చున్నది.

చ॥ అల త్రిపురారులన్ గెలుచు
 నత్తఱి నీవు యదంతరాత్మవో!
నిలిపిశరాన శక్తి నెవ
 నిన్ గెలిపించితో! యట్టిరుద్రుచే
నలినదళాక్ష! దక్షసవ
 నంబున నీవు జితుండ వౌట వ
శ్యులయెడఁ గామచార మది
 శూరులకుం దగు నంచుఁ జాటెడున్.

శ్లో॥ ముగ్ధ శ్శిశు ర్వటదళే శయితోఽతితన్వా
తన్వా జగంతి బిభృషే సవికాస మేవ।
ఐశీ మ్మిమాం తు తవ శక్తి మతర్కితవ్యా
మవ్యాజతః ప్రథయసే కి మిహావతీర్ణః ॥ 14

ప్రతి:- వటదళే = మఱ్ఱియాకునందు, శయితః = (ప్రళయార్ణవమునందు) పరుండిన, ముగ్ధః = అందగాఁడవును, శిశుః = పసివాఁడవును, (అగు) త్వమ్ = నీవు, అతితన్వ్యా = మిక్కిలి సూక్ష్మమగు, తన్వా = శరీరముచేత, జగంతి = లోకములను, సవికాసం ఏవ = విశాలముగనే (ఒత్తిడి లేకుండ) బిభృషే = ధరించు చున్నావు. అతర్కితవ్యామ్ = ఊహింపరాని, ఇమామ్ = ఈ, తవ = నీయొక్క, ఐశీమ్ = ఈశ్వరత్వప్రయుక్త మగు, శక్తిం తు = శక్తినే, ఇహ = ఇక్కడ, అవతీర్ణః = అవతరించినవాఁడవై, అవ్యాజతః = అకృత్రిమముగా, ప్రథయసే, కిమ్ = చాటు చున్నావా?

విశేషములు:- వటదళే శయితః-ప్రళయ సముద్రమునందని భావము.

'అతితన్వా తన్వా జగంతి బిభృషే సవికాస మేవ' మిక్కిలి పసిపాఁపడు తన చిన్ని బొజ్జలోఁ బ్రళయకాలిక సర్వభువనములను విశాలముగాఁ దాల్చి మున్నీటిలోఁ బొడమిన మఱ్ఱియాకుపైఁ బవ్వళించుట తన పరత్వమును సూచించుచున్న దని భావము.

ఐశీ మిమాం.........కి మి హావతీర్ణః- యశోదాదేవికి వశ్యమగు శైశవరూపసౌలభ్యము నందును పరత్వావిష్కరణము నోటిలో విశ్వమును జూపుట మున్నగు లీలలు మిక్కిలి ఆశ్చర్యజనకములే యని యాశయము.

తా॥ ఓ వైకుంఠపతీ! నీవు ప్రళయసముద్రములో అందమగు చిన్నారి పసికందవై చిన్నిబొజ్జలో లెక్కలేని బ్రహ్మాండములఁ దాల్చుచున్నావు. అచింత్యమహిమగల యీ యైశ్వర్యమగు శక్తినే దేవరవా రిట నవతరించియు వెల్లడించుచున్నారా?

మ॥ ప్రళయాంభోనిధి యంట యందు వటప
త్రం బంట యద్దానిలో
లలితాకారుఁడు చిన్నబాలుఁ డఁట య
ల్పం బైన తత్కుక్షిలో
పల బ్రహ్మాండము లెన్నొ! యుండు నఁట ని
ర్బాధంబు బల్ వింత! నీ
విల జన్మించి యచింత్య మైశ్వరము నీ
యీశక్తినేచాటెదే?

అవతారిక :- స ఉ శ్రేయాన్ భవతి జాయమానః (ఆ నారాయణమూర్తి యవతరించుచునే శ్రేష్ఠుఁడగుచున్నాడు) అని నుడివినప్రకారము అవతారసౌలభ్యము సైతము పరత్వమే యని నుడువుచున్నారు.

శ్లో॥ బ్రహ్మేశమధ్యగణనా గణనార్కపంక్తా
విన్ద్రానుజత్వ మదితేస్తనయత్వయోగాత్ ।
ఇక్ష్వాకువంశయదువంశజనిశ్చ హంత
శ్లాఘ్యా న్యమూ న్యనుపమస్య పరస్య ధామ్నః ॥ 15

ప్రతి :- అనుపమస్య = సాటి లేని, పరస్య = సర్వోత్తమమైన, ధామ్నః = తేజస్సునకు, (తేజస్సు వగునీకు) బ్రహ్మ,

ఈశ, మధ్య, గణనా = బ్రహ్మకును, శివునకును నడుమ లెక్కించుటయు, అర్క, పంక్తౌ = ద్వాదశాదిత్యులపంక్తి యందు, గణనా = లెక్కయు, అదితేః = కశ్యపుని భార్య యగు అదితిదేవికి, తనయత్వ యోగాత్ = పుత్రత్వసంబంధము వలన, ఇంద్రానుజత్వమ్ = ఉపేంద్రావతారము (దేవేంద్రు నకుఁ దమ్ముఁ డగుటయు) ఇక్ష్వాకువంశ, యదువంశ, జనిః, చ = ఇక్ష్వాకువంశమున, యదువంశమునఁ బుట్టుటయు, (రామ కృష్ణావతారములును) అమూని = ఇవి, శ్లాఘ్యాని = కొని యాడఁ దగినవి, హంత = సంతసము.

విశేషములు :- అనుపమస్య- 'న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే' అన్నట్లు భగవానునితో సమానుఁడు గాని యధి కుఁడు గాని లేఁడు గావున శ్రీహరి సాటిలేనివాఁడు.

పరస్య, ధామ్నః - 'నారాయణపరో జ్యోతిః' అనుశ్రుతి సిద్ధమగు నర్థము నిటఁ దెలియ నగును.

బ్రహ్మేశమధ్యగణనా :- 'మధ్యే విరించిగిరిశం ప్రథమావ తారః' ఇత్యాదు లిందులకుఁ బ్రమాణములు.

అర్కపంక్తౌ గణనా- 'ఆదిత్యానా మహం విష్ణుః' గీతా వచనము.

తా॥ ఓ వైకుంఠనాయకా! సాటిలేని పరమధాముఁడ వగు నీకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లని బ్రహ్మకును శివునకును నడుమ లెక్కయు ద్వాదశాదిత్యులలో నెన్నికయు అదితిదేవికిఁ

బుత్త్రుఁడవైన సంబంధముచేత నుపేంద్రుఁడ వగుటయు, రామ కృష్ణులుగా నవతార మెత్తుటయు నివి యెల్ల మిక్కిలి కొని యాడఁ దగి యున్నవి. ఆనందజనకములుగా నున్నవి.

మ॥ అనఘా! పంకజగర్భ శంకరుల మ
ధ్యన్ నిన్ను లెక్కించుటల్
దినకృత్యం క్తిని నిన్ను నొక్కఁ డనుటల్
దేవేంద్రుగారాబు మే
లనుఁగుందమ్ముఁడ వంట యయ్యదితివి
య్యానన్ రవీంద్వన్వయం
బున జన్మించుట యొప్పు మేల్ వెలుఁగునాఁ
బొల్పొందు నీ కచ్యుతా!

అవతారిక :- ఇప్పుడు త్రివిక్రమావతారసౌలభ్యము నను సంధించు చున్నారు.

శ్లో॥ త్వన్నిర్మితా జఠరగా చ తవ త్రిలోకీ
కిం భిక్షణా దియ మృతే భవతా దురాపా।
మర్త్యే కదా తు న విచక్రమిషే జగ చ్చేత్
త్వద్విక్రమైః కథ మివ శ్రుతి రంచితా స్యాత్ ॥ 16

ప్రతి :- త్వత్, నిర్మితా=నీచేత నిర్మింపఁ బడినదియు, తవ=నీయొక్క, జఠర, గా=ఉదరమును పొందినదియు, (అగు) ఇయమ్=ఈ, త్రిలోకీ=లోకత్రయము, భిక్షణాత్, ఋతే = యాచన లేకుండ, భవతా = దేవరవారిచేత, దురాపా, కిమ్=పొంద శక్యము కానిదా? (కా దని

భావము) మధ్యే=(సృష్టిప్రళయములకు) నడుమ, కదా, తు=ఎప్పుడైనను, జగత్=లోకమును, న, విక్రమిషే, చేత్ = విక్రమించనియెడల, (కొలచుకొనిన యెడల) కథ మివ=ఎట్లు, త్వత్, విక్రమైః = నీపాదవిన్యాసములచేత, (నీ విక్రమములచేత) శ్రుతిః=వేదము, అంచితా=పూజింపఁ బడినది, స్యాత్=అగును ?

విశేషములు :- త్వన్నిర్మితా- 'అప ఏవ ససర్జాదౌ' అను క్రమముచేత అండసృష్టిపర్యంతము స్వయముగానే చేసి తరువాతఁ దనచేతనే సృజింపఁబడి తనయంశ మగు చతుర్ముఖ బ్రహ్మచేత నిర్మింపఁ బడినట్టియు అని భావము.

'త్వద్విక్రమైః కథ మివ శ్రుతి రంచితా స్యాత్- ఇదం విష్ణు ర్విచక్రమే। త్రేధా నిదధే పదమ్। త్రీణి పదా విచక్రమే। విచక్రమాణ స్త్రే ధోరుగాయః ఉరుక్రమస్య స హి బంధు రిత్థా। విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః- ఇత్యాది త్రివిక్రమ మూర్తి విక్రమగాథలచేతనే శ్రుతి యలంకరింపఁ బడినది. ఇట్లు శ్రుతి నలంకరించుటకే కానిచో మొదట నీచే సృజింపఁ బడి పిదప నీచే సృజింపఁ బడి నీయంశ మగు చతుర్ముఖునిచేఁ బూర్తి చేయఁబడి ప్రళయమున నుదరమున నుంచుకొని నీచే భద్రము చేయఁబడిన త్రిలోకి నీదై యుండఁగా నొరులను బిచ్చ మెత్త నేల ? భవదీయ త్రివిక్రమవిస్ఫూర్తి శ్రుతులకు సార్థక్య మును గూర్చి వాని నలంకరించుటకే యని పిండితార్థము.

తా॥ ఓ వైకుంఠపతీ! తొలుత నీచే సృజింపఁబడి ప్రళయమున నీచే భద్రముగా నుదరమున దాచఁ బడిన యీ త్రిలోకి బిచ్చమెత్తని యెడల నీది కాకపోవునా? నడుమ నెప్పుడైన నొకమారు జగమును విక్రమింప వేని నీ విక్రమగాథలచేత శ్రుతి యెట్లలంకరింపఁ బడును.

శా॥ నీచే మున్ను సృజింపఁగాఁబడుట ము
న్నీ రేకమౌ న త్తతిన్
నీ చిన్నారివ రాలబొజ్జ మనుటన్
నీవే జగా లన్నియున్
యాచింపన్ బని యేమి యొక్కరుని దే
వా! యీత్రిలోకిన్ దయా
శ్రీచార్వంగికి నీత్రివిక్రమకళన్
శ్రీఁ గూర్పఁ గా కున్న చో.

అవతారిక:- తరువాత శ్రీరామావతారము నందలి యతిమానుషంబు లగు చరిత్రవిశేషములఁ బదునేడు శ్లోకములతో సంగ్రహముగాఁ జెప్పఁ దలఁచి మొట్టమొదట గృధ్రరాజమగు జటాయువునకు మోక్షమొసఁగుటలోని వైచిత్ర్యమును నుడువుచు తత్పరిహారము తనకు దురూహమగుటచే శ్రీరాము నే యడుగు చున్నారు.

శ్లో॥ పృచ్ఛామి కించన యదా కిల రాఘవత్వే
మాయామృగస్య వశగో మనుజత్వనాట్యాత్ ।
సీతావియోగవివశో నచ తద్గతిజ్ఞః
ప్రాదా స్తదా పరగతిం హి కథం ఖగాయ ॥ 17

(సశేషము)

ప్రతి :- కించన = ఆశ్చర్యకర మగు నొక విషయమును, పృచ్ఛామి - అడుగు చున్నాను. యదా, కిల - ఎప్పుడు, రాఘవత్వే = రాముఁడుగా నవతరించిన సమయమునందు, మనుజత్వ, మౌగ్ధ్యాత్ = మానవుఁడుగాఁ బుట్టుటవలన నేర్పడిన మోహము వలన, మాయామృగస్య = మాయ లేడికి, వశగః = వశ్యుఁడవై, సీతా, వియోగ, వివశః - సీతాదేవి యెడఁబాటుచేత పరవశుఁడవై (ఒడలు తెలియనివాఁడవై) తత్, గతి, జ్ఞః - ఆసీతా మార్గమును దెలిసినవాఁడవు, న, చ, - కావు, తదా = అప్పుడు, ఖగాయ - పక్షికొఱకు, పరగతిమ్ = ఉత్తమగతిని, కథమ్ = ఎట్లు, ప్రాదాః - ఇచ్చితివి.

విశేషములు :- మనుజత్వ, మౌగ్ధ్యాత్ — 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్' అని శ్రీరాముఁడు తన్ను నరునిగా భావించుట గమనింపఁ దగినది. మానవత్వ ప్రయుక్త మగు మోహమువలన సీతామార్గము నే యెఱుఁగ నట్లు నటించిన నీవు

'ప్రాదా స్తదా పరగతిం హి కథం ఖగాయ' జటాయువునకు మోక్ష మొసంగుట పరత్వమును సూచించును గదా !

'మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకా ననుత్తమాన్' అని చెప్పుట విరుద్ధము కాదా ? దీనికిఁ బరిహార మేమి చెప్పుదురు ?

(5)

తా॥ ఓ వైకుంఠనాథా! నీవు శ్రీరాముడుగా నవతరించి నప్పుడు నేను మానవుఁడను గా నే నటింతు నని దానికిఁ దగినట్లు మాయలేడి వెంటఁ బడి పోయి సీతావియోగమును బొంది సీతామార్గమును దెలియవు గాని దేవా! జటాయువున కెట్లు మోక్షము నీయఁ దెలిసితివి? ఈ ప్రశ్నమునకుఁ బరిహార మేమి చెప్పెదరు?

చ॥ అడిగెదఁ గోప మంద కొక
యంశము రాముఁడ వైనయప్డు మ
ర్త్యుఁడ ననిపించుకోఁ దలఁపు
తో నిజ మంచును మాయలేడి వెం
బడిఁ బడి ధర్మపత్ని నెడఁ
బాసి యెఱుంగవు కాని తద్గతిన్
గడుసరి! యెట్లెఱింగితి ఖ
గంబునకున్ దయచేయ సద్గతిన్.

అవతారిక :- పూర్వోక్తవిషయమునే భంగ్యంతరముగాఁ జెప్పు చున్నారు.

శ్లో॥ అక్షుణ్ణయోగపథ మగ్ర్యహతం జటాయుం
తిర్యంచ మేవ జత మోక్షపథే నియోక్తుమ్।
శక్నోషి వేత్సి చ యదా స తదా కథం త్వం
దేవీ మవాప్తు మనఘో వ్యథితో విచిన్వన్॥ 18

ప్రతి :- అక్షుణ్ణ, యోగపథమ్ - అభ్యసింపఁ బడని యోగ మార్గము గలట్టియు, తిర్యంచమ్ తిర్యగ్జంతు వైనట్టియు,

అగ్ర్య, హతమ్=బ్రాహ్మణునిచేఁ జంపఁ బడినట్టియు, జటాయుమ్=జటాయు వనెడుపక్షిని, మోక్షపథే = మోక్షమార్గమున, నియోక్తుమ్ - అనుమతి నిచ్చుటకు, యదా=ఎందువలన, వేత్సి=తెలియు చున్నావో! శక్నోషి చ=శక్తుఁడ వగుచున్నావో, తదా =అందువలన, సః - ఆ, త్వమ్=నీవు, దేవీమ్=సీతాదేవిని, విచిన్వన్ =వెదకుచు, అవాప్తుమ్=పొందుటకు, అనలః(సన్) =అశక్తుఁడ వగుచు, కథమ్=ఎట్లు, వ్యథితః=బాధగలవాఁడవు, (భవసి - అగు చున్నావు) బత - ఆశ్చర్యము.

విశేషములు :- అక్షుణ్ణయోగపథమ్— సాధనానుష్ఠానము లేనియని భావము. తిర్యంచమ్— తిర్యగ్జాతిలోఁ బుట్టుట వలన సాధనానుష్ఠానానుగుణ జన్మవిహీన మని తెలియ వలెను. అగ్ర్యహతమ్— 'నాగ్ర్యహతస్య లోకోస్తి' మున్నగు ప్రమాణములచే బ్రాహ్మణునిచే నిహతుఁ డగువానికి గతు లుండవు. పైఁగా జటాయువునకీ ప్రతిబంధకము సైతముగలదు.

ఓ వైకుంఠనాథా! నీవు రామావతారమున జటాయువున కేమి యర్హత గల దని మోక్షమిచ్చితివి. యోగమార్గమా! అభ్యసింపలేదు. సాధనానుష్ఠానమున కనుకూలమైన జన్మమా! కాదు. తిర్యక్కులమున జన్మించెను. రావణబ్రహ్మ బ్రాహ్మణుఁడు గావున నతనిచేఁ జంపఁ బడుట 'నాగ్ర్యహతస్య లోకోఽస్తి' అను ప్రమాణముచే నుత్తమలోకములు చెందుటకుఁ బ్రతిబంధకము కూడ. ఇట్టి జటాయువునకు మోక్షమీయఁ దెలిసితివిగాని భార్యామార్గమును గాలించియు

నెఱుఁగఁజాలక బాధపడితి వేల ? దీని కేమి సమాధాన మిచ్చెదవు ?

గీ॥ ఆరయదు యోగపథము తిర్యక్కులంబు
విప్రహత మందులో నట్టివిహగమునకె ।
పలుకుచేతనే మోక్ష మీఁ దెలిసినావు
తెఱవ తెరువును వెదకియుఁ దెలియ వేల ?

అవతారిక :- పూర్వశ్లోకమునందు వలెనే శక్తి లేమి యూహ ననుభవించు చున్నారు.

శ్లో॥ సాలాన్ హి సప్త సగిరీన్ సరసాతలాన్ యాన్
ఏకేషు మందజవతో నిరపత్రయ స్త్వమ్ ।
తే ష్వేకవివ్యథనఖిన్నకపిప్రణున్నం
శాఖామృగం మృగయసే స్మ కథం సహాయమ్॥ 19

ప్రతి :- సగిరీన్ = కొండలతోఁ గూడినట్టియు, సరసాతలాన్ = పాతాళముతోఁ గూడినట్టియు, యాన్ = ఏ, సాలాన్ = వృక్షములను, లేదా మద్దులను, ఏక, ఇషు, మంద, జవతః = ఒకేయొక బాణముయొక్క స్వల్ప వేగమువలన, త్వమ్ = నీవు, నిరపత్రయః = ఆకులు లేనివానినిగా నొనరించితివో, (లేదా భేదించితివో) తేషు = ఆవృక్షములందు, ఏక, వివ్యథన, ఖిన్న, కపి, ప్రణున్నమ్ = ఒక వృక్షమును భేదించుట యందు అలసిన కోతిచేత (వాలిచేత) నిరసింపఁ బడినవానరుఁడగు సుగ్రీవుని, కథమ్ = ఎట్లు, సహాయమ్ = సహాయునిగా, మృగయసే స్మ = వెదకితివి ?

విశేషములు— ఏకేషుమందజవతః— మందవేగము కాక యతివేగ మగునేని బ్రహ్మాండభిత్తియు బ్రద్దలగు నని భావము.

నిరపత్రయః— ఆకు లన్నియు రాలుదాఁక దులిపితివి. (లేదా) భేదించితివి. 'బిభేద చ పున స్సాలాన్ సప్తైకేన మహేషుణా। గిరిం రసాతలం చైవ' 'తే ష్వేకవివ్యథనఖిన్నకపి ప్రణున్నమ్' వాలి సప్తసాలములలో నొకదానియాకులు రాల్పుటకే యలసిపోవువాఁ డఁట- ఇందుకుఁ బ్రమాణము

'ఇమే చ విపులా స్సాలాః। సప్తశాఖావలంబినః
యత్రైకంఘటతే వాలీ। నిష్పత్రయితు మోజసా'

(రామాయణము—కిష్కింధ).

నిరపత్రయః— ఇది రామాయణప్రయోగానుగుణము. మృగయసే స్మ కథం సహాయమ్- అధికశక్తికల వానిని గదా సహాయము కోరుకొన వలెను ఒకచెట్టును భేదించుటకే యలసిపోయెడు వాలిచేతనే దెబ్బలు తినినకోతి యగు సుగ్రీవునా! సహాయునిగా వెదకుట. ఇది యాశ్చర్యముగా నున్నది. దీని కేమి పరిహారము చెప్పెదవు?

తా॥ ఓ వైకుంఠనాథా! నీవు రామావతారమున ఒకే యొక బాణముయొక్క స్వల్పవేగమున కొండతోఁబాటు పాతాళముతోఁబాటు సప్తసాలములను భేదించితివి. వానిలో నొక దానిని భేదించుటకే చెమటలు పట్ట నలసిపోయెడు వాలి చేత దెబ్బలు తినినవానరుని సుగ్రీవు నెట్లు సహాయునిగా వెదకుకొంటివి? ఇది ఆశ్చర్యముగా నున్నది.

మ॥ సకుభృద్వర్గరసాతలంబుగ హరీ!
సప్తావనీజాళి సా
యక మొక్కంటనె డుల్ల నేసితివి స
త్యాఢ్యుండ వీ వందులో
నొకదానిన్ విదళింప దయ్యుకపిచే
నుడ్డాడుకోతిన్ సహో
యకుఁగా స్వీయవధూగవేషణకు నె
ట్లర్థించితో రాఘవా!

అవతారిక :- సప్తసాలాదివిదారణము సైతము సుగ్రీవుని విషయమునఁ జూపిన సౌశీల్యకృత్యమే అని యీశ్లోకమున నుడువు చున్నారు.

శ్లో॥ దాస స్సఖా సమభవ త్తవ యః కపీంద్రః
తద్విద్విషం కపి మమర్షవశా జ్జిఘాంసుః ।
త్వ త్స్నేహవిక్లబధియం త మిమం కపీంద్రం
విస్రంభయన్ సపది సాలగిరీ నవిధ్యః ॥ 20

ప్రతి :- యః=ఏ, కపీంద్రః=వానరరాజగు సుగ్రీవుఁడు, తవ=నీకు, దాసః=దాసుఁడు, సఖా, చ=మిత్రుఁడును, సమభవత్=ఆయెనో!, తత్, విద్విషమ్ = ఆ సుగ్రీవునకు శత్రువగు, కపిమ్=కోఁతిని (వాలిని) అమర్షవశాత్=కోప పారవశ్యమువలన, జిఘాంసుః=చంపఁ దలఁచినవాఁడవై, త్వమ్=నీవు, త్వత్, స్నేహ, విక్లబ, ధియమ్=నీస్నేహము చేత వివశ మగుబుద్ధి గల, తమ్=ఆ, ఇమమ్-ఈ, కపీంద్రమ్=

వానరేంద్రుఁ డగు సుగ్రీవుని, సపది=వెంటనే, విస్రంభయన్–విశ్వసింపఁ జేయుచు, సాలగిరీన్=చెట్లను, కొండను, అవిధ్యః=కొట్టితివి. అనఁగా భేదించితివి.

విశేషములు :- త్వత్ స్నేహవిక్లబధియమ్- 'అతిస్నేహః పాపశ ఙ్కీ' అనులోకోక్తినిబట్టి సుగ్రీవునకు నీయెడల భక్తి మెండు గనుక బలాఢ్యుఁ డగు వాలివలన దేవరవారి కేమైన నపాయము కలుగునేమో! యని ప్రేమాంధ బుద్ధి యగువానిని.

తా॥ ఓ వైకుంఠపతీ! నీవు రాముఁడవుగా నవతరించినప్పుడు ఏవానరేంద్రుఁడు దేవరవారికి దాసుఁడు సఖుఁడు నాయెనో యాయాసుగ్రీవుని నీయందలి భక్తిచేతఁ బ్రేమాంధబుద్ధి యగు వానిని వెంటనే నమ్మింపఁ జేసి స్వస్థమానసుని జేయుటకుఁ దాము సప్తసాలములను పర్వతమును భేదించితిరి. ఇది తమకు సుగ్రీవునిపట్లఁ గల సౌశీల్యమునే తెల్పుచున్నది.

గీ॥ దాసుఁడు సఖుండు నేకపి తమకు వాని
శత్రువౌ వానరుని గిన్కఁ జంపఁ దలఁచి।
నీదునెయ్యానఁ గలఁతఁ జెందినకపీంద్రు
దిగులు చనఁ దరుగిరుల భేదించి తీశ!

శ్లో॥ యద్వా మృగం మృగయుప న్మృగయాపథేన
చ్ఛన్నో జఘంథ న తు శత్రువ దాభిముఖ్యాత్ ।
త ద్వ్యక్త మేవ తవ రాఘవవంశజస్య
తిర్యక్షు నైవ హి విపక్షత యోపచారః ॥ 21

ప్రతి :- మృగయువత్ = బోయ వలె, మృగమ్ = శాఖా మృగ మగు వాలిని, మృగయూపథేన = వేటబాటచే, ఛన్నః, వా = దాగినవాఁడవే యయి, జఘంథ = చంపితి వఁట, శత్రువత్ = శత్రువువలె, ఆభిముఖ్యాత్ = ఎదురుగా నుండి, న జఘంథ, ఇతి. యత్ = చంప వనుట యేదిగలదో, తత్ = అది, రాఘవవంశజస్య = రఘుకులీనుల కులమున నవతరించిన, తవ = దేవరవారికి, యుక్తం ఏవ = న్యాయమే, హి = ఎందు కనఁగా, తిర్యక్షు = తిర్యగ్జంతువులందు, విపక్షతయా = శత్రుత్వ ముతో, ఉపచారః = సత్కారము, న + ఏవ = నైవ = లేనే లేదు.

విశేషములు :- యద్వా- పక్షాంతరమున- లేదా- యత్, వా, అని రెండు పదములుగా విభజించుకొన వచ్చును. 'వా' అవధారణార్థకము. రెండు పదములుగా విభజించియే యిచట అర్థము వ్రాయఁ బడినది. శ్రీరాముఁడు వాలిని చెట్టుచాటున నుండి చంపెనను నాక్షేపమున కీ శ్లోకమున సమాధానము చెప్పఁ బడినది.

'తద్యుక్త మేవ తవ రాఘవవంశజస్య ।
తిర్యక్షు నైవ హి విపక్షత యోపచారః'

అసదృశపరాక్రమశాలులును సార్వభౌములు నగు రఘు వంశపురాజులు తిర్యగ్జంతువులతో నభిముఖముగాఁ బోరుట వారికి గౌరవము కాదు. తుల్యబలప్రతిపత్తి యున్నప్పుడే

వారెదుట నిలిచి పోరుదు రని భావము. కనుక శ్రీరాముఁడు మృగమగు వాలిని చెట్టుచాటునఁ బొంచియుండి చంపుట యుచిత మనియే కవియాశయము.

తా॥ బోయవాఁడు మృగమునువలె వేటమర్యాద ననుసరించి శాఖామృగ మగు వాలిని నీవు చెట్టుచాటున నుండి చంపితి వఁట, శత్రువువలె నభిముఖముగా నుండి చంపలేదఁట. ఇది రఘుకులీనులవంశమునఁ బుట్టిన దేవరవారికి యుక్తమే. ఏల యన ? సార్వభౌములును మహాబలశాలులు నగు రఘువంశపు రాజులకు తిర్యగ్జంతువులపై విపక్షత్వబుద్ధి యెట్లు గల్గును ? వారు తుల్యబలులగు వారినే విపక్షులుగా గౌరవింతురు.

ఉ॥ బోయ మృగంబుఁ బోలెఁ గపి
పుంగవు వాలిని జెట్టు మాటుగా
నాయమువీటి కంపి తఁట
యాజి నెదుర్కొన వంట శత్రున,
ట్లీయది యుక్తమే రఘు మ
హీశులవంశ మలంకరించు నీ
కేయెడ నేన్ విపక్షులుగ
నెంతురె వారలు తిర్యగాదులన్.

అవతారిక :- తరువాత సేతునిర్మాణరూప మగు నతిమానుష కార్యము ననుసంధించు చున్నారు.

శ్లో॥ మానుష్యకం చరిత మాచరితుం ప్రవృత్తో
దేవాతిగం చరిత మంగ కి మంగ్యకార్షీః।
య త్సాగరే బత బబంధిథ నాథ ! సేతుం
శైలైః ప్లవంగమ సమింగిత సంప్రణున్నైః॥ 22

ప్రతి :- అంగ, నాథ ! = ఓ స్వామీ ! మానుష్యకమ్= మనుష్యసంబంధి యగు, చరితమ్=చరిత్రను, ఆచరితుమ్= ఆచరించుటకు, ప్రవృత్తః = ప్రవర్తించిన, (త్వమ్ = నీవు), దేవాతిగమ్ దేవతలనతిశయించిన, చరితమ్ = చరిత్రమును, అంగ్యకార్షీః కిమ్=అంగీకరించితి వేల? యత్ =ఎందు కనఁగా, ప్లవంగమ, సమింగిత, సంప్రణున్నైః=వానరులచేతఁ దేఁబడి విసరివేయఁ బడిన, శైలైః=కొండలచేత, సాగరే=సముద్రమునందు, సేతుమ్ = వారథిని, బబంధిథ = బంధించితివి. బత ! = ఆశ్చర్యము.

విశేషములు :- 'కి మంగ్యకార్షీః' అనుచోట కొన్నిప్రతులందు 'కి మ ప్యకార్షీః' అను పాఠముగలదు. అప్పుడు- కిమపి=నీవనుకొన్న దానికంటె వేఱుగా నేదో మఱియొక దానిని, అకార్షీః = చేసితివి. అని యర్థము. బత- మనుష్యుఁడుగా మెలఁగ వలయు ననుకొన్న నీవు దేవతలకుఁ గూడ శక్యముగాని సేతువును నిర్మించుట ఆశ్చర్యావహ మని భావము.

తా॥ ఓ శ్రీరామా! నీవు మనుష్యునివలె మెలఁగఁ దలఁచి యమానుష మగు చర్య నొనర్చితి వేమి ? దేవతలు సైత మిట్టికార్యము నొనర్పఁ గలరా ? కోఁతులు కొనివచ్చి విసరి

వైచిన కొండలతో సముద్రమునకు సేతువు నొనర్చితివి. ఇది సామాన్యకార్యమా ?

గీ॥ అవని మానుషముం జూప నవతరించి
ఔర ! యతి దేవమహిమతో నలరినావు !
కపివరానీత శైల సంఘములచేతఁ
గడలి కెవ్వారు సేతువుఁ గట్టఁ గలరు ?

అవతారిక :- పూర్వోక్తమగు నర్థమునే మార్చిచెప్పు చున్నారు.

శ్లో॥ యో విక్రమేణ మనుజత్వవిభూషణేన
దేవం వరం వరుణరాజ మజ ! వ్యజేష్ఠాః ।
కృత్వోపదాం దశరథం విధిరుద్రముఖ్యై
ర్దేవైః స్తుత శ్చ స కిలేంద్రజితా జితోఽసి ॥ 23

ప్రతి :- హేఅజ ! = జన్మరహితుఁడ వగు ఓ వైకుంఠనాథా ! తదవతార మగు ఓ శ్రీరామా ! మనుజత్వ విభూషణేన = మనుజత్వమే యలంకారముగాఁగల, విక్రమేణ = పరాక్రమము చేత, వరమ్ = శ్రేష్ఠుఁ డగు, దేవమ్ = దేవుఁడైన, వరుణ రాజమ్ = వరుణరాజును, వ్యజేష్ఠాః = జయించితివి, దశరథమ్ = దశరథమహారాజును, ఉపదామ్ = కానుకనుగా, కృత్వా = చేసికొని, విధి రుద్రముఖ్యైః = బ్రహ్మయు రుద్రుఁడును మొదలుగాఁగల, దేవైః = దేవతలచే, స్తుతః చ = స్తుతింపఁ బడితివికూడ, సఃకిల = అతఁడవేయగు (త్వమ్ = నీవు) ఇంద్ర జితా = ఇంద్రజిత్తుచేత జితః = జయింపఁ బడినవాఁడవు, అసి = అగు చున్నావు.

విశేషములు :- యో విక్రమేణ మనుజత్వవిభూషణేన- విక్రమములకు మనుజత్వవిభూషణత్వ మనఁగా- సముద్రం రాఘవో రాజా శరణం గంతు మర్హతి' అని చెప్పినట్లు సముద్రుని శరణాగతిపూర్వకముగా జయించుట. కృతోపదాం దశరథమ్- దశరథప్రదానము రామునిఁ బ్రసన్నునిఁ జేసికొనుటకుఁ గాన ఉపదగా వర్ణింపఁ బడినది. విధిరుద్రముఖ్యై ర్దేవైః స్తుత శ్చ- 'సీతా లక్ష్మీ ర్భవాన్ విష్ణుః' ఈవిధముగా నని భావము. స కిలేంద్రజితా జితోఽసి- సముద్రాధిదేవత యగు వరుణ రాజును సైతము జయించి బ్రహ్మరుద్రాదులచే దశరథప్రదాన పూర్వకముగా విష్ణువుగా స్తుతింపఁబడిన దేవరవారికి ఇంద్రజిత్తు వలన నోటమి మానవభావనానుగుణ మని గ్రహింపవలెను.

తా॥ ఓ రామా! మానవత్వమే యలంకారముగాఁ గల విక్రమముచేత దేవశ్రేష్ఠుఁ డగు వరుణరాజును జయించితివి. దశరథదర్శనమును కానుకగా సమర్పించి బ్రహ్మదులచేత శ్రీమహావిష్ణువుగా స్తుతింపఁ బడితివి. అట్టి మహామహిమోపేతుఁడ వగునా నీవే యింద్రజిత్తునకు నోడితి వేల ?

చ॥ నరజననైకభూషణ మ
నం దగునట్టిపరాక్రమంబుచేఁ
దరిచితి వంబుధిన్ దశర
థక్షితిపాలుఁడు కాన్క- కాఁగ నా
సరసిజసంభవప్రభృతి
సన్నుతిఁ గాంచితి వట్టినీ వహో!

దురమున నింద్రజిత్తున కె
దుర్గోకనఁ జాల వదేమి రాఘవా!

అవతారిక :- మనుష్యభావనయందు సైతము పరత్వా విష్కారమును మార్గాంతరముగ నుడువు చున్నారు.

శ్లో॥ అబ్ధిం న తేరిథ న జిగ్యథ రాక్షసేంద్రం
నైవాస్య జిజ్ఞిథ యదా న బలాబలం త్వమ్।
నిస్సంశయ స్సపది తస్య పదేఽభ్యషించ
స్తస్యానుజం కథ మిదం హి విభీషణం చ॥ 24

ప్రతి :- యదా = ఎప్పుడు, అబ్ధిమ్ = సముద్రమును, న తేరిథ = దాఁట లేదో, రాక్షసేంద్రమ్ = రాక్షస రాజగు రావణుని, న, జిగ్యథ=జయించ లేదో, అస్య=ఈ రావణుని యొక్క, బలాబలం, చ=బలాబలమును గూడ, న జిజ్ఞిథ= తెలియవో, (తదా=అప్పుడే) త్వమ్=నీవు, నిస్సంశయః= సందేహము లేనివాఁడవై, తస్య=ఆ రావణునియొక్క, అనుజమ్=తమ్ముఁ డగు విభీషణుని, తస్య=ఆ రావణునియొక్క, పదే = స్థానమునందు, సపది = వెంటనే, అభ్యషించః = పట్టాభిషేక మొనర్చితివి, హి=ప్రసిద్ధము, ఇదమ్=ఇది, కథమ్=ఎట్లు ?

విశేషములు :- కథ మిదమ్- సముద్రమును దాఁట లేదు, రాక్షసేంద్రునిబలాబలములఁ దెలియ లేదు, రావణుని జయింప లేదు, అంతకుముందే రావణుని సోదరుఁ డగు విభీషణుని రాక్షసేంద్రునిగా రావణుని స్థానములోఁ బట్టాభిషేక మొన

ర్చుట దేవరవారి సత్యసంకల్పత్వావిష్కారపూర్వకముగాఁ బరత్వమును జాటుచునే యున్నది.

తా॥ ఓ శ్రీరామా! నీవు సముద్రము నైనను దాఁట లేదు, రాక్షసేంద్రుని బలాబలముల నైనను దెలియలేదు, రావణుని జయింపనైనను లేదు, అప్పుడే రావణుని స్థానమున అతనిసోదరుఁడగు విభీషణునికిఁ బట్టాభిషేక మొనర్చుట యెట్లు పొసఁగును. ఇది దేవరవారి యమానుషత్వమును జాటదా?

ఉ॥ వారిధి దాఁట వయ్యసుర
వల్లభు గెల్వవు తద్బలాబలం
బారయ వొక్కయించుకయు
నప్పుడె తత్పదమందు నిర్మలా
చారు నుదారునిన్ దదను
జన్ము విభీషణు సంశయింప కో
శ్రీరఘురామ! యెట్లు లభి
షిక్తుని జేసితి వయ్య! తెల్పుమా.

అవతారిక :- సముద్రునిపైఁ బ్రయోగింపఁ బడిన బాణము చేత నత్యంతదూరమున నున్న తద్ద్వీపముల వసించు దస్యులఁ దునుమాడిన భగవానుని యతిమానుషశీలవిశేషము ననుభ వించుచుఁ జెప్పు చున్నారు.

శ్లో॥ త్వం దక్షిణస్య నివస న్నుదధే స్తటేఽపి
దూరాంతరోత్తరపయోధిమహాంతరీపే।
దైత్యాన్ నిజైకశరపారణయన్ కి మేతాం
లంకాం స్థితోఽత్ర కురుషే కిల న స్మ భస్మ॥ 25

ప్రతి :- దక్షిణస్య, ఉదధేః = దక్షిణసముద్రముయొక్క తటే=ఒడ్డున, నివసన్, అపి=నివసించుచుఁ గూడ, దూర-అంత రీపే- దూర, అంతర = ఎక్కువ యెడము గల, ఉత్తర = ఉత్తరదిక్కునందలి,పయోధి=సముద్రముయొక్క, మహత్ = గొప్ప, అంతరీపే = ద్వీపమునందలి, దైత్యాన్ = రాక్షసులను, నిజ, ఏకశర, పారణయన్ =స్వకీయ మగు ఒకేబాణము నకు ఉపవాసానంతరభోజనముగాఁ జేయుచున్న (గుఱిచేయుచున్న) త్వమ్=నీవు, అత్ర=ఇచ్చట, స్థితః=ఉన్నవాఁడవగుచు, లంకామ్ = లంకాపురిని, భస్మ=బూడిదనుగా, న, కురుషే, స్మ, కిల, కిమ్ = చేయ వేమి?

విశేషములు :- 'లంకాం స్థితోఽత్ర కురుషే కిల నస్మభస్మ'- శ్రీరామా! నీవు దక్షిణసముద్రతీరమున నుండి చాల దవ్వున నున్న యుత్తరసాగరద్వీపములోని బలాఢ్యు లగు ననేకరాక్షసుల నొకబాణమున కెర చేసితివే, యట్లే దగ్గఱలో నున్నలంక నిచ్చట నుండియే యేల భస్మము చేయలేదని భావము.

తా॥ ఓరామా! నీవు దక్షిణసముద్రతీరమున నివసించుచుఁ జాల దవ్వుగా నున్న యుత్తరసముద్రద్వీపములో వసించుచున్న దైత్యుల నొక బాణమునకే యెర చేసిన మహావీరుఁడవు గదా! దక్షిణసముద్రతటమున నున్ననీకుఁ గడు దగ్గఱలో నున్న లంక నేటికి నిచ్చట నుండియే భస్మము చేయలేదు.

మ॥ అరరే! దక్షిణవార్థితీరమున నీ
వ ట్లుండి దూరాంతరో

త్రరవారాశిమహాంతరీపమున దై
త్యశ్రేణి నొక్కమ్మునచేఁ
బరలోకంబును జేర్పవే యటులె దే
వా ! యిందునే యుండి నీ
శరతీవ్రార్చుల లంక నేమిటికి భ
స్మం బీవు గావింపవో.

అవతారిక :- సముద్రమథనకాలికం బగు నాశ్చర్యమును సైతము ప్రసంగవశమున నుడువు చున్నారు.

శ్లో॥ ఏతత్ కథం కథయ ? న్మథిత స్త్వయాసౌ
హిత్వా స్వభావనియమం ప్రథితం త్రిలోక్యామ్ ।
అశ్వాప్సరోవిషసుధావిధుపారిజాత
లక్ష్మ్యాత్మనా పరిణతో జలధి ర్బభూవ ॥ 26

ప్రతి :- త్వయా = దేవరవారిచే, మథితః = చిలుకఁబడిన, అసౌ = ఈ, జలధిః = సముద్రము, త్రిలోక్యామ్ = మూఁడు లోకములందును, ప్రథితమ్ = ప్రసిద్ధి కెక్కిన, స్వభావనియమమ్ = సహజమగు మార్పును, హిత్వా = విడిచిపెట్టి, అశ్వ...... లక్ష్మ్యాత్మనా, అశ్వ = గుఱ్ఱముయొక్క (ఉచ్చైశ్శ్రవము యొక్క) అప్సరః = అప్సరఃకాంతలయొక్క, విష = విషము యొక్క, సుధా = అమృతముయొక్క, విధు = చంద్రునియొక్క, పారిజాత = పారిజాతవృక్షముయొక్క, లక్ష్మి = లక్ష్మీదేవి యొక్క, ఆత్మనా = స్వరూపముతో, పరిణతః = మాఱిపోయినది ఇతి యత్ = అనుట యేదిగలదో, ఏతత్ = ఇది (ఇట్లు మాఱుట) కథమ్ = ఎట్లు ? కథయ = చెప్పుము.

విశేషములు :- హిత్వా స్వభావనియమమ్— పాలు పెరుగుగా మాఱును, వెన్న నేయిగా మాఱును- ఇది యీ విధముగా మాఱు నన్నలోకప్రసిద్ధ మగుమార్పును విడిచిపెట్టి యని భావము. ఏతత్ కథం కథయ— నీచేత మథింపఁ బడిన సముద్రము లోకప్రసిద్ధమగు మార్పును జెందక అశ్వాప్సరః కాంతాదిరూపమగు పరిణామమును జెందుట దేవరవారి యఘటితఘటనా పటీయస్త్వమును జాటుచున్నదా లేదా తామే చెప్పవలె ననుట.

తా॥ ఓ రామచంద్రా! నీవు నాఁడు క్షీరాబ్ధిని జిల్కఁగా నది లోకప్రసిద్ధమగు సహజమైన మార్పును వీడి యుచ్చైశ్శ్రవముగాను అప్సరః కాంతలుగాను విషముగాను అమృతముగాను చంద్రుఁడుగాను పారిజాతముగాను శ్రీమహాలక్ష్మిగాను మాఱిపోయినది. ఇట్లు మాఱుటకు హేతువు మాకు గోచరింప కున్నది. ఇట్లగుటకుఁ గారణమేమో నీవే చెప్పుము. ఇది నీ యమానుషచర్యను దెలుపు చున్నదని భావము.

మ॥ ఇది యేమో వచియింపు రామనృపతీ!
యీ వంబుధిన్ జిల్కఁగా
నది స్వాభావిక మైనమార్పు విడి య
త్యాశ్చర్య ముచ్చైశ్శ్రవ

స్త్రీ దశస్త్రైణ, సుధా, హాలాహలసురో
ర్వీజాత పద్మాలయా
మదిరాక్షీ తుహినాంశు రూపపరిణా
మం బంది రొప్పారుటల్.

అవతారిక :- అంతులేని యపరాధము లొనర్చిన విరోధు లపై సైతము మద్దు లేకుండఁ బ్రసరించుచున్న శ్రీవారి కరుణ ననుభవించుచు నుడువుచున్నారు.

శ్లో॥ య స్తాదృశాగస మరిం రఘువీర! వీక్ష్య
విశ్రామ్యతా మితి ముమోచిథ ముగ్ధ మాజౌ।
కో౽యం గుణః కతరకోటిగతః కియా న్వా
కస్య స్తుతేః పద మహో! వద కస్య భూమిః॥ 27

ప్రతి :- హే రఘువీర! = ఓరామా!, తాదృశ + ఆగసమ్= అట్టి యపరాధము గలట్టియు, ఆజౌ = యుద్ధమునందు, ముగ్ధమ్ = మూర్ఛను బొందినట్టియు, అరిమ్ = శత్రువగు, రావణుని, వీక్ష్య=చూచి, విశ్రామ్యతామ్=విశ్రమింపఁ బడవలయును, ఇతి=అని, ముమోచిథ=విడిచిపెట్టితివి, ఇతియత్=అనుట యేదిగలదో, అయమ్=ఈ, గుణః=గుణము, కః=ఏది, (దీనికిఁ బేరేమి) కతర, కోటిగతః=ఏకోటికిఁ జెందినది? కియాన్ వా=ఎంతపరిమాణము గలది? కస్య = ఎవని యొక్క, స్తుతేః=స్తోత్రమునకు, పదమ్=ఆస్పదము, కస్య= ఎవనికి, భూమిః=అందుఁబాటులోనిది? అహో! = ఔరా! వద=చెప్పుము.

విశేషములు:- తాదృశాగసమ్ — ఇయత్తను (హద్దును) మించిన నేర మొనర్చిన— భార్యాపహారణము నిరవధికమును దుస్సహము నగు నపరాధము. దానిని జేసినవాఁడని భావము.

విశ్రామ్యతా మితి ముమోచిథ— అట్టిశత్రువు రణములో బడలి చేతఁజిక్కినపుఁడు చంపక అలసటఁ దీర్చుకొని రమ్మని సెల విచ్చితివి. ఇది స్వామివారి యనన్య సాధారణమగు దయాగుణము శ్రీమద్రామాయణము.

'గచ్ఛాను జానామి రణార్దిత స్త్వం
ప్రవిశ్య రాత్రిం చరరాజ! లంకామ్।
ఆశ్వాస్య నిర్యాహి' .... ....

కతరకోటిగతః— గుణములు రెండువిధములు, ఆశ్రయణ సౌకర్యాపాదకములు ఉదా- సౌశీల్యము, సౌలభ్యము, మొదలగునవి. 2 ఆశ్రిత కార్యాపాదకములు. ఉదా- జ్ఞానశక్త్యాదులు. అందులో శ్రీవారు రావణునిపైఁ జూపిన యీ కృపాగుణము ఏకోటికిఁ జెందినది యని ప్రశ్నకు అభిప్రాయము. ఇచ్చట కోటిశబ్దము 'తెగ' అను నర్థమును దెలుపును. లేదా 'అంచు' అని యేనియుఁ జెప్పుకొనవచ్చును. వద- దయ పరదుఃఖాసహిష్ణువే యైనను అంతటి మహాపరాధులయందు దానికిఁ బ్రవృత్తి యుండనే యుండదు. అట్లు ప్రవర్తించిన దేవరవారి యీ దయాగుణమునకు స్వరూప స్వభావపరిమాణ నిర్ణయ స్తుతి సాక్షాత్కారములు సంభవింపవని భావము.

తా॥ రఘువీరుఁడ వగు ఓ రామచంద్రా! హద్దుమీఱిన యపరాధ మొనర్చిన వైరియగు రావణుఁ డలసి చేఁ జిక్కి నప్పు డతని యశక్తతను జూచి విశ్రాంతిఁ దీసికొని రమ్మని విడిచిపెట్టితి వఁట! ఈ గుణమునకుఁ బే రేమి? ఇది యేకోటికిఁ జెందినది. దీని పరిమాణ మెంత? దీని నెవఁడు స్తుతింపఁ జాలును, ఇది యెవని కందుబాటులోనిది- స్వామీ! చెప్పుము. ఆశ్చర్యమును గలిగించుచున్నది.

ఉ॥ ఎంతమహాపరాధి యరి
యెంతయు డస్సిన నాలమందు వి
శ్రాంతిని జెంది రమ్మని ప్ర
సన్నతఁ బల్కితి వంట, మేలు మే
లెంత దయామయుండవయ!
యీగుణనామ మ దేమి? దీని కే
మంత, మెవండు దీని నహా
హా! నుతియించును జెప్పు రాఘవా!

అవతారిక :- రావణుని రూపుమాపఁ జాలిన భుజబలము గల రామభద్రున కింద్రజిన్నాగాస్త్ర బంధనమువలన మూర్ఛ యెట్లు సంఘటిల్లునని శంకించుకొని సమాధాన మిచ్చుచున్నారు,

శ్లో॥ య ల్లక్ష్మణ స్త్వదనుజో రిపుశక్తిముగ్ధః
శత్రో ర్గదు ర్హనుమత స్తు లఘు ర్బభూవ।
ఏతేన వై సువిదితోఽభవ దింద్రశత్రో
ర్మాయాస్త్ర బంధననిబంధనజో విమోహః॥ 28

ప్రతి :- రిపు, శక్తి, ముగ్ధః = శత్రువుయొక్క శక్త్యా యుధముచేత మూర్ఛ చెందిన, తేత్, అనుజః = సీతమ్ముఁడగు, లక్ష్మణః=లక్ష్మణుఁడు, శత్రోః=శత్రువునకు, గురుః=బరువైనవాఁడును, హనుమతః, తు=హనుమంతున కన్ననో, లఘుః=తేలికయైనవాఁడును, బభూవ=ఆయెను, ఇతి యత్ = ఇట్లగుట యేది కలదో, ఏతేన=దీనిచేత, (ఈపనిచేత) ఇంద్ర శత్రోః = ఇంద్రజిత్తుయొక్క, మాయా, అస్త్ర బంధన, నిబంధన, జః=మాయాస్త్రబంధన మనెడు కారణమువలనఁ బుట్టిన, విమోహః=మూర్ఛ, సువిదితః=బాగుగాఁ దెలియఁ బడినది, అభవత్ =ఆయెను, వై =ప్రసిద్ధము.

విశేషములు :- శత్రో ర్గురు ర్హనుమత స్తు లఘు ర్బభూవ- ఇంద్రజిత్తు శక్తిప్రహారముచేత మూర్ఛితుఁడైన లక్ష్మణస్వామి శత్రువునకు దురుద్ధరుఁడును హనుమంతునకుఁ బుష్పమాల వలెఁ దేలిక యైనవాఁడుగ నుండె ననుటకుఁ బ్రమాణము.

'హిమవాన్ మందరో మేరుః త్రైలోక్యం వా సహామరైః
శక్యం భుజాభ్యా ముద్ధర్తుం న సంఖ్యే భరతానుజః
శత్రూణా మప్రకంప్యోఽపి లఘుత్వ మగమత్ కపేః'

శ్రీమద్రామాయణము—యుద్ధకాండ.

(మేరుమందర హిమవత్పర్వతముల నైనను వేల్పులతో సహా మూఁడులోకముల నైనను భుజములతో నెత్త శక్యము కావచ్చును గాని యుద్ధమున లక్ష్మణుని ఎత్త శక్యము గాదు.

ఇట్లు లక్ష్మణుఁడు శత్రువులకుఁ గదలింప శక్యము గాని వాఁడైనను హనుమంతునకుఁ గడు తేలికగా నుండెను)

వై = ప్రసిద్ధము— శత్రుశక్తిమూర్ఛితుఁడగు లక్ష్మణ స్వామియే వైరికి దురుద్ధరుఁడు కాఁగా ఇంద్రజిన్మాయాస్త్రి బంధనము దేవా! నీకొక లెక్కయా? బద్ధుఁడు వోలె నీవు కాన వచ్చుట మానవత్వనటనమే కాని వేఱు కాదు.

తా॥ ఓరామా! వైరిశక్త్యాయుధమూర్ఛితుఁడగు నీతమ్ముఁడైన లక్ష్మణుఁడు శత్రువునకు దుర్భరుఁడును హనుమంతునకు తేలికవాఁడు నగుటచేతనే యింద్రజిత్తుమాయాస్త్రిజనిత మైన మూర్ఛ మానవభావనతో నీవు నటించిన దే యని చెప్పక చెప్పు చున్నది.

ఉ. నీయనుజుండు లక్ష్మణుఁ డ
నీదృశుఁ డయ్యరిశక్తిముగ్ధుఁడై
మోయఁగ దుశ్శకుం డరికిఁ
బూ వటు మారుతి కల్కనాయెఁ బో!
ఈయది మర్త్యతానటన
మే యని తావక మింద్రజేతయ
మ్మాయపుటస్త్రిబంధమున
మైమఱపున్ దెలుపున్ రఘూద్వహా!

అవతారిక :- ఇప్పుడు చరాచరముక్తిప్రదానవైచిత్ర్యము ననుభవించుచు నప్పుడు తనకు నిశ్శ్రేయసము లభింపమికి వగచు చున్నారు.

శ్లో॥ హా హంత హంత! భవత శ్చరణారవింద
ద్వంద్వం కదా ను భవితా విషయో మమాక్ష్ణోః ।
యోఽహం నిరర్గళవినిర్గలదంధకారై
ర్వృక్షై స్తృణై శ్చ సులభం సమయం వ్యతీతః ॥ 29

ప్రతి :- యః=ఏ, అహమ్ = నేను, నిరర్గళ, వినిర్గలత్, అంధకారైః=అడ్డు లేకుండ వెళ్ళిపోవుచున్న యజ్ఞానముగల, వృక్షైః=చెట్లచేతను, తృణైః=గడ్డిపఱకలచేతను, సులభమ్= సుఖముగాఁ బొందఁ దగిన, సమయమ్=కాలమును, వ్యతీతః= అతిక్రమించితినో, (తస్య=అటువంటి) మమ = నాయొక్క, అక్ష్ణోః=కన్నులకు, భవతః=దేవరవారియొక్క, చరణారవింద, ద్వంద్వమ్=పాదపద్మములజంట, కదా,ను=ఎప్పుడు, విషయః = లక్ష్యము, భవితా = కాఁగలదు ? ఎన్నఁటికి శ్రీవారి పాదపద్మదర్శనము నాకు ఘటిల్లదు అని భావము. హా హంత, హంత=అయ్యయ్యో! విచార మగుచున్నది.

విశేషములు:- నిరర్గళ వినిర్గళ దంధకారైః వృక్షైః తృణైశ్చ- వృక్షత్వ, తృణత్వ, ప్రయుక్తాజ్ఞత్వ శూన్యములగు వృక్షములచేత, తృణములచేత, సమయం+వ్యతీతః- ఆ కాలము నతిక్రమించితిని. అనఁగా- అప్పటి వృక్షతృణము లందు ఒకటిగాఁ బుట్టక పోతినని మనస్సులోని యార్తి.

హాహంతహంత- ఈ యవ్యయసముదాయము శోకాతి శయమును దెలుపుచున్నది. భూరిసంభావ సమయములోనే

ధనమునకు నోచుకొననివానికిఁ బరీక్షించి యిచ్చు దానమున నాశ యేముండును అని భావము.

తా॥ ఓ శ్రీరామా! అడ్డు లేకుండ నజ్ఞానాంధకారమునుండి విడుదలఁ గాంచిన తృణవృక్షములకుసైత మందుఁబాటులో నున్న యాకాలమునఁ బుట్టక పోయితిని. ఇఁక నేను దేవర వారి పాదపద్మములజంట నెన్నఁడు చూడఁ గలను. అయ్యయ్యో! యెంత విచారము.

గీ॥ అయ్యో! రాఘవ! త్వచ్చరణాబ్జయుగళిఁ
గాంచుభాగ్యంబు నాకెప్డు గలుగు నొక్కొ!
మించిపోయెను బో! దైవవంచితుండఁ
దరుతృణంబులతోఁ బాటు తరుణ మద్ది.

అవతారిక :- ముక్తి కుపాయములు భక్తిప్రపత్తులు. అవి లేనివృక్షములకు సైతము మోక్షము నొసఁగుట యెట్లు సంభ వించు నని శంకించుకొని సమాధానమును జెప్పుచున్నారు.

శ్లో॥ వంశం రఘో రనుజిఘృక్షు రిహావతీర్ణో
దివ్యై ర్వ్యవర్ధిథ తథాఽత్ర భవద్గుణౌఘైః।
త్వత్సన్నిధప్రభవశైత్యజుషో యథాహి
వృక్షా శ్చ తాంతి మలభంత భవద్వియోగే॥ 30

ప్రతి:- రఘోః=రఘుమహారాజుయొక్క, వంశమ్=వంశ మును, అనుజిఘృక్షుః = అనుగ్రహింపఁ దలఁచినవాఁడవై, ఇహ=ఇచ్చట, అవతీర్ణః=అవతరించిన (త్వమ్=నీవు) త్వత్, సన్నిధి ప్రభవ, శైత్య, జుషః=నీసన్నిధానముచేఁ బొడమిన

చలువను బొందిన, వృక్షాః, చ = చెట్లు సైతము, భవత్, వియోగే = నీ యెడఁబాటు నందు, యథా = ఏరీతిగా తాంతిమ్ = వాడఁబటను, అలభంత = పొందినవో, తథా = ఆ రీతిగా, అత్ర = ఈ భూలోకమున, దివ్యైః = అప్రాకృతములగు, భవత్, గుణ, ఓఘైః = దేవరవారి కల్యాణగుణసమూహములచేత, వవర్ధిథ = వర్ధించితివి.

విశేషములు:- వంశం రఘూ రనుజిఘృక్షుః- శ్రీరాముఁడీలోకమున నవతరించుట రఘువంశానుగ్రహార్థ మని భావము.

వృక్షా శ్చ- శ్రీవారి యెడఁబాటు నెఱుంగని వైనను- అని 'చ' శబ్దమున కర్థము.

లేదా- సలిలమాత్రధారకము లైనప్పటికి అని యైనను జెప్పికొన వచ్చును.

ఈ శ్లోకమునందు శ్రీరామవిరహమువలని గ్లానిచేత వృక్షములందుఁ బరమభక్తి సూచిత మగుచున్నది. పరమభక్తి యనఁగా 'పునర్విశ్లేష భీరుత్వం పరమా భక్తి రుచ్యతే' అట్టి పరమభక్తిరూప మోక్షోపాయము వృక్షములందుఁ గన్పట్టుటచేత శ్రీరాముఁడు వానికి మోక్షమును బ్రసాదించినాఁడని సాంప్రదాయి కులయాశయము.

తా॥ శ్రీరామచంద్రప్రభూ! రఘువంశము ననుగ్రహింప నీలోకమున నవతరించిన నీవు నీ సన్నిధివలనఁ బొడమిన చలువతో వర్ధిల్లిన వృక్షములు నీ యెడఁబాటు సమయమున నెట్లు

వాడిపోవునో యట్లుగా భవదీయములగు అప్రాకృత కల్యాణ గుణగణముల వర్షించితివి.

గీ॥ ఇనకుల మనుగ్రహింప నీ వింపుఁ బుట్టి
నీగుణౌఘంబు వర్షించి నెగడినావు।
దాన నే చెల్లు నీసన్నిధానమహిమఁ
బండె, నీవిరహంబుచే నెండె, రామ!

అవతారిక :- 'దేశోఽయం సర్వకామధుక్' (ఈ దేశము సర్వకామములను బితుకునది) 'తే వయం భవతా రక్ష్యా భవ ద్విషయవాసినః' (దేవరవారి దేశవాసులము గాన మేము శ్రీవారికి రక్షణీయులము) అన్నట్లు భగవద్భాగవతాభిమత దేశవాసముగూడఁ బ్రపత్తిలోఁ జేరి సాధన మగుటచేత అట్టి మోక్షసాధనము తృణాదుల కున్నదని నుడువుచున్నారు.

శ్లో॥ యే ధర్మ మాచరితు మభ్యసితుం చ యోగం
బోద్ధుం చ కించన న జా త్వధికారభాజః।
తేఽపి త్వదాచరితభూతలబంధగంధాత్
బంధాతిగాః పరగతిం గమితా స్తృణాద్యాః॥ 31

ప్రతి:- యే = ఏజీవులు, ధర్మమ్ = ధర్మమును, (కర్మయోగమును) ఆచరితుమ్ = అనుష్ఠాన మొనర్చుటకును, కించన = కొంచెమైనను, బోద్ధుం చ = తెలిసికొనుటకును, (జ్ఞాన యోగము ననుష్ఠించుటకును) యోగం = ధ్యానమును, అభ్యసితుం చ = అలవాటు చేయుటకును (భక్తియోగము ననుష్ఠించుటకును) జాతు = ఒకప్పుడైనను, అధికారభాజః = అధికార

మును (యోగ్యతను) పొందినవి, న-కావో, తృణాద్యాః = తృణము మొదలుగాఁ గల, తే, అపి=ఆ జీవులు కూడ. త్వత్, ఆచరిత, భూతల, బంధ, గంధాత్=నీచే నడువఁబడిన నేలతో సంబంధ మనెడు పుణ్యమువలన, బంధ+అతిగాః=కర్మబంధ ముల నతిక్రమించినవై, పరగతిమ్=ఉత్తమగతిని (మోక్ష మును) గమితాః=పొందింపఁ బడినవి.

విశేషార్థములు– బంధాతిగాః – అతిక్రమింపఁ బడిన కర్మ బంధము గలవియై,

పరగతిం గమితాః– ముక్తిని నీచేఁ బొందింపఁ బడరి.

దేశవాస మనెడు సాకుపెట్టి తృణాదులకు సైతము మోక్షము ననుగ్రహించితి వని భావము. 'ఉభయ పరికర్మిత స్వాంత స్యైకాంతి కాత్యంతిక పరభక్తి యోగలభ్యః' భగవ ల్లాభము కర్మజ్ఞాన యోగములచేత నిర్మలీకృత స్వాంతున కేకాంతికాత్యంతికభక్తి యోగలభ్యము గావునఁ దృణాదుల కట్టి భక్తియోగము లేకపోవుటచేత దేశవాసముచేతనే పరమ గతిప్రాప్తిని జెప్పుటవలన దేశవాసమునకుఁ బ్రపత్తిముఖ భేదత్వము సిద్ధమని సంప్రదాయజ్ఞుల సూక్తి.

తా॥ శ్రీరామా! కర్మయోగమునుగాని, జ్ఞానయోగమును గాని, భక్తియోగమునుగాని, కొంచెమైన ననుష్ఠించుటకు యోగ్యతలేని తృణాదిజీవులు నీవు సంచరించిన భూతలముతో

సంబంధమున్న పుణ్యమువలనఁ గర్మబంధవిముక్తులై నీచేఁ బరమపదమును బొందింపఁ బడిరి. ఏమి నీ వాత్సల్యము!

ఉ॥ కానవొకింత యేని నధి
కారము ధర్మ మొనర్ప, యోగముం
బూనఁగ జ్ఞానమున్ బడయ
భూతలి నిట్టితృణాదులన్ భవ
న్మానితపాదపంకజస
మర్పణధన్యతమావనీభవా
న్యూనవిశేషపుణ్యమున
నొందఁగఁ జేయవె ముక్తి రాఘవా!

అవతారిక :- వేయి మాట లేల? పరమపదనాథునకంటెఁ గాకుత్స్థునియందే కల్యాణగుణాధిక్యము కల దని సయుక్తికముగా నుడువు చున్నారు.

శ్లో॥ తాదృగ్గుణో నను బభూవిథ రాఘవ! త్వం
య స్తావకం చరిత మన్వహ మన్వభుంక్త ।
సోఽత్రైవ హంత హనుమాన్ పరమాం విముక్తిం
బుద్ధ్వావధూయ చరితం తవ సేవతేఽసౌ ॥ 32

ప్రతి :- హేరాఘవ! = ఓరామా! యః = ఏ హనుమంతుఁడు, తావకమ్ = నీసంబంధి యగు, చరితమ్=చరిత్రను, అన్వహమ్=ప్రతిదినము, అన్వభుంక్త=అనుభవించెనో, సః= అటువంటి, అసౌ=ఈ, హనుమాన్=హనుమంతుఁడు, పరమామ్=ఉత్కృష్టమగు, విముక్తిమ్ = మోక్షమును, అవ

ధూయ=త్రోసివైచి, అత్ర+ఏవ = ఈ లీలావిభూతియందే, తవ=నీయొక్క, చరితమ్=చరిత్రమును, బుద్ధ్యా = బుద్ధితో (మనస్సుతో) సేవతే=సేవించు చున్నాఁడు, త్వమ్ + నీవు, తాదృగ్గుణః = అటువంటి కల్యాణగుణములు గలవాఁడవు బభూవిథ, నను=ఇతివి గదా! హంత!=సంతోషము.

విశేషములు:- తాదృగ్గుణః-పరమపద నాథునకంటె నధిక కల్యాణగుణములు గలవాఁడవు. కనుకనే శ్రీమద్రామాయణమున

'బహవో దుర్లభా లోకే యే త్వయా కీర్తితా గుణాః
మునే వక్ష్యామ్యహం బుద్ధ్వా తై రుక్తః శ్రూయతాం నరః

అని శ్రీరాముఁ డనేక దుర్లభగుణ నిలయుఁడుగా వర్ణింపఁ బడెను. ఇది మానుషత్వమున సైతము రామునియెడఁ బరత్వమును సూచించు చున్నది.

సోఽత్రైవ హంతి హనుమాన్ పరమాం విముక్తిం బుద్ధ్యాఽవధూయ—హనుమంతుఁడు ముక్తిని సైతము కాదని రామ చరిత్రమునే యిచట ననుభవించె ననుటకు శ్రీమద్రామాయణము,

'స్నేహో మే పరమో రాజన్ త్వయి నిత్యం ప్రతిష్ఠితః
భక్తిశ్చ నియతా వీర! భావో నాన్యత్ర గచ్ఛతి'

కొన్నిప్రతులందు మొదటి పాదముచివర 'రాఘవత్వే' అని పాఠము కలదు. అప్పుడు రాఘవత్వే = నీవు రాముఁడవుగా నవతరించినప్పు డని భావము. వ్యాఖ్యలో మాత్రము రాఘవ!

త్వమ్ - అనియే కన్పట్టుచుండుటచేత నేను రాఘవ! త్వమ్ - అను సారమునే గ్రహించితిని.

తా॥ ఓ సీతాపతీ! హనుమంతుఁడు నిత్యము నీ చరిత్రమునే యనుభవించుచుఁ బరమపురుషార్థమగు ముక్తినిసైతము కాదని యీ లీలావిభూతిలో మనసార నీ చరితామృతమునే గ్రోలుటచేతఁ బరమపదనాథునికంటె నీయందే కల్యాణగుణ సమృద్ధి కలదని తెలుచున్నది.

ఉ॥ నీదగు సచ్చరిత్రమును
నిచ్చలుఁ గ్రోలుచు వాయుపుత్త్రుఁడే
కాదని ముక్తిఁ గింపురుష
ఖండమునందున నేఁటికిన్ భవ
త్పాదగతాంతరంగుఁ డయి
పల్మరు నీచరితంబె యెంచు నిం
కేదియు లేక డెందమున
నిట్టిగుణాఢ్యుఁడ వీవు రాఘవా!

అవతారిక :- 'ధాతూనా మివ శైలేంద్రో గుణానా మాకరో మహాన్' (గైరికాదిధాతువులకు శైలేంద్రమువలె గుణములకుఁ బెన్నిధి) అన్నట్లు కాకుత్స్థుఁడు సకలకల్యాణ గుణాకరుఁడైనను 'వధార్హ మపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్' అన్నసూక్తిచేత కృపయే మహాపరాధులకు శరణమని యీవిషయము నుపసంహరించుచున్నారు.

శ్లో॥ య స్త్వం కృతాగస మపి ప్రణతిప్రసక్తం
తం వాయసం పరమయా దయయాఽక్షమిష్ఠాః।
తేనైవ మాదృశజనస్య మహాగసోఽపి
యుక్తం సమాశ్వసన మి త్యుపధారయామి॥ 33

ప్రతి :- యః=ఏ, త్వమ్=నీవు, కృతాగసమ్, అపి=చేయఁబడిన నేరము గలవాఁడైనప్పటికి, ప్రణతి, ప్రసక్తమ్=నమస్కారమునం దుద్యుక్తుఁడగు. తమ్=ఆ, వాయసమ్=కాకాసురుని, పరమయా=నిరవధిక మైన, దయయా=కృపచేత, అక్షమిష్ఠాః=క్షమించితివో తేన=ఏవ = ఈకారణముచేతనే మహాగసోఽపి=మహాపరాధి యైనను, మాదృశ, జనస్య=నాబోటిజనమునకు, సమాశ్వసనమ్=రక్షింపఁ గలఁడను విశ్వాసము, యుక్తమ్=యోగ్య మైనది, ఇతి=అని, ఉపధారయామి=నిశ్చయించుకొను చున్నాను.

విశేషములు :- ప్రణతిప్రసక్తమ్- 'స తం నిపతితం భూమౌ' అని చెప్పుటచేత ఆనేలమీఁదఁ బడుటనే కాకాసురుఁడు ప్రణామ మొనర్చుటకుఁ బ్రయత్నించె నని శ్రీరాముఁ డభిప్రాయపడెను.

'త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య త మేవ శరణం గతః' అనుటచే అధికాపరాధ మొనర్చె నని తండ్రి మొదలగువారిచే విడువఁ బడియుఁ గాకాసురుఁడు శ్రీరామాశ్రమమును జేరుకొనెను. అంతఃపురాపరాధి యగు కాకాసురునే కాచుటచేత మాబోటి యపరాధుల కూఁటట గలుగు చున్నదని 'యుక్తం సమాశ్వసనమ్'- అనుపదము చాటుచున్నది.

తా॥ ఓ రామచంద్రా! నీవు అంతఃపురద్రోహియగు కాకాసురుఁడు నేలఁపైఁ బడినంతనే నమస్కారమున కుద్యుక్తుఁడైనట్లు భావించి పరమదయతో క్షమించుటఁజేసి మహాపరాధులమగు మమ్ముఁగూడ నట్లే క్షమింతువని మాకు విశ్వాసము కలుగు చున్నది.

ఉ॥ అంతిపురంబునందునె మ
హాపకృతిం బొనరించి నిన్ను నొ
క్కింత నమస్కరింప క్షమి
యించితి కాకము రామచంద్ర! నీ
యంతర మట్టి దాటనె మ
హాకలుషాత్ముల మయ్యు మేము నీ
యంతిక మేగుదేరఁగ భ
యం బెడలింతు వటంచు నమ్మెఁటల్.

అవతారిక:- ఇట్లు శ్రీ రామావతారాతిమానుషచరిత్ర వైచిత్ర ననుభవించి యిరువది శ్లోకములతో శ్రీకృష్ణావతారాతిమానుషచరిత్ర వైచిత్ర్యమునుగూడ ననుభవింపఁ దలఁచుచు మొట్టమొదటఁ బారాడుటకు సైతము చేతఁగాని బాల్యదశలో ప్రబలపూతనాశకటయమలార్జున భంజనాదుల నొనర్చిన నీవు శ్రీకృష్ణా! కంసభయమువలన నందవ్రజమున కేల చేరితివని ప్రశ్నించు చున్నారు.

శ్లో॥ సా పూతనా శకట మర్జునయో శ్చ యుగ్మం
బాల్యోచితేఽన్యపర చేష్టితవిస్ఫులింగే।
యస్యాలభంత శలభత్వ మహో నిగూఢః
స త్వం వ్రజే వవృధిషే కిల కంసభీత్యా ॥

ప్రతి :-యస్య=ఏ, తవ=నీయొక్క, బాల్యోచితే=శైశవమునకుఁ దగినదియు, అన్య, పర, చేష్టిత, విస్ఫులింగే=లీలానుగుణమగు వ్యాపారరూపమైన నిప్పురవయందు, సా=ఆ (శిశుహంత్రి యని పేరుమ్రోగిన) పూతనా = పూతనయు, శకటమ్=(అసురావిష్టమగు) బండియు, అర్జునయోః = మద్దిచెట్లయొక్క, యుగ్మం. చ = జంటయు, శలభత్వమ్=మిడుతలగుటను, అలభంత=పొందినవో, సః=అటువంటి, త్వమ్=నీవు, కంసభీత్యా=కంసుని భయముచేత, నిగూఢః=దాఁగినవాఁడవై, వ్రజే=నందగోకులమున, వవృధిషే, కిల=పెరిఁగితివఁట, అహో!=ఆశ్చర్యము.

విశేషములు :- అన్యపర......—లీలానుగుణమే కాని హింసాపరము కాదు. చేష్టితవిస్ఫులింగే — విస్ఫులింగసాదృశ్యమువలన — పూతనాశకటార్జున భంజనము చిన్నలీల లని భావము. అహో! — చిన్నబాలలీలలచేతనే పూతనాది సంహార మొనర్చిననీకుఁ గంసుఁడు సైతము మట్టిలీలచే వధ్యుఁడై యుండ వానిభయముచేత మఱియొక చోట దాగుట యాశ్చర్యకరమని భావము.

తా॥ ఓ యదుసింహా! కృష్ణా! శిశుహంత్రి యని పేరు గాంచిన పూతనయు శకటాసురుఁడును మద్దిచెట్లజంటయు బాల్యోచిత లీలానుగుణమగు నీ చిన్నిపనిపేరి నిప్పురవయందు మిడుతలై పోయినవిగదా! ఆ నీవు కంసభయమున గోకులము నందు రహస్యముగాఁ బెరిఁగితి వఁట. ఇది చాల వింతగా నున్నది.

గీ॥ పూతనాశకటార్జున భూరుహముల
బాలలీలాగ్నికణమున భస్మమట్లు
సలుపునీ వొక్కమామకు జడిసి దాఁగి
నా వఁట యదేల వ్రేపల్లె నందబాల!

అవతారిక :— శ్రియఃపతివియు నిత్యసూరిసేవ్యుఁడవును విభూతిద్వయ నాయకుఁడవును యోగిజనాన్వేష్యమాణుఁడవు నగు నీకు వెన్న ముచ్చిలించుట యెట్టిపని యని ప్రశ్నించు చున్నారు.

శ్లో॥ పశ్యత్సు సూరిషు సదా పరమం పదం తే
దేవ్యా శ్రియా సహ వసన్ పరయా విభూత్యా।
యోగేన యోగనిరతైః పరిమృగ్యమాణః
కిం త్వం వ్రజేషు నవనీత మహో! వ్యముష్ణాః॥ 35

ప్రతి :— తే=నీయొక్క, పరమమ్=శ్రేష్ఠమగు, పదమ్=స్థానమును, సూరిషు = నిత్యసూరులు, సదా = ఎల్లప్పుడు, పశ్యత్సు, సత్సు=చూచుచుండఁగా, పరయా=శ్రేష్ఠమగు, విభూత్యా=(ఉభయవిభూతులను నిర్వహించెడు) సంపదతో,

(ఉపలక్షితః = చూడఁబడిన వాఁడవై) శ్రియా, దేవ్యా, సహ = శ్రీదేవితోఁ గూడ, (శేషపర్యంకే = శేషతల్పము నందు) వసన్ = నివసించుచు, యోగనిరతైః = యోగీశ్వరుల చేత, యోగేన = ధ్యానముచేత, పరిమృగ్యమాణః = వెదకఁ బడుచున్న, త్వమ్ = నీవు, వ్రజేషు = గొల్లపల్లెలందు, నవనీతమ్ = వెన్నను, కిమ్ = ఎందుకని, వ్యముష్ణాః = దొంగిలించితివి, అహో! = ఔరా! నీచర్యలు విరుద్ధములుగా నున్నవి.

వి శేషార్థములు :—'పశ్యన్తి సూరిషు సదా పరమ పదంతే' త ద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః—ఈశ్రుతి యిందులకుఁ బ్రమాణము.

అహో!— ఇవి విరుద్ధచర్యలు. ఏమి యెఱుఁగని వ్రజవాసులకు సాక్షాత్కారము యోగీశ్వరులకు అన్వేష్యత్వము— ఇది విరుద్ధము గదా! ఉభయవిభూతి నాయకుఁడగు శ్రియఃపతి యెక్కడ? నవనీతచౌర్య మెక్కడ? ఇదియు విరుద్ధమే కనుక 'అహో' అని కవి యాశ్చర్యమును సూచించెను.

తా॥ దేవరవారి పరమపదమును నిత్యసూరులు సదా చూచుచుండ ఉభయవిభూతులను నిర్వహించెడు సంపదతో నొప్పుచు శేషపర్యంకమున శ్రీదేవిచే సేవింపఁబడుచు యోగీంద్రులు ధ్యాన మొనర్ప నొప్పారు శ్రీవారు గొల్లపల్లెలలో వెన్నల నేల ముచ్చిలించితిరో!

గీ॥ అరయ సూరుల్ సదా నీదుపరమపదము
పరవిభూతి దలిర్ప శ్రీ సరసఁ గ్రాల
వెదక లోదృష్టి యోగులు వెలయునీవు
వెదకుదే వెన్న ముచ్చిల వ్రేతలిండ్లు.

అవతారిక:- 'దామ్నా చైవోదరే బద్ధ్వా ప్రత్యబధ్నా దులూఖలే! యది శక్నోషి గచ్ఛ త్వ మతిచంచలచేష్టిత!'

(యశోద కృష్ణునిపొట్ట కొకత్రాడు గట్టి దానిని రోటికి బంధించి యొకచోట నిలవనియో యల్లరిపిల్లవాఁడా! శక్తి యున్నచో నింక వెళ్లుము) అన్న వెన్న దొంగిలించినందువలన నేర్పడిన బంధనము ననుభవించుచు నుడువు చున్నారు.

శ్లో॥ యం దుర్గ్రహం సుమనసో మనసాఽపి నిత్యం
బంధచ్ఛిదం పరమ మీశ ముదాహరంతి।
దామ్నా నిబద్ధ ఇతి శుశ్రుమ తం భవంతం
నాలం బభూవిథ బత శ్లథనాయ తస్య॥ 36

ప్రతి:- యమ్=ఎవనిని, సుమనసః=నిర్మలాంతఃకరణుఁడగు యోగియొక్క, మనసా, అపి = మనస్సుచే సైతము, దుర్గ్రహామ్=గ్రహింప శక్యముకానట్టియు, నిత్యమ్= శాశ్వతుఁడై నట్టియు, బంధచ్ఛిదమ్=సంసారబంధమును ఛేదించునట్టియు, పరమమ్ = శ్రేష్ఠుఁడైనట్టియు, ఈశమ్ = నియామకునిగా (ప్రభువునుగా) ఉదాహరంతి=చెప్పుచున్నారో, తమ్=అటు వంటి, భవంతమ్=నిన్ను. దామ్నా=త్రాటిచేత, నిబద్ధః= బంధింపఁబడినవాఁడు, ఇతి = అని, శుశ్రుమ = వింటిమి,

తస్య = ఆ బంధముయొక్క, శ్లథనాయ = విప్పుకొనుట కొఱకు, అలమ్ = సమర్థుఁడవు, న, బభూవిథ = కాలేదఁట, బత! = ఔరా!

విశేషార్థములు – సుమనసః – కర్మయోగ, జ్ఞానయోగముల చేత నిర్మలీకృతమగు నంతఃకరణముగల యోగియొక్క, బంధచ్ఛిదమ్–సంసారబంధనివర్తకుని, పరమ మీశ ముదాహరంతి– 'త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్' అన్నట్లు ఈశ్వరత్వాభిమానులకు సైతమీశ్వరుఁడవైన, బత! – విస్మయామంత్రణే బత–అను నిఘంటుప్రకార మీశబ్ద మాశ్చర్యమును బోధించును. యోగిమనోదుర్గ్రాహుఁడవును సంసారబంధమోచకుఁడవు నగు నీ వొక స్త్రీకిఁ బట్టుపడి యామె కట్టిన బంధమును ద్రెంపుకొనఁ జాలకపోవుట యాశ్చర్యకరమని భావము.

తా॥ ఏ నిన్ను యోగిజనుల మనస్సులకు సైత మందవనియు నిత్యుఁడవనియు సంసారబంధముల ఛేదింతువనియు నీశ్వరుల మని విఱ్ఱవీగువారికి సైత మీశ్వరుఁడ వనియు వేదములు చాటునో యట్టి నిన్ను దామబద్ధునిగా వింటిమి ఆ త్రాటిని నీవు విప్పుకొనలేక పోతివఁట– కృష్ణా! యిది యాశ్చర్యకరముగా నున్నది.

గీ॥ మనసునకు నంది వనియు బంధనము లూడ్చు
వనియు నీశుల కీశుఁడ వనియు బిరుదు,

ఇట్టినినుఁ బట్టుకొని త్రాటఁ గట్ట నోర్తు
ఏల గోపాల! త్రెంచుకోఁ జాల వైతి?

అవతారిక:- వెనుకటి 'సా పూతనా శకట' మిత్యాది శ్లోకద్వయత్రయమును ఐదు శ్లోకములతో వివరించుచున్నారు.

శ్లో॥ ఐశం హి శైశవ మపి వ్యతివేలఖేలం
య త్పూతనా శకట మర్జునయో శ్చ యుగ్మమ్।
బాల్యోచితా న్యపరసాచివిచేష్టితేన
హంతాలభంత శలభాయిత మోజస స్తే॥ 37

ప్రతి:- ఐశమ్ = ఈశ్వర సంబంధియగు, శైశవమ్, అపి = బాల్యము సయితము, వ్యతివేలఖేలమ్ = హద్దులుమీఱిన క్రీడలు గలది, యత్ = ఎందుకనఁగా, పూతనా = పూతనయు, శకటమ్ = బండియు, అర్జునయోః = మద్దిచెట్లయొక్క, యుగ్మం చ = జంటయు, తే = నీయొక్క, బాల్యా...విచేష్టితేన బాల్య = పసితనమునకు. ఉచిత = తగిన, అన్యపర = లీలాపరమగు, సాచి = సహజమైన, విచేష్టితేన = వ్యాపారముచేత, (తే = నీయొక్క) ఓజసః = తేజస్సునకు, శలభాయితమ్ = మిడుతలపాటును, అలభంత = పొందినవి, హంత = సంతోషము.

విశేషములు:- వ్యతివేలఖేలమ్-ఇన్ని యని హద్దు పెట్టరాని లీలలు గలది. శలభాయితమ్- శలభవ దాచరితమ్- అనఁగా మిడుతలపాటును.

తా॥ ఓ శ్రీకృష్ణా! ఈశ్వరసంబంధి యగు శైశవము కూడ నిన్ని యనియు నింత ప్రమాణముగలవి యనియు నిర్వచింప

వీలుగాని లీలలుగలది. కనుకనే నీతేజస్సునందు బాలోచిత లీలలచేఁ బూతనయు శకటాసురుఁడు మద్దివృక్షములు మిడుతల వలె మాడి పోయినవి. సజ్జనుల కిది యెంతయు సంతోష దాయకము.

ఉ॥ పిశము శైశవంబు నహ
　　　హా! యనిపించు నవేలఖేలమై
యాశకటంబు మద్దు లసు
　　　రాంగనతోడ భవత్ప్రభావహా
తాశనకీలలందు మిడు
　　　తల్ వలె మాడవె? క్షీరపాన, పా
దాశువిసార, చంక్రమణ
　　　హారి శిశూచితలీలలన్ హరీ!

శ్లో॥ సత్యేవ గవ్యనివహే నిజధామ్ని భూమ్నా
　　పర్యంతసద్మసు కిమర్థ మచూచర స్త్వమ్।
　　ముష్ణం శ్చ కిం వ్యజఘటో ఘటశేష మగ్రే
　　గోపీజనస్య పరిహాసపదం కిమాసీః॥ 38

ప్రతి :—త్వమ్ = నీవు, నిజధామ్ని = సొంతయింటియందు, భూమ్నా = అధికముగా, (కావలసినంత) గవ్య, నివహే = గోసంబంధి యగు పాలు, పెరుఁగు, వెన్న మొదలగు వస్తు సమూహము, సతి + ఏవ = ఉండఁగనే, పర్యంత, సద్మసు = ఇరుగుపొరుగిండ్లయందు, కిమర్థమ్ = ఎందుకొఱకు, అచూచరః = దొంగిలించితివి? ముష్ణన్, చ = దొంగిలించుచు, ఘట

శేషమ్=కడవలో మిగిలియున్న దానిని, కిమ్=ఎందుకొఱకు, వ్యజఘటః=ఒలుకఁబోసితివి, గోపీజనస్య = గోపికలయొక్క, అగ్రే=ఎదుట, పరిహాస, పదమ్=పరిహాసమునకుఁ బాత్రమవు, కిమ్=ఎందుకొఱకు, ఆసీః=అయితివి ?

విశేషము—ఇందలి ప్రశ్నత్రయమునకును ఒకటే సమాధానము—అంతయు భగవానుని లీలయే

తా॥ ఓకృష్ణా! నీయింటిలోఁ గావలసినంత పాలు పెరుగు మీగడ వెన్న యున్నదిగదా పొరుగిండ్లలో నెందుకు దొంగతన మొనర్చితివి. దొంగిలించితివి సరే తిని మిగిలినదానిని పారఁబోసితి వేటికి, ఇట్లు చేసి గొల్లతెఱవల యెగతాళి కెందులకుఁ బాత్ర మైనావు ?

గీ॥ భవనమున నున్నఁ బొరుగిండ్లఁ బాలు వెన్నఁ
గృష్ణ! దొంగిల నేల? దొంగిలితి వనుము,
పగులఁ గొట్టంగ నేటికి భాండములను
ఏలగోపీపరీహాస వేల వయితి ?

శ్లో॥ య న్నాథ ! నామ నవనీత మచూచర స్త్వం
తచ్ఛాదనాయ యది తే మతి రావిరాసీత్ ।
కిం ముగ్ధ ! దిగ్ధ మమునా కరపల్లవం తే
గాత్రే ప్రమృజ్య నిరగాః కిల నిర్విశంకః ॥ 39

ప్రతి:—హేనాథ ! =ఓస్వామీ !, త్వమ్=నీవు, నవనీతమ్= వెన్నను, అచూచరః = అపహరించితివి, నామ = ప్రసిద్ధము, ఇతి యత్ =అనుట యేది గలదో, తత్, ఛాదనాయ=దానిని

గప్పిపుచ్చుకొనుటకొఱకు, తే=నీకు, మతిః = బుద్ధి, ఆవిరాసీత్, యది=ఉదయించినయెడల, హేముగ్ధ!=దాపఱికము తెలియనివాఁడా!, అమునా=ఈవెన్నతో, దిగ్ధమ్ = పులమఁబడిన, కరపల్లవమ్ = చిగురాకువంటిచేతిని, తే = నీయొక్క, గాత్రే=దేహమునందు, ప్రమృజ్య=తుడుచుకొని, నిర్విశంకః = నిర్విచారుఁడవై, నిరగాః కిల=వెళ్ళితివఁట, కిమ్=ఎందుకు.

విశేషములు :—ముగ్ధ— దాఁచుకొన నుపాయమెఱుంగనివాఁడా! గాత్రే ప్రమృజ్య నిరగాః కిల— వెన్నచేతిని దేహమున రాచుకొనుట వెన్నదొంగతనమును దాఁచుకొనుట కనుకూలము గాదు. పైపెచ్చు ఆదొంగతనమును బట్టి యిచ్చును. అట్లేల చేసితివి? ఇదియంతయును నీ బాలలీల.

తా॥ ఓనందకుమారా! నీవు నవనీతమును దొంగిలించితివనుకొనుము. ఆ దొంగతనమును గప్పిపుచ్చుటకు నీకు మనస్సు గలిగినపుడు వెన్నచేతిని ఒడలికిఁ బులుముకొంటివేల? అది దొంగతనమునే బైటఁ బెట్టదా? ఈమాత్రము తెలియదా?

మ॥ నవనీతంబును ప్రుచ్చిలించితివి పో!
నాతండ్రి తచ్చౌర్యమున్
భువనఖ్యాతముఁ గప్పిపుచ్చుకొనఁగా
బుద్ధిం దలం పొప్పినన్
సువివేకంబొకొ! వెన్నచేయి మెయికిన్
జొబ్బిల్లఁ గాఁ బుల్మికొం
చవిశంకంబుగ నేఁగి తంట యిది దే
వా! గోపనోపాయమా!

(10)

శ్లో॥ త్వా మన్యగోపగృహగవ్యముషం యశోదా
గుర్వీ త్వదీయ మవమాన మమృష్యమాణా।
ప్రేమ్ణాఽథ దామపరిణామజుషా బబంధ
తాదృ జ్న తే చరిత మార్యజనా స్సహంతే॥ 40

ప్రతి:- గుర్వీ = మిక్కిలి అభిమానవతియగు, యశోదా= యశోదా దేవి, త్వదీయమ్ = నీ సంబంధియగు, అవమానమ్= తిరస్కారమును (నిందను) అమృష్యమాణా=సహింపనిదియై, అన్య, గోప, గృహ, గవ్య, ముషమ్ = ఇతరులగు గొల్లల యిండ్లలో పాలు వెన్నను దొంగిలుచున్న త్వామ్ = నిన్ను, అథ = తరువాత, దామ, పరిణామ, జుషా = త్రాడుగా మార్పుచెందిన, ప్రేమ్ణా=ప్రేమచేత, బబంధ = కట్టివేసెను. ఆర్య జనాః =పెద్దలు, తే=నీయొక్క, తాదృక్ =అటువంటి, చరితమ్=చరిత్రను, న, సహంతే=సహింపరు.

విశేషములు:- గుర్వీ త్వదీయ మవమాన మమృష్యమాణా- మిక్కిలి అభిమానవతిగాన యశోదా దేవి - యశోదకొడుకు మాయింట బాలు దొంగిలించెను, మాయింట వెన్న నపహరించెను, మాయింట జున్ను ముచ్చిలించెనని వ్రజాంగనలనెడు నిందావాక్యముల సహింపలేక పోయెనని భావము. తాదృక్ న తే చరిత మార్యజనా స్సహంతే- ఆర్యజనాః = శుకపరాశరాదులు, భట్టనాథ, పరాంకుశ, పరకాలాదులును, 'యది శక్నోషి గచ్ఛ త్వ మతిచంచలచేష్టిత' అని యశోద నిన్నుఁ బ్రేమమయదామముతో బంధించుటను సహింపరు, సహింపక పోవుటకు హేతువు 'యది శక్నోషి గచ్ఛ త్వమ్'

(చేతనైనచో నింక వెళ్లుము)అని సర్వశక్తిగల (శ్రీ)కృష్ణునను టయే యని గ్రహింపవలెను.

తా॥ అత్యంతాభిమానవతి యగు యశోద యశోదబిడ్డ దొంగ యని వ్రజాంగనలు నిన్నుఁ గూర్చి నిందించు చుండ నీ యా యవమానమును సహింప లేక పొరుగిండ్లలోఁ బాలు పెరుగును దొంగిలించెడు నిన్ను ప్రేమరూప మగు త్రాటితోఁ గట్టివేసె నఁట. ఆర్యులట్టి నీనడతను సహింపఁ జాలకున్నారు.

చ॥ అతిశయితాభిమానవతి
యమ్మ యశోద వ్రజంబువారు నీ
సుతుఁడు గురుండు దొంగలకు
జున్నును వెన్నను ముచ్చిలించె నాన్
మతి సహియింప లేక యవ
మానము దామముపేరి ప్రేమతోఁ
జతురతఁ గట్టి యింకఁ జను
శక్తుఁడవే ననె నైప రుత్తముల్

అవతారిక:- 'తాదృ ఙ్న తే చరిత మార్యజనా స్సంహాతే' అను విషయమునే వివరించు చున్నారు.

శ్లో॥ మాత్రా యది త్వ మసి దామని సన్నిబద్ధః
తచ్ఛ్రావిణా ముదితచాక్షుషనిర్ఘృణానామ్।
బధ్నాసి హంత! హృదయం భగవన్! కుత స్త్వం
సర్వో హి వశ్యవిషయే వివృణోతి వీర్యమ్॥ 41

ప్రతి: హే భగవన్! = షడ్గుణైశ్వర్య సంపన్నుఁడవగు ఓ కృష్ణా!, త్వమ్ = నీవు, మాత్రా = తల్లియగు యశోదచేత, దామని=త్రాటియందు, సన్నిబద్ధః=బంధింపఁ బడినవాఁడవు, అసి, యది=అగుదువేని, తత్, శ్రావిణామ్ = నిన్నుఁ గట్టి వేయుటను వినునట్టియు, (కనుకనే) ఉదిత, చాక్షుష, నిర్ఝ రాణామ్=పుట్టినకన్నీటిప్రవాహము గల, (ఆర్యజనానామ్ = పెద్దలయొక్క, హృదయమ్=మనస్సును, కుతః=ఎందువలన, బధ్నాసి=బంధించుచున్నావు, హంత! = ఆశ్చర్యము. సర్వః= ప్రతివాఁడును, వశ్యవిషయే = లొంగిన వారి విషయమున, వీర్యమ్=పరాక్రమమును, వివృణోతి = వివరించుచున్నాఁడు గదా!

విశేషములు:- ఈ శ్లోకమునఁ బూర్వశ్లోకమునుండి 'ఆర్యజనాః' అనుపదమును దెచ్చుకొని విభక్తివ్యత్యాసముతో 'ఆర్యజనానామ్' అని మార్చుకొనవలెను.

చతుర్థపాదమున అర్థాంతర న్యాసాలంకారమునుంచి పై మూఁడుపాదములలోని విషయమును సమర్థించిరి.

ఓ కృష్ణా! తల్లికి నీవు వశ్యుఁడవు, నీకు ఆర్యజనులు వశ్యులు. కావుననే తల్లి నీ మీఁదను నీ వార్యజనులమీఁద నిట్లు వీర్యమును జూపుచున్నారు.

తా॥ ఓ శ్రీకృష్ణా! నీవు తల్లియగు యశోదచేతఁ ద్రాటిచేత బంధింపఁ బడితివేని చేతనైనచో నామెను బంధించుము. కాని యామాట వినినతోడనే కన్నీరు పెట్టుచున్న యార్యుల

మనస్సును బంధించు చున్నావేటికి? ఔరా! అందఱును తమకు లొంగిన వశ్యులవిషయమునఁ దమప్రతాపమును జూపుదురు గదా!

చ॥ నిను నొకత్రాటఁ గట్టు జన
నిం గని యే మనలేవు వల్లవీ
వనజదళేక్షణా హృదయ
వల్లభ! యయ్యది విన్నతోడనే
కనులను బాష్పపూరములు
గాఱుచు మూమదిఁ గట్టివైతు, వే
మనఁ గనిపింత్రు వశ్యవిష
యంబున విక్రమ మెల్లవారలున్.

శ్లో॥ కాంతాలకాంత మమలం కమలాయతాక్ష
మభ్రూభవిలాస ముదితస్మిత మున్నసంచ ।
వక్త్రం వహన్ పరమ! గోపగృహేషు కిం త్వం
గోపీమనాంసి నవనీత మతాభ్యమోషీః ॥ 42

ప్రతి:- హేపరమ!=ఓసర్వేశ్వర! కాంత, అలక, అంతమ్= అందములగు ముంగురుల కొనలుగలిగినట్టియు, అమలమ్=

నిర్మల మైనట్టియు, కమల, ఆయత, అక్షమ్ = తామరలవలె విశాలములగు కన్నులు గలిగినట్టియు, ఉత్, భ్రూవిలాసమ్= ఉన్నతములగు కనుబొమల యందములు గలిగినట్టియు, ఉదిత స్మితమ్ = ఉదయించిన చిఱునగవు గలట్టియు, ఉన్నసంచ= ఉన్నతమగు నాసిక (ముక్కు) గలదియు, అగు వక్త్రమ్ = మొగమును, వహన్=వహించుచున్న, త్వమ్=నీవు, గోపీ మనాంసి=గోపికల హృదయములను, అభ్యమోషీః = దొంగి లించితివా? ఉత=లేక, నవనీతమ్=వెన్నను, అభ్యమోషీః= దొంగిలించితివా ?

విశేషములు :— పరమ !– పరః, మా, యస్మాత్ ఇతి పరమః=ఎవనికంటెఁ బరుఁడు లేఁడో యతఁడు అనఁగా సర్వోత్తముఁ డని భావము. దాని సంబుద్ధి 'పరమ !' అని యగును. గోపీమనాంసి నవనీత ముతాభ్యమోషీః– కృష్ణా! నీ విట్టి మనోహరముఖముతో గొల్లయిండ్లలో గోపికల మన స్సుల దొంగిలించితివా ? లేక వెన్నను దొంగిలించితివా ? ఉభయమును దొంగిలించితి వని భావము. శ్రీకృష్ణుండు నవనీతహారుఁడును గోపికామనోహరుఁడును గదా !

తా॥ ఓ సర్వేశ్వరా! శ్రీకృష్ణా! అందములగు ముంగురుల కొనలు గలిగి ఆకర్ణాయతములై కమలములను బోలిన కన్నులు గలిగి నిర్మలమై ఉన్నతభ్రూవిలాసము లొప్పి మనోహరనాసికమై చిఱునవ్వుతోఁ దనరు మోముతో నీవు గొల్లలయిండ్లలో గోపీమనస్సుల మ్రుచ్చిలించితివా? లేక వెన్నను దొంగిలించితివా? లేక రెండిటిని గొల్లకొట్టితివా?

ఉ॥ చెన్నలరారు ముంగురులు
చిందఁగ మోమునఁ దామరల్ వలెన్
గన్నులు నున్నతభ్రువులు
క్రాలఁగఁ జిర్నగ వొప్పుమోముతోఁ
జిన్నతనంబునందు సర
సీరుహలోచన! గొల్లయిండ్లలో
వెన్ననె మ్రుచ్చిలించితివొ!
క్రేఁతలయుల్లమె మ్రుచ్చిలించితో!

శ్లో॥ సర్వం గుణాయ గుణినా మితి సత్య మేతత్
యత్ ఖ ల్వి హేతరజనే మలినత్వహేతుః ।

యద్గోపవేషవినిషేవణ ముత్తమం తే
గోపాలనం చ గణయంతి గుణం గుణేషు ॥ 43

ప్రతి :- యత్ = ఎందువలన, తే = నీయొక్క, గోప, వేష, వినిషేవణమ్ = గొల్ల వేషమును సేవించుట, గోపాలనం, చ = ఆవులను రక్షించుటయు, గుణేషు = గుణములందు, ఉత్తమమ్ = శ్రేష్ఠమగు, గుణమ్ = గుణమునుగా, గణయంతి = లెక్కించుచున్నారో, (తత్ = అందువలన) యత్ = ఏది, ఇతరజనే = గుణహీనుఁడగు జనునియందు, మలినత్వహేతుః = దోషమునకుఁగారణమో, (తత్ = అది) సర్వమ్ = అంతయు, గుణినామ్ = గుణవంతులకు, గుణాయ = మంచిగుణముకొఱకే, (భవతి = అగు చున్నది) ఇతి, ఏతత్ = ఈమాట, సత్యమ్ = యథార్థము.

విశేషము :- 'గోపాలనం చ గణయంతి గుణం గుణేషు' కృష్ణా! పరాత్పరుఁడవైన నీకు అత్యంత సౌలభ్యముసైత ముత్కర్షావహమే యని భావము.

తా॥ గుణహీనులయెడ నేది దోషమునకుఁ గారణ మగునో యది యెల్లను గుణవంతులపట్ల నతిశయమునకే హేతువగు

ననెడు సూక్తి యథార్థము. ఓ కృష్ణా! నీవు గొల్లవేషమును బూనుటయు గోవులను గాచుటయు నుత్కర్షమునకే హేతువాయెను గదా!

చ॥ ఎది గుణహీనునం దెసఁగు
నెంతయు దోషనిదాన మాచు న
య్యది యఖిలమ్ము నా సుగుణు
నందు గుణం బనుమాట సత్యమే
యదుకులదీప! లెక్క యిడ
రయ్య! గుణంబుల మేల్ గుణంబుగా
ముదమున గోపవేషమును
బూనుట గోగణరక్ష నీయెడన్.

శ్లో॥ గోపాలపోతకతయా నిభృతం ధరిత్రీ
మావస్తు కామ ఇవ స న్నపి బాల్యలౌల్యాత్ ।
ఐంద్రం నిహత్య మఖ మద్రి మహో దధానః
కిం తస్థిషే సురగణాయ సవాసవాయ ॥ 44

ప్రతి:- నిభృతమ్=నిగూఢముగా (రహస్యముగ) గోపాలపోతకతయా = నందగోపుని కుమారుఁడవను భావముతో, ధరిత్రీమ్=భూమియందు, ఆవస్తుకామః ఇవ=నివసింపఁ దలఁచిన వానివలె, సన్, అపి = అగుచుఁ గూడ, బాల్యలౌల్యాత్ =బాల్యచాపల్యము వలన, అథో=తరువాత, ఐంద్రమ్=

ఇంద్ర దేవతాకమగు, మఖమ్ = యాగమును, నిహత్య = అణంచి వేసి, అద్రిమ్=గోవర్ధన పర్వతమును, దధానః = ధరించుచు, సవాసవాయ = దేవేంద్రునితోఁ గూడిన, సురగణాయ = దేవసమూహముకొఱకు, తస్థిషే, కిమ్ = ఎదురు నిలిచితి వేల ?

విశేషములు:- ఇంద్రం నిహత్య మఖమ్ అనుచోట 'ఇంద్రం నిహత్య మహమ్' అని పాఠాంతరము కలదు. అప్పుడు మహమ్ = ఉత్సవమని యర్థము.

'కిం తస్థిషే సురగణాయ సవాసవాయ' ఇంద్రయాగమునకు విఘ్నమొనర్చె ననఁ కోపముతో దేవేంద్రుఁ డేడుదినములెడ తెగకుండఁ గుంభవర్షమును గురిపింప గోగోపబృందమును గాపాడ నేడుదినములును గోవర్ధనపర్వతమును జేయి మార్చకుండ ధరించి ముక్కోటిదేవతలతోడఁ గూడిన దేవేంద్రునకెదురు నిలిచితివని భావము. గొల్లపిల్లవాఁడుగా దాగియుండఁ దలఁచిన నీ కిట్లు సేయుట యెట్లు బయలుపడ నీయదు ?

తా॥ ఓ కృష్ణా! నీవు గొల్లపిల్లవానివలె నొరులకుఁ దెలియకుండ భూమిలో దాగఁ దలఁచినచో ఇంద్రయాగమును మాన్పించి దానివలనఁ గోపించిన దేవేంద్రునకు దేవతలకుఁ బ్రతిభటుఁడవై వారు కురిపించిన వర్షమును వ్యర్థమొనర్ప గోవర్ధనపర్వతమును గొడుగువలె నేల ధరించితివి. దేవబృంద

సహితుఁడగు దేవేంద్రు నేల యెదురుకొంటివి? ఇది నీ యతిమానుషచర్యను వెల్లడింపదా?

ఉ॥ గోపకుమారున ట్లవని
గూఢముగా నివసింప నెంచియున్
శ్రీపతి! బాల్యచాపలము
చే దివిజేశ్వరుఁ డల్గఁ దన్మఖం
బాపితి వేల? ఛత్ర మటు
లద్రిని దాలిచి రాళ్ళవానయా
టోపము మాన్పుచున్ బ్రతిభ
టుండుగ నిల్చితి వేల వజ్రికిన్.

శ్లో॥ వేణుక్వణప్రణయిని త్వయి లోకనాథ!
బృందావనం చరణసంచరణైః పునానే।
భావా స్తదా వనభువః కిల కీదృశ స్తే
త్వద్గీత సిక్తసికతాసు వసుంధరాసు॥ 45

ప్రతి :- హేలోకనాథ! = ఓ జగన్నాథుఁడ వగు కృష్ణా! వేణు, క్వణ, ప్రణయిని = మురళీగానమునఁ బ్రీతి గలవాఁడవై, త్వయి = నీవు, బృందావనమ్ = బృందావనమును, చరణః సంచరణైః = పాద సంచారములచేత, పునానే = పవిత్రము చేయు చుండఁగా, తదా = అప్పుడు, వసుంధరాసు = యమునా తీరసంబంధి భూభాగములు, త్వత్, గీత, సిక్త, సికతాసు = నీ గానముచేతఁ దడుపఁ బడినయిసుకతిన్నెలు గలవి కాఁగా, వనభువః = బృందావనమునఁ బుట్టిన, తే = ఆ, భావాః =

జంతువులు, కీదృశః కిల = ఎటువంటి స్వభావము గలవి యైనవో గదా !

విశేషములు :- వసుంధరాసు — ఇచ్చట బహువచనము యమునాతీర్థ భేదముచేతఁ బ్రయోగింపఁ బడినది. త్వద్గీత సిక్తసికతాసు—సిక్తపదప్రయోగముచేత గీతమునం దమృత త్వము వ్యంగ్యము. వేణుగానరూప మగు నమృతధారచేత బృందావనప్రాంత యమునాసైకతములు శీతలములుగాఁ జేయఁ బడిన వని భావము.

'భావా స్తదా వనభువః కిల కీదృశ స్తే' నీ వేణుగాన శ్రవణ ప్రవణములై బృందావనములోని జంతుజాలములు జడములు స్వభావాంతరమును బొందిన వని యభిప్రాయము- ఎట్లన ?

> శ్లో॥ శైలోఽగ్ని శ్చ జలాంబభూవ మసయో మూఢాం
> బభూవు ర్జడాః । ప్రాజ్ఞామాసు రగా స్సగోస
> మమృతామాసు ర్మహాశీవిషాః । గోవ్యాఘ్రా
> స్సహజాంబభూవు రపరే త్వన్యాంబభూవుః ప్రభో !
> త్వం తే ష్వన్యతమాంబభూవిథ భవద్వేణుక్వణోన్మాదనే॥ 45

ఈ శ్లోకమునకు నా యనువాదము—

> సీ॥ శైలంబు లగ్నియు సలిలాత్మకము లాయె
> మును లొడ లెఱుఁగనిమూఢు లైరి
> గొల్లలతోడ శాఖులు తెల్వి గల వాయె
> నాశీవిషములకు నమృత మొదవె
> గోవ్యాఘ్రములు జతగూడి మైత్రిఁ దనర్చె
> ముందు పోలేక కాళింది యాగె

నిలిచి బాలసమీరములు పాట నాలించెఁ
బులకితలై లతల్ తలల నూఁచె
గీ॥ ఒకటి చూచుచు నుండ వే ఱొకటి గాఁగఁ
దనరె నవ్వానిలో నన్యతముఁడ వగుచు
నీవు గనిపించినా వఁట, దేవ! నీదు
మురళిగానంబు మోదాబ్ధి ముంచ జగము.

తా॥ జగన్నాథుఁడవగు ఓ శ్రీకృష్ణా! నీవు మురళిని వాయించుచు నీ పాదసంచారముల చేత బృందావనమును బవిత్ర మొనర్చుచుండఁగా నీ గానామృతధారలచేత దడుపఁబడిన యిసుకతిన్నెలుగల యమునాతీర్థ భూభాగములందుఁ బొడమిన స్థావరజంగమము లెట్టి మార్పును జెందినవో గదా!

ఉ॥ ఓ నలినాక్ష ! యమ్మురళి
నూదుచు బృందను బాదముద్రలన్
మానితగా నొనర్చుచు స
మంచితరీతిఁ జరింప నౌర! త్వ
ద్గానసుధారసార్ద్రసిక
తాతలి యైనవసుంధరాస్థలిన్
ప్రాణులు స్థావరంబులు స్వ
భావమునన్ గనె నంట మారుపుల్.

అవతారిక :- పై విషయమునే వివరించుచున్నారు.

శ్లో॥ ధన్యైః శ్రుతం త దిహ తావకరాసకాలే
గీతేన యేన హి శిలా స్సలిలాంబభూవుః ।
పంచాపి కించ పరివృత్తగుణాని భూతా
న్యుర్వీ, కృశాను, మరు, దంబర, శంబరాణి ॥ 46

ప్రతి :- ఇహ=ఈజగత్తునందు, తావక, రాసకాలే=నీసంబంధమగు రాసక్రీడా సమయమందు, యేన=ఏ, గీతేన=వేణుగానముచేత, శిలాః=రాళ్లు, సలిలాంబభూవుః = నీళ్ళాయెనో. కించ=మఱియు, ఉర్వీ, కృశాను, మరుత్, అంబర, శంబరాణి=భూమి, అగ్ని, గాలి, ఆకాశము, నీరు, అనెడు, పంచ=అయిదు, భూతాని, అపి=భూతములు సైతము, పరివృత్త, గుణాని=వ్యత్యస్త (మారిన) స్వభావము గలవి, (ఆసన్ =ఐనవో) తత్ =ఆవేణుగానము, ధన్యైః=భాగ్యాధికులచేత, శ్రుతమ్ = వినఁబడినది.

విశేషములు :- పరివృత్తగుణాని భూతాని – పంచభూతములకు గుణవ్యత్యాస మెట్లనఁగా 1. భూమి—కాఠిన్యమును వీడి మార్దవమును జెందెను 2. జలము – వేగమును వీడి నిలుకడను జెందెను. 3. అగ్ని = వేడిని వీడి చల్లఁదనమును బొందెను. 4. వాయువు – సదాగతిత్వమును వీడి నిశ్చలత్వము నందెను. 5. ఆకాశము — శూన్యతను వీడి రూపమును ధరించెను.

తా॥ ఓ శ్రీకృష్ణా! ఈలోకమున నీరాసక్రీడా సమయమునందు జగన్మోహనమగు నీ వేణుగాన శ్రవణముచేత రాళ్ళు

సైతము కరఁగి నీళ్ళవలెఁ బ్రవహించె నఁట. మఱియుఁ బృథివ్యప్తేజో వాయ్వాకాశము లైదును వ్యత్యస్తస్వభావము గలవి యాయెనఁట. అదృష్టవంతు లెవరో! అప్పుడు నీపాటను వినిరి.

గీ॥ నాఁడు బృందావనిని యదునాథ! నీదు
గానరసమున రాళులు గరఁగె నంట
తాఱుమాఱాయె నంట భూతంబు లైదు
విని రపుడు ధన్యులెవరో! నీవేణురవము.

అవతారిక:- పైనిఁ జెప్పఁబడిన మార్పును సర్పముల యందు సైతము కలదని నుడువు చున్నారు.

శ్లో॥ తేభ్యః కృతీ న కిల కశ్చి దిహాస్తి యే వై
రాసోత్సవోత్సుకధియ స్తవ కాననాంతే।
వేణుస్వనస్రుతరసౌఘపరిప్లుతాంతే
స్వే సృక్విణీ రసనయా లిలిహు ర్భుజంగాః॥ 47

ప్రతి:- యే=ఏ, భుజంగాః=సర్పములు, కానన, అంతే=బృందావనము నడుమ, రాసోత్సవ, ఉత్సుక, ధియః= రాసక్రీడయందు వేడుకగల బుద్ధిగలవియై, తవ = నీయొక్క, వేణు...... అంతే — వేణు = పిల్లనగ్రోవియొక్క, స్వన= నాదమునుండి, స్రుత = స్రవించిన, రస = అమృతరసము యొక్క, ఓఘ = ప్రవాహముచేత, పరిప్లుత = తడుపఁబడిన, అంతే=ప్రాంతములుగల, స్వే = తమ, సృక్విణీ = సెలవులను (పెదవి మూలలను) రసనయా = నాలుకతో, లిలిహుః=నాకి

కొనినవో, తేభ్యః = ఆ సర్పములకంటె, ఇహ = ఈ లోక
మున, కశ్చిత్ = ఒకఁడును, కృతీ = సుకృతి, నాస్తి కిల =
లేఁడుగదా, వై = ఇది ప్రసిద్ధము.

విశేషము:- తేభ్యః కృతీ న కిల — వేణుగాన శ్రవణముచేత
విషధరములగు సర్పములయొక్క యంతర్గతమగు విషమే
అమృతముగాఁ బరిణామమును జెందుటచేత నా సర్పములకంటె
భాగ్యాధికు లెవరును లేరని భావము.

తా॥ ఓ శ్రీకృష్ణా! ఆనాఁడు బృందావనములో నీ రాస
లీలాదర్శనోత్సుకబుద్ధులై నీ వేణురవమునుండి స్రవించిన
యమృతధారలచేతఁ దడుపఁబడిన సెలవులను (పెదవి మూల
లను) నాలుకతో నాకికొనుచున్న సర్పములకంటెఁ బుణ్యా
త్మునర్చివా రీలోకమున నెవరు గలరు ?

ఉ॥ ఓ సరసీరుహాక్ష! కృతు
లుందురె? వారలకంటె నుర్వి నీ
రాసమహోత్సవంబుఁ గని
రంజిలి త్వన్మురళీనినాదని
ర్యాససుధారసాంచితము
లౌ సెలవుల్ రసనాద్వయంబునన్
వాసిగ నాకికొంచు నట
వర్తిలి రంట భుజంగవల్లభుల్.

శ్లో॥ అంభోదనీల మరవిందదళాయతాక్షం
పింఛావతంస మురరీకృతవేణుపాణిమ్ ।
త్వాం, గోపవేషపరికర్మితకాయకాంతిం
ధన్యా స్తదా దదృశు రున్మథితాన్యభావాః ॥ 48

ప్రతి:- తదా = ఆ రాసలీలా సమయమునందు, అంభోద నీలమ్ = మేఘమువలె నల్లని వాఁడవును, అరవింద, దళ, ఆయత, అక్షమ్=తామర రేకులవలె విశాలములైన కన్నులు గలవాఁడవును, పింఛ, అవతంసమ్ = నెమలిపించెము శిరోభూషగాఁ గలవాఁడవును, ఉరరీకృత, వేణు, పాణిమ్=అంగీకరింపఁబడిన పిల్లనఁగ్రోవి చేతియందుఁ గలవాఁడవును, గోపవేష పరికర్మిత, కాయకాంతిమ్=గొల్ల వేషముచేత నలంకరింపఁబడిన శరీరకాంతి గలవాఁడవును అగు, త్వామ్ = నిన్ను, ధన్యాః= భాగ్యాధికులు, ఉన్మథిత, అన్య, భావాః = నశింపఁజేయఁబడిన యితరభావములు గలవారై, దదృశుః = చూచిరి.

విశేషములు:- ఉన్మథితాన్యభావాః ––– అన్యవిషయకః భావః అన్యభావః ––– అనఁగా ఇతర విషయములందు అభిప్రాయము అది నశించినవారు ఉన్మథితాన్యభావులు – ధన్యా స్తదా దదృశుః – విషయాంతరవైముఖ్యముతోఁ గూడిన భగవద్విగ్రహ సౌందర్యాద్యనుభవము భాగ్యాధికులకే సంభవించును.

తా॥ శ్రీకృష్ణా ! నీలమేఘశ్యామలుడవును, తామర రేకుల వంటి విశాలములగు కన్నులుగల వాఁడవును నెమిలిపించెము

శిరోభూషణముగాఁ గలవాఁడవును, పిల్లనఁగ్రోవి చేతఁ గల వాఁడవును, గోపవేషముతో నలంకృతమగు శరీరకాంతి గల వాఁడవును, నగు నిన్ను రాసలీలాసమయమం దనన్య భావములతో ధన్యు లెవ్వరో! చూచిరి.

ఉ॥ నల్లనికల్వ లట్టినయ
నమ్ములు శ్యామలకోమలాంగమున్
పిల్లనఁగ్రోవియున్ నెమిలి
పించెముఁ గల్గి మనోజ్ఞ మైన యా
గొల్లనిరూపుతో హాయలు
గుల్కెడునిన్ గృతపుణ్యు లెవ్వరో
తొల్లి యనన్యమానసము
తోఁ గన నోచిరి రాసలీలలన్-

శ్లో॥ గోవర్ధనో గిరి వరో యమునా నదీ సా
బృందావనం చ మధురా చ పురీ పురాణీ।
అద్యాఽపి హంత సులభాః కృతినాం జనానా
మేతే భవచ్చరణచారజుషః ప్రదేశాః ॥ 49

ప్రతి:- గిరివరః = పర్వతశ్రేష్ఠమగు, గోవర్ధనః = గోవర్ధనము, సా = ప్రసిద్ధమగు, యమునా = యమునయనెడు నదియు, బృందావనం చ = బృందావనమును, పురాణీ = పురాతనమైన, మధురా = మధురయనెడు, పురీ,చ = పట్టణమును, భవత్, చరణ, చార, జుషః = తమ పాదసంచారములను పొందిన, ఏతే = ఈ, ప్రదేశాః = ప్రదేశములు,

కృతినామ్ = సుకృతమును జేసికొనిన, జనానామ్ = జనులకు, అద్య, అపి = నేఁటికిని, సులభాః = సాక్షాత్కారమున కర్హములు (భవంతి=అగుచున్నవి) హంత! = సంతోషము.

విశేషములు:- గోవర్ధనో గిరివరః — గోవర్ధనపర్వతము శ్రీకృష్ణకరస్పర్శము నేడుదినములు నిరంతరముగా ననుభవించి నది కాన — గిరివరః – పర్వతశ్రేష్ఠమని చెప్పఁబడెను.—

మథురా చ పురీ పురాణీ – మథురాపట్టణము కృష్ణావతార మునకుఁ బూర్వమే శ్రీరాముని తమ్ముఁడగు శత్రుఘ్నునిచేతఁ బరిపాలింపఁ బడుటవలనఁ బురాతన పట్టణముగాఁ జేర్కొనఁ బడినది. అద్యాఽపి – భగవదవతారకాలము చాల దవ్వై నప్పటికి నని భావము.

సులభాః – సాక్షాత్కారార్హములై యున్నవి యనుట వలన భగవత్సాక్షాత్కారము వలె భగవదధిష్ఠిత దేశసాక్షా త్కారము సైతము సుకృతవంతులకే లభించునని తేలును. ఈ శ్లోకమునందు భగవత్సంబంధముగల దేశమే పరమప్రాప్య మని చెప్పుట గమనింపఁదగిన విషయము

తా॥ ఓ కృష్ణా! నీ కరస్పర్శముచేత గిరివరమను కీర్తిగడిం చిన గోవర్ధనపర్వతము, ప్రసిద్ధమగు యమునానది, బృందా వనము, పురాతనమైన యా మథురాపట్టణ మనేడు తమ పాద సంచారముల ననుభవించిన యీ తావులు నేఁటికిని సుకృ తాత్ములగు జనులకు సాక్షాత్కారార్హములై యలరారు చున్నవి ఎంత సంతోషము!

మ॥ అదిగో! యయ్యమునాస్రవంతి యదె బృం
దారణ్య భూభాగ మ
య్యదె గోవర్ధన మల్లదే మథుర ది
వ్యంబౌ పురం బీశ! త్వ
త్పదసంచార పవిత్రతాంచితములై
భవ్యంబులై యివ్వి పు
ణ్యదముల్ నేఁటికి భక్తకోటిభజ నీ
యంబుల్ సుతీర్థస్థలుల్.

అవతారిక:- 'తే వయం భవతా రక్ష్యా భవద్విషయ వాసినః' (మేము మీ దేశమున నుండువారము గావున మీచే రక్షింపఁ దగినవారము) అని నుడివిన ప్రకారము దేశము భగవల్లాభప్రాపక మనుటను భంగ్యంతరముగఁ బ్రతిపాదించుచున్నారు,

శ్లో॥ బృందావనే స్థిరచరాత్మకకీటదూర్వా
పర్యంతజంతునిచయే బత యే తదానీమ్।
నైవాలభామహి జనిం హతకా స్త ఏతే
పాపాః పదం తవ కదా పున రాశ్రయామః ॥ 50

ప్రతి :- తదానీమ్=అప్పుడు (శ్రీకృష్ణ సంచార కాలమున) స్థిర......నిచయే - స్థిర=స్థావరముల యొక్కయు, చర = జంగమముల యొక్కయు, ఆత్మక=స్వరూపము గల, కీట = పురుగులు, దూర్వా = గఱికగడ్డి, పర్యంత = హద్దుగాఁగల, జంతు=ప్రాణులయొక్క, చయే = సమూహముగల, బృందా

వనే = బృందావన పుణ్యక్షేత్రమునందు, యే = ఏ, వయమ్ = మేము, జనిమ్ = జన్మమును, న + ఏవ, అలభామహి = పొందనేలేదు, హతకాః = జీవన్మృతులమగు, తే = ఆ, ఏతే = ఈ, పాపాః = పాపిష్ఠులమగు మేము, కదా = ఎప్పుడు, పునః = మఱల, తవ = నీయొక్క, పదమ్ = పాదమును, ఆశ్రయామః = ఆశ్రయింతుము, ఎన్నటికి నాశ్రయింప లేమని భావము. బత! = అయ్యో!

విశేషములు :- 'స్థిరచరాత్మకకీటదూర్వా పర్యంతజంతు నిచయే'—ఇచ్చట యథాస్థితపాఠము ననుసరించి యర్థము చెప్పినయెడల స్థిరాత్మకము కీటము, చరాత్మకము దూర్వ కావలసివచ్చును. ఇది లోకవిరుద్ధము కావున 'పాఠక్రమా దర్థక్రమో బలీయాన్' (యథాస్థిత పాఠక్రమముకంటె నర్థక్రమమే బలిష్ఠము) అను నియమము ననుసరించి అర్థ మనుకూలించునట్లు వ్యాఖ్య చేయువలయును. స్థిరాత్మక = స్థావరాత్మకమైన, దూర్వా = గఱికయు, చరాత్మక = జంగమాత్మకమగు, కీట = పురుగును, అని యెట్లో సమాధానము చెప్పుకొనవలెను. పర్యంతపదముచేత స్థిరములలోఁ జివరది దూర్వయు, చరములలోఁ జివరది కీట మనియు గ్రాహ్యాము గఱిక (దూర్వ) కూడ వృద్ధిక్షయములు గలది గనుక జంతు పద మిచట వాడఁబడినది.

తా॥ ఓ, శ్రీకృష్ణా! నీవు క్రీడించిన కాలమునందు స్థావరజంగమాత్మకము లగు దూర్వా కీటాదులకు నిలయమైన బృందా

వసములో మేము జన్మించక పోతిమి. అయ్యో! జీవన్మృతులము. ఈ పాపాత్ములమగు మేము వ్రజనాథా! మఱల నెన్నఁటికి నీపాదము నాశ్రయింతుమో గదా!

శా॥ బృందారణ్యమునందు నీ వపుడు గో
బృందంబుఁ బాలించుచున్
నందాగారమునందు నున్నతఱిఁ గృ
ష్ణా! నీదుమార్గంబునం
దం దెందేనియుఁ గీటమో! తృణమునో!
యై నేను జన్మింప నే
మందున్ బాపుఁడ నెన్నినాళ్ళ కిఁక నీ
యంఘ్రిద్వయిం గొల్తునో!

అవతారిక :- భగవత్సంబంధి సంబంధము గల కొన్ని తావులందు జన్మించుటయుఁ దరణోపాయ మని కటాక్షించుచున్నారు.

శ్లో॥ హా! జన్మ తాసు సికతాసు మయా న లబ్ధం
రాసే త్వయా విరహితాః కిల గోపకన్యాః ।
యా స్తావకీనపదపంక్తిజుషోఽజుమంత
నిక్షిప్య తత్ర నిజ మంగ మనంగతప్తమ్ ॥ 51

ప్రతి :- రాసే = రాసక్రీడయందు, త్వయా = నీతో, విరహితాః = ఎడఁబాటు చెందిన, యాః = ఏ, గోపకన్యాః = గొల్లకన్నెలు, తత్ర = ఆయెడఁబాటు సమయమునందు, అనంగతప్తమ్ = మన్మథునిచేఁ దపింపఁ జేయఁబడిన, నిజమ్ = స్వకీయ

మగు, అంగమ్ = అవయవమును, నిక్షిప్య = ఉంచి, తావకీన, పద, పంక్తి, జుషః = నీసంబధములగు పాదన్యాసముల పంక్తిని పొందియున్న, యాః=ఏ, సికతాః=ఇసుకతిన్నెలను, అజుషంత = సేవించిరో, తాసు = అటువంటి, సికతాసు = ఇసుకతిన్నెలందు, మయా=నాచేత, జన్మ=పుట్టుక న,లబ్ధమ్= పొందఁ బడలేదు. హా! = అయ్యో!

విశేషములు:- రాసే — ఒండొరులచేతులను బట్టుకొని పెక్కుమంది పెక్కురకములగు తాళములతో మండలాకారముగ నుండి చేయు నృత్యవిశేషము రాస మనఁ బడును.

అజుషంత = సంతసించిరో (ప్రీతిఁ జెందిరో) జుషీ=ప్రీతిసేవనయోః—అను ధాతువునుండి యేర్పడిన రూపము ఈ యర్థము గూడ నిచటఁ బొసఁగును. కృష్ణవియోగ కాలమునందుఁ దత్పాద ముద్రాంకితములగు సైకతములే విరహిణులగు గోపకన్యల కాలింగనాదుల కనుకూలములై మదనతాపమును బోఁగొట్టఁ జాలిన వని భావము. హా! జన్మ తాసు సికతాసు మయా న లబ్ధమ్— అట్టి యిసుకతిన్నెలలో నొక యిసుకతిన్నెగా నైనను బుట్టక పోయితినే యని కవియార్తి.

తా॥ ఓ శ్రీకృష్ణా! రాసక్రీడలో నిన్నెడఁబాసిన గోపకన్యకలు త్వత్పాదముద్రాంకితములగు నే యిసుకతిన్నెలందు మన్మథాగ్నితప్తములైన నిజావయవముల నుంచుకొని ప్రీతిఁజెందిరో యా యిసుకతిన్నెలలో నొకటిగా నైనను నేను జన్మింపనైతిని. అయ్యో! యెంత దౌర్భాగ్యము.

గీ॥ రాసలీలల ని న్నెడఁ బాసి నాఁడు
గోపికలు స్వీయతాపంబుఁ బాపికొనిరి
త్వత్పదాంకంబు లైనయేతావులందు
అట్టిసికతాతలుల నైనఁ బుట్ట నైతి.

శ్లో॥ ఆచిన్వతః కుసుమ మంఘ్రిసరోరుహం తే
యే భేజిరే బత! వనస్పతయో లతా వా।
అద్యాఽపి తత్కులభువః కులదైవతం మే
బృందావనం మమ ధియం చ సనాథయంతి॥ 52

ప్రతి:- యే = ఏ, వనస్పతయః, వా = వృక్షములో, (యాః=ఏ) లతాః, వా = తీగెలో, కుసుమమ్ = పూలను (జాత్యేకవచనము) ఆచిన్వతః=కోయుచున్న, తే=నీ యొక్క, అంఘ్రిసరోరుహమ్ = పాదపద్మమును, భేజిరే=సేవించినవో, బత=ఔరా!, తత్, కుల, భువః = (నీ వెక్కి పూలుకోసిన చెట్ల యొక్కయు తీగెలయొక్కయు) వంశమునఁ బుట్టిన, చెట్లును తీగెలును, అద్యాఽపి = ఇప్పటికిని, మే=నాయొక్క, కులదైవతమ్ = కులదైవమగు, బృందావనమ్ = బృందావనమును, మమ = నాయొక్క, ధియంచ = బుద్ధిని, సనాథయంతి = అలంకరించు చున్నవి.

విశేషములు :- 'అంఘ్రిసరోరుహం తే। యే భేజిరే' — పూలు కోయుటకుఁ జెట్లు నెక్కునప్పుడు దిగునప్పుడు నీ పాద పద్మమును సేవించిన చెట్లు తీగెలు అని యర్థము.

'బృందావనం మమ ధియం చ సనాథయంతి'— బృందా వనమున కలంకారభూతములును తత్కాలసంభవములు నగు చెట్లు తీఁగెలు నాబుద్ధికి భోగ్యములుగా ననుసంధింపఁబడు చున్నవి.

వెనుకటి శ్లోకమునఁ బరంపరగా భగవత్సంబంధి జడ ప్రాప్తియే పరమప్రాప్యమగు బ్రహ్మానందమునకుఁ గారణము గాఁ జెప్పఁబడినది. ఈ శ్లోకమునందుఁ బరంపరాసంబంధము గల వనస్పత్యాదులు స్వయముగాఁ బరమప్రాప్యము లని నుడువఁబడినది. ఇందువలనఁ బరంపరాసంబంధులకు సైతము ఉపాయత్వము, ఉపేయత్వము గలవని సంప్రదాయము.

తా॥ ఓ శ్రీకృష్ణా! పూలకొఱకు నీ వెక్కిదిగువప్పుడు ఏ చెట్లును తీఁగెలును నీపాదపద్మమును సేవించినవో వానివంశ ములోఁ బుట్టిన యాచెట్లు తీవెలే నేఁటికిని నాకులదైవ మగు బృందావనమును నాబుద్ధిని అలంకరించి యున్నవి.

ఉ. పూవులఁ గోయుపొంటె యదు
పుంగవ! చెట్లుల నెక్కువేళ నీ
పావన పాదపద్మముల
ప్రాపును గాంచఁగఁ గల్గె నేతరుల్
తీవెలు, వానిసంతతులె

తీయక నేఁటికిఁ బూలఁ బండ్ల బ్రం
దావని నాదు డెందమును
దామరసాక్ష! యలంకరించెదున్.

అవతారిక :- భగవచ్చేష్టిత మంతయుఁ బావనమే యని యీ శ్లోకమున ననుసంధించు చున్నారు.

శ్లో॥ యత్ త్వత్ప్రియం త దిహ పుణ్య మపుణ్య మన్య
న్నాన్య త్తయో ర్భవతి లక్షణ మత్ర జాతు ।
ధూర్తాయితం తవ హి యత్ కిల రాసగోష్ఠ్యాం
తత్కీర్తనం పరమపావన మామనంతి ॥ 53

ప్రతి :- ఇహ = ఈ లోకమునందు, యత్ = ఏది, త్వత్, ప్రియమ్ = నీకుఁ బ్రీతికరమో, తత్ = అది, పుణ్యమ్ = పుణ్యము, అన్యత్ = నీకు అప్రియమైనది, అపుణ్యమ్ = పాపము, అత్ర = ఈ విషయమున, తయోః = ఆ పుణ్యపాపములకు, అన్యత్ = నీ ప్రియత్వాప్రియత్వములకంటె నితరమైనది, జాతు = ఒకప్పుడును, లక్షణమ్ = లక్షణము, న,భవతి = కాదు, రాసగోష్ఠ్యామ్ = రాసక్రీడా వినోదమునందు, తవ = నీయొక్క, యత్ = ఏ, ధూర్తాయితమ్ = ధూర్తకృత్యము, గలదో, తత్ కీర్తనమ్ = దానిని సంకీర్తన మొనర్చుట, పరమపావనమ్ = అత్యంత శుద్ధికరముగా, ఆమనంతి = తలఁచు చున్నారు.

విశేషములు :- ధూర్తాయితమ్— 'అంగనా మంగనా మంతరే మాధవో మాధవం మాధవం చాంతరే ణాంగనా'

ఈప్రకారముగా నొనర్చిన ధూర్తకృత్యము. (లీల) 'తత్కీ-ర్తనం పరమపావన మాహురనంతి'— రాసక్రీడలోని ధూర్తాయితమును స్మరించుట పవిత్రతాహేతు వని శుకపరాశరాదులు నుడివిరని భావము. సారాంశ మేమన - దేవరవారి యాజ్ఞారూపములగు శ్రుతిస్మృతులచేత విహితములగు విధినిషేధములందును శ్రీవారి ప్రియత్వాప్రియత్వములే పుణ్యాపాపములకు అనుగతములగు లక్షణములు.

తా॥ శ్రీకృష్ణా! నీకుఁ బ్రీతికరము పుణ్యము, అప్రీతికరము పాపము, అనునదియే పుణ్యాపాపముల కనుగతమగు లక్షణము. అందుచేతనే శుకపరాశరాదులగు పెద్దలు రాసగోష్ఠిలోని నీ లీలావిశేష మేదిగలదో తత్సంకీర్తనమును పరమపావనముగాఁ దలంచిరి.

గీ. పుణ్య మగుఁ ద్వత్ప్రియంబై, యపుణ్య మన్య,
మవియ లక్షణములు వాని కవు నిజమ్ము
రాసగోష్ఠిఁ ద్వదీయ ధూర్తాయితంబు
వనజలోచన! పరమపావనము మాకు.

శ్లో॥ యా కంసముఖ్యనృపకీటనిబర్హణోత్థా
సా నిర్జితత్రిజగత స్తవ నైవ కీర్తిః।
గోపాలనాది య దిదం భవదీయకర్మ
త్వార్ద్రీకరోతి విదుషాం హృదయం త దేతత్॥ 54

ప్రతి :- కంస, ముఖ్య, నృప, కీట, నిబర్హణ, ఉత్థా = కంసుఁడు మొదలుగాఁగల రాజకీటములను సంహరించుటవలన

వచ్చిన, యా=ఏకీర్తిగలదో, సా=అది, నిర్జిత, త్రిజగతః = జయింపఁబడిన మూఁడు లోకములుగల, తవ = నీకు, కీర్తిః = కీర్తి, నైవ=కానేకాదు, యాత్ =ఏ, ఇదమ్=ఈ, గోపాలనాది=ఆవులను గాచుట మొదలుగాఁగల, తత్, ఏతత్ = ఆయిది, భవదీయకర్మ=తమపని, ఇతి = అని, విదుషామ్ = జ్ఞానులయొక్క, హృదయమ్ = మనస్సును, ఆర్ద్రీకరోతి = కరఁగించుచున్నది.

విశేషములు :- భవదీయకర్మేతి — ఉభయవిభూతులకు నాథుఁడవగు నీకుద్యోగమాయెను గదా! యని భావము.

కంసాదిజయానుసంధానము కంటెను దేవరవారి యాలఁ గాచుట మున్నగు చర్యయే తత్వవేత్తల చిత్తమునకు వ్యామోహమును గలిగించుచున్నది. అని సారాంశము.

తా॥ ఓ కృష్ణా! నీకు రాజకీటములవంటి కంసాదులను సంహారించుటవలనఁ గలిగినకీర్తి యొకకీర్తి కాదు. మూఁడు లోకములను జయించిన శ్రీవారికిది యెంత? కాని ఉభయ విభూతినాథులగు తాము గోపాలనాదులఁ గావింపవలసెనే యని మాత్రము పండితుల మనస్సు తఱిగికొని పోవుచున్నది.

గీ. కంసముఖ రాజకీటకఖండనంబు
ఘనతయే నిర్జితత్రిలోకునకు నీకు ?
కాని నీయంతవాఁ డాలఁ గాయ వలసెఁ,
దఱిగికొనిపోవు మది నది తలఁపఁ గృష్ణ!

శ్లో॥ గోపాలవేషపరికర్మ పరావరేశం
యన్నామ ధామ పరమం తమసః పరస్తాత్ ।
తత్ పింఛలాంఛనసుదామకృతోపవీతం
గోధూలిధూసరితకుంతల మంత రాస్తామ్ ॥ 55

ప్రతి :- పర, అవర, ఈశమ్ = ఉత్కృష్టులగు అనంత గరుడాదులకును, నికృష్టులగు బ్రహ్మరుద్రాదులకును పాలకమైనట్టియు, పరమమ్=ఉత్కృష్టమైనట్టియు, యత్ = ఏది, తమసః=ప్రకృతికి, పరస్తాత్ =ఆవలిదియై (వర్తతే=ఉన్నదో) నామ = ప్రసిద్ధ మైనట్టియు, గోపాల, వేష, పరికర్మ = గొల్ల వేషమే అలంకారముగాఁ గలిగినట్టియు, పింఛలాంఛన, సుదామ, కృత, ఉపవీతమ్ = నెమిలిపించెము గుర్తుగాఁగలదియు, పుష్పమాలచేతఁ జేయఁబడిన యుపవీతము గలదియు, గో, ధూళి, ధూసరిత, కుంతలమ్=ఆవుల (గిట్టలవలన రేగిన) దుమ్ముచేత మాయఁజేయఁబడిన ముంగురులు గలదియు, అగు, తత్ = ఆ, పరమమ్=శ్రేష్ఠమగు, ధామ=తేజస్సు, అంతః = నాలోపల, ఆస్తామ్ = ఉండుఁగాక.

విశేషములు :- పరావరేశమ్— పరులగు అనంతగరుడ విష్వక్సేనాదులకును, అవరులగు బ్రహ్మరుద్రాదులకును ప్రభువైనదియు – అనఁగా ఉభయవిభూతులను నిర్వహించునది యని భావము. నామ— ప్రసిద్ధము— 'ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్' అను శ్రుతిప్రసిద్ధము. అంత రాస్తామ్— భగవత్స్వరూపముకంటె అవతారసౌశీల్యమే భోగ్యమై నిరంతరాను భావ్యమగు చున్నది.

తా॥ పరావరేశమై యుభయవిభూతులను పాలించునదియు, ప్రకృతి కతీతమైనదియు, గోపాలవేషమే యలంకారముగాఁ గలదియు, నెమిలిపించెమును దాల్చినదియు పుష్పమాల ధరించినదియు, గోపరాగధూసరాలకమైనదియుఁ బ్రసిద్ధమైనదియు నగు గొప్పవెల్గు నాలో నెల్లప్పుడును బ్రకాశించుఁ గాక.

చ. ప్రకృతి కతీతమున్ బరమ
పావనమున్ శిఖిపింఛవశాళి పా
లకము పరావరాళి కశ
శంకము దామకృతోపవీతమున్
బ్రకటితగోపవేష మను
భావ్యము గోఖురధూళిధూసరా
లకము వ్రజాంగనాక్షిసు
ఫలమ్ము వెలుంగు వెలుంగు నామదిన్.

శ్లో॥ యద్వై జరాసుతభయాత్ విపలాయితా త్వం
తచ్చే న్మనుష్యచరితానువిధానజం తే।
తర్హి త్రిలోకగురు మీశ్వర మీశ్వరాణాం
బాణాహవే కి మితి శంభు మజృంభయ స్త్వమ్॥ 56

ప్రతి :— జరాసుతభయాత్ = జరాసంధుని భయమువలన, త్వమ్ = నీవు, విపలాయితాః, (ఇతి) యత్ = పరుగెత్తి పోతి వనుట యేది గలదో, వై = ప్రసిద్ధమగు ఆ పాఱిపోవుట, తే = నీకు, మనుష్య, చరిత, అను విధానజం, చేత్ = మనుష్య చరిత్రనటనము వలనఁ గలిగినది యైనయెడల, తర్హి = ఆపక్ష

మున, త్రిలోక, గురుమ్ == మూఁడులోకములకు గురువై నట్టియు, ఈశ్వరాణామ్ == లోకపాలురకుఁగూడ, ఈశ్వరమ్== ప్రభువైన, శంభుమ్==ఈశ్వరుని, బాణ, ఆహవే=బాణాసురుని తోడి యుద్ధమునందు, కి మితి == ఎందుకని, త్వమ్ == నీవు, అజృంభయః == ఆవులింపఁ జేసితివి ?

విశేషములు :- 'బాణాహవే కి మితి శంభు మజృంభయ స్త్వమ్'— బాణాసురునకు సాయముచేయ వచ్చిన యీశ్వరుని శ్రీకృష్ణుఁడు జృంభణాస్త్రమును ప్రయోగించి యావులింపఁజేసి యుద్ధమునందశక్తు నొనర్చెనని భారతము చెప్పుచున్నది, 'జృంభణాస్త్రప్రయోగేణ జృంభయామాస శంకరమ్ జృంభాభిభూత స్తుహరో రథోపస్థ ముపావిశత్ నశశాక తదా యోద్ధుం కృష్ణే నాక్లిష్టకర్మణా' జరాసంధునికిఁ బాఱిపోయితి వేని ఈశ్వరు నెట్టు లోడించఁ గల్గితివి ? కావున మానుషత్వ నటనమునఁగూడఁ బారమ్యము దాఁపశక్యము గాకున్నదని భావము.

తా॥ ఓ కృష్ణా! నీవు జరాసంధునిభయము వలనఁ బాఱి పోవుట మానవత్వమును నటించుట కైనచో బాణాసురునితో యుద్ధము చేయునప్పుడు త్రిలోకగురువును ఈశ్వరులకు సైతము (ఇంద్రాదిదిగీశ్వరులకు) ఈశ్వరుఁడగు శంకరుని జృంభణాస్త్ర ప్రయోగమున నేమని యావులింపఁ జేసితివి ? ఇది మనుష్యత్వ నటనకు భంజకము గాదా!

గీ. భయపడి జరాసుతున కీవు పరుగు లిడుట
మురహరా ! నరచరితానుకరణ మేని।
ఈశ్వరుల కీశ్వరుండౌ మహేశ్వరు నెటు
బాణుపోరాటమున భంగపఱిచినావు ?

శ్లో॥ జాతం కుత స్త దకృతజ్ఞవిచేష్టితం తే
పుత్త్రియయా కిల వరం వవృషే వృషాంకాత్ ।
అక్షేషు సక్తమతినా చ నిరాదరేణ
వారాణసీ హరపురీ భవతా విదగ్ధా ॥ 57

ప్రతి :- పుత్త్రియయా = పుత్త్రుఁడు కావలయు నను ఇచ్ఛచేత, వృషాంకాత్ = ఈశ్వరునివలన, వరమ్ = వరమును, వవృషే కిల = కోరితి వఁట, అక్షేషు = పాచికలయందు, సక్తమతినా = లగ్నమగు బుద్ధిగలట్టియు, నిరాదరేణ = పట్టుదలలేనట్టియు, భవతా = నీచేత, హరపురీ = ఈశ్వరుని పట్టణమగు, వారాణసీ = కాశి, విదగ్ధా = విశేషముగా దహింపఁజేయఁబడినది. (భస్మము చేయఁబడినది) తే = నీకు, తత్ = ఆ, అకృతజ్ఞ, విచేష్టితమ్ = కృతఘ్నుని కృత్యము, కుతః = ఎట్లు, జాతమ్ = ఏర్పడినది ?

విశేషములు :- వారాణసీ హరపురీ భవతా విదగ్ధా — పౌండ్రకవాసుదేవునకు సహాయము వచ్చిన తనతండ్రిని శ్రీకృష్ణుఁడు చంపెనన్న కోపముతోఁ గాశీరాజు రుద్రవర ప్రసాదముచేత నుద్భవింపఁ జేయఁబడిన కృత్య ద్వారకాపట్టణ

మును దహింపఁ బూనుకొనఁగా రుక్మిణీదేవితోఁ బాచిక లాడు చున్న శ్రీకృష్ణుఁడు కాశీరాజుచేఁ బంపఁబడిన కృత్యను కాశీ నగరమును కాశీరాజును భస్మమొనర్చెననెడి భాగవతకథ యిట ననుసంధించుకొనునది. 'జాతం కుత స్త దకృతజ్ఞ విచేష్టితం తే'— పశుపతివలనఁ బుత్త్రినికొఱకు వరమును బొందిననీవు కృతఘ్నునివలెఁ దత్పట్టణమగు కాశిని గాల్చి వేయుట యనుచితముగదా! అట్లేల నీవంటివాఁడు చేయును. యథార్థమునకు సర్వేశ్వరుఁడువగు నీకు పుత్త్రప్రార్థనాదికము మనుష్యత్వవిడంబమునకే యని సారాంశము.

తా॥ శ్రీకృష్ణా! నీవు పుత్త్రార్థము శంకరునివలన వరమును బొందితివిగదా! ఆకృతజ్ఞత లేశమైనను లేకుండఁ దద్రాజధాని యగు కాశీనగరము నవలీలగా రుక్మిణితోఁ బాచిక లాడుచు గాల్చివేసితి వేల? ఇది యుచితమా?

ఉ. శంకరుఁ గూర్చి బల్ తపము
సల్పి కుమారుని వేఁడి తంట ని
శ్శంకముగా దహించితివి
శంభునివాసముఁ గాశి రుక్మిణీ
పంకజనేత్రతోడ నటు
పాచిక లాడుచునే కృతజ్ఞచ
ర్యాంకమె యిద్ది పుత్రవర
ణాదులు త్వన్నరతావిడంబముల్.

(14)

శ్లో॥ సంజీవయ న్నపి మృతం సుత ముత్తరాయాః
సాందీపినే శ్చిర మృతం సుత మానయం శ్చ।
ధామ్నో నిజాత్ ద్విజసుతాన్ పున రానయ న్వా
స్వా మేవ తాం తను మహో కథ మానయ స్త్వమ్ ॥

ప్రతి :- మృతమ్=మరణించిన, ఉత్తరాయాః=అభిమన్యుని భార్యయగు ఉత్తరయొక్క, సుతమ్ = గర్భస్థితుఁడైన కుమారుని, సంజీవయన్, అపి=బ్రతికించి నప్పటికిని, చిరమృతమ్ = చాలకాలముక్రిందఁ జనిపోయిన, సాందీపినేః = గురువైన సాందీపినియొక్క, సుతమ్ = కుమారుని, ఆనయన్, చ = తీసికొని వచ్చినప్పటికిని, నిజాత్=సొంతమగు, ధామ్నః = స్థానమునుండి, (శ్రీవైకుంఠలోకమునుండి) ద్విజసుతాన్ = ద్వారకావాసియగు ఒక బ్రాహ్మణుని కుమారులను, పునః = మఱల, ఆనయన్, వా = తీసికొని వచ్చినప్పటికిని, త్వమ్ = నీవు, స్వామ్=స్వకీయమగు, తామ్=ఆ, తనుమ్, ఏవ = (మరణకాలికమగు) శరీరమునే, కథమ్ = ఎట్లు, ఆనయః= తెచ్చితివి? అహో! = ఔరా! ఎన్నఁడో భస్మమయిన దేహమును గొనివచ్చుట యాశ్చర్యములలో నాశ్చర్యమని భావము.

విశేషములు :- 'సంజీవయ న్నపి మృతం సుత ముత్తరాయాః'—అశ్వత్థామప్రయుక్తమగు అపాండవాస్త్రముచేత దగ్ధుఁడైన యుత్తరాదేవి కుమారుని శ్రీకృష్ణుఁడు బ్రతికించిన కథ నిట ననుసంధించునది.

క. 'చెల్లెలికోడల, నీమే
నల్లుఁడు శత్రువులచేత హతుఁ డయ్యెను సం
ఫుల్లారవిందలోచన !
భల్లాగ్ని నడంచి శిశువు బ్రతికింపఁ గదే'
(శ్రీమదాంధ్ర భాగవతము)

ఇట్లుత్తరాదేవిచేఁ బ్రార్థితుఁడై శ్రీకృష్ణుఁడు 'పాదేన కమలాభేన । బ్రహ్మరుద్రార్చితేనచ పస్పర్శ పుండరీకాక్ష ఆపాదతలమస్తకమ్' యది మే బ్రహ్మచర్యం స్యాత్ । సత్యం చ మయి తిష్ఠతి అవ్యాహతం మమైశ్వర్యం తేన జీవతు బాలకః ఈవిధముగా నుత్తరాగర్భస్థ మృతశిశువును రక్షించెను. 'సాందీపినే శ్చిర మృతం సుత మానయం శ్చ'— విద్యాగురువగు సాందీపినికి గురుదక్షిణగా ఎన్నఁడో సముద్ర స్నానమునకు వెళ్ళి సముద్రములోని పంచజనాసురుని చేత భక్షింపఁబడిన కుమారుని దెచ్చియిచ్చినగాథ నిట గమనింప వలయును.

ఇట్లే తక్కిన విషయముల భాగవతాదులనుండి తెలియ వలెను.

అహో !— ఆశ్చర్యము. మృతులను గొనివచ్చుట యేరి తరము. ఒక భగవానునకే ఆశక్తి కలదు. ఎందువలన ?

'పరాఽస్య శక్తి ర్వివి ధైవ శ్రూయతే'

తా॥ ఓ శ్రీకృష్ణా! ఉత్తరాప్రార్థనచేత అశ్వత్థామాస్త్ర దగ్ధుఁడైన గర్భస్థమృతశిశువును గాపాడినప్పటికిని, ఎన్నఁడో సముద్రస్నానమున కేఁగి మరణించిన గురుపుత్రుని గురువగు సాందీపినికి గురుదక్షిణగాఁ దెచ్చియిచ్చినను, ద్వారకావాసి యగు బ్రాహ్మణుఁడు వేఁడికొనఁగా మరణించిన యతని కుమారులను వైకుంఠమునుండి తెచ్చియిచ్చినను వీని యన్నిటి కంటె నాశ్చర్యకరమగు భస్మీభూతమైన నీ శరీరము నెట్లు తీసికొని రాఁగలిగితివో యూహింపలేము.

చ. ఉదరమునందె యస్త్రిహతు
నుత్తర చిన్నికుమారుఁ గాచితో
ముదమొనఁ గూర్చినావు సుతు
మున్ మృతుఁ గాన్కగ నిచ్చి యొజ్జకున్,
సదయుఁడవై యొసంగితివి
స్వర్గతులన్ సుతులన్ ద్విజాతికిన్
మది వెఱగందు భస్మ మగు
మైఁ గనిపించితి వెట్లు మాధవా!

అవతారిక :- ఇట్లు 'అతిమానుషశీలవృత్తవేషైః' అన్న శ్లోకముతో నుపక్రమించి, 'ఆత్మానంమానుషం మన్యే రామం దశరథాత్మజమ్' 'అహం వో బాంధవో జాతః' అన్నప్రకారము మనుష్యత్వభావనయందు సైతము అతిమానుషజ్ఞాన శక్త్యాది గుణగణము ననుభవించి యతిమానుషస్తోత్రము నుపసంహ

రింపఁబోవుచు శరణాగతి పూర్వకముగా స్వాభిమతమును మూఁడు శ్లోకములతోఁ బ్రార్థించు చున్నారు.

శ్లో॥ అద్యాఽపి నా స్త్యుపరతి స్త్రివిధాపచారాత్
పాపః పరే నిపతితోఽస్మి తమ స్యపారే ।
ఏతాదృశోఽహ మగతి ర్భవతో దయాయాః
పాత్రం త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥ 59

ప్రతి :- పాపః = పాపిష్ఠుఁడనగు, అహమ్ = నేను, పరే = గొప్పదియు, అపారే = దుస్తరమైనదియు, (అగు) తమసి = అజ్ఞానమునందు, నిపతితః = పడిపోయినవాఁడను, అస్మి = అగు చున్నాను. త్రివిధ, అపచారాత్ =త్రివిధమగు (మూఁడు రకములైన) అపచారమునుండి, ఉపరతిః = నివృత్తి, అద్య, అపి=ఇప్పటికిని, నాస్తి = లేదు, ఏతాదృశః = ఇటువంటి, అగతిః = ఉపాయాంతరములేని, భవతః=నీయొక్క, దయాయాః = కృపకు, పాత్రమ్ = స్థానమునగు, అహమ్= నేను, త్వదీయ, చరణౌ = నీపాదములను, శరణమ్ = శరణమునుగా, ప్రపద్యే=ప్రపత్తి చేయుచున్నాను (పొందుచున్నాను)

విశేషములు :- పాపః — అనుటచేతఁ గర్మయోగము లేమి చెప్పఁబడెను. దానిచేతనే 'కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే' అను ప్రమాణమునుబట్టి జ్ఞానయోగము లేమియుఁ జెప్పఁబడినట్లయ్యెను, త్రివిధాపచారాత్ — అపచారములు మూఁడురకములు 1. భగవదపచారము 2. భాగ

వతాపచారము 3. అసహ్యాపచారము. అద్యాఽపి నా స్త్యవ
రతిః— నేఁటికిని ఈ త్రివిధాపచారములనుండి నివృత్తిలేదు.
నిజమే అపచారములు జ్ఞానముచేత నివృత్తములగును. జ్ఞాన
యోగము లేకపోవుటచేత అపచారములనుండి తొలగుట సంభ
వింపదు. కర్మయోగ, జ్ఞానయోగములు లేకపోవుటచేతఁ
దత్సాధ్యమగు భక్తియోగమును సిద్ధింపలేదని తేలినది.
ఏతాదృశోఽహ మగతిః— అగతి యనుటచేత కర్మయోగ,
జ్ఞానయోగ, భక్తియోగము లనెడి యుపాయములు లేని
వాఁడనయితిని గాన భవతో దయాయాః పాత్రమ్— 'అకించ
నానాం కృపైవోత్తారికా' అన్నట్లు ఏయుపాయసంపత్తియు
లేనినాకు నీ నిరుపాధికకృపయే తారకము. కనుక త్వదీయ
చరణౌ శరణం ప్రపద్యే— నీపాదములను శరణుచొచ్చు
చున్నాను. అద్యాఽపి నా స్త్యవరతి స్త్రివిధాపచారాత్—
అనుచోట నీవిధముగానైనను జెప్పికొనవచ్చును. శరణోపాయ
మును గోరువారికి భగవంతునియెడల 1. ప్రాతికూల్యవర్జనము,
2. అనుకూల్య సంకల్పము, 3. రక్షింపఁగలఁ డను మహా
విశ్వాసము ఉండవలెను. ఇవిలేవని యిందుఁ దెలుపఁబడినవి.
ఇప్పటికిని త్రివిధాపచారములనుండి నివృత్తి లేదనుటచేత
1. ప్రాతికూల్యవర్జనాభావము, 'పాపః'— అనుటచేత 2. అను
కూల్యసంకల్పా భావము, 'తమసి నిపతితోఽస్మి'— అనుటచేత
మహావిశ్వాసాభావము, తెలుపఁబడినవి. ఈవిధముదిక్కు లేని
నాకు నీకృపయే దిక్కని భావము.

తా॥ ఓ శ్రీకృష్ణా! పాపిష్ఠుఁడను. అపారమైన మహా తమస్సునఁ బడిపోయితిని, ఇప్పటికిని త్రివిధాపచారములనుండి నివృత్తి గలుగలేదు. ఇట్లుపాయాంతర శూన్యుఁడ నగు నేను నీ నిరుపాధికదయకుఁ బాత్రుఁడను. నీ చరణంబుల శరణుఁ జొచ్చుచున్నాను.

ఉ. పాపుఁడ మున్గిపోయితి న
పారమహాతమమందు, నేఁటికిన్
చాపలవృత్తి నామనము
చక్రధరా! త్రివిధాపచారదు
ర్వ్యాపృతినుండి మాన దను
పాయుఁడ నీకరుణైకపాత్ర మీ
కాపురుషుండు త్వచ్చరణ
కంజములన్ శరణంబు చొచ్చెదున్.

అవతారిక :- పూర్వోక్తమునే వివరించు చున్నారు.

శ్లో॥ విస్రంభణం త్వయి న యద్యపి మేఽస్తి నాపి
శ్రద్ధా యథోక్తవచనార్థగతా తథాఽపి ।
వాచం త్విమాం సకృదథాప్యసకృన్మయోక్తాం
సత్యాం కురుష్వ దయయైవ దయైకసింధో ॥ 60

ప్రతి :- హేదయైకసంధో! = దయకు ముఖ్యముగా సముద్రమువంటి ఓకృష్ణా!, యద్యపి = విచారింపఁగా, త్వయి = నీయందు, విస్రంభణమ్ = రక్షింపఁ గలఁడను విశ్వాసము, న, అస్తి = లేదు, యథోక్త, వచన, అర్థ, గతా = చెప్పఁ

బడినవాక్యార్థమును ననుసరించిన, శ్రద్ధా, అపి = శ్రద్ధయు, నాస్తి= లేదు, తథాఽపి = ఐనను, సకృత్ = ఒక్కమారు, మయా=నాచేత, ఉక్తామ్=పలుకఁబడిన, ఇమామ్ = ఈ, వాచమ్ = వాక్కును, అథాఽపి = తరువాత, అసకృత్ = పలుమార్లు, ఉక్తామ్=పలుకఁబడిన దానినిగాను, సత్యామ్ = త్రికరణశుద్ధిగా ననుష్ఠింపఁబడిన దానినిగాను, (లేదా) హృదయ పూర్వకమైన దానినిగాను, దయయా, ఏవ = దయచేతనే, కురుష్వ = చేయుము.

విశేషములు :- శ్రద్ధా యథోక్తవచనార్థగతా — 'ఏతా దృశోఽయ మగతి ర్భవతో దయాయాః పాత్రం త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే' అని పూర్వశ్లోకమునఁ జెప్పఁబడిన వాక్యార్థమున కనుగతమైన శ్రద్ధయు లేదు. శ్రద్ధ యనఁగ విశ్వాసత్వర— మాట చెప్పితినే కాని యది యనుష్ఠానపర్యవసాయి కాదు. చెప్పినప్రకార మనుష్ఠానము లేదని భావము. దయయైవ—ఇందలి ఏవకారముచేత దయయే సాంగమగు సాధనమని చెప్పినట్లైనది.

తా॥ దయాసముద్రుఁడవగు ఓ శ్రీకృష్ణా! విచారింపఁగా నిజమునకు నాకు నీయెడల రక్షింపఁగలవను విశ్వాసము శూన్యము, 'త్రివిధాపచారములనుండి నివృత్తుఁడనుకాని మహాపాపిని దిక్కులేనివాఁడను, నీ దయాపాత్రమును నీపాదముల శరణు పొందితిని. చెప్పినప్రకార మాచరణములేని శ్రద్ధాహీనుఁ

డను, ఒకమారు పలుకఁబడిన నాయీవాక్యను పలుమార్లు పలుకఁబడిన దానినిగాను త్రికరణశుద్ధమైన దానినిగాను సత్యమైనదానిని దయతోఁ జేయుము.

శా. రక్షింపం గల వంచు నీయెడల నీ
రంధ్రంబు విస్రంభ మో
కుక్షిస్థాఖిలలోక! లేదు, గతి నా
కున్ నీవె యన్ వాక్యలే
సాకూ ద్వ్యక్త్రిగతంబు లాచరణని
స్వాంబుల్, కృపన్ బుండరీ
కాక్షా! నానుడులన్ ద్రిశుద్ధములు స
త్యంబుల్ పొనర్పం దగున్.

శ్లో॥ పాపీయసోఽపి శరణాగతిశబ్దభాజో
నోపేక్షణం మమ త వోచిత మీశ్వరస్య ।
త్వజ్జ్ఞానశక్తికరుణాసు సతీషు నేహ
పాపం పరాక్రమితు మర్హతి మామకీనమ్ ॥ 61

ప్రతి :- (హేదయైకసింధో! = కరుణాసముద్రుఁడ వగు ఓ శ్రీకృష్ణా!, పాపీయసః, అపి = అత్యంతము (మిక్కిలి) పాపినైనప్పటికిని, శరణాగతి, శబ్ద, భాజః = శరణాగతి శబ్దమును మాత్రమే పొందియున్న వాఁడనగు, మమ = నాయొక్క, ఉపేక్షణమ్ = ఉపేక్ష, ఈశ్వరస్య = శక్తిమంతుఁడవగు, తవ = నీకు, న,ఉచితమ్ = తగదు, (ఉచితము కాదు) త్వత్, జ్ఞాన, శక్తి, కరుణాసు = దేవరవారి జ్ఞానము శక్తిదయలు, సతీషు =

ఉండఁగా, మామకీనమ్=నాసంబంధి యగు, పాపమ్=పాపము, ఇహ=ఇక్కడ, పరాక్రమితుమ్=బలమును జూపుటకు (ప్రతిబంధక మగుటకు) న, అర్హతి=తగదు.

విశేషములు :- త్వజ్జ్ఞానశక్తి కరణాసు సతీసు నేహ। పాపం పరాక్రమితు మర్హతి మామకీనమ్— శరణాగతుఁడను మాటయే ఫలసాధనమైనను ఆఫలసిద్ధికిఁ బ్రతిబంధకములగు పాపములు ప్రాయశ్చిత్తాదులవలన నుపశమింపఁ జేసికొన వలయును, నీ వట్టి ప్రాయశ్చిత్తాదుల నొనర్చుకొనక పోవుటచేత ఫలమెట్లు సిద్ధించును ? అని భగవానుఁ డన్నట్లు శంకించుకొని ఈ యుత్తరార్థముచేత సమాధాన మిచ్చుచున్నారు.

ఓ కృష్ణా! నీ జ్ఞానశక్తికరుణలు ప్రకాశించు చుండఁగనే నాపాపమున కింతపరాక్రమము చెల్లదు. నీ జ్ఞానశక్తికరుణలను త్రోసి రాజనుటకు నాపాపమునకు బలమున్నచో నాపాపమే మిన్నయగును గదా!

సారాంశ మేమన— ఓ దేవా! ఏదృష్టితో ఏవిధముగానే కానీ శరణాగతుల మన్నవారికిఁ బ్రతిబంధకములగు పాపములను నిరసించుట మూలమున నీచరణారవిందములందు నిరంతరము దాస్యము ననుగ్రహించుటకుఁ గంకణము కట్టుకొనియున్న నీజ్ఞానశక్తి కరుణలు రాజిల్లుచుండఁగా నాపాపము ఫలమును బ్రతిబంధింపఁజాలదు గాన శ్రీవారు నన్నవశ్యము చేఁబట్టి రక్షింప వలయును. 'త్వజ్జ్ఞానశక్తికరుణాసు'— అను చోట 'దయాయాః పాత్రమ్' 'దయైవ'— 'ఏవకారేణ దయైవ

సాంగం సాధనమ్' ఇత్యాదివాక్యములచేత ప్రకరణానుగుణ ముగా దయయే ప్రధానసాధన మనియు జ్ఞానశక్తులు దయకు అంగభూతము లనియు సంప్రదాయము.

తా॥ ఓ శ్రీకృష్ణా ! నే నత్యంతపాపి నైనను 'శరణాగతుఁ డను' అను శబ్దము నుచ్చరించితిని గాన సమర్థుఁడవు శక్తి సంపన్నుఁడవు నగు నీకు నన్నుపేక్షించుట తగదు. దేవరవారి జ్ఞానశక్తి కరుణలయందు నాపాప మెంతది? తమయుపేక్షవలన నా పాపమున కిట్టిపరాక్రమమును గల్గించి గౌరవమిచ్చుట తగదు.

గీ. పరమపాపినె యగుదుఁ బో ! పద్మనాభ !
అర్హ మే నీకు నను శరణార్థి వీడ ?
నీకృపాజ్ఞానశక్తులు నెగడు చుండ
నక్రమము నాదుపాపపరాక్రమందు.

శా. ఏవిద్వన్మణిభారతీహారికథా
హేలావతీ స్వర్ధునీ
సేవాభాగ్యముచేత నిన్నిదినముల్
సేమంబుగా నేఁగె నా
శ్రీవత్సాంకుఁడు కూరనాథుఁ డిటుపై
స్వీయస్తుతిన్ శేషమున్
భావాదర్శముదాంధ్రటిప్పణముతో
భాసిల్ల దీవించుతన్.

ఉ. కాకికి నెన్నిదంతములు
కంబళిరోమము లెన్నొ తెల్పుమా

ఏకరువెట్టు చోళమున
నేమి కబు ర్లనునట్లు కాక యీ
నాకుఁ దరించుమార్గము నొ
నర్చెను శ్రీయుతదాస శేషమై
శ్రీకలనంబు కూరపతి
దివ్యవచోలహరీపరిప్లుతిన్.

సీ. తరతరంబును మాకు దాసశేషస్వామి
నెయ్యంబువియ్యంబు నెగడుఁ గాక
విష్ణువైష్ణవగోష్ఠి వేళఁ బదే పదే
దాసకుటీయాత్ర తనరుఁ గాక
దాసకుటీ ముఖద్వారాలయశ్రీమ
దాంజనేయునిసేవ యలరుఁ గాత
కోదండరాములగురుకృపాపీయూష
ధార నామీఁద నేపారుఁ గాత

గీ. గణ్యమై దాసశేషప్రకాశిత మయి
పత్రికారాజ మని పేరు వడినమేటి
భక్తిసంజీవనికి మాకుఁ బ్రబలుఁ గాక
నిత్యసంబంధ ముజ్జ్వనీయ మగుచు.

గద్యము :— ఇది శ్రీ శ్రీవత్సాంకమిశ్ర విరచితంబగు నతిమానుషస్తవంబు నకు కవిశేఖర, మహోపాధ్యాయ, మధ్వశ్రీ పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్య కృతంబగు భావాదర్శం బను నాంధ్ర వివరణము.

స మా ప్త ము.

# శ్రీ స్తవము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 9 | లీలాయుతం | లీలాయితం |
| 8 | 7 | త్వసద్ధ్యో | త్వసతో౽ధి |
| 10 | 8 | నీ సంబంధములకు | నీ సంబంధములగు |
| 12 | 13 | దుష్యేత్ | నదుష్యేత్ |
| 15 | 1 | యవ | యద |
| 15 | 3 | దధీన | త్వదధీన |
| 15 | 20 | ఐశ్వర్య | ఐశ్వర్యము |
| 16 | 8 | దన్మ | దన్మా |
| 16 | 13 | భ్రాంతోయ్య | భ్రాంతో౽య |
| 17 | 5 | ఇదంతయో | ఇదంతయా |
| 17 | 6 | తటస్థై | తటస్థైః |
| 17 | 21 | నభే | నదే |
| 19 | 26 | శిరంగ | శ్రీరంగ |
| 19 | 26 | వీక్షితాం | వీక్షతాం |
| 20 | 6 | వీక్షి | వీక్ష |
| 20 | 17 | దజ్ఞుల | దజ్ఞుల |
| 20 | 19 | నీకివిగ | నీకివి |

# శ్రీ వైకుంఠ స్తవము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 11 | పపత్తి | ప్రపత్తి |
| 3 | 7 | సమాపి | సమాప్తి |
| 8 | 13 | ప్రయుం | ప్రయం |
| 36 | 5 | పోవట | పోవుట |
| 39 | 17 | స్తత్ | స్స |
| 43 | 10 | ర్వ్యాప్తియు | ర్వ్యావ్యాప్తియు |
| 43 | 17 | పరో | పరా (సరో) |
| 63 | 20 | ఈశిత్వత్వమే | ఈశిత్వత్వమ్ |
| 67 | 8 | భవ | భవే |
| 76 | 19 | దఘటః | ద్ఘటః |
| 84 | 19 | తీశిత్వతత్వమ్ | తీశిత్వత్వమ్ |
| 98 | 5 | చెప్వ | చెప్ప |
| 119 | 6 | లవసంకలంబుచే | సంకల్పంబుచే |
| 130 | 20 | క్షణార్ఘె | క్షణార్ధే |
| 132 | 13 | దహ్రూ | దహ్రో |
| 161 | 3 | ఉపాఖ్వ్యాయా | ఉపాఖ్యాయా |
| 188 | 9 | పరిమాణమము | పరిమాణము |

# అ తి మా ను ష స్త వ ము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 4 | సుస్వాభావ | సుస్వభావ |
| 2 | 8 | వ్యూహావ | రామకృష్ణాద్యవ |
| 15 | 17 | గోచరోఽస్తి | గోచరోఽసి |
| 16 | 8 | తేజస్తిరములకు | తేజస్తిమిరములకు |
| 19 | 18 | సనాది | శనాది |
| 31 | 3 | కొలచుకొనిన | కొలచుకొవని |
| 38 | 13 | మమర్ష వశౌ | మమర్ష వశా |
| 39 | 5 | పాపశకీ | పాపశంకీ |
| 40 | 8 | తిర్యగ్జంతువలందు | తిర్యగ్జంతువులందు |
| 71 | 16 | పరిహూస | పరిహాస |
| 105 | 12 | నవలిలగా | నవలీలగా |
| 115 | 13 | పరాక్రమెందు | పరాక్రమంబు |
| 116 | 18 | ముజ్జివనీయ | ముజ్జీవనీయ |

# సూచన

వైకుంఠ స్తవమునందు 18 వ శ్లోకమునకుఁ దాత్పర్యము

తా॥ నారాయణ శబ్దమున కర్థమగు శ్రీ వైకుంఠనాథుని యందుఁ దాత్పర్యము గల వందలకొలఁది వేదవాక్యముల చేతను, అట్టివే యగు స్మృతులచేతను, శబ్దశక్తివలనను (సామర్థ్యముచేతను) నారాయణ పరములు గనుకనే సాత్త్వికములు శ్రేష్ఠములు నగు భాగవతాది పురాణములచేతను, పరదైవము నెఱింగిన పరాశర, పరాంకుశాదిమునుల యుపదేశ ములచేతను, ఓ వైకుంఠనాథా! నిన్నే చేతనాచేతన నియంత నుగా నిశ్చయించు కొనుచున్నాముఁ

వైకుంఠస్తవములో 27 వ శ్లోకమునకుఁ దాత్పర్యము-

తా॥ వేదములం దేపరవస్తువు పరమ తత్త్వమనియు, పరంజ్యోతి యనియు, పరమాత్మ యనియు, బ్రహ్మ మనియు నధ్యయనము చేయఁబడినదో యాపరవస్తువు నొక యుపనిషత్తు నారాయణుఁ డనియు, మఱియొక యుపనిషత్తు విష్ణుమూర్తి యొక్క పరమస్వరూప మనియు నుడువు చున్నది.